# శ్రీదత్త పురాణము

## ప్రథమ భాగం

### నై మిశారణ్యములో మునులకు దత్త ప్రత్యక్షం

**ధ్యానమూలం గురోర్మూర్తిః పూజా మూలం గురోః పదమ్ ।**
**మంత్ర మూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోః కృపా ॥**
**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుసాక్షాత్ పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

శుక శౌనకాది మునులందరూ కలసి నైమిశారణ్యంలో దీర్ఘసత్రయాగం చేస్తున్నారు. నిరాటంకంగా హోమాలు జరుగుతున్నాయి. ఒకరోజు విరామ సమయంలో ప్రశాంత వాతావరణంలో మునులందరూ ధ్యానంలో నిమగ్నమైయున్నారు. అందరూ పద్మాసనములు వేసుకొని రెండు చేతులూ ఒడిలో సంధించి అరమోడ్పుకన్నులతో అంతర్ దృష్టిని భ్రూ మధ్యస్థానంలో బంధించి శ్వాస ప్రక్రియలను క్రమ మార్గంలో వుంచి తేజ స్వరూపుడైన నారాయణుని నిష్ఠతో ఏకాగ్రమైన మనస్సుతో ధ్యానిస్తున్నారు. మనఃశరీరాలను స్తంభింపజేసి శిలా ప్రతిమలై అత్యంత నిష్ఠలో ధ్యానంలో వున్నారు. అంతలో చల్లని గాలి ఆ ప్రాంతాన్ని పరిమళ భరితంతో ముంచెత్తింది. కోటి సూర్యులకాంతితో ఒక దివ్యజ్యోతి వారి నడుమ సాక్షాత్కరించింది. అదొక అద్భుత కాంతి. కేవలమైన తేజస్సు. ఆకారం లేని తేజస్సు, కోటి సూర్యుల కాంతితో కోటి చంద్రుల చల్లదనం కలగలిపిన మహా మహస్సు. ధ్యానంలో వున్న మునులందరూ దివ్యమైన అనుభూతితో కళ్ళు తెరిచారు. ఎదురుగా కన్నులు మిరుమిట్లు గొలిపేకాంతి పుంజం. ఆ తేజస్సు దశదిశలా వ్యాపించింది. మంగళవాయిద్యాలు మనోహరంగా వినిపిస్తున్నాయి. శౌనకాది మునులందరూ ఆ కాంతిపుంజాన్ని చూడలేక కన్నులు మూసుకున్నారు. చేతులు జోడించి ఆర్తితో "మహానుభావా ! తేజ స్వరూపా! నువ్వు అనుగ్రహించి మా ఎదుట నిలిచినా నిన్ను దర్శించలేని అశక్తులము. అద్భుతమైన ఆ తేజస్సును మా కన్నులు తట్టుకోలేకపోతున్నాయి. మనస్సులు మాత్రం పరమానందంలో మునిగివున్నాయి. ఈ అనుభూతిని మేమెన్నడూ అనుభవించనిది. దయామయా నీ రూపాన్ని దర్శించగల్గే శక్తి మాకు ప్రసాదించు" అంటూ మునులందరూ సాష్టాంగ ప్రణామములు ఆచరించారు.

అప్పుడు ఆ తేజస్సు నుండి ఇలా వినిపించింది. మహామునులారా ! కన్నులు తెరవండి. మునులందరూ కన్నులు తెరిచారు. అదే తేజోస్వరూపం. ఎరుపూ, నలుపూ, తెలుపూ కలయికగా కాంతి. ఆ కాంతిలోనే శ్రీమన్నారాయణుడు దర్శనమిచ్చాడు. అత్రి, భృగు, మరీచి మొదలగు మహర్షులందరూ పరివేష్టించి యున్నారు. చతుర్వేదాలను పఠిస్తున్నారు. ఆ నీల నీరదశ్యాముడు చిరునవ్వులు చిందిస్తున్నాడు. వక్ష స్థలంలోని కౌస్తుభమణితో వాసుదేవుని ముఖం మరింత కాంతిమంతం అయింది. నాలుగు భుజాలతో శంఖం, చక్రం, గద, పద్మం నాలుగు

చేతుల్లో విరాజిల్లుతున్నాయి. కటికి పట్టు పీతాంబరం వ్రేలాడుతూ వుంది. దాని అంచులకున్న బంగారుకాంతులు ధగధగలాడుతూ స్వామి పాదాలకు ఒక వింతశోభని కలిగిస్తున్నాయి. శిరస్సున వజ్రకిరీటం, చెవులకు మకరకుండలాలు భుజాలకు మణిమయమాలలు, చేతి వ్రేళ్ళకు రత్నాలతో పొదిగిన ఉంగరాలు, మెడలో వనమాల, బంగారు యజ్ఞోపవీతం. వక్షస్థలంలో ఒకవైపు లక్ష్మి మరొకవైపు శ్రీవత్సలాంఛనం. బంగారుకొండ మీద కూర్చున్నట్లుగా గరుత్మంతుని మీద ఠీవిగా కూర్చుని దర్శనమనుగ్రహించాడు. సనక సనందనాదులు నారద తుంబురులూ స్తుతిగీతాలు ఆలపిస్తున్నారు. జయవిజయులు ఇరువైపులా సేవలు అందించుచున్నారు. విష్వక్సేనాదులు జయజయ ధ్యానాలు పలుకుతున్నారు.

మహామునులందరూ ఆనందపరవశులై చూస్తున్నారు. ఉన్నట్టుండి ఆ నీల మేఘశ్యాముడు మల్లికార్జునుడుగా మారిపోయాడు. వెండికొండమీద నంది వాహనాన్ని అధిష్టించి పరమశివుడుగా మారిపోయాడు. శిరస్సున చంద్రరేఖ. జటాజూటం నుండి దుముకుతున్న గంగమ్మ, శరీరంనిండా విభూతి ధరించి సర్వాంగాలకు సర్పములను ఆభరణములుగా ధరించి ఒకచేతిలో త్రిశూలం, మరొక చేతిలో ఢమరువు, మరొక చేతిలో కమండలం, మరొక చేతిలో జపమాల, కటి భాగాన పులితోలు, నాగజందెం నాగహారములు శరీరం నిండా రుద్రాక్షలను నాగకుండలాలు నాగమంజీరాలు, సర్ప భూషిత సర్వాంగుడు, నందీశ, భృంగీశ, గణేషులూ, వీరభద్ర, షణ్ముఖులు, మాతృగణాలు ప్రమథగణాలు అందరూ పరివేష్టించి యుండగా దర్శనమిచ్చాడు.

ఆశ్చర్యచకితులై మునులందరూ చూస్తున్నారు. అంతలో ఆ తేజోమండలం చతుర్ముఖుడుగా మారిపోయింది. తెల్లకమలంపై ఎర్రని రంగులో సృష్టికర్త. నాలుగు ముఖాలు, నాలుగు వేదాలు శ్రావ్యంగా గానం చేస్తున్నాయి. బ్రహ్మర్షులందరూ చుట్టూ కూర్చుని ఉపనిషత్ వాక్యాలను వల్లిస్తున్నారు. మలయ మారుతంలాగా వీణానాదం వినిపిస్తోంది. దివ్యమాలలను ధరించి అర్థ నిమాలిత నేత్రుడై జపమాల త్రిప్పుతూ ధ్యానం చేస్తూ బ్రహ్మదర్శనమిచ్చాడు.

శౌనకాది మునులందరూ కన్నార్పకుండా చూస్తున్నారు. ఆ కాంతి పుంజం త్రిమూర్తుల కలయికగా మారిపోయింది. మూడు రంగులు మూడు మూర్తులూ కలగలిసి కనిపిస్తున్నాయి. ఆరు చేతులు దర్శనమిచ్చాయి. శంఖము, చక్రము, త్రిశూలం, ఢమరువు, మాల, కమండలము చేతులలో కనిపించాయి. సకల దేవతలు సేవిస్తున్నారు. సూర్యచంద్రులు అష్టదిక్పాలకులు, మను, వసు, రుద్రులూ నక్షత్రగ్రహాది దేవతలు కిన్నర కింపురుష సిద్ధ సాధ్య గరుడోరగ దివ్యజాతులూ ఆ త్రిమూర్తి స్వరూపుడ్ని పరివేష్టించి స్తోత్రాలు చేస్తున్నారు. సప్తసముద్రాలు సకల నదీనదాలు పర్వతాలు సకల సృష్టి సకలజీవరాసులూ ఆ దివ్య స్వరూపంలో సాక్షాత్కరించాయి.

శౌనకాది మునులందరూ ఆశ్చర్య, ఆనందాల నుండి తేరుకొని సాష్టాంగ దండ ప్రణామములు చేస్తూ "మహానుభావా, త్రిమూర్తి స్వరూపా, మా జన్మలు ధన్యమయ్యాయి. చరితార్థులమయ్యాము. మా జపములు తపస్సు నేటికి ఫలించింది. మహా మహా యోగీశ్వరులకు కూడా లభించని దివ్యదర్శనాన్ని అనుగ్రహించావు. కరుణా స్వరూపా! ధన్యులమయ్యాము. దేవాధిదేవా! భక్తితో మేము చేసే షోడశోపచారములు స్వీకరించి మమ్ములను కృతార్థులను చేయమని వినయముతో అభ్యర్థించారు. త్రిమూర్తి స్వరూపుడు చిరునవ్వుతో తలఊపాడు. మునులందరూ స్వామిని పూజించి సేవించి ఇలా స్తుతించారు.

చక్రాసి గదాధరా! శార్ఙధరా! సకల కారణ కారణా! కారణాతీతా! అవక్ర పరాక్రమా! పురుషోత్తమా! సృష్టి, స్థితి, లయ, కారకా! జగత్క్రీడా వినోదీ! త్రిమూర్తి స్వరూపా! నమోనమః చిదగ్ని స్వరూపా! వేదాంతులు నిన్ను పరబ్రహ్మవనీ సాంఖ్యవిధులు నిన్ను పురుషోత్తముడవనీ, యోగులు పరమాత్మ అనీ, మీమాంసకులు ధర్మమనీ, విజ్ఞానులు శూన్యమని, చార్వకులు పంచభూతాత్మకమనీ అంటూస్తుతిస్తున్నారు. వేదాలు నిన్ను విశ్వస్వరూపడవంటున్నాయి. మళ్ళీ కాదు అంటున్నాయి. నీ స్వరూపాన్ని నిర్ణయించలేక నీరసపడుతున్నాయి. వాచామగోచరా! తేజోమయా! నమోనమః ఏ సాధనము లేకపోయినా నీకు అసాధ్యమన్నది లేదు. నిజానికి సాధ్యము. అసాధ్యము రెండూ నీవే. వెలుగులకు వెలుగువి. సకల ప్రాణికోటిలోని జీవశక్తివి. సృష్టిలో నీవుకానిది, నీవు లేనిది ఏదిలేదు. సకలవ్యాపకా! ఆది దేవా! దివ్య పీతాంబరం ధరించావు. సువర్ణకాంతులు జిమ్మే శరీరం నిండా బూడిద ధరించావు. కోటి సూర్యులకాంతిలో వెలిగిపోతున్నావు నీ పాదాలను స్మరిస్తే చాలు భవరోగాలు నాశనమౌతాయి. కర్మఫలప్రదాతా! కర్మసాక్షి! అరిషడ్ వర్గాలను జయించి సమాహితచిత్తులై నీ పురాణగాధను విన్నవారు సంసార సముద్రాన్ని అవలీలగా దాటుతారు. ఆనంద స్వరూపా! అమృతమయా! నమోనమః

శ్రీమన్నారాయణుని నాభి కమలము నుండి ఉద్భవించి రజోగుణ ప్రధానుడవై కర్మఫలానుసారంగా నీవు సకల చరాచర సృష్టిని చేస్తున్న వేళ భవబంధ విముక్తులైన బ్రహ్మర్షులు యోగీశ్వరులూ నిన్ను స్తుతిస్తుంటారు. సృష్టి విధాతా! నామస్మరణలో భక్తుల పాపాలను పటాపంచలు చేసి భవసాగరాన్ని అనాయాసంగా తరింపజేసే సత్వగుణ ప్రధానా! స్థితి కారణా! శ్రీమన్నారాయణా! ముముక్షువులందరూ నిన్నే ధ్యానిస్తుంటారు. ఉపమన్యువు అభ్యర్థిస్తే సాక్షాత్తూ పాలసముద్రాన్నే ప్రసాదించిన దయామయుడవు. తమోగుణ ప్రధానుడవై ప్రళయవేళ సకల సృష్టిని ఉపసంహారించే మహాకాల స్వరూపా! భయంకరా! అభయంకరా! శంకరా! నమోనమః నైమిశారణ్యవాసులు చేసిన ఈ స్తోత్రమునకు త్రిమూర్తి స్వరూపుడు సంతుష్టుడయ్యాడు. మునీశ్వరులారా నా దర్శనముతో మీరు కృతార్థులయ్యారు. ఏమికావాలో కోరుకోండి అన్నాడు. సృష్టి, స్థితి, లయ, కారకా ధన్యులమయ్యాము. నీ విరాడ్రూపాన్ని దర్శింపజేసావు. ఇంతకాన్నా మేము కోరుకోవలసింది ఏముంది. అయినా అడగమన్నావు కనుక అడుగుతున్నాము. ఇన్ని ఆకారాలలో మాకు కనిపించావు వీటిలో నీ అసలైన రూపం ఏది? నీ నివాసం ఎక్కడ? నీ జన్మకర్మల వృత్తాంతం ఏమిటి? నువ్వు త్రిమూర్తులకు అతీతుడవని పరాక్రముడవనీ విన్నాము ఇది నిజమా ? కాదా ? మా అజ్ఞానాన్ని మన్నించి మాసంశయాలు తొలగించు. నిశ్చల జ్ఞానాన్ని ప్రసాదించు. అవ్యయ ఆనందాన్ని అందించు అన్నారు.

మునీశ్వరులారా! మీరు ఎన్నో జన్మల నుండి జపతపాలను యజ్ఞాలను నియమనిష్టలతో ఆచరిస్తూ జీవితాలు గడుపుతున్నారు. అందుకు సంతోషించి ఇలా దర్శనం అనుగ్రహించాను. నా నామరూపాలు జన్మకర్మలు అడిగారు కదా యోగోపదేశం చేయటానికి సాధన సాగించటానికి తగిన పుణ్యఫలం అందించటానికి నేను అత్రిమునికి పుత్రుడుగా జన్మించి దత్తాత్రేయుడు అనే నామంతో సకల లోకాలలో సంచరిస్తూ వుంటాను. ఇది ఒక అవతారం. ఇంకా ఎన్నో జన్మలు, ఎన్నో రూపాలు, ఎన్నో నామాలు నాకు ఉన్నాయి. వాటిని చెప్పటం వెయ్యినోళ్ళు కలిగిన వానికైనా అసాధ్యము. కాని వీనిలో కొన్నింటిని సూతమహర్షి చెప్పగలడు. అతడు వ్యాసమహర్షి ప్రత్యక్ష శిష్యుడు. గురు అనుగ్రహం వల్ల సకల పురాణాలు అతనికి కరతలామలకములు. ప్రవచనంలో కూడా నేర్పరి. అతడిని అడిగి నా జన్మకర్మలు

తెలుసుకోండి. ఈ యాగాన్ని పూర్తి చేసి పూర్ణఫలాన్ని పొందండి. ముమ్మూర్తులా నాకు అభిన్నుడైన గురువు సన్నిధిలో ప్రత్యక్ష, పరోక్ష జ్ఞానాన్ని పొంది చివరికి పరమానంద స్వరూపులు కండి. మీరంతా ఏకకంఠంతో చేసిన స్తోత్రము నన్ను ఆనందింపజేసింది. ఇది భక్తి ముక్తిదాయకంగా యోగసిద్ధిదాయకంగా విరాజిల్లుతుంది. భక్తిశ్రద్ధలతో ఇది పఠించిన వారికి సకలాభీష్టాలు నెరవేరును అని చెప్పి ఆ కాంతిపుంజం అదృశ్యమైంది.

శౌనకాది మునులందరూ దివ్యానుభవంలో ఆనంద పారవశ్యంలో మునిగితేలుతున్నారు. అంతలో నైమిశారణ్యంలోని బ్రహ్మచారులు అక్కడకు వచ్చారు. వారంతా సమిధలు, ఫలాలు సేకరించుకోవటానికి అడవికి వెళ్ళి వాటిని తీసికొని అక్కడ దర్శించిన అద్భుత దృశ్యములను మహర్షులకు చెప్పాలన్న ఆతృతతో ఆశ్రమంలోకి పరుగు పరుగున ప్రవేశించారు. ఆనంద సాగరంలో వున్న మునులకు నమస్కరించారు.

గురువర్యులారా! రోజూ చూసే అరణ్యం ఈ రోజు వింతగా మారిపోయింది. ఎక్కడా క్రూరమృగాలు లేవు. పళ్ళూకాయలతో విరగకాచిన చెట్లు, రంగురంగుల పూవులతో లతలు. కలువల్ని, తామరల్ని గట్టు చేరుస్తున్న సరోవరాలు, హంసలు ఆనందంతో కళకళలాడుతున్నాయి. అడవిలో ఎటుచూచినా పురివిప్పిన మయూరముల నాట్యాలు. ఇదివరకటి అడవిలా లేదు నందనవనంగా మారి వుంది. ఈ వింత మీకు చెబుదామని కారణమేమిటో మీరు చెపుతారని పరుగు పరుగున వచ్చాం అన్నారు.

ఈ సందడిలో తేరుకున్న మునులు నలువైపులా దృష్టి సారించారు. శిష్యులు చెప్పింది నిజమే. నందనవనంలా మారింది నైమిశారణ్యం. ఇది అంతా స్వామి సాక్షాత్కార మహిమ అని గ్రహించారు. జరిగినదంతా శిష్యులకు వివరించారు. మా అదృష్టమే అదృష్టమంటూ పరవశించిపోయారు. వటువులకు ఒకవైపు ఆనందం ఒకవైపు దుఃఖం పొంగివచ్చాయి. తమ గురువులకు స్వామి సాక్షాత్కారం లభించినదని ఆనందమూ, తాము ఆ సమయంలో లేకపోయామే అనే దుఃఖమూ పొంగివచ్చాయి. సరిగ్గా ఇదే సమయానికి మనం అడవికి వెళ్ళాలా, ఎంత దురదృష్ట వంతులం. అయ్యయ్యో మళ్ళీ ఎన్ని జన్మలకి ఈ అవకాశం లభిస్తుంది. ఇంత కాలంగా చేస్తున్న వేదాధ్యయనం ఆశ్రమ సేవ, జపతపములు. గురుసేవ పరిపక్వం కాలేదు కాబోలు అని దుఃఖించారు. అలా విలపిస్తున్న శిష్యులను మునులందరూ జాలిపడి ఓదార్చారు పరిపరివిధాలుగా. "మీ గురు శుశ్రూష ఫలం వృధాగాపోదు. శిష్యులు కనుక మా పుణ్యంలో మీకూ భాగం ఉంటుంది. సత్సాంగత్యం, సత్ఫలాలను ప్రసాదిస్తుంది. సమయం వచ్చినపుడు మీకూ ఆ ఫలాలు దక్కుతాయి. పరాత్పరుడు కటాక్షిస్తాడు." అని ఊరడించేసరికి శిష్యులంతా ఊరడిల్లారు. సాయాహ్న విధులను ముగించుకొని ఎవరి కుటీరములలోకి వారు వెళ్ళి విశ్రమించారు.

## నైమిశారణ్యమునకు సూతమహర్షి రాక

తెల్లవారింది. సూర్యునితోపాటు సూతమహర్షి ఆశ్రమానికి వచ్చేశాడు. ఆశ్చర్య చకితులైనారు అంతా. ఆశ్రమ నియమాలకు అనుగుణంగా అర్ఘ్య పాద్యాదులతో స్వాగతసత్కారాలు జరిపారు. మునులంతా మహానుభావా ! సకల పురాణవేత్తవు. సర్వాగమ విశారదుడవు. సకలశాస్త్రకోవిదుడవు, వ్యాసభగవానునికి ఆప్త శిష్యుడవు శ్రీమన్నారాయణుని భక్తుడవు. ఈ సృష్టిలో నీకు తెలియని విద్యలేదు. ధర్మశాస్త్రాల వాదోపవాదాలకు వేద పురాణముల మధ్యనున్న సంశయాలన్నింటికి తుది తీర్పు నీదే, నీ రాక కేవలం పరమేశ్వర అనుగ్రహమే. లోగడ ఎన్నో పురాణాలని

వినిపించి మమ్మల్ని ఎంతో ధన్యులను చేశావు. ఇప్పుడు నీ నుండి దత్తమహాత్మ్యాన్ని వినాలని కుతూహలంగా వుంది. ఇది నారాయణుని ఆజ్ఞ కూడా. దయచేసి వినిపించు. రోమాంచితంగా వినిపించే సామర్థ్యం నీకువుంది. దత్తుడెవరు? ఆయన జన్మకర్మల వృత్తాంతాలేమిటి? యోగనిష్ఠా గరిష్ఠుడై బాల, ఉన్మత్త, పిశాచ స్థితులు, దిగంబర, జడాకారుల స్థితులలో సంచరిస్తూ భక్తులను అనుగ్రహిస్తూ పరీక్షిస్తాడని విన్నాం. ఆ లీలలన్నీ తెలియజెయ్యి. దత్తనామాలు, స్తోత్రాలు, మహిమలు, భక్తుల గాధలు, భక్తులు తరించిన వైనాలు సమగ్రంగా మాకు తెలియజెయ్యి. వాసుదేవుడు ఇన్ని అవతారాలనూ ఎందుకు ధరించినట్లు? ఆయన యొక్క అసలు సత్య స్వరూపం ఏమిటి? సగం తెలిసీ తెలియక అవస్థపడుతున్నాం. నీవు సర్వజ్ఞుడవు దిట్టవని నారాయణుడీ ఆనతిచ్చాడు. కనుక దయజేసి వివరించు. ఇలాంటి పుణ్యగాధలు విన్నవారికే కాక, వినిపించిన వారికీ పుణ్య ముంటుంది అంటారు. సూత మహర్షీ ! నీ వంటి సకల వేదశాస్త్ర సమన్వితుడు ఎదుటికి వస్తే ఏమనడగాలో మాకు తెలియదు. అందుచేత మా ఆర్తి, తాపము, ఉపశమించేట్టు ఏదిఏది ఎంత చెప్పాలో నిర్ణయించుకొని వినిపించవలసినవన్నీ వినిపించు. భుక్తి ముక్తిదాయకము. యోగవిద్యా ఫలదాయికమూ అయిన దత్త మహిమను ప్రధానంగా నీ నోటి నుండి వినాలనేది మా అందరి అభీష్టము. దయచేసి మా కోరిక తీర్చు.

మునులంతా ఇలా అడిగే సరికి సూతుడు సంబరపడ్డాడు. వారితో ఇలా అన్నాడు. మునులారా! అందరికి వందనములు. సకల సిద్ధి ప్రదాయకమైన దత్త మహిమలను వినాలనుకోవటం గొప్ప విశేషం. పుణ్యఫలం వల్ల తప్ప ఇటువంటి కోరిక ఉదయించదు. నన్ను కూడా కృతార్థుడిని చేస్తున్నారు. నా జన్మ కూడా చరితార్థమవుతుంది. మీరు బ్రహ్మనిష్ఠులు, తపోధనులు, మీసాంగత్యం లభించడం వల్ల నా జన్మ ధన్యమయ్యింది.

భగవదనుగ్రహం వల్ల గురుకటాక్షం వల్ల నా శక్తిమేరకు దత్తాత్రేయ చరిత్రను సాంగోపాంగంగా వివరిస్తాను. శ్రద్ధగా ఆలకించండి. అని సూత మహర్షి పద్మాసనం వేసుకొని కన్నులు మూసుకొని ధ్యానసమాధిలోకి జారుకున్నాడు.

వాణీ చతుర్ముఖులను, గౌరీశంకరులను, లక్ష్మీవాసుదేవులను స్మరించాడు. గజాననుడ్ని స్మరించాడు. అష్టదిక్పాలకుల్నీ అఖిలదేవతలని, సమస్త ముని జనవందితులని తలుచుకుని నమస్కరించాడు. యోగమార్గంలో సకలేంద్రియాలను ఏకాగ్రపరచి హృదయపద్మంలో దత్తాత్రేయ సన్నిధికి చేరుకున్నాడు.

త్రిమూర్తి స్వరూపా ! త్రివర్ణాంచితా ! వేదవేద్యా ! విశ్వవంద్యా ! విశ్వరూపా ! ఒకప్పుడు గరుత్మంతునిపై వుంటావు. ఒకప్పుడు పులితోలు ధరిస్తావు. ఒకప్పుడు పీతాంబరం ధరిస్తావు. మరొకప్పుడు శ్వేతవస్త్రం ధరిస్తావు.

ఒకప్పుడు సర్ప యజ్ఞోపవీతం ఒకప్పుడు సువర్ణ యజ్ఞోపవీతం ఒక్కొక్కప్పుడు బ్రహ్మసూత్రం ధరిస్తావు. గంగలో స్నానం చేసి కొల్హాపురం లక్ష్మి వద్ద బిక్షతీసికొని సహ్యాద్రిపై సంచరిస్తావు.

మూడు యుగాలలోను అవతారాలను ధరించినవాడా ! శ్రీహరీ ! నమోనమః

ఒకప్పుడు బాలుడుగా దర్శనమిస్తావు. ఒక్కొక్కసారి యువకుడిగా వృద్ధుడిగా దర్శనమిస్తావు. ఒక్కొక్కవేళ జటాధారిగా, ఒక్కొక్కసారి ముండిత శిరస్కుడిగా వుంటావు. ఒక్కోముహూర్తాన దివ్య మాలికా దివ్యాభరణ. దివ్యవస్త్రములను ధరించి దివ్యసుందర విగ్రహుడవై కనిపిస్తావు. ఒక్కోసమయంలో మదోన్మత్త చిత్తుడుగా మదిరతో మగువతో గోష్ఠి జరుపుతూ వుంటావు. ఒక్కోసారి దిగంబరుడవై ఈగలు ముసురుకుంటూ కనిపిస్తావు. వీభూతి పులుముకుంటూ కనిపిస్తావు. అనంత నామా! దత్తప్రభూ ! నీకు నమోవాకములు. పుట్టుకతో చేతులు లేని కార్త

వీర్యార్జునున్ని వేయిబాహువులుతో మహావీరుణ్ని చేసి, వేల సంవత్సరాలు భూమండలాన్ని ఏలించి, సేవలు అందుకున్న ఘనత నీదే. నీకు ప్రణామములు. ప్రహ్లాదుడి భక్తి తత్పరతకు మెచ్చి ఉపదేశంతో మోహాన్ని తొలగించి ముక్తిని ప్రసాదించిన యోగీశ్వరా ! దిగంబర స్వరూపంతో వున్న నిన్ను సేవించిన యదుమహారాజుకీ, అలర్క మహారాజుకీ జ్ఞానోపదేశం జేసిన సద్గురూ! నీకు నమోవాకములు. యోగవిద్యా స్వరూపా! మహామాయా ! తేజస్వులలో తేజస్సు నీవు. బుద్ధిమంతులలో బుద్ధివి నీవు. బలవంతులలో బలంనీవు. విద్యావంతులలో విద్యవు నీవు.

శాంతి, క్షాంతి, దయ, ధృతి, స్మృతి, మతి అన్నీ నీవే. భూత, భవిష్యత్, వర్తమానాలు నీవే, సర్వవ్యాకరణ స్వరూపుడవు నీవే, ఈ సృష్టిలో నీవు లేనిది లేదు. నువ్వుకానిది లేదు. సర్వాత్మకా ! సర్వాంతర్యామీ ! నీకివే నా నమస్సులు.

వామనుడవై బలిని మూడడుగుల నేల దానమడిగావు. త్రివిక్రముడవై విజృంభించావు. ఆకాశంలోని సూర్యచంద్ర గోళాలు గొడుగులై, శిరోమణులై, కర్ణకుండలాలై, భుజకీర్తులై, కటిసూత్రమై అందెల మువ్వలై, నీ పాదాలకింద జారిపోయాయి. సత్యలోకంలో బ్రహ్మదేవుడు నీ పాద పద్మాలను స్వయంగా కడిగి వేదమంత్రాలతో పూజించాడు. నీకాలిగోరు తగిలి బ్రహ్మాండం బ్రద్ధలై దివ్యోదకం వాగులై ప్రవహించింది. అది భూమిపై అవతరించి గంగానదియై తనలో మునిగిన సకల జీవులకూ జన్మజన్మల పాపాలను ప్రక్షాళన చేస్తోంది. విష్ణు పాదోద్భవగా త్రిలోకాలలో పూజలు అందుకుంటోంది. సచ్చిదానంద స్వరూపా ! నీ అవతార లీలలు అచింత్యాలు. అప్రమేయాలు, అగమ్యగోచరములు. బ్రహ్మర్షులకే అంతుబట్టవు. దత్తా శరణు శరణు.

ఇలా ధ్యానించిన సూత మహర్షి హృదయ పద్మంలో దత్తాత్రేయుడు సాక్షాత్కరించాడు. చిరునవ్వులు చిందుతున్న ముఖ పద్మం. శిరస్సుపై పింగళ జటాజూటం, సూర్యచంద్రులు నేత్రాలుగా, కటియందు పీతాంబరం. ఆరుచేతులతో కరుణార్ద్ర హృదయుడు తనను స్మరించే వారి అజ్ఞానాన్ని పటాపంచలు చేసే స్వామి ప్రత్యక్షమయ్యాడు.

నాయనా, నీ ధ్యానానికి, నీవు చేసిన స్తోత్రానికి సంతోషించాను. ఏమి కావాలో కోరుకో మృదుమధుర స్వరంతో పలికారు. ఆనందపారవశ్యంలో మునిగిన సూతుడు నోరు మెదపలేకపోయాడు. నాయనా నీ అభీష్టం నెరవేరుతుంది ఈ శౌనకాది మునులకు నా మహిమలు వినిపించు. నీకు అంతా కరతలామలకమవుతుంది. నీవు పరమ పదానికి చేరుకుంటావు. అని వరమునను్గ్రహించి దత్తదేవుడు అంతర్థానం చెందాడు. క్రమక్రమంగా సూత మహర్షి ధ్యానం నుండి తేరుకుని ఆనంద భాష్పములతో నింపిన కన్నులు తుడుచుకొన్నాడు.

మునీంద్రులారా! దత్తదేవుడు అనుగ్రహించాడు. మీరడిగిన దత్త చరిత్రను వినిపిస్తాను. ఇది గురుశిష్య సంవాదంగా వుంటుంది. భక్తి శ్రద్ధలతో ఆలకించండి. ఇది సకల మనోభీష్టప్రదం. దీన్ని వినడం కన్నా మించిన తపస్సు లేదు. సకల సంపత్కరం. విద్యాప్రదాయకం, జ్ఞానప్రదం. సకలప్రదేశాలలో సమస్త కాలాలలో ఎంతటి కష్టాలు సంభవించినా దత్తుని ధ్యానించినవారికి జయమే తప్ప అపజయమంటూ వుండదు. ఇది సకల బంధవిమోచకం. ఈ దత్త చరిత్రలో ఒక అధ్యాయాన్ని గాని లేదా ఒక భాగాన్ని గాని పఠిస్తూ దత్తుని స్మరించిన వారు దత్తుని అనుగ్రహానికి పాత్రులవుతారు. దత్త నామాన్ని జపించినవారికి ఆ యోగీంద్రుని దయవల్ల ముక్తిని పొంది తీరుతారు. ఆలకించండి.

సూత మహర్షీ! మరి గురుశిష్య సంవాదమన్నావు గదా అసలు గురువంటే ఎవరు ? శిష్యుడంటే ఎవరు ? వీరి లక్షణాలేమిటి ? వీరిలో శ్రేణులు ఏమైన వున్నాయా ? అ వివరాలు చెప్పి పుణ్యం కట్టుకో అని శౌనకాదులు అడిగారు.

మునీంద్రులారా ! మంచి ప్రశ్నలు వేశారు. మీ సందేహాలు తీరాలంటే ఒక పురాణ గాధ తెలుపుతాను దీనికి బ్రహ్మ - కలి సంవాదమని పేరు. ముందుగా అది వినిపిస్తాను, వినండి అని సూతుడు ప్రారంభించాడు.

## కలి - బ్రహ్మ సంవాదం

పద్మ కల్పానికి ఆరంభంలో నారాయణుని నాభి నుండి కమలము ఉద్భవించి అందుండి బ్రహ్మ ఉద్భవించి పద్మాసనంలో కూర్చుని సకల చరాచర జగత్తును సృష్టించనారంభించినాడు. భూలోకంలో మానవులను సృష్టించాడు. వారికి వర్ణాశ్రమ ధర్మాలను ఏర్పరచి వాటిని అమలు చేయడానికి మనువులను సృష్టించాడు. కాలాన్ని యుగాలుగా ఏర్పరచాడు. కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలను యుగాధిపతులుగా మనువులను ఏర్పరచాడు. ధర్మ రక్షణ భారాన్ని మనువులకు అప్పగించాడు. మొదటి ముగ్గురూ తమతమ విధి నిర్వహణకోసం బ్రహ్మ ఆజ్ఞను అనుసరించి బయలుదేరారు. పిశాచ రూపుడు, కలహ శీలుడు అయిన కలి పురుషుడు మాత్రం దిగంబర రూపంలో గంతులువేస్తూ వెకిలి చేష్టలు చేస్తూ ఒక చేత్తో మర్మాంగాన్ని, మరొక చేత్తో నాలుకను పట్టుకొని నిలబడ్డాడు.

విధాతా! సకల పాపాలకు ధర్మాలకు వినాశకుడిగా నన్ను రూపొందించావు. భూలోకంలో శత్రువులు నాకు చాలామంది వున్నారు. పుణ్యకార్యాలు ఆచరించే వారంతా శత్రువులే. శివనామం, హరినామం, గంగాస్నానం, దానం, సత్సంగం, పుణ్యక్షేత్ర సందర్శనం ఇవి ఆచరించే వారంతా నాకు శత్రువులే. వీటిని ఆచరించటం నాకు నచ్చటం లేదు. నాకు ఇలాంటి పాపకార్యాలు విధించావేమిటి ? అంటూ కలిపురుషుడు విలపించాడు.

అప్పుడు బ్రహ్మ నాయనా! కలిపురుషా! నీ విధులు నీవు నిర్వర్తించు. ఇందులో బాధపడవలసింది ఏమీ లేదు. నువ్వు అనుకుంటున్న నీ శత్రువర్గాన్ని నీవు ఏమీ చేయలేవు. వ్యసనాలకు, అరిషడ్ వర్గాలకు, డాంభికులకు, అసత్య, అనాచారాలకు దాసులైన వారే నీ శిష్యులు. వారిని ఆక్రమించి శిక్షించడం నీ విధి. నీ బాధల నుండి తప్పించుకోవాలంటే జనులకు రెండు మార్గాలు వున్నాయి. ఒకటి పురాణ పఠనం, శ్రవణం. రెండు గురుసేవ. ఇవి చేసే వారిని నీవు హింసించలేవు. వారి దరిదాపులకు కూడా నీవు వెళ్ళలేవు. పురాణాలు వినిపించేవారు గురువులే! గురు సేవ చేసుకునే వారికి నీ బాధవుండదు. **పూర్వ జన్మ సుకృతం వల్లనే ఉత్తమ గురువు లభ్యమవుతాడు. గురువు బోధిస్తే తప్ప శాస్త్ర పరిజ్ఞానం ఏర్పడదు. శాస్త్రజ్ఞానం ఉంటేగానీ ధర్మాధర్మ వివేకం అబ్బదు. అది అబ్బకపోతే తత్వం తెలియదు. తత్వం తెలియకపోతే ఆత్మజ్ఞానం కలుగదు. ఆత్మజ్ఞానం కలుగకపోతే ముక్తి లభించదు. కావున ముక్తి మూలం గురువే పురాకృత పుణ్యం లేని వారికి గురువు లభించడు.** వారంతా నీకు చిక్కుతారు. ఇందులో నువ్వు విచారపడవలసింది ఏమీలేదు. నీ ధర్మం నీవు ఆచరించు అని బ్రహ్మ కలిపురుషుడిని బుజ్జగించాడు.

బ్రహ్మదేవా! గురువు అంత గొప్పవాడా? గురు శబ్దానికి అర్ధం ఏమిటి ? గురువంటే ఎవరు ? ఎలాంటివాడు గురువు ? ఎవరికి గురువు ? గురు స్వరూపం తెలియపరచి నన్ను కృతార్థుణ్ని చేయమని కలిపురుషుడు అభ్యర్ధించాడు.

కలిపురుషా ! నీ సందేహం తీర్చడం నా ధర్మం. గురు శబ్దంలో ఉకారం అచ్చు. అది ద్విరుక్త మయ్యింది. గకార రేఫలు రెండూ హల్లులు. నీటిలో గకారం సర్వసిద్ధి ప్రదం. రకారం సర్వ పాపనాశకం. ఉకారం అవ్యక్త అచింత్య విష్ణు తత్వానికి వాచకం. అందుకే రెండు హల్లులకు ప్రాణమయ్యింది.

అచ్చునే ప్రాణమంటారు. దాని వల్లనే హల్లులు ప్రాణులు అవుతున్నాయి. ఇంకా వీటిలో వర్ణాదిదేవతలు వున్నారు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

గకారానికి గణపతి. రకారానికి అగ్ని. ఉకారానికి విష్ణువు అధి దేవతలు. ఈ రకంగా గురు శబ్దమే మంత్రంతో సమానం. ఇది చతుర్విధ పురుషార్థాలకు సాధనం. తల్లి, తండ్రి, పరాత్పరుడూ గురువే. శిష్యుడు మీద శివుడికి కోపం వస్తే గురువు రక్షించగలడు. గురువుకే కోపం వస్తే శివుడు కూడా వాణ్ని ఏమి చేయలేడు. గురువే పరతత్వం. అందుకే గురువును ఆశ్రయించాలి అంటున్నాయి వేదాలు, పురాణాలు. శ్రీమన్నారాయణుడే ప్రసన్నుడైనా గురుభక్తినే కోరుకుంటారు ఉత్తమ వైష్ణవ భక్తులు. గురువు ప్రసన్నుడైతే నారాయణుడు ప్రసన్నం అయినట్లే. సకల పుణ్యక్షేత్రాలను, తీర్థాలను దర్శించిన ఫలం దక్కుతుంది. సకల వ్రతాలు, తపస్సు చేసిన పుణ్యఫలం దక్కుతుంది. శాస్త్ర పరిజ్ఞానం ధర్మాధర్మ వివేకం, భక్తి జ్ఞానవైరాగ్యాలు, సదాచారం సమస్తము గురుసేవ చేతనే లభిస్తుంది. నాయనా కలీ! ఒక్కమాటలో చెప్పాలంటే గురుమహిమ వర్ణనాతీతం. అంతట కలి, విధాతా ! ఇక్కడ నాదొక ధర్మసందేహం ఉన్నది. మానవ మాత్రుడైన గురువుకు ఇంతటి శక్తి ఎలా వచ్చింది. సకల దేవతా స్వరూపుడంటున్నావు, సర్వజ్ఞుడంటున్నావు ఇదెలా సాధ్యం అయింది? అని అడిగాడు.

కలీ! మంచి సందేహం వచ్చింది. చెపుతున్నాను విను, గురువు లేకపోతే ఎవరికైనా శాస్త్ర పరిజ్ఞానం వుంటుందా? శాస్త్రాలు తెలియకపోతే ధర్మ స్వరూపం తెలుస్తుందా? ఇది తెలియనివాడు నీ బారి నుండి తప్పించుకోగలడా? కీలకం అంతా ఇక్కడే వుంది.

గురుమహిమను తెలియజెప్పే పురాణ గాథ ఉంది. చెబుతాను. ఆలకించు. నీ సందేహాలు అన్నీ తీరుతాయి అన్నాడు బ్రహ్మ.

## దీపక వృత్తాంతం

అంగీరసుడు అనే బ్రహర్షి వుండేవాడు. ఆయన గోదావరీ తీరంలో ప్రశాంత వాతావరణంలో ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేసుకొనేవాడు. ఆయన ఆశ్రమం ఎప్పుడూ మునులతో శిష్యులతో కళకళలాడుతూ వుండేది. ఎక్కడెక్కడ నుండో మునులు, ఋషులు వచ్చి అంగీరసుడ్ని అడిగి తమతమ సందేహాలు తీర్చుకుంటూ వుండేవారు. యోగరహస్యాలు తెలుసుకుంటూ వుండే వారు. ఎందరు వచ్చినా ఆ ఆశ్రమంలో కందమూల ఫలాలుకాని, పుష్పాలకు గాని లోటు ఉండేదికాదు. అలా వచ్చిన వారిలో వేదధర్ముడు అనే ముని ఒకరు, ఆయన పైలుని కుమారుడు. శిష్యబృందంతో వచ్చి ఆంగీరసుని వనంలోనే తపస్సు చేసుకుంటూవున్నాడు. ఆయన శిష్యులలో దీపకుడు అనే శిష్యుడు అగ్రగణ్యుడు. బుద్ధిలోను, గుణంలోనూ, వినయంలోనూ, విధేయతలలోనూ, నిష్టలోనూ చెప్పకోదగిన వ్యక్తి. వేద వేదాంగాలు అభ్యసించాడు. అయినా గృహస్థాశ్రమం స్వీకరించలేదు. బ్రహ్మచారిగానే జీవితాంతం వుండి గురుసేవ చేస్తూ తరించాలని దృఢంగా నిశ్చయించుకున్నాడు. గురువుగారు సరేనని అంగీకరించాడు. దీపకుడు పరమానందభరితుడై గురుసేవలో కాలం గడుపుతున్నాడు. ఒకరోజు దీపకుడు వేదధర్మునికి సేవ చేస్తూ ఇలా అన్నాడు. గురుదేవా ! నాదొక చిన్న సందేహం. అడగమంటే అడుగుతాను అన్నాడు. వేదధర్ముడు అడగమన్నాడు. అప్పుడు దీపకుడు గురుదేవుని పాదాలు నొక్కుతూ గురుశిష్య పదాలకు సమగ్రంగా అర్థం వివరించండి అన్నాడు. అప్పుడు వేదధర్ముడు ఆనందంతో ఇలా చెప్పుతున్నాడు.

నాయనా లోకంలో హితం చెప్పిన వాడల్లా గురువే ! ఒక్క అక్షరం పాటి జ్ఞానాన్ని బోధించేవాడు గురువే !

జీవితంలో మనిషికి చాలా మంది గురువులు వుంటారు. వారిలో ఉత్తములు ఉంటారు. మొట్టమొదట కన్నతల్లి గురువు. ఆ తరువాత, తండ్రి మరొక గురువు, ఇంటికి పెద్దవాడు గురువే. మేనమామ, పిల్లనిచ్చిన అత్తమామలు, తండ్రి యొక్క తల్లిదండ్రులు, తల్లి యొక్క తల్లిదండ్రులు వీరంతా మంచి చెప్తారు కనుక గురువులే ! ఉపనయన సమయంలో బ్రహ్మోపదేశం చేస్తాడు కనుక కన్నతండ్రి గురువే ! వేదాలు శాస్త్రాలు అతడే నేర్పితే అతని గురుత్వం రెట్టింపు అవుతుంది. వేరొకరెవరైనా వేదాలు శాస్త్రాలు నేర్పితే అతడు ఉత్తమ గురువు. సంగీతం, శిల్ప, లౌకిక విద్యలు నేర్పిన వారెవరైనా గురువులుగానే పరిగణింపబడతారు. సంసార సాగరాన్ని తరించడానికి జనన మరణాల చక్రం నుండి బయటపడటానికి ఏకైక మార్గం అయిన బ్రహ్మ జ్ఞానాన్ని ఉపదేశించేవాడు పరమగురువు. అతడే పరతత్వం ! అతడే త్రిమూర్తి స్వరూపం ! అతడే సకల దేవతా స్వరూపం ! మానవ రూపంలో వున్నాడని అనుమానించవలసిన అవసరం లేదు. బ్రహ్మజ్ఞానంతో నిన్ను బ్రహ్మమును చేసే పరబ్రహ్మమతడే. వీరు కాక రకరకాల దేవతా ఉపాసనలు, మంత్రాలు, వ్రతాలు, ఉపదేశించే గురువులు చాలామంది వుంటారు. దీక్షలు ఇచ్చేగురువులు వుంటారు. ఆచార్యులు వుంటారు. **గురికుదుర్చుకొని శ్రద్ధతో గురుసేవ చెయ్యాలి. ఇహ పరాలలో శ్రేయస్సుని కలిగించేవాడు గురువు. సద్గురువును ఆశ్రయిస్తే సమకూడనిది అంటూ లేదు.**

ఈ దేహము ఒక నౌకతో సమానం సంసార సముద్రంలో నౌక పయనిస్తుంది. దీన్ని సరియైన దారిలో పెట్టి గట్టుకి చేర్పించే వాడే సద్గురువు. కనుక సద్గురువును ఆశ్రయించడం ప్రథమ కర్తవ్యం. బ్రహ్మజ్ఞానం వాదోపవాదాలతో లభించదు. యోగ సాధన కావాలి. తపోనిష్టకావాలి. అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహం వుండాలి. వేదవేదాంగ పరిజ్ఞానం వుండాలి. వీటి అన్నింటికి మార్గదర్శకుడు సద్గురువు మాత్రమే.

మానవరూపంలో అవతరించిన నారాయణుడు కూడా సద్గురువును ఆశ్రయించాడు. శ్రీరాముడు వశిష్ఠ విశ్వామిత్రులను గురువులుగా సేవించాడు. శ్రీకృష్ణుడు, సుదాముడు మొదలగు మిత్రులతో కలసి సాందీప మహర్షి వద్ద గురుసేవలు చేసి వేద విద్యలు అభ్యసించాడు. గురుకులవాసం చేసాడు. సహాధ్యాయులతో కలసి తాను అడవికి వెళ్ళి గురువుకు కావలసిన సమిధలు, పండ్లు మొదలగునవి సేకరించి తెచ్చాడు. ఆ సమయంలో కష్టాలు అనుభవించాడు. గురువుల అనుగ్రహాన్ని పొందారు. శ్రీకృష్ణుడ్ని జగద్గురువుగా పరబ్రహ్మముగా గుర్తించిన తరువాత సహధ్యాయులు, గురువులు తమతమ భాగ్యానికి ఆనందించారు. లీలానాటక సూత్రధారి అని పొగిడారు. గురుశుశ్రూషకు సంతోషించినట్లుగా నేను ఇంక ఏ ధర్మాచరణకు సంతోషించనని అలనాడు భగవానుడే ప్రకటించాడు. కనుక నాయనా దీపకా ! గురుమహిమవర్ణనాతీతం. గురుప్రసాదం సకలార్థ సాధకం.

ఇంక శిష్యుని గురించి చెబుతాను విను. మంచి మాటలతో గురువు చేత శాసించబడేవాడు శిష్యుడు. భోగమోక్ష విషయంగా మంచి రెండు రకాలు. (గురువులో లేశ మాత్రమైన ఏమైనా లోపాలు వుంటే, దోషాలు. బలహీనతలు ఉంటే వాటిని పదిమందికి టముకు వేసి ప్రచారము చెయ్యకుండా కప్పివుంచేవాడు ఛాత్రుడు. నీడలాగ గురువెంటవుండి విద్యనభ్యసిస్తూ సేవిస్తూ జీవించేవాడు అంతేవాసి. ఇలాగ శిష్యులలో బేధాలు వున్నాయి) **శిష్యునికి ఏది హితమని భావిస్తాడో దాన్నే గురువు బోధిస్తాడు. మారుమాట్లాడకుండా శిష్యుడు శిరసావహించాలి. ఇహలోకంలో సుఖాన్ని పరలోకంలో ముక్తిని ప్రసాదించేది, హితమంటె. ఒక్కొక్కప్పుడు గురువు చెప్పింది ఇహలోకంలో కష్టంగావచ్చు. అయినా శిష్యుడు**

**కాదు అనకూడదు. వేదశాస్త్ర పురాణాలు ఏది ఎవరికి హితమో నిర్ణయించాయి. ఆ పరిజ్ఞానంతోనే గురువు శాసిస్తాడు. ఆచరణకి అనుగుణం అయిన సాధన సంపత్తిని నేర్పిస్తాడు. నిత్యానిత్యవస్తు వివేకం కలిగిస్తాడు. భోగాలు క్షణికమని గ్రహించి వైరాగ్యంతో గురుపాదాలను ఆశ్రయించడమే శిష్యుని కర్తవ్యం. తత్వజ్ఞానం ఉపదేశంపొందడానికి అర్హుడు వాడే. అనంతకాలంలో తానూ గురు పదవిని అధిష్టిస్తాడు. ఉత్తమ శిష్యులను రూపొందించి గురుఋణ విముక్తుడవుతాడు. ఇలా గురుశిష్యపరంపర నిరంతరంగా అనంతంగా కొనసాగుతూనే వుంటుంది.** అని వేదధర్ముడు ముగించాడు. దీపకుడు సందేహాలు తీర్చుకొని ప్రశాంత చిత్తంతో గురువుకు సాష్టాంగ నమస్కారము చేసాడు.

శౌనకాది మునులారా! బ్రహ్మదేవుడు కలికి చెప్పిన గురుశిష్యుల సంభాషణ ఇది. గురు శిష్యుల లక్షణాలు గుణగణాలు తెలిసాయి కదా! గురువు అంటే త్రిమూర్తి స్వరూపుడు అని గురుభక్తి గురుసేవయే భుక్తిముక్తిదాయకం అని పురాణములు బోధిస్తున్నాయి. అటువంటి గురు దత్తాత్రేయుడి చరిత్రను వినాలని అనుకోవటం మీ పూర్వపుణ్య విశేషం. చెబుతాను వినండి. అని సూత మహర్షి అన్నాడు.

అప్పుడు మునులంతా ఇలా అన్నారు. మహర్షీ గురు శిష్యుల లక్షణాలు అద్భుతంగా చెప్పావు, ధన్యవాదాలు. దత్త చరిత్ర వినాలనే కుతూహలం మమ్మల్ని తొందర పెడుతుంది. కానీ దీపక వేదధర్ముల సంభాషణ మధ్యలోనే ఆగిపోయింది. దీపకుడు తన దీక్షను నెరవేర్చుకొన్నాడా ? జీవితాంతం బ్రహ్మచారిగానే వుండి గురుసేవలో తరించాడా? కష్టాలు ఎదురైనాయా ? చివరికి అతనికి దక్కిన గురుఫలం ఎలాంటిది ? గురువు ఎలా అనుగ్రహించాడు ? ఇవన్నీ మాకున్న సందేహాలు అని అడిగారు.

అప్పుడు సూతమహర్షి వారి వంక చిరునవ్వుతో చూస్తూ ఇలా చెప్పాడు. గురుశుశ్రూష తప్ప వేరొక ధ్యాసలేని దీపకుడ్ని ఒకరోజు వేద ధర్ముడు దగ్గరకి పిలచి నాయనా నీ సేవలకు ఆనందంగా వుంది. నాకున్న శిష్యులందరిలో అగ్రగణ్యుడవు నీవే. నాకొక అవసరం వుంది ముందు విను తరువాత సమాధానం చెబుదువు గాని తొందరలేదు అని నాయనా, దీపకా, నేను అనుభవించవలసిన కొన్ని కర్మలు ఇంకా మిగిలిపోయాయి. అవి పూర్వజన్మ సంచితములు. తపస్సులతో కొంతరవకు నశింపజేసుకొన్నాను. ఇంకా కొన్ని మిగిలి ఉన్నాయి. అవి తప్పనిసరిగా అనుభవించి నశింపజేసుకోవడమే ఉత్తమ మార్గం. అందుకని కాశికి వెడదామని అనుకొంటున్నాను. ఆ పుణ్యక్షేత్రంలో అయితే మహా మహా పాతకములను కూడా స్వల్ప ప్రాయశ్చిత్తములతో నశింపజేసుకోవచ్చు. **పుణ్య ఫలాల మాదిరిగానే పాప ఫలాలు ఎక్కడికిపోవు. కర్త - అనుభవించి తీరవలసిందే. దేవతలకైనా ఇది తప్పదు.** కనుక నేను ఈ నిర్ణయం తీసుకొన్నాను. కాశీలో నేను పాప ఫలాలు అనుభవిస్తున్న వేళ విసుక్కోకుండా, కసుక్కోకుండా, సేవలు చేసే శిష్యుడు కావాలి. నా మనస్సుకి నీవు కనిపించావు నేను నిర్ణయిస్తే నీవు కాదనవని తెలుసు. కాని ఇది ఒకటి రెండు రోజులు కాదు ధృఢదీక్ష వుండాలి, అంకిత భావం వుండాలి. అన్యచింతలు దగ్గరికి రానివ్వని నిగ్రహం వుండాలి. అదీగాక నీవు ఇప్పుడు గృహస్థాశ్రమానికి యోగ్యమైన వయస్సులో వున్నావు విద్యలన్నీ పూర్తి చేసుకున్నావు నీ మనస్సు ఏమంటుందో తొందరలేదు ఆలోచించుకొని చెప్పు అన్నాడు.

అప్పుడు దీపకుడు గురుదేవా ! మీరింతగా చెప్పాలా నేను మీ సేవకే అంకితమైనాను. మీ సేవలో జీవించడమే నా ధ్యేయం, నా దీక్ష. మనస్సులో కూడా నన్ను శంకించకండి. కాశిలో వుండి మీ సేవ చేసుకొనే భాగ్యం ప్రసాదించండి అన్నాడు.

నాయనా దీపకా నువ్వు ఇలా అంటావని నాకు తెలుసు కనుకనే నేను నిన్ను అడిగాను. కాని కాశిలో పాప ఫలాన్ని అనుసరించి నేను కుష్టు రోగపీడితున్ని కాబోతున్నాను. కుంటితనము, గ్రుడ్డితనము ఇవన్నీ వస్తాయి. ఇవన్నీ ఇరువది ఒక్క సంవత్సరముల పాటు అనుభవించవలసినవి. ఇవన్నీ పూర్వజన్మ సంచితాలు. ఇన్ని సంవత్సరములు సేవ చెయ్యాలి అన్నాడు.

అప్పుడు దీపకుడు గురూత్తమా ! తప్పకుండా చేస్తాను. కాని నాదొక సందేహం ఆ పాపాన్ని మీరే అనుభవించాలా? నాకు సంక్రమింప జేయండి అది నేను అనుభవిస్తాను. మీరు నిరాటంకంగా తపస్సు చేసుకోవచ్చు అన్నాడు.

అప్పుడు వేదధర్ముడు నాయనా **ఎవరి పాపాలు వారు అనుభవించవలసినదే. పాప ఫలాలు కర్తలకే చెందుతాయి తప్ప శిష్యునకో, పుత్రునికో, లేదా ఇంకొకరికో పులముదామని అనుకొంటే అంటుకోవు** కనుక నా పాప ఫలాలు నేను అనుభవిస్తాను.

అనుభవిస్తున్న సమయంలో సేవ చేస్తే చాలు. కుష్టురోగికి సేవలు చేయడమంటే అది అనుభవించడంకన్నా కష్టం. దానికి నువ్వు అంగీకరించావు. పద వెంటనే కాశీకి చేరుకుందాం అని త్వరత్వరగా ఇద్దరూ మనోవేగంతో కాశి చేరుకున్నారు. గంగానదిలో మణికర్ణికా ఘట్టంలో స్నానం చేసారు. డుండి గణపతిని కాలభైరవుణ్ని అర్చించారు. అన్నపూర్ణ విశాలాక్షి, విశ్వేశ్వరులను దర్శించారు. ఉత్తర దిక్కుగా ఒక కంబలాశ్వతరు సన్నిధిలో చిన్న కుటీరం నిర్మించి నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ముప్పొద్దులా గంగాస్నానం, విశ్వనాధుని దర్శనం, చేసుకున్న తరువాత ఒకరోజు తెల్లవారి లేచేసరికి వేదధర్ముడి శరీరం నిండా పొక్కులు వచ్చాయి. క్షణంలో కాళ్ళు చేతులు తిమ్మిరులెక్కాయి. పొక్కులు చితికి చీము, నెత్తురు కారసాగాయి. చూస్తూవుండగానే శరీరం అంతా పొడలుతో నిండిపోయింది. చూపు మందగించింది. కంఠస్వరం మారిపోయింది. వేళ్ళు వంకరలు తిరగాయి. కుష్టు తనము, కుంటి తనము, గ్రుడ్డి తనము ఒక్కసారిగా వేదధర్ముణ్ని ముంచెత్తాయి. క్రమక్రమంగా రోగం బాగా ముదిరిపోయింది. నిలబడలేక పోతున్నాడు, కూర్చో లేకపోతున్నాడు, పడుకోలేకపోతున్నాడు. అసలు కదలలేని స్థితి వచ్చింది. అన్నీ మంచంలోనే భరించలేని దుర్వాసన. దీనికి తోడు కాశీలోని ఈగలన్నీ అతన్ని చుట్టు ముట్టాయి. రోగ బాధతో వికృతంగా మారిపోయాడు. మెడలు వాల్చి ముఖం ఏటవాలుగా త్రిప్పి కనిపించని కన్నులతో దీపకా, దీపకా అని అరుస్తున్నాడు. దీపకుడు మాత్రం నిమిషం ఏమారకుండా సకలసేవలూ చేస్తున్నాడు. పసి బిడ్డను కన్నతల్లిలా చూస్తున్నాడు. ఎంత దుర్గంధం అయినా ముఖం త్రిప్పుకోకుండా భరిస్తూ గురువుగారు వున్న ప్రదేశాన్ని ఆయన శరీరాన్ని శుభ్రం చేస్తూ ఈగలను తోలుతూ సేవచేస్తున్నాడు. గురువుగార్కి కొద్దిగా కునుకుపట్టిన సమయంలో గబాగబా నాలుగిళ్ళు తిరిగి యాచించి ఆహారం తెస్తున్నాడు. ఆకలి ఎరిగి బతిమాలి తినిపిస్తున్నాడు. కుష్టురోగికి కోపమెక్కువ అన్నారు. వేదధర్ముడు నిష్కారణంగా దీపకుణ్ని తిట్టిపోస్తున్నాడు. ఈపాటి చెయ్యిలేనివాడివి ఎందుకొచ్చావని దెప్పిపొడుస్తున్నాడు. ఒకరకంగా కాదు, నానా దుర్భాషలు ఆడుతున్నాడు. మరుక్షణంలోనే మళ్ళీ సౌమ్యుడౌతున్నాడు. నాయనా దీపకా, తండ్రీ దీపకా అని బుజ్జగిస్తున్నాడు. నిన్ను బాధపెడుతున్నానురా అని విలపిస్తున్నాడు. మళ్ళీ అంతలోనే అనరాని మాటలతో తిట్టిపోస్తున్నాడు. దీపకుడు మాత్రం అన్నింటికి ఓర్చుకుని చెరగని చిరునవ్వుతో, నిగ్రహంతో, సేవజేస్తున్నాడు. గురువులోనే విశ్వనాధున్ని, కాశీలోని దేవతలందర్ని, గురువులోనే చూస్తూ సేవిస్తున్నాడు. తగినంత దొరక్క, దొరికింది గురువుకే సరిపోక పస్తులుంటూ సేవించుకొంటున్నాడు. ఏ నిమిషాన గురువు గారికి ఏ అవసరముంటుందోనని మంచం ప్రక్కనే

వుండి రేయింబవళ్ళు మెలకువగా కూర్చుంటున్నాడు. కాశికి వచ్చింది మొదలు కంటినిండా నిద్రపోయిన రోజులేదు. కడుపునిండా తిన్న రోజులేదు. అయినా గురుసేవ చేస్తున్నాననే తృప్తి అతన్ని నిలబెడుతోంది. లభించబోయే ముక్తి అతన్ని నడిపిస్తోంది. రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడుస్తున్నాయి.

ఒకరోజు తెల్లవారుఝామున దీపకుడు గంగానదికి వెళ్ళి తాను స్నానం చేసి యధావిధిగా గురువువారి శరీరాన్ని శుభ్రం చేయడానికి అవసరమైన గంగాజలాన్ని కడవకెత్తుకుని గురువుగారు లేచారేమోననుకొని వడివడిగా కుటీరంలోకి వస్తున్నాడు. ఇంతలో కుటీరానికి చేరువలో దీపకుని ఎదుట కాశీవిశ్వనాధుడు దర్శనమిచ్చాడు. నువ్వుచేస్తున్న గురుసేవకు ధర్మనిష్టకూ సంతసించాను ఏదైనా వరంకోరుకో అన్నాడు విశ్వనాధుడు. దీపకుడు సంభ్రమాశ్చర్యములతో సాష్టాంగపడి విశ్వనాధుని సేవించి స్తుతించాడు. బ్రహ్మర్షులకు కూడా దక్కని నీ దర్శన భాగ్యం దక్కింది, నాకు వరంకూడా ఇస్తానంటున్నావు. ఆనందపారవశ్యంలోవున్నాను. ఏమని అడగాలో కూడా తెలియడం లేదు. ఓ నిమిషం ఆగు కుటీరంలోకి వెళ్ళి గురువుగార్ని అడిగివస్తాను, అంటూ కుటీరంలోకి ప్రవేశించాడు. గురుదేవా ! శివుడు ప్రత్యక్షమైనాడు. వరం కూడా ఇస్తానంటున్నాడు. గురుశుశ్రూషకు సంతోషించాడట. మీరు అనుమతి ఇస్తే మీ కుష్టత్వము, అంధత్వము అన్నీ పోయేటట్లుగా వరం అడుగుతాను అడగమంటారా అన్నాడు. అప్పుడు వేదధర్ముడు గంభీర స్వరంతో నాయనా దీపకా శివుడంతటివాడు ప్రత్యక్షమై వరంకోరుకోమంటే ఇంతకంటే అడగడానికి నీకు ఇంకేమీ దొరకలేదా ఐహిక విషయములా అడగవలసింది. పైగా నారోగం పాప ఫలం అనీ, అనుభవించడం తప్ప వేరొక గత్యంతరం లేదని ఎన్నోసార్లు చెప్పాను అన్నాడు.

వేదధర్ముడి మాటల్లో విసుగుని గుర్తించాడు దీపకుడు. కుటీరం వెలుపలికివచ్చి శివునికి నమస్కరించి అష్టమూర్తీ నీ వాత్సల్యానికి ధన్యవాదములు. నిన్నిప్పుడు అడగదగింది నాకు ఏదీ కనిపించడంలేదు క్షమించు అన్నాడు. అదేమిటి నాయనా అడగదగిందే కన్పించడం లేదా మీ గురువు ఆరోగ్యం సరిచేయమని కోరవచ్చు కదా ! అంటూ శివుడు ప్రోత్సహించాడు. దానికి దీపకుడు నిరాకరించాడు. అలాంటివరం అడిగేందుకు గురువు అనుమతిలేదు. సెలవు ఇప్పించు గురువు గార్కి సేవజేసుకోవాలి అని రివ్వున కుటీరంలోకి వెళ్ళి గురుసేవలో నిమగ్నమయ్యాడు. శివుడు అంతర్ధానం చెంది తన ఆస్థానమంటపంలో ఆ సాయంకాలం కొలువు తీరి వుండగా సకల దేవతల సమక్షంలో అందరూ వింటూవుండగా శ్రీమన్నారాయణునితో ఈ సంగతి చెప్పాడు. దీపకుడంటే దీపకుడే భవధ్వాంతనాశకుడు. నువ్వు తప్పనిసరిగా వెళ్ళి చూడదగిన శిష్యుడు అని ప్రశంసించాడు.

శ్రీమన్నారాయణుడు ఆనందంపట్టలేక మరునాడే దీపకుని ముందు ప్రత్యక్షమయ్యాడు. నాయనా దీపకా నీ గురుసేవా పరాయణత్వం నన్ను ఆనందపరవశుణ్ని చేసింది. నీ యిష్టం వచ్చిన వరం కోరుకో అన్నాడు.

దీపకుడు భక్తి ప్రపత్తులతో సాష్టాంగ నమస్కారం చేసాడు. అనేకానేక స్తోత్రములతో స్తుతించాడు. నారాయణా! వాసుదేవా! గురుసేవ అనేది హరిహరులను ఇద్దరినీ ఇంతగా ఆనందపరుస్తుందని తెలియదు. నా ధర్మంగానే నేను సేవజేస్తున్నాను. దిక్పాలకులకైనా అనుగ్రహించని దివ్య దర్శనం నాకు ప్రాప్తింపజేసారు. ఇది మీ కరుణకి సంకేతం. నాకు గురువే దైవం జపము, తపము, తీర్థము, క్షేత్రము సర్వస్వమూ నాకు గురువే. వేదశాస్త్రాలు బోధించి, ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించి, పరతత్వాన్ని తెలియపరచిన వేదధర్ముడే నాకు ప్రత్యక్షదైవం. అనన్య చిత్తంతో గురుసేవ చేస్తున్నాను. దీనికి ఏదైనా ప్రతిఫలముంటే అది మోక్షమే తప్ప కోరదగింది ఏమీలేదు. అయినా కరుణామూర్తివై వచ్చి ఏదైనా

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

కోరుకోమన్నావు కాబట్టి అడుగుతున్నాను. నాలో గురుభక్తి స్థిరమయ్యేట్టు అనుగ్రహం ప్రసాదించు. నాకు తెలియని గురుమహిమ ఏమైనా ఉంటే చెప్పు. ఇదే నిన్ను కోరే వరం.

శ్రీమన్నారాయణుడు కళ్ళల్లో ఆనంద భాష్పాలు తిరిగాయి. నాయనా గురుస్వరూపమే బ్రహ్మపదాన్ని అందిస్తుంది. ఉదరపోషణకు అవసరమయిన లౌకిక విద్యలు నేర్పిన వాడు సాధారణ గురువు. ధర్మాధర్మ వివేకాన్ని కలిగించేవాడు అతనికంటే ఘనుడు. వేదశాస్త్రాలను బోధించేవాడు అతనికంటే ఘనుడు. వేదార్థ బోధకుడు అధికుడు. బ్రహ్మవిద్యోపదేష్ట అందరికన్నా గొప్పవాడు. అతడు నాకు అభిన్నుడే. అరిషడ్వర్గాలలో చిక్కుకొని అల్లకల్లోలమవుతున్న శిష్యుని మనస్సుకు పురాణేతిశాస్త్రాల ప్రబోధంతో ఊరడింపు కలిగించి ధర్మపథంలో నడిపించే గురువే ప్రత్యక్షదైవం. అతన్ని మనోవాక్కాయ కర్మలతో సేవించడానికి మించిన పురుషార్థం లేదు. అదియే భుక్తి, ముక్తి ప్రదం. ఈ తత్వం నీవు తెలుసుకొని గురుసేవలో ఉన్నావు. అందువల్లనే దర్శనం ఇచ్చాను. సద్గురువులను సేవించే సచ్ఛిష్యులంటే మా త్రిమూర్తులకు చాలా ఇష్టం. నీకు సకలశుభాలు కలుగుగాక ! అని ఆశీర్వదించి నారాయణుడు అదృశ్యమయ్యాడు.

కుటీరంలోని వేదధర్మునకు మెలుకువ వచ్చింది. దీపకున్ని పిలిచి నాయనా దీపకా ఎవరు వచ్చింది, ఎవరితో మాట్లాడుతున్నావు అని అడిగాడు. దీపకుడు వేదధర్మునికి నమస్కరించి పరమానందంతో జరిగిన వృత్తాంతం చెప్పాడు. వేదధర్ముడు ముఖంలో ఆనందం, కన్నుల్లో వాత్సల్యం తళుక్కున మెరిశాయి.

ధృఢ చిత్తంతో, స్థిరసంకల్పంతో దీపకుడు సేవలుజేస్తు ఉండగా 21 సంవత్సరాలు గడిచిపోయాయి. వేదధర్ముని పాపాలు నశించాయి. కుష్ఠురోగము, అంధత్వము అన్నీ ఎవరో తీసివేసినట్టుగా తొలగిపోయాయి. శరీరం మీద ఆనవాలుగా ఒక మచ్చ కూడా లేదు. బూడిద నుండి వెలువడిన అగ్నికణంలా ప్రకాశిస్తున్నాడు. దీపకుడు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. గురుదేవా అంటూ వేదధర్ముడు పాదాలమీద పడి సాష్టాంగ నమస్కారం చేశాడు.

నాయనా దీపకా నీ సేవలు ఫలించాయి. పూర్వజన్మ సంచితాలయిన నా పాపకర్మలు వదిలిపోయాయి. ఈ పుణ్యమంతా నీదే, నీ గురుభక్తి చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుంది. నవనిధులు నీకు పరిచారకులు అవుతాయి. అష్టసిద్ధులు సంప్రాప్తమవుతాయి. ఇకనుంచి గురుశుశ్రూష విషయంలో ముందు నిన్నే చెప్పుకుంటుంది లోకం. కాశీ విశ్వనాధుని దయవల్ల ప్రారబ్ధకర్మేకాదు. మొత్తం భవసాగరాన్నే దాటాము.

కాశీకి వచ్చిన ఏ ప్రాణికోటినయినా తరింప చేస్తాడు విశ్వనాధుడు. ఈ భూగోళంలో కాశీని మించిన క్షేత్రం లేదు. విశ్వనాధున్ని మించిన దైవంలేదు. ముక్తిని కోరుకునే వారందరికీ కాశీ వాసము కొంగు బంగారం. మహా ప్రళయములో కూడా నశింపక నిలిచే ఏకైక అద్భుత క్షేత్రం కాశి. యమ నియమాలతో అంతరేంద్రియ బహిరింద్రియాలను బంధించి విశ్వనాధుని పాదాలను ఆశ్రయించిన వారు జీవన్ముక్తులవుతారు. కాశీలో నివశిస్తూ గంగానది, కాలభైరవుడు, డుండి విఘ్నేశ్వరుడు, దండపాణి, విశాలాక్షి, విశ్వనాధుడు, ఆరుగురిని సేవించే వారిని షడంగయోగులు అంటారు. ఎక్కడెక్కడో నివసిస్తూ యమ - నియమ - ప్రాణాయామ - ఆసన -ప్రత్యాహార - ధ్యాన - ధారణ - సమాధులను అవలంభించే, అష్టాంగ యోగులుకన్నా వీరు పుణ్యాత్ములు. కాబట్టి దీపకా మనం కాశీలోనే ఉండిపోదాం. 21 సంవత్సరములు, విసుగు విరామం లేకుండా, నిద్రహారాలకు దూరమై నాకు సేవలు చేసావు. నా అంతరంగము ఆనందమయమయ్యింది. సాక్షాత్తు విశ్వనాధుడు, నారాయణుడు ప్రత్యక్షమై వరాలు కోరుకోమన్నా

నిశ్చల గురుభక్తిని మాత్రమే కోరుకున్నావు. అలాంటి నీకు ఇవ్వదగింది చెప్పదగింది ఏమున్నది, అని ఆనందంతో, సంతోషంతో పలికాడు వేదధర్ముడు.

దీపకుడు సాష్టాంగ నమస్కారం చేసి లేచి నిలబడి చేతులుజోడించి, కన్నీరు కారుస్తూ, మహాతపస్వి, బ్రహ్మతేజస్వి అయిన మీ అనుగ్రహానికి పాత్రుడునయ్యాను నాకు అన్నీ లభించినట్లే. అణిమాది సిద్ధులు - చతుర్విధ పురుషార్థాలు మీ సేవతోనే దొరికాయి. నాకు మీ పాద సేవకన్నా ఇవి అన్నీ ఎక్కువ అనిపించడం లేదు. నిన్ను సేవించడం తప్ప ఇహపరాలలో నేను కోరదగింది ఏమీ లేదు. నా జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మరిక దేని జోలికి పోవడం లేదు. ఇది సత్యం. అయినా ప్రసన్నుడవై ఉన్నావు కనుక చాలా కాలంగా నా మనస్సుతో ఉండిపోయిన కోరిక ఒకటి ఉంది. ఇంతకు ముందు ఒకసారి అడిగితే తరువాత చూద్దాం అన్నారు. అప్పటి నుండి ఎదురుచూస్తున్నాను. ఇప్పుడు అవకాశం ఇచ్చారు కనుక దత్తాత్రేయుడి చరిత్రను మీ ముఖతః వినాలని నా కోరిక. గురుదేవ దత్తుడు ఎవరు ? ఎవరి అవతారం? ఆయన రూపం, ఆయన చరిత్ర, ఆయన మహిమ ఆయన్ను ఉపాసించవలసిన విధానం, ఉపాసించి తరించిన భక్తుల కథలు ఇవన్నీ తెలుసుకోవాలని ఉంది. ఆయన దయలేనిదే యోగసిద్ధులు కలగవు అంటారు. ఆయన వర్ణాశ్రమ ధర్మాలకి అతీతుడు అంటారు. అనసూయ, అత్రి మహామునుల బిడ్డడు అంటారు. త్రిమూర్తి స్వరూపుడంటారు. చిత్ర విచిత్రమయిన లీలలు చేస్తారు అంటారు. జ్ఞానము యొక్క పరిపూర్ణ రూపమే ఆయనంటారు. దయచేసి వీటిని వివరంగా తెలియచెప్తే, అదే వరంగా ఆనందిస్తాను. అన్నాడు దీపకుడు.

## వేద ధర్ముడు చెప్పిన దత్త చరిత్ర

దీపకా నీ సంస్కారం నన్ను ఆశ్చర్యపరుస్తోంది. దత్త చరిత్రను వినాలని కోరిక కలగడం గొప్ప విశేషం తప్పకుండా చెప్తాను. ఈ రూపంగా ఆ దత్తదేవున్ని స్మరించుకొనే భాగ్యం నాకు కల్గించావు. ఈ సద్గురు దేవుని యొక్క కథ అత్యద్భుతం. చెప్పినవారు, విన్నవారు ధన్యులవుతారు. సర్వపాపాలు నశిస్తాయి. సర్వమంగళాలు లభిస్తాయి. కానీ ఆయన లీలలు అన్నీ చెప్పడం ఎవ్వరి తరమూ కాదు. ఆ పరమాత్మను ధ్యానించి ఆయన అనుగ్రహించిన మేరకు రూపాలు, నామాలు, మహిమలు, భక్తుల గాథలు, అన్నీ చెప్తాను ముందుగా అష్టోత్తర శతనామావళితో దత్తాత్రేయుణ్ని మన మనోమందిరములలో పూజిద్దాం. నమస్కార ప్రియుడు స్వామి, స్మరణ మాత్ర సంతుష్టుడు స్వామి. ఓం శ్రీం హ్రీం ద్రాం బీజాక్షర సంపుటితో చివరిగా దత్త నామాన్ని ఉచ్చరించి నమః అని అంటే చాలు. స్వామి సంబరపడి కరుణామృత వృష్టి కురిపిస్తాడు.

ఓం శ్రీం హ్రీం దత్తాయనమః, ఓం దేవదత్తాయనమః ఓం బ్రహ్మదత్తాయనమః ఓం విష్ణుదత్తాయనమః, ఓం శివదత్తాయనమః, ఓం అత్రి దత్తాయనమః, ఓం ఆత్రేయాయనమః, ఓం అత్రివరదాయనమః, ఓం అనసూయాయనమః, ఓం అనసూయసూనవేనమః, ఓం అవధూతాయనమః, ఓం ధర్మాయనమః, ఓం ధర్మపరాయణాయనమః, ఓం ధర్మపతయేనమః, ఓం సిద్ధాయనమః, ఓం సిద్ధిదాయనమః, ఓం సిద్ధి పతయేనమః, ఓం సిద్ధిసేవితాయనమః, ఓం గురవేనమః, ఓం గురుగమ్యాయనమః, ఓం గురోర్గురుతరాయనమః, ఓం గరిష్టాయనమః, ఓం వరిష్టాయనమః, ఓం మహిష్టాయనమః, ఓం మహాత్మనేనమః **(25)**, ఓం యోగాయనమః, ఓం యోగపతయేనమః, ఓం యోగీశాయనమః, ఓం యోగాధీశాయనమః, ఓం యోగపరాయణాయనమః, ఓం యోగిధ్యేయాంఘ్రి పంకజాయనమః, ఓం దిగంబరాయనమః, ఓం దివ్యాంబరాయనమః, ఓం పీతాంబరాయనమః, ఓం శ్వేతాంబరాయనమః, ఓం

చిత్రాంబరాయనమః, ఓం బాలాయనమః, ఓం బాలవీర్యాయనమః, ఓం కుమారాయనమః, ఓం కిశోరాయనమః, ఓం కందర్ప మోహనాయనమః, ఓం అర్ధాంగలింగితాంగనాయనమః, ఓం సురాగాయనమః, ఓం విరాగాయనమః, ఓం వీతరాగాయనమః, ఓం అమృతవర్షిణేనమః, ఓం ఉగ్రాయనమః, ఓం అనుగ్రహరూపాయనమః (50), ఓం స్థవిరాయనమః, ఓం స్థవీయసేనమః, ఓం ఊర్ధ్వరేతసేనమః, ఓం ఏకవక్త్రాయనమః, ఓం అనేక వక్త్రాయనమః, ఓంద్వినేత్రాయనమః, ఓం త్రినేత్రాయనమః, ఓం ద్విభుజాయనమః, ఓం షడ్భుజాయనమః, ఓం అక్షమాలినేనమః, ఓం శంఖినేనమః, ఓం గదినేనమః, ఓం మునయేనమః, ఓం మాలినేనమః, ఓం విరూపాయనమః, ఓం స్వరూపాయనమః, ఓం సహస్రశిరసేనమః, ఓం సహస్రాక్షాయనమః, ఓం సహస్రబాహవేనమః (75), ఓం సహస్రాయుధాయనమః, ఓం సహస్రపాదాయనమః, ఓం సహస్ర పద్మార్చితాయనమః, ఓం పద్మపాదాయనమః, ఓం పద్మనాభాయనమః, ఓం పద్మమాలినే నమః, ఓం పద్మగర్భారుణాక్షాయనమః, ఓం పద్మకింజల్క వర్చసేనమః, ఓం జ్ఞానినేనమః ఓం జ్ఞాన గమ్యాయనమః, ఓం ధ్యాననిష్ఠాయనమః, ఓం ధ్యానస్థిమితమూర్తయేనమః, ఓం ధూళిధూసరితాంగాయనమః, ఓం చందన లిప్తమూర్తయేనమః, ఓం భస్మోద్ధూళితదేహాయనమః, ఓం దివ్యగంధానులేపినేనమః, ఓం ప్రసన్నాయనమః, ఓం ప్రమత్తాయనమః, ఓం ప్రకృష్టార్థ ప్రదాయనమః, ఓం వరీయసేనమః, ఓం బ్రహ్మణేనమః, (100), ఓం బ్రహ్మరూపాయనమః, ఓం విష్ణవేనమః, ఓం విశ్వరూపిణే నమః, ఓంశంకరాయనమః, ఓం ఆత్మనేనమః, ఓం అంతరాత్మనేనమః ఓం పరమాత్మనేనమః (108)

నాయనా దీపకా దత్త దయవల్ల నా దివ్య దృష్టికి గోచరించిన అష్టోత్తర శతనామావళి ఇది. స్వామి అనంతనామధేయుడు. అనంతరూపములు కలిగినవాడు. ఈ శతనామావళిని భక్తి శ్రద్ధలతో మూడు కాలాలలో జపించేవాడికి అష్ట అయిశ్వర్యములు లభిస్తాయి. ఆది వ్యాధులు తొలగుతాయి. కన్యలకు తగిన వరుడు లభిస్తాడు. ఇది సకల సిద్ధిప్రదం.

**నాయనా దత్తాత్రేయస్వామి వారు పరస్పర విరుద్ధరూపాలలో తిరుగుతుంటారు. భక్తులను కఠినంగా పరీక్షిస్తుంటారు. ఒక్కోసారి జటామండలధారిగా మరుక్షణంలో ముండిత శిరస్కుడుగా, యోగిగా, భోగిగా, దిగంబరుడుగా, శ్వేతాంబరుడుగా, పీతాంబరుడిగా, కనిపిస్తారు. ఒక్కోసారి మహా విద్వాంసుడిగా కనిపిస్తే మరోసారి ఉన్మత్తుడిగా, మదమత్తుడిగా, కనిపిస్తారు. ఒకోసారి భిక్షాటన చేస్తూ కనిపిస్తారు. ఒకోసారి మహైశ్వర్య సంపన్నుడిగా కనిపిస్తారు. నిజమైన రూపం ఏది అనేది ఎవ్వరికీ తెలియదు. అంతుపట్టని రహస్యం. హర, హరి, హిరణ్యగర్భులుగా కనిపిస్తూ, ఒకేసారి త్రిమూర్తి స్వరూపుడవుతాడు. గంగలో స్నానం చేసి, కొల్హాపురిలో బిక్షచేసి, సహ్యాద్రిపై నివసిస్తూ ఉంటారు. త్రికరణశుద్ధిగా స్మరిస్తే భక్తులకు కనిపిస్తారు. స్మతృగామి అనేది ఈ స్వామికి గొప్ప బిరుదు. అంగన్యాస, కరన్యాసాలతో స్వామిని అర్చించే విధానమున్నది. దీనినే దత్త కవచము అంటారు.** భక్తుడు దత్తనామాలను జపిస్తూ, శిరస్సు మొదలుకొని, కాలివేళ్ళ కొసల వరకు, ఒక్కొక్క అంగాన్ని తాకాలి. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలలో, మనోబుద్ధి చిత్త అహంకారాలలో దత్తనామాలను నిక్షేపించాలి. దత్త కవచధారులకు ఏరంగములోను అపజయముండదు. శత్రుభయాలు, దుష్టపీడలు, గ్రహబాధలు, భూతప్రేత పిశాచాల హింసలు దరిదాపులకు కూడా రావు. భక్త రక్షణలో ఇది వజ్రకవచం. దీనితోపాటు దత్త మంత్రాన్ని సద్గురువు ద్వారా ఉపదేశం పొందితే చెప్పదగింది ఏమీలేదు. దత్తమంత్ర దీక్షను పొందిన వారికి చతుర్విధ పురుషార్థాలు లభించినట్లే. ఇంతగా జపించలేనివారు దత్త నామాన్ని రోజుకు కనీసం 10 సార్లయినా స్మరించాలి.

స్మరించే ముందు దత్త స్వామిని హృదయంలో నిలుపుకోవాలి. పీతాంబరధారి, భస్మోద్ధూళిత దేహుడు, సువర్ణవర్ణుడు, విద్యుత్కాంతి కల్గిన జడలు కలవాడుగా దత్తస్వామిని ధ్యానించి నమస్కరించాలి.

నాయనా దీపకా దత్తస్వామి అవతారగాధ చాలా మనోహరంగా ఉంటుంది. పూర్వం నారదుడు అడిగితే బ్రహ్మ చెప్పాడట. అత్రి మహర్షి చేసిన తపస్సుకు మెచ్చి సాక్షాత్తు, శ్రీమన్నారాయణుడే అత్రికి కొడుకుగా అవతరించాడు అత్రిపుత్రుడు కనుక, ఆత్రేయుడు. అనసూయాత్రి దంపతుల తపస్సుకు మెచ్చి వాసుదేవుడు తనంతతానుగా దత్తమయ్యాడు. కనుకనే దత్తాత్రేయుడయ్యాడు. తన భక్తులైన యదు, కార్తవీర్యార్జున, ప్రహ్లాద, అలర్కుడు, వీరికి బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదించి తరింపచేసాడు. ఈ దత్త లీలలన్నీ మైత్రేయ మహర్షి విదురుడికి చెప్పాడు. ఆ వివరాలు చెప్తాను శ్రద్ధగా విను.

## విదుర మైత్రేయ సంభాషణ

శౌనకాది మునులారా వింటున్నారు కదా ! మీకు కలిగిన సందేహాలే విదురుడికి వచ్చాయి. మైత్రేయ మహర్షిని అడిగాడు. ఆయన చెబుతున్నట్టుగా బ్రహ్మ కలికి చెప్తున్నాడు. ఇవి విన్నవారిని చెప్పిన వారిని ముక్తుల్ని చేసే దత్త లీలలు. ఇవి అతి పురాతన గాధలు. దీపక వేదధర్ముల సంభాషణగా చెబుతాను వినండి, అన్నాడు సూతుడు.

స్వయంభువ మనువుకి ఇల్లాలు శతరూప. ఆ దంపతులకి ఇద్దరు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు జన్మించారు. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, కొడుకుల పేర్లు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనేవి కూతుళ్ళు పేర్లు. వీరిలో ఆకూతిని ఋచి మహర్షికి, దేవహూతిని కర్దమ ప్రజాపతికి, ప్రసూతిని దక్ష ప్రజాపతికి ఇచ్చి వివాహాలు చేసారు. వీరిలో దేవహూతికి తొమ్మిది మంది అమ్మాయిలు, ఒక అబ్బాయి జన్మించారు. అబ్బాయి పేరు కపిలుడు వాసుదేవుడే కపిలుడుగా జన్మించాడు. తొమ్మిది మంది కన్యలు సౌందర్యరాశులు. బ్రహ్మపుత్రులు తొమ్మిదిమంది వీరిని వివాహం చేసుకొన్నారు. అనసూయను అత్రి, అరుంధతిని వశిష్టుడు, శాంతిని అధర్వుడు, కళను మరీచి, శ్రద్ధను అంగీరసుడు, హవిర్భువను పులస్త్యుడు, గతిని పులహుడు, క్రియను క్రతుడు, ఖ్యాతిని భృగువు వివాహం చేసుకున్నారు. వీరిలో అనసూయాత్రికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వర్లు వరుసగా చంద్ర, దత్త, దుర్వాసులుగా జన్మించారు. సృష్టి, స్థితి, లయ కారకులు ఇలా జన్మించటానికి బలమైన కారణం ఉంది. చెప్తాను వినమని మైత్రేయుడు చెప్తున్నాడు. విదురుడు శ్రద్ధగా వింటున్నాడు.

విదురా! ఒకానొక కల్పారంభము నందు చతుర్ముఖుడు పునఃసృష్టి చేయబోతు అత్రి మహర్షి సహాయం అడిగాడు. అంగీకరించటం కోసం అనసూయాసహితుడై ఋక్షాద్రి పర్వతం మీద తపస్సుకి కూర్చున్నాడు. యోగ పరిణితుడు కనుక నిరాహారుడై మనస్సును నిశ్చలపరచి వాయుభక్షణ చేస్తూ ఒంటికాలి మీద నిలబడి వందల సంవత్సరాలు ఘోర తపస్సు చేశాడు. ఎండలు, వానలు, ఏ ఋతువులు ఆయన ఏకాగ్రతను భంగపరచలేకపోయాయి. నూరు సంవత్సరాలు గడిచేసరికి అత్రి శిరోభాగం నుంచి తపోగ్ని జ్వాలలు వెలువడ్డాయి. అవి ముల్లోకాలకు వ్యాపించాయి. దీన్ని గమనించిన త్రిమూర్తులు తమ తమ దేవేరులతో వాహనరూఢులై అష్టదికల్పాలకులు, సకల దేవజాతులు, మునీశ్వర ఋషీశ్వరులు వెంటరాగా, అత్రి ఎదుట నిలిచినారు. ఎట్టెదుట త్రిమూర్తులు సకల దేవతలు, సకల మునులు, అత్రికి కనిపించారు. వృషభ వాహనంపై పార్వతీ పరమేశ్వరులు, గరుత్మంతునిపై లక్ష్మీనారాయణులు,

హంస వాహనంపై వాణీ చతుర్ముఖులు, తమ తమ దివ్యాయుధాలతో, దివ్యాభరణములతో ఉజ్వలంగా ప్రకాశిస్తున్నారు. ఇంద్రాది దిక్పాలకులు పరివేష్టించియున్నారు. ఋషులు మునులు వేదమంత్రాలతో త్రిమూర్తులను స్తుతిస్తున్నారు. అప్పుడు అత్రి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులారా పుత్రార్థినై, నేను ఒకే ఒక్క దివ్య మహస్సును ధ్యానిస్తున్నాను. మీరు ముగ్గురుగా దర్శనమిచ్చారు. మీకు ఇవే నా సాష్టాంగ నమస్కారములు అన్నాడు.

అత్రి మునీంద్రా! నీ సంకల్పం గొప్పది. తపస్సు గొప్పది. నిరాకారము, నిర్గుణము అయిన ఒకే ఒక్క మహస్సును నీవు ధ్యానించినా సాకారులమూ సగుణలమూ అయి మేము ముగ్గురము ధ్యానించిన నువ్వు త్రిగుణాత్మకుడవు కనుక ఇలా దర్శనమిచ్చాము. నీ కోరిక నెరవేరుతుంది. మా అంశలతో నీకు ముగ్గురు కుమారులు జన్మిస్తారు. దివ్యతేజస్వులై జగతిలో ప్రకాశిస్తారు. నీ యశస్సులు దశదిశలా వ్యాపించి శాశ్వతంగా నిలుస్తాయి. తీవ్ర తపస్సును విరమించు శుభం కల్గుతుంది అని ఆశీర్వదించి అదృశ్యులయ్యారు.

అటుపైన బ్రహ్మాంశ వల్ల చంద్రుడు, విష్ణాంశ వల్ల దత్తుడు, శివాంశ వల్ల దూర్వాసుడు, అనసూయాత్రి దంపతులకు జన్మించారు. ఇది మైత్రేయుడు విదురునకు చెప్పిన దత్త జన్మవృత్తాంతం.

నాయనా దీపకా దత్త జన్మ వృత్తాంతం విన్నావు గదా! ఇక దత్తదేవుని యొక్క యోగ విద్య తెలియచెప్తాను శ్రద్ధగా విను అన్నాడు వేదధర్ముడు.

బ్రహ్మర్షి నారదుడు ముల్లోకాలలో తిరుగుతూ ఒకనాడు హస్తినాపురానికి వచ్చాడు. ధర్మరాజు ఎదురువెళ్ళి అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి రాజమందిరంలోనికి తీసుకువచ్చాడు. తన సోదరులు నలుగురిని సమావేశపరచాడు. ఆ సమయంలో అక్కడ శ్రీకృష్ణుడు కూడా ఉన్నాడు. అందరూ నారదునకు నమస్కరించి కూర్చున్నారు. కుశల ప్రశ్నలయ్యాయి. ధర్మరాజు నారదునితో ఏదైనా ఇహపర సాధనమైన వృత్తాంతం చెప్పమని ధర్మప్రబోధం చేయమని అభ్యర్థించాడు. అన్ని ధర్మప్రబోదాలు తెలిసిన నీకు భగవానుడైన శ్రీకృష్ణుడే అండగా ఉండగా చెప్పవలసినవి ఏమున్నాయి. అయినా అడిగావు కాబట్టి ఒక వృత్తాంతం చెప్తాను. పూర్వం ప్రహ్లాదుడు అడిగితే ఆజగరుడు చెప్పిన విశేషాలు ఉన్నాయి అవి చెబుతాను వినండి అని చెప్పటం మొదలుపెట్టాడు.

## ప్రహ్లాదుడు - అజగరుడు సంవాదం

లోకతత్వాన్ని ప్రత్యక్షంగా దర్శించి తెలుసుకుందామనే అభిప్రాయంతో ప్రహ్లాదుడు సాధుసజ్జన బృందంతో బయలుదేరాడు. భూగోళం అంతా సంచరిస్తూ వింతలూ విడ్డూరాలు తెలుసుకుంటూ సహ్యాద్రి పర్వతప్రాంతం చేరుకున్నారు. అక్కడ కావేరీ నదిలో స్నానసంధ్యలు గావించి నదీతీరంలో ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ అల్లంతదూరాన నేల మీద పడుకొని ఉన్న ఒక మహర్షిని చూచారు. ఆ మహర్షి శరీరం దుమ్ముకొట్టుకునిపోయి వుంది. కాని శరీరం నుంచి దివ్యతపః కిరణములు పెల్లుబుకుతున్నాయి. ఎవరీ మహర్షి? ఎందుకు ఇలా నేల మీద పడివున్నాడు. ఉలుకు పలుకూ లేదు. కదలిక మెదలికాలేవు. సమీపంలో ఆశ్రమంకానీ కుటీరంగాని లేదు ఇది ఏమైనావ్రతమా? నియమమా? లేదా ఇంకేదైనా వుందా? తెలుసుకుందామని ఆ మహర్షి పాదముల చెంత కూర్చున్నాడు. పాదములకు శిరస్సు ఆన్చి నమస్కరించాడు మృదువుగా ఆ పాదములను తనఒడిలోకి తీసుకుని మెల్లమెల్లగా ఒత్తుతూ మహానుభావా! అని భయం భయంగా పలకరించాడు. ఆయన మెల్ల మెల్లగా కన్నులు తెరిచి ప్రహ్లాదుని వంక ఏమిటి అన్నట్లు చూచాడు. ప్రహ్లాదుడు ధైర్యం తెచ్చుకుని ఇలా అడిగాడు.

మహానుభావా! ఏమిటి మీరు ఇలా నేలపై పడి వున్నారు. శరీరం అంతా దుమ్ముతో కప్పిపోయి వుంది. అంటే మీరు చాలాకాలంగా ఇలా నిశ్చేష్టులై వున్నారన్నమాట ఇది ఏమైనా వ్రతమా, నియమమా? చాలా చిత్రంగా వుంది. లోకంలో ఏ ప్రయత్నము చేయకుండా మనిషికి ధనం లభించదు. ధనం లేకపోతే భోగాలు లేవు. అవి లేకపోతే శరీరం సముజ్వలంగా నిలచియుండదు. ఇవన్నీ వదలి మీరిలా రోజుల తరబడి నేల మీద పడి నిద్రపోతున్నారు. అయినా మీ దేహం సముజ్వలంగా ప్రకాశిస్తుంది. ఇది చాలా ఆశ్చర్యకరం. దయచేసి మీ వింత పద్ధతికి కారణమేమిటో తెలియచెప్పండి. ఎందుకిలా పడి వున్నారో జెప్పండి అన్నాడు.

ప్రహ్లాదా! నిజంగా నీకు తెలియకనే అడుగుతున్నావా? నీవు శ్రీహరిని మెప్పించిన భక్తుడవు. తత్వవేత్తలలో అగ్రగణ్యుడవు. సత్ప్రవర్తనములో నీకు నీవే సాటి. ప్రవృత్తి నివృత్తి ఫలములను ఆధ్యాత్మిక దృష్టితో చూడగలవాడివి. అలాంటి నువ్వు ఈ ప్రశ్న వేయటం నాకు ఆశ్చర్యంగా వుంది. అయినా అడిగావు కాబట్టి చెపుతాను దీని వల్ల నీకూ నాకూ ఆత్మశుద్ధి కలుగుతుంది ఆలకించు.

కర్మలు ఆచరిస్తూ వాటి వల్ల కలిగే జన్మల ఫలాలు చూస్తూ ఈ సుడిగుండంలో తిరిగి తిరిగి విసిగిపోయాను. ఇప్పుడు మానవజన్మ ఎత్తాను. ఇది స్వర్గమోక్షాలకు ద్వారసీమ. ఇక్కడ పాపకర్మలు ఆచరిస్తే జంతుజన్మ లభిస్తుంది. పాపపుణ్యములు రెండూ చేస్తే మనుష్య జన్మ లభిస్తుంది. దుఃఖాలను తొలగించుకోవటానికి, సుఖాలు పొందటానికి మనుజులు ఏవేవో కర్మలు చేస్తుంటారు. వాటితో లభించే అనుకూల వ్యతిరేక ఫలాలను పొందుతూ వుంటారు. అసలు ఫలానుభవమే వద్దని అనుకున్నవాడు అసలు కర్మలని ఆచరించవలసిన పనిఏముంది. సుఖం ఆత్మస్వరూపం. భోగాలు అనేవి కల్పితములు. అశాశ్వతములు. ఈ జ్ఞానం కలిగిన తరువాత నేను ఇంక కర్మలు ఎందుకు ఆచరించాలి. అందువలన నిశ్చేష్టుడనై, నిష్ప్రయత్నుడనై పూర్వజన్మ సంచితాలైన ప్రారబ్ద ఫలములను అనుభవిస్తూ ఇక్కడ పరుండి నిద్రిస్తున్నాను. ఈ రహస్యం తెలుసుకోలేనివాడు తనలోనే నిక్షిప్తమై నాచుతో కప్పబడిన సరోవరంలా ఉన్న సుఖరూప పురుషార్ధాన్ని అందుకోలేక దాహార్తుడై ఎండమావుల వెంట పరుగెత్తుతున్న వానివలె వున్నాడు. కర్మాచరణ వలలో చిక్కి జన్మపరంపరల వలయంలో సుడిగుండంలో తిరుగుతూ వున్నాడు. మోహం యొక్క మహిమ అటువంటిది.

ప్రహ్లాదా! ధనం వల్ల సుఖం కలుగుతుంది అన్నావు గదా అది వట్టిభ్రమ మాత్రమే. దుఃఖమే తప్ప దాని వల్ల సుఖం లేదు. సంపాదనలో దుఃఖం, దాన్ని కాపాడుకోవటంలో దుఃఖం. రాజ, చోర, శత్రు, పుత్ర, మిత్ర, కళత్ర యాచకాదులు అపహరించుకు పోతారేమోనన్న దుఃఖం అనుక్షణమూ భయపడటమే. ధనికులకు నిద్రాహారములు వుండవు. పైగా ఎవరైన ఏ రకంగానైనా ఏ మూల నుండైనా వచ్చి అపహరిస్తారేమోనని నిరంతరం భయపడుతూ వుంటారు. పైగా దీనికి తోడు వీరికి పక్కనే వుంటుంది అరిషడ్వర్గం సంతానంగా. అంచేత ధనం మీద, దాని మూలమైన భోగముల మీద అనురాగాన్ని వదలివెయ్యటం ఉత్తమం.

ప్రహ్లాదా ఈ సృష్టిలో తేనెటీగ ఒకటి మరియు అజగరం ఒకటి నాకు గురువులు. ఎలాగంటే చెబుతాను విను. తేనెటీగలు అష్టకష్టాలుపడి తేనెను సమకూరుస్తాయి పట్టులో. లోభంతో తేనెను కూడబెడతాయి. ఎవడో వచ్చి పొగపెట్టి ఆ తేనేటీగల్ని చంపి పారద్రోలి ఆ తేనె కాస్తా అపహరించుకుపోతాడు. తేనెటీగలకు మిగిలింది ఏమిటి చెప్పు. అలాగే మానవులు ధనం కూడబెడతారు. చివరకు దాని వలనే నశిస్తారు. అందువల్ల తేనెటీగల్ని చూచి వైరాగ్యం నేర్చుకొన్నాను. ఇంకొకటి మహాసర్పం (కొండ చిలువ) వుంది చూచావా అది కదలదు మెదలదు అందుబాటులో ఆహారాన్ని మాత్రమే

స్వీకరిస్తుంది. తనకై తను సొంతంగా ప్రయత్నం చేయదు. ఏ తిండీ దొరక్కపోతే హాయిగా కడుపులో కాళ్ళుపెట్టుకుని పడి వుంటుంది. ఎన్నాళ్ళయినా ఈ అజగరము ఇలాగే పస్తులుంటుంది. ఈ అజగరాన్ని చూచి సంతుష్టిని నేర్చుకొన్నాను. లేదని ఎవరిని అడగను. రాదని దుఃఖపడను. ఎవరు పిలిచినా ఆ అనను. ఏది ఇచ్చినా వద్దు అనను. నాకు సుఖము లేదు దుఃఖము లేదు. విలువైన పట్టుబట్టలు కట్టినా, గుడ్డపీలకలే ధరించినా, అసలు ధరించకపోయినా నా మనస్సుకి తేడా లేదు. పల్లకీ ప్రయాణాలు, కాలినడకలు నాకు ఒక్కటే కర్పూరచందనములు రాసుకున్నా దుమ్ముధూళిలో వున్నా నాకు ఒక్కటే. హంసతూలికా తల్పాల మీద పడుకున్నా పట్టు పరుపులపై వున్నా, బండరాతిపై వున్నా, అవమానించినా, ఇచ్చినది తీపిదైనా చేదుదైనా ఒకేలాగ ఆదరిస్తాను. సగుణమైనా నిర్గుణమైనా, అధికమైనా అల్పమైనా నాకు ఒక్కటే. నాది సర్వసమదృష్టి. దీని వల్ల సుఖదుఃఖాల భేదాన్ని చిత్తవృత్తిలో లయింపజెయ్యగలిగాను. చిత్తవృత్తిని మనస్సులో, మనస్సు అహంకారములో, అహంకారాన్ని మాయలో, మాయను ఆత్మానుభూతిలోలయింపజేసాను. స్వానుభవంతో ఆత్మస్థితిలో ఏకనిష్ఠలో వుంటున్నాను.

ప్రహ్లాదా! నీవు యోగ్యుడవు కనుక అతిగుప్తమైన నా ఆత్మ ప్రవృత్తిని నీకు తెలియజేశాను. ఇది చాలా మందికి లోక విరోధంగా శాస్త్రవిర్ధుంగా కనిపిస్తుంది. కానీ నీవు అర్థం చేసుకోగలవు. ఆ సామర్థ్యం నీకువుంది, అని గ్రహించాను. కనుక చెప్పాను అని ముగించాడు. ఆ అజగర ప్రవృత్తిలోవున్న మహర్షి. ప్రహ్లాదుడు అమితానందంలో ఆ మహాను భావున్ని సేవించి అర్చించి పూజించి సంపూర్ణ అనుగ్రహం పొంది వీడ్కోలు తీసుకొన్నాడు.

ధర్మరాజా ప్రహ్లాద, అజగరుల వృత్తాతం విన్నావు కదా దీనిలో ఆంతర్యం నీవు గ్రహించు అంటూ ముగించాడు నారదుడు. నాయనా ! దీపకా! విన్నావు కదా! యోగ విద్యా విశారదుడు అయిన దత్త యోగి యొక్క సిద్ధావస్థ ఇది అని వేదదర్ముడు చెప్పాడు. దీపకుడు ఆశ్చర్యంలో గురుదేవా చాలా శ్రద్ధగా విన్నాను. ఈ కథలో దత్తదేవుని ప్రస్తావన ఎక్కడా మీరు చెప్పలేదు. మరి మీరు ఇది దత్తుని సిద్ధావస్థ అంటున్నారు. ఇదేమిటో నాకు అర్థం కాలేదు వివరించండి అని దీపకుడు సవినయంగా వేడుకున్నాడు.

నాయనా దీపకా, దీనిని నీవు అనుసంధానం చేసుకోవడంలో పొరపాటు బడుతున్నావు. మొట్ట మొదటే చెప్పాను కదా దత్తుడు యోగమాయను ఆశ్రయించి అనేక రూపాలు ధరిస్తువుంటాడని అదీ గాక బ్రహ్మానారదునికి చెప్పిన విషయం గుర్తుచేసుకో తన పాద పద్మాలను సేవించిన యదు, కార్తవీర్య, ప్రహ్లాద, అలర్కులను దత్తదేవుడు ఆత్మ విద్య భోదించాడని బ్రహ్మదేవుడు చెప్ప లేదూ! వీటిని అనుసంధానం చేసుకుంటే దత్తుడు ఎవరో నీకే తెలుస్తుంది. ఆ వరుసలోనే యదువుకి దత్తుడు తత్వం ఉపదేశించిన వృత్తాంతం ఇప్పుడు చెపుతాను ఆలకించు అంటూ వేదధర్ముడు మళ్ళీ ఇలా చెప్పుతున్నాడు.

## అవధూత - యదుమహారాజు సంవాదం

నాయనా దీపకా ఒకప్పుడు ఉద్ధవుడు శ్రీ కృష్ణభగవానునికి నమస్కరించి దయచేసి ఆత్మతత్వం భోదించమని అడిగాడు. అప్పుడు వాసుదేవుడు ఉద్ధవునితో ఇలా అన్నాడు. ఉద్ధవా ఆత్మతత్వాన్ని ఒకరు ఉపదేశిస్తారా? ఎవరి మటుకు వారు తెలుసుకోవాలి. మానవులు మంచి చెడ్డ విచక్షణా జ్ఞానం కలవారు. తమని తామే ఉద్ధరించుకోవాలి. ఆత్మకు గురువు ఆత్మయే. అందుకనే సాంఖ్యులు మానవశరీరంలోనే సర్వజ్ఞుడైన పరమాత్మను దర్శిస్తూవుంటారు. సృష్టిలో అపాద, ద్విపాద, త్రిపాద, చతుష్పాద, బహుపాద జీవరాసులు వున్నాయి. వీటిలో పురుష శరీరం అంటేనే నా

కిష్టం. ఎందుకంటే ఆ శరీరంలోనే సాధకులు నన్ను అన్వేషించి తెలుసుకుంటున్నారు. అందుచేత మానవ శరీరం అంటేనే నాకు ప్రీతి. ఇందులో నివసించే మనో, బుద్ధి, చిత్త, అహంకారములు జడ పదార్థములు. వాటిని ప్రకాశింపజేసి చైతన్యం తెస్తున్న శక్తి సంపన్నుడు ఒకడెవడో వుండాలి. అందుచేత వెతుకుదాం అని సాధకులు ప్రయత్నించి సాధనతో నన్ను తెలుసుకుంటున్నారు. బుద్ధ్యాదులు సాధనములు కనుక వీటికి సాధ్యుడు వుండాలి అని అనుమాన ప్రమాణంతో నన్ను అన్వేషిస్తున్నారు. కనుక మానవ శరీరం అంటేనే నాకు చాలా ఇష్టం. ఇందులో వున్న ఆత్మతత్వం గురించి తెలుసుకోవాలంటే కొంతవరకు అవధూత - యదువు సంవాదం గురించి చెబుతాను ఆలకించు. యదువు తెలుసుకదా యయాతిపుత్రుడు మహాతపశ్శాలి, ధర్మజ్ఞుడు. ఒకరోజు ఒక అవధూతను దర్శించి నమస్కరించి ఇలా అడిగాడు.

మహానుభావా ! నీవు సుందరుడవు, కవీశ్వరుడవు, సత్యసంధుడవు, మహాజ్ఞానివి. అయినా జడుడులా ఉన్మత్తుడిగా సంచరిస్తున్నావు ఎందుకని ? యింద్రియతృప్తి కోసం నీవు ఏ పనీ చేయటంలేదు. ఈ వివేకం నీకు ఎలా కలిగింది ? పండితుడవయ్యుండి బాలుడిగా ప్రవర్తిస్తున్నావు ఎందుకని ? సాధారణంగా మానవులు పడే ఏ తాపత్రయమూ నువ్వు పడ్తున్నట్లుగాలేదు. సిరిసంపదలు వృద్ధి చేసుకోవాలని నీవు రవ్వంతయినా ప్రయత్నం చేయటంలేదు. ఇది చాలా వింతగావుంది. అందరికన్నా భిన్నంగా వుంది నీ తీరు. గంగానదిలో మునిగిన ఏనుగులా ఎక్కడో వుంటున్నావు. ఒంటరిగా గడుపుతున్నావు. ఎవరి జోలికి పోవటంలేదు. ఏ స్పర్శలు నీకు అంటటం లేదు. అయినా ఎప్పుడూ ఆనందంగా కన్పిస్తున్నావు. నీకిది ఎలా సాధ్యమయ్యింది ? దయజేసి ఇది తెలియజెప్పి పుణ్యం కట్టుకో అని ప్రాధేయపడ్డాడు.

అప్పుడు అవధూత ఇలా చెప్తున్నాడు

యదుమహారాజా నాకు ఇరవై నాలుగు మంది గురువులు. ఒక్కొక్కరి నుండి ఒక్కొక్క కోణంలో జ్ఞానం పొందాను. జీవన్ముక్తుడనై సంచరించుచున్నాను. పంచభూతాలు, సూర్యచంద్రులు, అజగర కపోతములు, సముద్రపతంగాలుగా, మధుకరగజాలు, మధుహారి హరిణములు, మీనపింగళలు, కురర బాకులు, కన్యకాశరకారులు, సర్పకీటక ఊర్ణనాభాలు - ఇవీ నా ఇరవైనాలుగు గురువులు

**పృథివీవాయురాకాశమాపోఽ గ్నిశ్చంద్రమారవిః !**
**కపోతోఽజగరః సింధుః పతంగో మధుకృత్ గజః !!**
**మధుహా హరిణోమీనః పింగళఃకురరోఽర్భకః !**
**కుమారీ శరకృత్ సర్పఊర్ణనాభిః సుపేశకృత్ ॥**

**భూమి :** మానవులు కాళ్ళతో త్రొక్కినా గునపములు తీసికొని త్రవ్వినా భూమి ఓర్చుకుంటుంది. అంతేకాక వారికి కావలసిన ఆహారం పండించి ఇచ్చి ఉపకారం చేస్తుంది. సహనాన్ని భూమి ద్వారా గ్రహించాను అపకారికి కూడా ఉపకారం చేసే గుణం భూమి నుండి నేర్చుకున్నాను.

**వాయువు :** అలాగే మన శరీరంలో వుండేది ప్రాణవాయువు. మనం తినే ఆహారాన్ని గ్రహిస్తుంది కాని విషయవాంఛలకు అతీతంగా వుంటుంది. ఉత్తమజ్ఞాని కూడా ఇలావుండాలి. జ్ఞానానికి దేహం, దేహమునకు ప్రాణం, ప్రాణమునకు ఆహారం అత్యవసరం. ఇక శరీరమునకు వెలుపల సంచరించే గాలి శీతోష్ణ దుఃఖములను సమముగా

చూస్తుంది. రకరకాల దుర్గంధాలను, సుగంధాలను సమంగా గ్రహిస్తుంది. అయినా గంధ గుణం వాయువుకు లేదు. యోగి అయినవాడు ఈ రెండు గుణాలను వాయువు నుండి నేర్చుకోవాలి. పంచభూతాత్మక శరీరంలోకి ప్రవేశించినా ఆ గుణాలు అంటకుండా చూసుకోవాలి, దీన్నే నిర్లేపత్వం అంటారు. దీన్ని గ్రహించాను వాయువు నుండి.

**ఆకాశం :** ఆకాశం నుండి సర్వవ్యాపకత్వము సర్వ బ్రహ్మతత్వం అభంగత్వము అసంగత్వము గ్రహించాను.

**జలం :** జలం నుండి నిర్మలత్వం, స్నిగ్ధత్వము, మధురత్వం, పావనత్వం నేర్చుకున్నాను. ఇవి గ్రహించిన యోగులు తమని తల్చుకున్న వార్ని పావనం చెయ్యగలుగుతారు.

**అగ్ని :** అగ్ని మహాతేజశ్వి, సర్వభక్షకుడు అయినా సర్వదా పవిత్రుడు అందరికీ ఆరాధ్యుడు ఈ లక్షణాలు యోగి అగ్ని నుండి గ్రహించాలి. అగ్ని ఏ వస్తువును ఆశ్రయిస్తాడో ఆ రూపంలో మాత్రమే వుంటాడు. పరమాత్మ కూడా ఏ జీవిలో వుంటే ఆ రూపం ధరిస్తాడని గ్రహించాను అగ్ని నుండి. అగ్ని వున్నప్పటికీ ఒక్కోసారి కంటికి కనిపించదు. అలాగ జీవికి జన్మాది వికారాలు నిత్యమే అయినా ఒక్కొక్కప్పుడు కాలగతిలో మరుగున పడివుంటాయి. ఇవీ నాకు పంచభూతాలు ఉపదేశించిన బోధ, నేను గ్రహించిన తత్వం.

**చంద్రుడు :** చంద్రుడు వృద్ధి, క్షయములకు లోనవుతూవుంటాడు. అవి అతడి కళలే గాని అతని పూర్ణరూపంగాదు. అలాగే షడ్భావ వికారములు శరీరమునకే కాని ఆత్మకు కాదని తెలుసుకున్నాను చంద్రునివల్ల.

**సూర్యుడు :** సూర్యుడు ఒక్కడే అయినా అనేక జలాశయాల్లో కనిపించి అనేకానేక ప్రతిబింబములుగా కన్పిస్తాడు. అంటే ఆత్మ ఒక్కటే అయినా అనేకంగా కన్పిస్తుంది అని గ్రహించాను. అంతేకాక సూర్యుడు శుభ్ర, అశుభ్ర భేదాలు లేకుండా సర్వత్రా విరాజిల్లుతునే వుంటాడు. అన్నిరకాల జలాలను స్వీకరిస్తాడు. పరిశుభ్రపరిచి వర్షములుగా కురిపిస్తూ వుంటాడు. కానీ అతడి చేతులకి మలినం అంటదు. సూర్యుడు నిత్య పరిశుభ్రుడు. యోగి కూడా ఇలాగే ఇంద్రియాదులతో సుఖదుఃఖాదులన్నింటిని సమదృష్టితో చూడాలని వాటికి అతీతుడుగా నిత్యశుద్ధుడుగా వుండాలని తెలుసుకున్నాను సూర్యుడు నుండి.

యయాతినందనా! తక్కిన పదిహేడుమంది గురించి చెబుతాను తెలుసుకో ముందుగా కపోతం గురించి విను.

**కపోతం :** ఒక అడవిలో ఒకచెట్టుమీద గూడు కట్టుకుని కపోత దంపతులు సుఖంగా జీవిస్తున్నాయి. అనుక్షణము కలిసిమెలసి తిరుగుతూ ఆహారం సంపాదించుకుంటూ ఆనందంగా అన్యోన్యంగా వుంటూ కులాసాగా తమ జీవితాన్ని గడుపుతున్నాయి. ఇంతలో కొన్నాళ్ళకి ఆడ పావురం గర్భం ధరించి గ్రుడ్లు పెట్టింది. వాటిని ఎంతో ప్రేమతో పొదిగింది. అన్నీ పిల్లలయినాయి వాటి పెంపకంలో కపోత దంపతులు క్షణం తీరికలేకుండా ఆనందం అనుభవిస్తున్నాయి. ఎక్కడెక్కడికో వెళ్ళి రుచికరమైన ఆహారము సేకరించి తెచ్చి ముక్కులతో అందించి సంబరపడుతున్నాయి. పిల్లల కేరింతలు చూచి మురిసిపోతున్నాయి. ఒకరోజున కపోత దంపతులు అడవికి మేతకు వెళ్ళిన సమయంలో ఒక బోయవాడు వచ్చి ఆచెట్టు క్రింద నూకలు జల్లి వలపన్ని దగ్గరలో వున్న పొదలో దాగి కూర్చున్నాడు. పాపం అప్పుడప్పుడే రెక్కలు వస్తున్న పిల్ల పావురాళ్ళు ఆ కొమ్మా ఈ కొమ్మమీద దూకుతూ చెట్టు క్రింద ఆ వలలో చిక్కుకున్నాయి. అదే సమయానికి కపోత దంపతులు వచ్చి ఆ సంఘటన చూచి భోరున విలపించాయి. కన్న తీపిని వదులుకోలేక ఆడ పావురం పిల్లల్ని రక్షించుకుందామని వచ్చి తాను వలలో చిక్కుకుంది. భార్యాపిల్లలు వలలో చిక్కుకుని విలపిస్తుంటే

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

మగపావురం భరించలేక వీళ్ళులేకపోయాక నా జీవితమెందుకు అని తానుకూడా వలలోకి చిక్కుకుంది. పొద నుండి వచ్చిన బోయవాడు రెండు రోజులకి సరిపోయే ఆహారం దొరికిందని సంబరపడుతూ అన్నింటిని వలలో గట్టిగా బంధించి భుజాన వేసుకొని చక్కగా పోయాడు. యదు మహారాజా! కుటుంబీకుడైన వాడికి వుండే అనురాగాలు, మోహాలు, ఎలా బంధనాలు అవుతాయో, ఆత్మ వినాశమునకు ఎలా దారితీస్తాయో, ఈ కపోత దంపతుల ద్వారా నేర్చుకున్నాను. ముక్తి ద్వారం లాంటి మానవ జన్మను పొంది గృహలంపటుడు అయ్యేవాడు మూర్ఖుడుకాక మరి ఏమిటి అతి స్నేహం పనికిరాదని నేర్చుకున్నాను కపోతాల ద్వారా.

**అజగరము :** అజగరమంటే మహాసర్పం (కొండచిలువ) కదలదూ మెదలదు. ఆహారం కోసమైనా ఏ ప్రయత్నమూ చెయ్యదు. అప్రయత్నంగా లభిస్తే తింటుంది. లేకపోతే పస్తులుంటుంది. ఇలాగే మనమూను. దైవికంగా ప్రాప్తమయ్యే సుఖ దుఖాలను అనుభవించడమే తప్ప వాటికోసం కర్మాచరణ చెయ్యడం మానుకోవాలి. నిద్రహారాలను పరిత్యజించి ఆత్మనిష్టను అలవరచుకోవాలి. ఇది నేర్పింది కాబట్టి అజగరం నాకు మరో గురువు.

**సముద్రం :** తనలాగ గాంభీర్యం అలవరచుకోమని ప్రభోదించింది సముద్రం. దానిలోతు ఎవడికైనా తెలుసా? దాన్ని దాటగలవాడు ఉన్నాడా? ఎన్ని నదులు వచ్చి చేరినా ఉప్పొంగుతుందా? సూర్య కిరణాలకు ఎంత నీరు ఆవిరి అవుతూన్న దిగులుపడి కృశిస్తోందా? తనలో ఏవస్తువులూ ఏ జంతువులూ ఎన్నెన్ని ఎక్కడెక్కడ దాగి ఉన్నాయో తెలియనిస్తోందా? దీనికి గట్టులూ అవధులు ఉన్నాయా? ఆత్మనిష్టుడు ఈ గాంభీర్యాన్ని అలవరచుకోవాలి.

**పతంగం :** యదువల్లభా ! పతంగమంటే తెలుసుగా, మిడత. ఇది నాకు మరోరకం పాఠం చెప్పింది. దీనికి మంటలు కనబడితే చాలు ఒళ్ళు తెలియదు. మాడిపోతామని తెలిసీ నిగ్రహించుకోలేదు. ఆనందంగా ఎగురుకుంటూ వెళ్ళి మసి అయిపోతుంది. ప్రపంచంలో కనిపించే రకరకాల యోషిత్ (స్త్రీ) హిరణ్య అంబరాది ఆకర్షణలకి మానవుడు లోనై అలాగ బలైపోతున్నాడు. వట్టి తోలుతిత్తి అని తెలిసికూడా సౌందర్యాలకు మోహపడి ప్రలోభాలకు ఆశపడి జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నాడు. అహంకరించి మసి అయిపోతున్నాడు. ఈ సందేశం అందించింది కనుక మిడత నాకు మరో గురువు.

**మధుకరం :** మధుకరం అంటే తేనెటీగ. ఇది పాఠాలు నేర్పింది. పువ్వు పువ్వుకీ వెళ్ళి పువ్వుకి నొప్పి కలగకుండా బొట్టు బొట్టుగా మకరందం గ్రహించి పొట్టనింపు కుంటుంది. తేనెటీగ. యోగి కూడా ఇలాగే ఇల్లిల్లు తిరిగి ఇంటి వారికి ఇబ్బంది కలిగించకుండా ఇంటికొక ముద్దగా ఆహారం స్వీకరించిపొట్టపోసుకోవాలి. ఏ పువ్వు దగ్గర మకరందాన్ని ఆ పువ్వు దగ్గరే గ్రోలినట్లు ఏ గుమ్మం దగ్గర ముద్దను ఆ గుమ్మం దగ్గరే ఆరగించాలి. కడుపునిండిన తక్షణం ఆ పూటకు మధూకర వృత్తిని మానుకోవాలి. మనకు రకరకాల శాస్త్రాలున్నాయి. వాటిలోని విజ్ఞాన సారాన్ని గ్రహించడంలో కూడా యోగి ఇదే మధూకర వృత్తిని అవలంభించాలి. తేనెటీగలు మకరందాన్ని కూడబెట్టి తేనె పట్టులు కడితే చివరికి అవి ఆ తేనెను అపహరించేవారి చేతిలో మృతి చెందుతున్నాయి. కాబట్టి యోగి ఆహారాన్ని కూడ బెట్టకూడదు. ఈ రెండు పాఠాలు నేర్చుకున్నాను మధుకరాల నుంచి.

**ఏనుగు :** నువ్వు రాజువి కాబట్టి, అడవిలో స్వేచ్ఛగా సంచరించే మదపు టేనుగుల్ని ఎలా బంధిస్తారో ఎరుగుదువు. ఒక పెద్ద గొయ్యి తవ్వి, దాని మీద సన్నని కర్రలు వేసి, వాటి మీద గడ్డి పరచి, దాని మీద మధ్యలో ఒక పెద్ద ఆడ

ఏనుగు బొమ్మను నిలబెట్టి, మీ రాజుభటులు చుట్టు పక్కల పొదలలో దాగి, పొంచి ఉంటారు. అటువైపు వచ్చిన మదపు టేనుగు ఒంటరిగా ఒక ఆడ ఏనుగు దొరికిందని పరుగు పరుగున వచ్చి గోతిలో పడుతుంది. ఇది కాక నిజమైన ఆడ ఏనుగే దొరికి ఒక మదపుటేనుగు దాని వెంట పడితే మరికొన్ని మదపుటేనుగులు ఎగబడి, పరస్పరం పోరాడుకొని మరణిస్తాయి. పురుషుడికి స్త్రీ వ్యామోహం ఎంతటి వినాశానికి దారితీస్తుందో ఈ గజ వృత్తాంతం తెలియజేస్తోంది.

**మధుహారి :** మధుహారి అంటే తేనెను సేకరించేవారు. వేల సంఖ్యలో తేనె టీగలు నెలల తరబడి శ్రమపడి తేనె పట్టులో తేనెను కూడబెడితే మధుహారి వచ్చి పొగపెట్టి ఆ తేనె టీగలను సంహరించి క్షణంలో తేనెను అపహరించి పట్టుకుపోతాడు. లుబ్ధులై ఎవరు ఏ ధనాన్ని కూడ బెట్టినా, బలవంతులు ఎవరో వచ్చి దాన్ని కాజేస్తారు. కనుక తన అవసరానికి మించి సంపదలను కూడ బెట్టుకోవడం చాలా హానికరమని గ్రహించాను. అలాగే గృహస్తుల కన్నా ముందు యాచకులు వెళ్ళి వారి వంటకాలను అడిగి ఆరగించడం తగదనీ గ్రహించాను.

**హరిణం :** హరిణమంటే లేడి. అది వేటగాడి సంగీతానికి మోహపడి వలలో చిక్కుకుంటుంది. యతీశ్వరుడు కూడ అలాగే సంగీతాది లలిత కళలకు సమ్మోహితుడయితే ధ్యాన నియమనిష్టల నుంచి పరిభ్రష్టుడవుతాడు. ఋష్యశృంగుడి కథ ఎరుగుదువు కదా! విలాసవతుల నృత్య గీతాలకు వివశుడై సంసారంలో చిక్కుకొన్నాడు.

**మీనం :** నాకు మరొక గురువు మీనం. అంటే చేప ఎరకి ఆశపడి గాలానికి తగులుకుంటుంది. జిహ్వాచాపల్యం ప్రాణాలు తీస్తుంది. యోగులకు కూడా జిహ్వేంద్రియాన్ని జయించడం కష్టసాధ్యం. దీన్ని జయిస్తే అన్నింటినీ జయించినట్టే. ఈ రహస్యం నేర్చుకున్నాను చేపను చూసి.

**పింగళ :** పింగళ ఒక వేశ్య. విదేహ పట్టణంలో నివసిస్తుండేది. చాలా అందగత్తె. ధనవంతులకు గేలం వెయ్యడం వారిని బికారులను చెయ్యడం దాని వృత్తి. ఒకనాటి సాయంకాలం అద్భుతంగా సింగారించుకొని తన భవంతి గుమ్మంలో నిలబడింది. వీధినపోయే ధనవంతుల్ని పసికట్టి ఆకర్షిద్దామని దాని ఆశ. గంటలు గడుస్తున్నాయి. గానీ ఎవడూ ఈమెకేసి కన్నెత్తి అయినా చూడడం లేదు. అయినా ఆశగా అలాగే నిలబడింది. చీకట్లు ముసురుకున్నాయి. గుడ్డివెన్నెల కాసింది. పింగళ ఒక సారి లోపలికి వెళ్ళి సింగారానికి సవరింపులు చేసుకుని మళ్ళీవచ్చి నిలబడింది. వీధిలో జనసంచారం తగ్గింది. అర్ధరాత్రివేళగదా అప్పుడైనా విటులు వస్తారని ఆశగా అలాగే నిలబడింది. ఫలించలేదు. కాళ్ళు లాగాయి. విసుగువచ్చింది. ఇక నిలబడలేక లోపలికి వెళ్ళి హంస తూలికా తల్పం మీద నడుం వాల్చింది. అంతలో వాకిట గుమ్మం దగ్గర ఏదో అలికిడి అయితే విటుడెవడో వచ్చాడనుకొని చివాలున లేచి చరాలున గుమ్మంలో నిలిచింది. ఎవ్వరూ లేరు. అంతా గుడ్డి వెన్నెల చెట్లనీడలు, సగం నిద్రలో ఉలిక్కిపడిన పులుగు కూనల కువకువలు. అంతటా నిశ్శబ్దం - ఒక్కసారిగా పింగళ హృదయంలో తుఫాను చెలరేగింది. నేనేమిటి? నేను చేస్తున్న పని ఏమిటి? నా జన్మకు ప్రయోజనం ఏమిటి? ఎంతమందిని బికారుల్ని చేశాను? ఎంత కూడ బెట్టాను? చచ్చిపోయేటపుడు ఇందులో ఎంత కూడా పట్టుకు వెడతాను? ఎక్కడికి వెడతాను? నరకానికే!? అక్కడ నేను అనుభవించే యాతన లేమిటి? నేను చస్తే ఒక్కడైనా అయ్యోపాపం అంటాడా? ఆలోచనలు ఉవ్వెత్తున చెలరేగాయి. సమాధానాలూ దొరికాయి. తన మీద తనకే అసహ్యం వేసింది. తన వృత్తి మీద జుగుప్స కలిగింది. వైరాగ్యభానుడు ఉదయించాడు. అయ్యో! ఎన్ని సంవత్సరాల జీవితాన్ని వ్యర్థం చేసుకున్నాను. ఒక్కనాడైనా హరి నామస్మరణ చెయ్యలేదే. అనంత సుఖప్రదుడూ మనశ్శాంతి కారకుడూ

అయిన భగవంతుణ్ని, చేరువలో ఉన్న పెన్నిధానాన్ని విస్మరించి ఎవడెవడో సుఖాలు ఇస్తాడని నిధులు పంచుతాడనీ ఎండమావుల వెంట పరుగులు తీశాను. ఛీ! ఇక ఆ జీవితానికి స్వస్తి-ఇలా ఒక నిర్ణయానికి వచ్చింది. ఆ క్షణం నుంచి శేష జీవితాన్ని హరినామస్మరణతో గడిపింది. ధర్మ కార్యాలు ఆచరించింది. తీర్థయాత్రలు చేసింది. పాప పంకిలాలను ప్రక్షాళన చేసుకుని మనశ్శాంతితో తనువు చాలించింది. యదుపతీ! ఈవిడ జీవితం నాకు నేర్పిన పాఠమేమిటో గ్రహించావా? ఆశ అనేది దుఃఖ ప్రదమనీ వైరాగ్యం సుఖ ప్రదమనీను.

**కురరం :** మరొక గురువు కురరం. అంటే లకుముకి పిట్ట. అది ఎక్కడో ఒక మాంసపు ముక్కను సంపాదించి ముక్కున కరుచుకుని గూటికి ఎగురుతోంది. మరొక పెద్దపులుగు చూసింది. లకుముకుని వెంటాడింది. ఈ చిన్ని పిట్టకు భయం వేసింది. మాంసం ముక్కను వదిలేసింది. పెద్దపులుగు దాన్ని తన్నుకుపోయింది. బ్రతుకు జీవుడా అనుకుంది లకుముకి. రాజా! గ్రహించావా? మరొకరికి కన్నుకుట్టే వస్తువు మనదగ్గర ఉంటే అది మన ప్రాణాలకే ముప్పు. బలహీనుడు ఈ రహస్యం తెలుసుకోవాలి. లేదంటే ఆపదల్లో పడతాడు.

**పసిబాలుడు :** పసిబాలుడు నా పరమ గురువు. చీకూ చింత లేకుండా కేరింతలు కొడతాడు. తన ఆటలేవో తనవి. తన ఆనందమేమో తనది. మిగతా ప్రపంచం ఏమైపోయినా అతడికి పట్టదు. అవధూత కూడా ఇలాగే ఉండాలి. ఈ సృష్టిలో నిశ్చింతగా ఆనందించేది వీరిద్దరే. ఒకడు అమాయకుడు, మరొకడు మాయాతీతుడు.

**కన్య :** కన్యకా వృత్తాంతం ఏమి నేర్పిందో చెబుతాను విను, అనగనగా ఒక వూరు. ఆ వూళ్ళో ఒక కన్యక. రూప యౌవన వతి. గుణవతి. శీలవతి. పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. చూస్తున్నారు. వెడుతున్నారు. ఇంకా ఏదీ ముడిపడలేదు. ఒక రోజున తల్లిదండ్రులు ఏదో పని మీద గ్రామాంతరం వెళ్ళిన సమయాన పొరుగూరు నుంచి మగపెళ్ళివారు వచ్చారు పిల్లను చూసుకుందామని. వరుడూ అతడి తల్లిదండ్రులూ, బంధుమిత్రులూ ఒక అయిదారుమంది వచ్చారు. కన్యకామణి స్వయంగా స్వాగతం పలికి కాళ్లు కడుక్కోవడానికి నీళ్ళు ఇచ్చి, తడి ఒత్తుకోవడానికి తువ్వాళ్ళు ఇచ్చి నడవలో చాపలు పరచి లోపలికి ఆహ్వానించి కూర్చోబెట్టింది. తాగడానికి మంచి నీళ్ళు అందించింది. ఇప్పుడే వస్తాను ఉండండి. అంటూ వంట గదిలోకి వెళ్ళింది. ఏదైనా ఫలహారం చేసి పెడదామని డబ్బాలు వెదికి వరిపిండి తీసి పళ్లెంలో పోసి రెండు చేతులతోను తడిపి ముద్ద చేస్తోంది. ఆ కదలికలకి గాజులు గలగలలాడాయి. ఏదో చేస్తున్నామని అతిథులు గ్రహిస్తారని ఒక్కొక్క చేతికి రెండేసి గాజులే ఉంచి మిగతావి తీసేసింది. అవి కూడా ఒక దానికి ఒకటి తగిలి రొద చేస్తున్నాయి. అప్పుడు ఒక్కొక్క గాజునే ఉంచుకొని గబగబా పిండి కలిపి జంతికలు వండిపెట్టింది. మగ పెళ్ళివారు అమ్మాయి పని మంతురాలని గ్రహించి సంబరపడి మరొక రోజు వచ్చి మీ నాన్న గారితో మాట్లాడతాములే అని చెప్పి బయలుదేరారు. తరువాత ఏమయ్యిందో వదిలి వేద్దాము ఇప్పటికి ఈ ముక్కచాలు. యదువీరా! ఏమైనా గ్రహించగలిగావా? పది మంది ఒక చోట చేరితే గాజులలాగ గలగల లాడటమూ కలహించుకోవడమే తప్ప పరమార్థ విచికిత్స ఉండదు. ఇద్దరు ఉన్నా వృధా సంభాషణలతో కాలయాపన జరుగుతుందే కాని ఒరిగేదేమీ ఉండదు. అంచేత నిరాటంకంగా ధ్యానం సాగాలంటే అంతర్ దృష్టి విస్తరించాలంటే సాధకుడు ఒంటరిగానే ఉండాలి. ఇదీ గాజుల గలగలలు నాకు నేర్పిన పాఠం.

**శరకారుడు :** మీరందరూ ఉపయోగించే బాణాలను తయారుచేసే శరకారుడు నా ఇరవై ఒకటవ గురువు. అతడిని ఎప్పుడునీవు గమనించి ఉండవు. బాణం తయారుచెయ్యడం చాలా క్లిష్టమైన విద్య. పొడువు లావు కొసకోనా

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

బరువూ బలమూ వీటన్నింటికీ సమతూకాన్ని సాధించాలి. ఏది తేడా వచ్చినా విలుకాడి గురి తప్పుతుంది. వేగం మందగిస్తుంది. అంచేత శరకారుడు బహుజాగరూకుడై చేస్తాడు. అతడు ఒక బాణాన్ని తయారు చేస్తున్నపుడు పక్కనేభేరి భాంకారాలు చేసినా మహరాజే వచ్చి నిలిచినా అతడికి పట్టదు. అతడి కంటికి ఆ బాణం తప్ప మరేమీ కనిపించదు. చెవికి మరేమీ వినిపించదు. అది పూర్తి అయ్యేవరకు లేవడు. అంతటి ఏకాగ్రతను యోగి అలవరచుకోవాలి. రోజుల తరబడి నిష్ఠగా కూర్చోగలగాలి. నిశ్చలంగా మనస్సును భగవంతుడి మీద నిలపడం ఎలాగో శరకారుడివల్ల తెలుసుకున్నాను. బాహ్య ప్రపంచంతో ప్రమేయం లేకుండా సమాధి స్థితి నిలుపుకోవడం నేర్చుకున్నాను.

**సర్పం :** సర్పం అంటే అందరూ భయపడతారు. కానీ నాకు అదీ ఒక గురువు. అది ఎక్కడ ఉంటుందో తన ఉనికిని ఎవ్వరికీ తెలియనివ్వదు గదా. ఎప్పుడూ ఒంటరిగానే సంచరిస్తు ఉంటుంది తనకో నివాసం ఏర్పరుచుకోవాలని తాపత్రయపడదు. చీమలు పెట్టిన పుట్టల్లో తలదాచుకుంటూ కాలక్షేపం చేస్తుంది. యోగ మార్గంలో ప్రయాణించే వాడికి ఈ మూడు గుణాలు తప్పనిసరి.

**భ్రమరం :** యదువరా! భ్రమరకీట న్యాయమని నువ్వు వినే ఉంటావు. భ్రమరం ఒక రకం కీటకాన్ని పట్టితెచ్చి తన గూటిలో పెట్టి ఝుంకారం చేస్తూ దాని చుట్టు పరిభ్రమిస్తుంది. ఆ కీటకం భయోద్వేగంతో ఆ నాదాన్ని వింటూ ఆ భ్రమరాన్ని చూస్తూ బిక్కుబిక్కుమని కాలం గడుపుతుంది. కొన్ని రోజులు అయ్యేసరికి ఆ కీటకం, భ్రమరనాదాన్నే కాదు, భ్రమర రూపాన్ని కూడా పొందుతుంది. మానవుడు ఇంతే. ఏ కారణంగానైతేనేమి తన మనస్సును దేనిమీద పూర్తిగా నిలుపుతాడో దాని లక్షణాలను పొందుతాడు. భగవంతుడి మీద నిలిపితే భగవత్ లక్షణాలు అలవడతాయి. ఈ జన్మలో కాకపోయినా దేహాంతంలోనైనా సారూప్యముక్తి పొందుతాడు. ఇదీ కీటకం నేర్పిన పాఠం.

**సాలె పురుగు :** చివరిది ఊర్ణనాభం. సాలెపురుగు.తన లోంచి దారాలను వెలువరించి గూడు అల్లుతుంది. అందులో కొంచెం సేపు క్రీడిస్తుంది. ఈగల్లాంటి జంతువులను బంధించి ఆడిస్తుంది. మళ్ళీ ఆదారాలను తానే మింగేస్తుంది. తనలో లీనం చేసుకుంటుంది. సృష్టి స్థితి లయలు ఇలా జరుగుతున్నాయి. సృష్టి చెయ్యాలని సంకల్పించు కొన్నపుడు బ్రహ్మతత్వం తన నుంచి త్రిగుణాత్మకాలైనా మాయా తంతువులను ఆవిష్కరిస్తుంది. త్రిగుణాత్మక జగత్తును సృష్టిస్తుంది. అందులో తాను క్రీడిస్తుంది. జీవుల్ని ఆడిస్తుంది. ఇది స్థితి విలాసం. ప్రళయకాలంలో ఆ పరబ్రహ్మమే - తాను సృష్టించిన ఈ ప్రపంచాన్ని తనలోనే లీనం చేసుకుంటుంది. ఈ పరమ రహస్యాన్ని సాలెపురుగును చూసి గ్రహించాను.

ఇలా ఇరవై నలుగురు గురువుల నుంచి ఆత్మోపదేశాలు పొందాను. ఇవేకాదు నా శరీరమే నాకొక పరమ గురువు. ఇది నశ్వరమని మనకు తెలుసు. దీనిలోపల జుగుప్సాకరమైన పదార్థాలు ఉన్నాయని తెలుసు. అయినా దీని మీద అందరికీ వల్లమాలిన మమకారం. కళ్ళ ఎదుట ఎందరి శరీరాలు రాలిపోతున్నా, తన శరీరం మాత్రం శాశ్వతమనుకుంటాడు ప్రతి వాడూ. దీన్ని పోషించడానికి, దీని సంరక్షణకు ఎన్నెన్ని అగచాట్లు పడతాడో, ఎంత లేసి ఘోరాలు చేస్తాడో, పోనీలే అనుకుంటే ఈ శరీరానికి కృతజ్ఞత ఉందా? అణువంతయినా లేదు. చెప్పాపెట్టకుండా ఎప్పుడో హఠాత్తుగా రాలిపోతుంది. దీన్ని ఆశ్రయించుకొని జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు. సవతుల్లా పోరాడుతూ జీవులను సుఖభ్రాంతిలో ముంచి కడపటికి నరకంలోకి త్రోసేస్తున్నాయి. విచిత్రమేమిటంటే ఇదే మోక్షానికి సాధన

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

మవ్వడం. వివేకంతో వైరాగ్యంతో ఇంద్రియాలను అదుపు చేసుకొని దీని అశాశ్వతత్వాన్ని గుర్తించి మెలగగలిగిన వాడు ధన్యుడు. నిజానికి మానవ శరీరం ఎన్నో జన్మలకు గానీ, దొరకదు. అన్ని పురుషార్థాలకీ ఇదే సాధనం. ఇది మృత్యుగుహ్వారంలో ప్రవేశించక ముందే మేల్కొని మోక్షపురుషార్థ సాధనకు మనం ప్రయత్నం చెయ్యాలి. ఇందరు గురువులు, ప్రత్యక్షంగా పరోక్షంగా చేసిన ప్రబోధాలను గుర్తించి అహంకార మమకారాలకు లొంగకుండా ఆత్మనిష్ఠలో సంచరిస్తున్నాను. యదురాజా! ఏ ఒక్క గురువు పరిపూర్ణ జ్ఞానాన్ని అందించలేడు. పలువురు పలువిధాలుగా ఉపదేశిస్తుంటారు. బ్రహ్మతత్వం ఏకైకమే అయినా ఋషులలో అభిప్రాయ భేదాలు మాత్రం అనేకం. దీనిని నిరసించక అన్నింటినీ గ్రహించి ఆకళింపు చేసుకోవడం మన కర్తవ్యం.

అవధూత చెప్పిన ఈ మహా విషయాలను యదు మహారాజు ఆకళింపు చేసుకున్నాడు. కొత్త వెలుగు ఏదో తనకు కనిపించినట్టు అయ్యింది. సంతృప్తి చెందాడు. అవధూతను సత్కరించి పునఃపునః దండప్రణామాలు ఆచరించి సెలవు తీసుకొని తన రాజధానికి చేరుకున్నాడు.

ఉద్ధవా! మన వంశంలో పూర్వీకుడైన ఈ యదు మహారాజు, అవధూత చేసిన జ్ఞానబోధను ఆచరణలో పెట్టి సర్వసంగ విముక్తుడూ సర్వప్రాణి సమచిత్తుడూ అయ్యి ధర్మబద్ధంగా పరిపాలన సాగించి అపునర్భవమైన ముక్తిని పొందాడు. అంటూ శ్రీకృష్ణుడు తన ప్రసంగం ముగించాడు. శ్రద్ధగా విన్న ఉద్ధవుడు ఆత్మతత్వాన్ని ఆకళింపు చేసుకొని సంతృప్తి చెందాడు.

నైమిశారణ్యవాసులారా! ఋషీశ్వరులారా వేదధర్ముడు తన శిష్యుడైన దీపకుడుకి చెప్పిన దత్తావధూత మహిమ ఇది అంటూ బ్రహ్మ కలిపురుషుడుకి గురు మహిమను చెప్పి కనువిప్పు కలిగించాడు అని చెప్పి సూత మహర్షి కాసేపు విశ్రాంతి తీసుకున్నారు.



# శ్రీదత్త పురాణము

## ద్వితీయభాగం

సూత మహర్షి ఇలా చెప్తున్నాడు. శౌనకాది మునులారా బ్రహ్మ కలిపురుషుడుకి చెప్తున్న దీపక వేదధర్ముల సంభాషణ ఇలా జరిగింది. అంతా కూలంకషంగా చెప్తాను ఆలకించండి.

వేదధర్ముడు చెప్పిన యదు - అవధూత సంభాషణని విన్న దీపకుడు శ్రద్ధగా విని పులకరించిపోయి, ఆనందంతో గురూత్తమా! నీ పాద పద్మాలను సేవించుకొనే భాగ్యం నాకు దొరికింది. నేను ధన్యుణ్ణి నన్ను కన్న తల్లి తండ్రులు ధన్యులు, ప్రహ్లాద - అజగర సంభాషణ - యదు -అవధూత సంభాషణలు రెండుకి రెండు అత్యంత మనోహరాలు నిగూఢార్థ ప్రభోధాలు. అయినా తనివి తీరలేదు. ఇంకా దత్త మహిమల్ని వినాలి తెలుసుకోవాలి అనే కుతూహలం నా మనస్సును తొందరపెడుతున్నది. దయచేసి మిగతా దత్త కథలు కూడా చెప్పి నన్ను తరింపజెయ్యండి నా జన్మ చరితార్థం చేసుకొంటాను. దప్పికతో ఉన్నవాడు మధుర పానీయాలు ఆశించినట్లు నేను దత్త కథామృతాన్ని యాచిస్తున్నాను అనుగ్రహించు అన్నాడు.

నాయనా దీపకా ఈ దత్త కథల పట్ల నీకు ఇంత ప్రీతి కలుగడం నిజంగా నీ అదృష్టం. జనన మరణాలతో సంబంధం లేని ముక్తి నీకు లభించును. దత్త కథలలో అద్భుతమైన సుమతి వృత్తాంతంవుంది చెబుతాను విను.

## సుమతి వృత్తాంతం

అనగనగా ఆర్యావర్తంలో ఒక పల్లెటూరు. ఆ వూళ్ళో ఒక బ్రాహ్మణుడు. వేదవేదాంగ పారంగతుడతడు. సర్వసద్గుణ సంపన్నుడు. సర్వసౌమ్యుడు. శాంత స్వభావి. ధర్మపత్నీ సమేతుడై యజ్ఞయాగాది క్రతువులను నిర్వహిస్తూ ఆచరిస్తూ వుండేవాడు. కాని ఎంతకూ వారికి సంతానం కలుగలేదు. ఇంక మన బ్రతుకులు ఇంతే ! ఈ తనువు ఇలా రాలిపోవలసిందే అని దిగులు చెందుతున్న నడి వయస్సులో వారి కలలు ఫలించి ఆమె కడుపు పండింది. పది నెలలూ మోసి పండంటి మగ బిడ్డను ప్రసవించింది. బంగారు మేనిఛాయతో దివ్యతేజస్సుతో సౌందర్య రాశిలా వున్నాడు బిడ్డడు. రోజుల గడుస్తున్న కొద్దీ బిడ్డడు అంధుడని, చెవిటివాడని, మూగవాడని ఆ తల్లితండ్రులు గుర్తించి భోరుభోరున విలపించారు. అవిటివాడైతేనేమి కొడుకు పుట్టాడు అంతే చాలు అనుకొని గుండెలురాయి చేసుకొని బ్రతుకుతున్నారు. అల్లారుముద్దుగా బిడ్డడిని పెంచుకొంటున్నారు. సుమతి అనినామకరణం చేసి సంబరపడ్డారు. ఏనాటికైనా అతడు ఆరోగ్యవంతుడవుతాడని ఆశతో ఎదురుచూస్తూ జీవితం గడుపుతున్నారు. కాని అది అడియాశే అయ్యింది. ఏ చైతన్యం లేని జడపదార్థంలా సుమతి ఎదుగుతున్నాడు. ఎనిమిదేళ్ళు వచ్చాయి. వయస్సుకు తగిన బుద్ధి వికసించలేదు. కాని ముఖ వర్చస్సు మాత్రం అద్భుతంగా వుండేది. ఉపనయనంజేసి కనీసం గాయత్రినైనా జపిస్తే ఫలితం కలుగుతుందని తండ్రి ఆశపడి ముహూర్తం ఏర్పాటు చేసి ఒడుగు జరిపించాడు. చెవిలో గాయత్రిమంత్రం జపించాడు. విన్న అలికిడి ఆ బిడ్డ ముఖంలో కన్పించలేదు. తండ్రి గాంభీర్యం అంతా సడలిపోయింది. అయ్యో నాయనా ఇంత జడుడుగా వున్నావేరా అంటూ బిడ్డని గుండెలకు హత్తుకొని భోరుభోరున విలపించాడు. బిడ్డలు లేనంతకాలం అదొక్కటే దిగులు ఇప్పుడు నిన్ను పెంచిపెద్ద చెయ్యటం అనుక్షణము మాకు అగ్ని పరీక్ష అంటూ దుఃఖించాడు. ఏ జన్మలో ఏ పాపం

చేసానో ఈలాంటి బిడ్డని భగవంతుడు అనుగ్రహించాడని ఇదీ ఒక పరీక్షే అని ఆ దంపతులు ఒకరినొకరు ఓదార్చుకొని దుఃఖిస్తున్నారు.

ఓ రోజు సాయంకాలం సంధ్యను ఉపాసింపజేసి తొమ్మిదేళ్ళ సుమతిని ఒళ్ళో కూర్చోబెట్టుకొని తనయా ! ఉపనయనం చేసాను. వేదాధ్యయనానికి నీకు వయస్సు వచ్చింది. గురుకులంలో వేస్తాను గురుసేవ చేస్తూ చదువుకో బాగా వివేకం సంపాదించు. వయస్సు వచ్చాక వేదాధ్యయనం అయ్యాక అనువైన సంబంధం చూసి నీకు వివాహం జరిపిస్తాను. గృహస్థాశ్రమం ధర్మబద్ధంగా నడిపి సత్పుత్రులను పొంది వారికి నీ బాధ్యతలు నెరవేర్చి వానప్రస్థాశ్రమం స్వీకరించి ఆ తరువాత అనుబంధాలన్ని తెంపుకొని సన్యాసంపుచ్చుకో. ఆ దీక్షతో నీకు ముక్తి లభిస్తుంది. సుమతి అంతా శ్రద్ధగా వింటున్నాడు అతడికి అన్ని తెలుస్తున్నాయి అనే భ్రమతో పాపం ఆ పిచ్చి తండ్రి ఇంతటి బోధ చేస్తున్నాడు. సుమతి మాత్రం ఉలకలేదు, పలకలేదు అసలు అతనికి వినిపించిందో లేదో కూడా తెలియలేదు. తనపుత్ర వ్యామోహానికి తానే దిగులుపడి కళ్ళల్లో నీళ్ళు కుక్కుకున్నాడు. పాపం ప్రతీ రోజు ఈ తంతు ఇలా జరుగుతూనే వుంది. ఒకనాటి మధ్యాహ్నం సమయాన సుమతి హఠాత్తుగా మాట్లాడాడు. తనను తానే నమ్మలేనంతగా ఆశ్చర్య చకితుడై వింటున్నాడు తండ్రి.

తండ్రీ మీరంటున్న వేదాలు శాస్త్రాలు కళలు కావ్యాలు ఇవి అన్నీ నేను ఎన్నో సార్లు అభ్యసించాను. ఇవి ఏమీ నాకు కొత్తకాదు. గ్రుడ్డి, మూగ, చెవుడు, జడుడు అనుకున్న కొడుకు ఇలా మాట్లాడటమేమిటి అని ఆశ్చర్యపోతున్నారు కదా! ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు. నా కథ చెబుతాను విను. ఇంతవరకూ నేను కొన్ని వేల జన్మలు ఎత్తాను. అవన్నీ నా కళ్ళ ఎదుట బొమ్మలు లాగా కదులుతున్నాయి. ప్రతిజన్మలో జరిగిన ప్రతీ విషయం నాకు జ్ఞాపకం ఉంది. ఎందరెందరు తల్లిదండ్రులు ఎందరెందరు బంధుమిత్రులు ఎందరెందురు భార్యాపుత్రులు లెక్కపెట్టి చెప్పడం ఎవ్వరి తరమూకాదు. ఎన్నెన్ని సుఖాలు ఎన్నెన్ని దుఃఖాలు ఎన్నెన్ని అనుభవాలు ఎన్నెన్ని అనుభూతులు. తలుచుకుంటేనే తల తిరిగిపోతుంది నరజన్మలేనా మృగజన్మలేనా పశుపక్షి, కీటకాదిక్రిముల జన్మలేనా అన్నీ నేను అనుభవించాను. ప్రతి పుట్టుకా ఒక నరకం మలమూత్ర పంకిలమైన జననీ జఠర నివాసం. శైశవ, బాల్య, యౌవన, కౌమార, వార్థక్యాలలో సుఖదుఃఖాల వెలుగునీడలు స్వయం కృతాలు, పరాకృతాలు, అన్ని చాలా రుచి చూసాను. భృత్యజన్మల్లో కృంగిపోయాను. రాజజన్మల్లో విర్రవీగాను. పిరికిపందగా పారిపోయాను. మహాశూరుడిగా విజృంభించాను. దరిద్ర, ధనిక, చోర, కిరాతక, జూదరిజన్మలు ఎన్నో ఎత్తి వంచించాను, వంచింపబడ్డాను. త్యాగిగా కీర్తింపబడ్డాను. లోభిగా నిందింపబడ్డాను. సర్వాంగ సౌందర్యాలు, అంగవైకల్యాలు అన్నీ గుర్తువున్నాయి. అవన్నీ కలిగించిన నిర్వేదంతో ఈనాడు ఇలా జడపదార్థంలా మారిపోయి మీ ఇంటిలో జన్మించాను. పూర్వజన్మస్మృతి లేకపోవడం నిజంగా మానవుడివరం. లేకపోతే నాలాగే అందరూ జడపదార్థముల వలె ఉండేవారు. నిర్వేదంలో మునిగిపోయేవారు సరే - ఆ జన్మలూ, ఆ కష్టాలు, ఆ వైరాగ్యాలు, వాటి మాటకేం గాని తండ్రీ నీవు చెబుతున్న వేదోక్త కర్మలపట్ల నాకు సదభిప్రాయం లేదు. అవి నాకు రుచింపవు. యజ్ఞయాగాదులు చెయ్యడం స్వర్గసౌఖ్యాలు అనుభవించడం సంపాదించుకున్న పుణ్యం ఖర్చుకాగానే మళ్ళీ భూలోకంలో గర్భవాస నరకం అనుభవించడం ఏదో ఒక జన్మ మళ్ళీ ఎత్తడం మళ్ళీ దుష్కర్మలు సత్కర్మలూ నరకయాతనలు సుఖదుఃఖాలు అనుభవించడం మళ్ళీ పుట్టడం మళ్ళీ గిట్టడం ఇంతేగదా జనన మరణ చక్రంలోబడి

కొట్టు మిట్టాడటం. దీనికి విసుగూ విరామం లేదా ? నువ్వంటునట్లు కర్మమార్గం ఇంతకన్నా ఉత్తమ పదాన్ని అందిస్తుందా? ఇంతకన్నా ఉన్నతపదం ఉంది అని అసలు నీవు గుర్తించావా? జననమరణాలకు అతీతమైన శాశ్వత ఆనందధామం కదా మనం చేరుకోవలసింది దాన్ని పొందాలి అంటే జ్ఞాన మార్గం ఒక్కటే శరణ్యం. నిర్గుణ పరబ్రహ్మను ఉపాసించడం ఒక్కటే జ్ఞానమార్గం, సర్వ సంగపరిత్యాగము, రాగద్వేషాది ద్వందాలకు లొంగని ప్రవృత్తి అలవరచుకోవడమే జ్ఞానమంటే. ఇది ఉన్నవాడికి దుఃఖం ఉండదు. కర్మబంధం ఉండదు. జన్మరాహిత్యమే చివరఫలం. తండ్రీ ఇది నువ్వు తెలుసుకోవాలి.

ఆశ్చర్యచకితుడై కళ్ళు అప్పగించి తండ్రి రవ్వంత తేరుకున్నాడు. ఇంతటి జ్ఞాని తన ఇంట పుట్టినందుకు ఆనందం కల్గుతున్నా చిన్నవాడి వైరాగ్య మాటలు అతన్ని కలవరపరచాయి. జడుడు అనుకున్నవాడు నేడు జ్ఞాని అయ్యాడని సంతోషించాలో ఈ ధోరణికి దుఃఖించాలో అగమ్యగోచరంగా ఉంది. నాయనా సుమతి ఏమిటి నీ మాటలు, ఒక్కనిమిషంలో నీకు ఇంతటి జ్ఞానం ఎలా వచ్చింది? పూర్వజన్మల స్మృతి ఎలా కలిగింది? ఏదైనా శాపకారణంగా నీవు మా ఇంట జన్మించావా ? నన్ను మీ అమ్మను మళ్ళీ దుఃఖ సాగరంలో ముంచి వెళ్ళిపోతావా? అసలు నీ జన్మ రహస్యం ఏమిటి ? చెప్పు అని ఆందోళనతో అడిగాడు. వేదవేదాంగాలు అభ్యసించిన తండ్రి పుత్రవ్యామోహంతో అలా రోదిస్తుంటే సుమతికి నవ్వు వచ్చింది. ఇలా అన్నాడు. తండ్రీ నీకు పుత్రుడుగా జన్మించడానికి ముందు చాలా శాస్త్రాలు అభ్యసించాను. ఆ ఇంటికి వచ్చిపోయే సాధు సజ్జనులతో సాంగత్యం కలిగింది. వేదాంగ చర్చలు అనేకం చేసాను. ముక్తిమార్గాలు తెలుసుకున్నాను. జ్ఞానం ఉదయించింది. అంతరంగం నిండా వెలుగునింపుకొంది. ఏకాంత వాసంలో చాలాకాలం గడిపాను. నా నియమనిష్టలు పరిపక్వదశకు వచ్చే సమయంలో, బ్రహ్మసాక్షాత్కారం లభించే సమయంలో ప్రమాద వశాత్తు మరణించాను. యోగశక్తికారణంగా అప్పటి నుండి నాకు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. నేను చేసిన జ్ఞాన దానాల ఫలితంగా పదివేల పూర్వజన్మల్లోని అన్ని విషయాలు నాముందు నిలచాయి. నిర్వేదంతో, సంగాతీత, ద్వంద్వాతీత స్థితి కలిగింది. దానినే ఈ జన్మతోను కొనసాగించదలచాను. ఇప్పుడు ఆ జ్ఞాన మార్గాన్ని విడిచి నువ్వు చెప్తున్న కర్మమార్గం అవలంభించలేను. ఏ మార్గంలో ఎవరు ప్రయాణం చేసినా అందరూ చేరుకొనేది గమ్యమే. అదే అందరి లక్ష్యము. నా మార్గంలో నేను గమ్యం చేరుకుంటాను. అందువలననే ఈ జడ స్థితి. కాలం వృధా చేసుకోకూడదు కదా ! ఈ శరీరానికి ఏ క్షణంలో ఏం జరుగుతుందో ఎవరికెరుక, కనుక ముక్తిలభించే వరకు అనుక్షణము ఆత్మానుభవపరుడ్నై తదేక దీక్షలో గడపడం నా ధృడసంకల్పం. నీ ఇంట పుట్టాను కనుక పితృఋణం తీర్చుకోవడం నా ధర్మం. జ్ఞాన దానం చేసి ఋణ విముక్తి పొందుతాను. తండ్రీ నీకేమైనా సందేహాలుంటే అడుగు అన్నాడు.

కిందటి క్షణం వరకు జడుడుగా ఉండి ఇప్పుడు ఇంతటి జ్ఞానిగా ప్రసంగిస్తున్న కొడుకు ఆ తండ్రికంటికి మహాయోగీశ్వరుడులా కనిపించాడు. హిమాలయ శిఖరంలా గోచరించాడు. సుమతికి తాను పెట్టిన పేరు సార్థకమయ్యిందని సంబరపడ్డాడు. కుమారా, నాయనా ఇంతకీ ఇప్పుడు నా కర్తవ్యము ఏమిటి చెప్పు. నేను ఈ జన్మ పరంపరలలో ఇలా మునిగి తేలవలసిందేనా ! దీనికి విముక్తి ఏమిటి ? దయచేసి తెలియచెప్పు. కన్నకొడుకుతో మాట్లాడుతున్నానన్న చనువు, మహాజ్ఞానితో మాట్లాడుతున్నానన్న బెరుకు తండ్రి స్వరంలో వినిపించాయి. సుమతి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ తండ్రితో ఇలా అన్నాడు.

తండ్రీ నా మాటలమీద నీకు నిజంగా గురి కుదిరింది కదా ! అయితే చెబుతాను విను. ఈ సంసారము నిస్సారమని ముందు నువ్వు గ్రహించు. ఆ తరువాత ఆలస్యం చేయకుండా గృహస్థాశ్రమం వదలి వానప్రస్థం స్వీకరించి అమ్మతో సహా అడవులకు వెళ్లి భగవధ్యానం చేసుకుంటూ నిస్సంగత్వం అలవరుచుకో, ఆ పైన సన్యాసం స్వీకరించు.

క్షేత్ర, క్షేత్రజ్ఞ విలువలను గుర్తించు, ద్వంద్వ ప్రవృత్తిని జయించు. ఏకాంతవాసంతో, యోగాభ్యాసంతో అంతరేంద్రియాలను నిగ్రహించు. భిక్షాటనతో దేహాన్ని నిలుపుకుంటూ నిరంతరం జాగరూకుడవై యోగమార్గాన పయనిస్తే ఆత్మ బ్రహ్మైక్యానుసంధానం చెందుతుంది, భవరోగాలన్నింటికీ అదే దివ్య ఔషధం. జనన మరణాల చక్రము నుండి బయటపడే సాధనం ఇదే, మరొకటి లేదు. యోగమార్గాన ప్రయాణం చేయడమే శరణ్యం. ఈ క్షణములోనే నీవు ధృడంగా సంకల్పించుకో.

నాయనా ! కళ్ళు తెరిపించావు. ఈ సంసారము నుండి బయటపడాలి. బయటపడాలి అనుకోవడమే తప్ప బయటపడే మార్గం తెలియక ధైర్యంచాలక కొట్టుకుంటున్నాను. దారి చూపించావు. ధైర్యం కలిగించావు. జన్మ పరంపరల సుడిగుండం నుంచి తప్పించే యోగవిద్య నాకు ఉపదేశించు. భవదావాగ్నిలో మాడిపోతున్న నా అంతరంగానికి బ్రహ్మ జ్ఞానమనే జడివానతో ఉపశమనం కలిగించు. అవిద్య కృష్ణసర్పం కాటువేసి మూర్ఛపోయిన నన్ను నీ మంత్రోపదేశంతో బయటపడేయి. ఇల్లు వాకిలి ఇల్లాలు బిడ్డలు ధనధాన్యాలు ఇలా వేయి పాశాలు ముడివేసుకొని గిలగిలా కొట్టుకుంటున్నాను. యోగవిద్య అనే ఖడ్గంతో నా బంధనాలు ఛేదించి స్వేచ్ఛ ప్రసాదించు.

తండ్రీ! యోగాభ్యాసానికి కావలసిన పరిణతి నీకులభించింది. తప్పకుండా ఉపదేశిస్తాను. వెనుక దత్తయోగీంద్రుడు అలర్కుడికి చెప్పిన యోగవిద్య నీకు చెప్తాను, శ్రద్ధగా విను.

నాయనా కుమారా నువ్వు బోధించే యోగవిద్యలో ఈ అంశాలు వస్తాయో రావో, మళ్ళీ చివరలో ఈ సందేహాలు గుర్తుంటాయో ఉండవో అందుకని ముందే అడుగుతున్నాను. దత్తయోగీంద్రుడు ఎవరు? అలర్కుడు అంటున్నావు. ఆయన ఎవరు? వీళ్ళ జన్మ వృత్తాంతాలు ముందుగా చెప్పి ఆపైన యోగవిద్య చెబుదువుగాని.

తండ్రీ అడగవలసిందే అడిగావు. వీరిద్దరి గురించి చెప్పకుండా యోగవిద్య ఎలా చెప్పగలను. ముందుగా దత్త యోగీంద్రుని ఆవిర్భావానికి హేతువయిన పావన గాథ చెబుతాను విను.

## సుమతీ కౌశికుల వృత్తాంతం

ప్రతిష్ఠానపురంలో కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతని భార్యపేరు సుమతి. పేరుకు తగిన గుణవతి. మహా పతివ్రత. కొంతకాలంగా వాళ్ళిద్దరి యొక్క సంసారం అన్యోన్యంగా సాగింది. ఉన్నట్టుండి కౌశికుడికి ఏ పూర్వ జన్మ పాపమో కుష్ఠురోగం సోకింది. రోజులు గడుస్తున్న కొద్దీ రోగం ముదిరి తనువంతా చీము, నెత్తురు కారుతుంటే సుమతి మనస్సులో కూడా ఏవగించుకోకుండా అతని శరీరాన్ని నీటితో కడిగి మెత్తని గుడ్డలతో వత్తి, వైద్యులిచ్చిన తైలములను మృదువుగా రాస్తూ ఉండేది. ఔషధాలను సమయానికి అందిస్తుండేది. మలమూత్రాలను ఎత్తిపోయడం, కంపు కొట్టే గుడ్డలు ఉతికి ఆరవేయడం, దగ్గరగా కూర్చుని వింజామరతో విసరడం. కాళ్ళు పట్టడం మంచిగా చెప్పి ఇంత తినిపించడం, ఒకటేమిటి సకలోపచారాలు విసుగు విరామం లేకుండా చేసేది. రోగం తగ్గుముఖం పడుతుందని తొందరలోనే నయమవుతుందని ధైర్యం నూరి పోసేది. అయితే రోగబాధతో ఉన్న కౌశికుడు మాత్రం ఆమెపై అనుక్షణం మండిపడుతుండేవాడు. అయిన దానికి కాని దానికి తిట్టేవాడు. చిన్న, చిన్న విషయాలకే చిరాకు పరాకు ప్రదర్శించే వాడు. చేతికి ఏది అందితే అది తీసుకొని కొట్టేవాడు. నవ్వుతూ కనిపించినా, వీధిలోకి వెళ్ళి రావడం, క్షణం ఆలస్యమైన కుళ్ళు మాటలతో ఏడిపించేవాడు. అలాగని నవ్వకుండా ఉంటే ఏమీ నా సేవ చేయాలని ఏడుస్తున్నావా!

ఎపుడు చస్తాడాని ఎదురుచూస్తున్నావా అంటూ చంపుకు తినేవాడు. పాపం సుమతికి నవ్వాలో ఏడ్వాలో తెలియదు. ఇది రోగ లక్షణం కాబోలు అనుకొని అలాగే సహనంతో, ప్రేమతో, భక్తితో సంవత్సరాల తరబడి సేవలు చేస్తూనే ఉంది.

ఒక రోజు ఉదయాన కౌశికుడుకి శరీరం అంతా శుభ్రం చేసి విభూధిరేఖలు దిద్ది శుభ్ర వస్త్రాలు కట్టి ఇంటి ముంగిట పంచలో మంచం వేసి, మెత్తని పడకలు ఏర్పరిచి సుఖంగా కూర్చోబెట్టి తాను వంట పనుల్లో తలదూర్చింది సుమతి. కౌశికుడు కులాసాగా వీధిన వచ్చిపోయేవాళ్ళని పలకరిస్తూ పుండ్ల మీద వాలుతున్న ఈగల్ని తోలుకుంటూ సరదాగా ఉన్నాడు.

అంతలోకే ఒక మెరుపు తీగలాంటి అమ్మాయి నడుచుకుంటూ ఆ వీధిలోకి వచ్చింది. 16 ఏళ్ళ పడుచుపిల్ల. ఆ పిల్ల చూపు మన్మధ భాణంగా ఉంది. ప్రతిష్ఠానపురంలో పెద్ద, పెద్ద ధనవంతుల కుమారులను సైతం లోకువకట్టి వెంట తిప్పుకొంటున్న సానిదాని కూతురు ఆ పిల్ల. కౌశికుడి కంటబడింది. కళ్ళు జిగేలుమన్నాయి. గుండెల్లోకి దిగింది మన్మధ బాణం. అసలే రోగంతో తిమ్మెరలు ఎక్కిన దేహం. జువజువలాడింది. ఆ కుర్రపిల్ల సోయగాలు విసురుతూ కౌశికుడు వైపుకు కొంటెచూపు విసిరి తుర్రుమని వెళ్ళిపోయింది. పాపం ఆ పిచ్చి బాపడు విలవిల్లాడిపోయాడు. ఆ హొయలు, వయ్యారం, రూపు, చూపు తలుచుకుంటూ మురిసిపోయాడు. తనవైపు ఎందుకు చూచిందీ అని ఆలోచించి కామంతో ఉడికిపోయాడు. కౌశికుడు తనని తాను చూసుకున్నాడు. అందంగా కనిపించాడు. ఏమైనాసరే సాని పాపను కలవాల్సిందే, లేదంటే మరణించవలసిందే ఇందుకు శరీరం సహకరిస్తుందా! ఈ రోగంతో ఉన్న రూపాన్ని ఆమె అంగీకరిస్తుందా? ఇంతకీ వేశ్య ఇంటికి తనను తీసుకువెళ్ళేది ఎవరు? ఇలా ప్రశ్నలు పుట్టుకొచ్చాయి అతని మనస్సులో, ఆకలిదప్పికలు మరచిపోయాడు. ఇంతలో సూర్యుడు నడినెత్తికి చేరుకున్నాడు.

క్షణానికొకసారి పెడబొబ్బలుతో పిలిచే భర్త ఈ పూట ఇంత ప్రశాంతంగా ఉన్నాడని ఆశ్చర్యపోతూ వంట ముగించుకొన్న సుమతి ఇంటి ముంగిటకు వచ్చింది. మనసులో మల్లగుల్లాలు పడుతున్న భర్తను గమనించింది. ప్రేమగా సరసన కూర్చుంది. వంట ఆలస్యమయిందని కోపం వచ్చిందా! లేవండి వడ్డిస్తాను అంటూ అతణ్ణి లేవనెత్తే ప్రయత్నం చేసింది. కోపంగా కౌశికుడు విదిలించుకున్నాడు. సుమతి నివ్వెరపోయింది. లేచి లోపలికి వెళ్ళబోయింది. ఇంతలో కౌశికుడు ఆమె చెయ్యి పట్టుకొని కూర్చోబెట్టి, సుమతీ ఇవాళ నాకు ఆకలిగా లేదు అని సరసమైన చూపుతో అన్నాడు. సుమతి బుగ్గలు ఎరుపెక్కాయి. అపుడు కౌశికుడు తెచ్చిపెట్టుకొన్న ప్రేమతో సుమతి బుగ్గపట్టుకొని సుమతీ నాకున్న దిక్కు, మొక్కు నీవే. నీతోకాక ఎవరితో చెప్పుకుంటాను. కట్టుకొన్న భార్యను అడగకూడదు. అయినా అడగక తప్పటంలేదు, కాలు చెయ్యి తిన్నగా ఉండి ఈ రోగం రాకుండా ఉంటే అసలు నీకు తెలియనిచ్చేవాడినే కాదు. పాపం నీ దురదృష్టం. నాకేమో ఈ మాయ రోగం వచ్చింది. నీ సహాయం అడగక తప్పటం లేదు. నువ్వు కాదనవనే నమ్మకం నాకుంది. నీ పాతివ్రత్యం నాకు తెలుసుగదా! కౌశికుడు ఇలా మాట్లాడుతూ ఉంటే సుమతికి ఏమీ అర్థంకాలేదు. నాధా అంటూ చేరువకు వచ్చింది. ఈ రోజేమిటి, మీ ప్రవర్తన వింతగా ఉంది. దాపరికం లేకుండా చెప్పండి. ఏనాడైనా మీ మాట కాదన్నానా! మీకు ఎదురు చెప్పానా! మీరు ఏది కోరినా మంచి చెడులతో నాకు సంబంధం లేదు. శక్తి మేరకు తీర్చడం నాధర్మం. సంశయించకండి. మీ మనసులో ఉన్న దేమిటో ఆజ్ఞాపించండి. నా

ప్రాణం అర్పించి అయినా సరే మీ కోరిక నెరవేరుస్తాను. మీ ఆనందమే నా ఆనందం. మీ సంతోషమే నా సంతోషం, త్వరగా చెప్పండి అన్నది.

ఈ మాటలతో కౌశికుడికి ధైర్యం వచ్చింది. సుమతీ, యిది ఏమో విధి వైపరీత్యంలా ఉంది. దైవలీలలన్నీ చిత్ర, విచిత్రంగా ఉంటాయి. ఆరోగ్యం అన్ని విధాలా బాగున్న రోజుల్లో నిండు యవ్వనంలో ఏ రోజు కలుగనిదీ, ఈ రోజు కలిగింది నాకు ఆ కోరిక. ఎంత వింత! సుమతి! మన వీధికి ఏనాడైనా సానిపాపలు రాగా నీవు చూసావా! విన్నావా! అదే ఆశ్చర్యం. ఇందాక ఒక సాని పాప మన వీధిలో నడుచుకుంటూ వెళ్ళింది. మన ఇంటి ముందు క్షణం నిలబడి కొంటె చూపుల్ని నా గుండెల్లో గ్రుచ్చి వెళ్ళింది. నా మనస్సంతా కలచి వేసింది. ఇప్పుడు శరీరంలో క్రొత్తరోగం ప్రవేశించింది. ఆ రోగం పోవాలంటే సానిపాపను కలవవలసిందే. ఇపుడు నేను శారీరకంగా మన ఇంట్లో ఉన్నాను కాని, మానసికంగా సానిపాప ఇంటి గడపలో ఉన్నాను. చకచకా నడిచి వెళ్ళగలిగిన శక్తిలేదు. మాయరోగం నా కాళ్ళు, చేతులూ తినేసింది. అంటూ దుఃఖ వదనంతో చెప్పాడు.

నాధా! ఇంత చిన్న పనికి హైరానా పడతారెందుకు! నేను ఏమనుకుంటానో అనే చింత వదిలివెయ్యండి నేను మీ కొరకై జీవిస్తున్న వ్యక్తిని. మీ ముఖంలో ఇలాంటి కాంతి, తేజస్సు నేను చూసి ఎన్నాళ్ళయ్యిందో మీ ఆనందం కన్నా నాకు ఏంకావాలి, దాని కోసం నేను ఏం చెయ్యమన్నా చేస్తాను, కాళ్ళు, చేతులు ఆడటం లేదని నడవలేనని బాధపడకండి. నేను తీసుకువెళతాను. భుజాలపై కూర్చోబెట్టుకొని మీకు ఏ శ్రమ కలగకుండా హాయిగా తీసుకువెళతాను. ముందు లేవండి! భోజనం చెయ్యండి! కాసేపు విశ్రాంతి తీసుకోండి. ఈ లోగా సాయంకాలం అవుతుంది. స్నానం చేయించి పట్టు వస్త్రాలు కట్టించి, చందన సుగంధద్రవ్యాలు చల్లి, మిమ్మల్ని అలంకరించి, సాని వాడకు తీసుకొని వెడతాను. నాది బాధ్యత. లేవండి భోజనం చేద్దురుగాని, అంటు సుమతి భర్తను ప్రేమగా అనునయంగా మాట్లాడుతూ లేవనెత్తింది.

కౌశికునకు ఏదో కొత్తగా శక్తి ఆవరించినట్లయింది. లేచేందుకు తన ప్రయత్నం తాను చేశాడు. పూర్తిగా సుమతిపై వాలిపోకుండా తనకు తాను నిలబడటానికి ప్రయత్నం చేశాడు. సుమతీ ఒక చేత్తో నిన్ను పట్టుకుంటాను. ఒక చేత్తో గోడపట్టుకుంటాను ఈ పాటి ఆసరా నాకు చాలు ఏదో కొత్తశక్తి ఆవరించింది నన్ను. నెమ్మదిగా వస్తాను నన్ను తొందరపెట్టకు అని తన ప్రయత్నం తాను చేశాడు. చిన్నగా నడుచుకుంటూ వంటగదిలోకి వెళ్ళాడు. సుమతికాళ్ళు కడిగి తుడిచి పీటవేసి కూర్చోబెట్టింది. వండినవి విస్తరిలో వడ్డించి ముద్దలు చేసి పెడ్తూ ప్రేమగా తినిపించింది. ఆనందంతో మాట్లాడబోయిన కౌశికుడికి పొలమారింది. దగ్గు వచ్చింది. సుమతి కంగారుతో అతని మాడుపై చిన్నగా తడ్తూ నెమ్మదిగా తినండి ఇంకా చీకటి పడటానికి చాలా సమయం వుంది అంటూ అతని చేత మంచినీళ్ళు త్రాగించింది. కౌశికుడు కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. కంఠాన్ని సవరించి సర్దుకున్నాడు. సుమతి ముఖంలో చిరునవ్వు మెరిసింది. మరోవైపు తిరిగి ఎడమచేత్తో పెరుగు అందుకొని అతనికి వడ్డిస్తూ అతన్ని కవ్వించాలని బహుశా సానిపాప మిమ్మల్ని తలుచుకుంటోందేమో అంది. కౌశికుడి ముఖంలో సిగ్గు ఉదయించింది. సుమతీ నేను చాలా సిగ్గుపడుతున్నాను. జీవితంలో ఏనాడూ కలగని కోరిక ఈనాడు కలిగింది. తప్పు అని నాకు అనిపిస్తుంది. అయినా మనస్సు నిగ్రహించుకోలేకపోతున్నాను. ఇది దైవ లీల అనుకుంటాను. ఏమి జరుగనున్నదో తెలియడంలేదు. అన్నింటిలోకి బాధిస్తున్న విషయం ఏ యుగంలో ఎంతటి నీచుడూ చెయ్యని పని నేను చేస్తున్నాను. సాని వాడకు తీసికెళ్ళమని

కట్టుకున్న ఇల్లాలిని అడగడం ఎంతనీచం, దారుణం అని అంటూ కౌశికుడు దుఃఖంతో ఉండగా తెరలుగా దగ్గువచ్చి గొంతులో మెతుకులు అడ్డంపడ్డాయి. ఉక్కిరి బిక్కిరి అయ్యాడు దగ్గుతో. పాపం సుమతి కంగారుపడి భయపడి వూరడిల్లండి, వూరడిల్లండి అంటూ మంచినీళ్ళు అందించింది. ముక్కూమూతి తుడిచింది. చేతులు కడిగి కాళ్ళను తడిచేత్తో తుడిచింది. కౌశికుడు కొద్దిగా తేరుకున్నా ఇంకా బాధపడుతూనే వున్నాడు.

అప్పుడు సుమతి అతని దగ్గరగా వచ్చి కూర్చుని నాథా! మీరు ఇంతగా భాదపడవలసిన పనిలేదు. సానివాడకు మీరు తీసికెళ్ళమని నన్ను అడిగారా లేదు నా అంతట నేను అన్నాను. మరి సిగ్గు పడటం ఎందుకు? బాధపడటం ఎందుకు? భార్యలను మోసంచేసి సానివాడల్లో తిరిగే వారు ఎంతమంది లేరు. నా మగడు అటువంటి వాడు కాదు. నన్ను మోసంచేయడంలేదు. నా భర్త నా సహాయమే అడుగుతున్నాడు. ఇది నాకు గర్వకారణం ఈ పరిస్థితుల్లో మీకు ఇలాంటి కోరిక కలగడం కేవలం కామవాంఛ అని నేను అనుకోవడం లేదు. మీరన్నట్లుగా ఇదేదో దైవలీల. లేవండి మంచం మీద కూర్చోబెడతాను కాసేపు నడుంవాల్చండి. ఈలోగా నేను కూడా భోజనం చేసి వంటిల్లు సర్దివస్తాను. ఆ తర్వాత మిమ్మల్ని ముస్తాబుచేస్తాను అన్నది.

సుమతి మాటలతో కౌశికుడు కాస్తంత తేరుకున్నాడు. మరల సానిపాపనే తలుచుకుంటూ సూర్యాస్తమయము కొరకు ఎదురు చూస్తూ నడుం వాల్చాడు. వంటింటి పనులన్నీ చకచకా ముగించుకొని సుమతివచ్చి భర్తను చూచి కారణం ఏదైతేనేమి తన భర్త ఆనందంగా వున్నాడు. అనారోగ్యాన్ని పూర్తిగా మరచిపోయాడు ఇదే చాలునని తృప్తిపడి భర్తను లేవదీసి పీటవేసి దానిపై అతన్ని కూర్చోబెట్టి కుష్టురోగంతో కుళ్ళివున్న శరీరంపై వున్న కట్లను విప్పి చీమునెత్తురూ శుభ్రంచేసి మందులురాసి కొత్త గుడ్డలతో కట్లు కట్టింది. రోగకారణంగా సగానికిపైగా తినేసిన చేతి వ్రేళ్ళు కాలి వేళ్ళు కనబడకుండా జాగ్రత్తలు తీసుకుంది. రసికంపురాకుండా పరిమళ ద్రవ్యాలు శరీరం అంతా పులిమింది. నొసట వీభూతి కుంకమ అద్దింది. పట్టు పంచ కట్టించింది. పట్టు శాలువా రెండు భుజాల నిండుగా కప్పి అటు ఇటూ అందంగా వ్రేలాడేటట్లుగా సర్దింది. మల్లెల దండలు మెడలో, చేతిమణి కట్టులకు అలంకరించింది. గుండెల మీద భుజాల మీద మంచి గంధం రాసింది. కౌశికుడు పెళ్ళి కొడుకులా తయారయ్యాడు. నీళ్ళునిండిన కళ్ళతో సుమతి కళ్ళల్లోకి చూచి, సుమతీ ఉదయం కనిపించింది సానిపాప సూర్యుడు అస్తమిస్తున్నా నన్ను వదలడంలేదు. హృదయంలో హత్తుకొనిపోయింది ఆసానిపాప చూసిన చూపు. ఆమెను పొందలేకపోతే నేను బ్రతుకలేను అన్నాడు.

సుమతి హఠాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఇంట్లోకి వెళ్ళి అద్దంతెచ్చి భర్తకు చూపించింది. మందగించిన చూపుతో కౌశికుడు అద్దంలో తన బింబాన్ని చూసి మురిసిపోయాడు. వేశ్యలకు బంగారం ప్రాణమంటారు కనుక తన మెడలోవున్న కాసుల హారాన్ని తీసి భర్త మెడలో వేసింది. నాథా! సూర్యాస్తమవుతుంది, ఇంక బయలుదేరుదాం వేశ్యవాటిక మనింటికి చాలా దూరం మధ్యలో శ్మశానం దాటాలి, బయలుదేరుదాం అని కొంగు బిగించి కొంత ధనాన్ని మూట కట్టుకొని మంచానికి చేరువలో నేల మీద కూర్చుంది. కౌశికుడు మంచం మీద నుండి ముందుకు జరిగి ఆమె మెడకు అటుఇటూ కాళ్ళువేసి సర్దుకొని కూర్చున్నాడు. వూతగా ఆమె శిరస్సును పట్టుకున్నాడు. నేలకు చేతులు ఆనించి సుమతి అతి ప్రయత్నం మీద లేచింది. భర్త కాళ్ళను చేతులతో అదిమిపట్టుకొని బరువుగా అడుగులు వేస్తూ బయలుదేరింది.

దారిలో కన్పించిన వారినందర్ని కౌశికుడు సరదాగా పలకరిస్తున్నాడు. వింతగా ఇకిలిస్తూవున్నాడు. చూసిన వాళ్ళంతా ఇతనికి పిచ్చిపట్టిందేమో అనుకున్నారు. తెలిసినవాళ్ళు ఏమోయి కౌశిక ఎందాక అంటే మాత్రం సమాధానం చెప్పకుండా దాటవేస్తున్నాడు. సుమతి మాత్రం ఇక్కడికే వ్యాహ్యాళికి అని అంటోంది. ఇంతలో చీకట్లు కమ్ముకున్నాయి. వూరు దాటి స్మశానంలోకి అడుగుపెట్టారు. కౌశికుడులో ఉత్సాహం రెట్టింపు అయ్యి గుర్రం మీద స్వారీ చేస్తున్నట్లుగా కాళ్ళు అటు ఇటూ ఆడిస్తూ వెకిలిగా వింతగా ప్రవర్తిస్తున్నాడు. అడ్డంగావచ్చిన చెట్లకొమ్మలను రెమ్మలను లతలను కాళ్ళతో చేతులతో ఆడిస్తూ వున్నాడు. తలకు తగిలే చెట్లు కొమ్మల నుండి తప్పించుకుంటూవున్నాడు. గర్వంగా నవ్వుకుంటున్నాడు. పై బరువుల కదలికలతో సుమతి కాళ్ళు తడబడుతున్నాయి. అప్పుడప్పుడు తూలిపడిబోతోంది. చెట్లకొమ్మలు గీసుకుంటున్నా, కాళ్ళ క్రింద ముళ్ళూ రాళ్ళూ వున్నా లెక్కచేయకుండా నడుస్తూవుంది. ఎటుచూసినా కారు చీకటి. ఏనాడూ చూసి ఎరగని ప్రాంతం దారి ఎటో తెలియని స్థితి అడుగుదామంటె ఎవరూ కనిపించడం లేదు. అయినా నడుస్తోంది. ఇంతలో "చంపేశావురా నీచుడా" అంటూ మూలుగులాంటి కేక వినిపించింది. భారంగా ఆ మాట వినిపించింది. సుమతి నివ్వెరపోయింది. ఎవరది అంటు ఆ మూలుగు వినిపించిన వైపుకు చూసింది. చేరువలోనే మానవశరీరం కొరత వేయబడి కొన వూపిరితో కొట్టుమిట్లాడుతున్న వ్యక్తి కనపడ్డాడు. చీకటిలో ఎవరో పోల్చుకోలేకబోయింది. సుమతి ఎవరు స్వామి తమరు అంది భయంభయంగా.

నన్నే గుర్తు పట్టలేకపోయావా? నేను మాండవ్య మహర్షిని ఈ దేశం ఏలే మహారాజు గర్వాంధుడై నాకు చౌర్యం అంటగట్టి కొరత వేయించాడు. పరమాత్మని ధ్యానం చేసుకుంటూ ప్రాణాలుపోకడకు ఎదురుచూస్తున్నాను. నీ భుజాల మీద స్వారీ చేస్తున్న ఈ దుష్టుడు నా తలపై తన్నాడు. ప్రాణం జిల్లార్చుకుపోయింది. మహర్షి అనే మర్యాదలేదు. మనిషి అనే గౌరవంలేదు. చావుకి సిద్ధంగా వున్నాననే దయలేదు దీనికి వీడు శిక్ష అనుభవించవలసిందే వీడు సూర్యోదయం అయ్యేలోగా మరణించవలసిందే ఇది నా శాపం అన్నాడు. పాపం సుమతి నిలువునా ఒణికిపోయింది. మహర్షీ మహర్షీ అంటూ రెండు చేతులు జోడించి కన్నీరు మున్నీరుగా విలపిస్తూ పాదాలపైబడి ప్రాధేయపడలేని స్థితిలో వున్నాను. నా భుజాలపై నున్నది ఎవరో కాదు నా భర్త కౌశికులవారు. మేము మీకు తెలియని వాళ్ళంకాదు. వీరి ఆరోగ్యం బాగున్న రోజుల్లో తమరికి నేను చాలా మార్లు అతిధి మర్యాదలు చేసుకున్నాను. ఇటీవలే ఈ రోగంతో ఈయన ఇలా వున్నారు. కుష్టురోగంతో పరితపిస్తున్నారు. పాపం ఏమి చేస్తున్నారో వారికి తెలియడంలేదు. కాళ్ళు చేతులు తిమ్మిరి లెక్కి పాపం స్పర్శ జ్ఞానాన్ని కోల్పోయారు. వీరి చిన్ని కోరిక తీర్చడానికి నేను భుజాల మీద మోసుకెళ్తున్నాను. పాపం పొరబాటున వీరి కాలు మీ శిరస్సుకు తగిలింది. కళ్లు కనిపించని చీకటి ఇది. తెలిసి చేసిన పొరబాటు కాదు. కావాలని చేసిన అవమానం కాదు. మిమ్మల్ని అర్చించి ఆశీస్సులు పొందవలసిన వాళ్ళం. తెలిసి అవమానిస్తామా? అవమానిస్తే మాకు ఒరిగే దేమిటి? మహర్షులు అనుగ్రహిస్తే మహా రోగాలుసైతం ఉపశమింపజేసుకోవచ్చు. ఈ ఆశతో అర్చిస్తాము కాని అవమానిస్తామా? తెలియక జరిగిన ఈతప్పు కాయండి. నా అవస్థ చూస్తున్నారు కదా. మూలిగే నక్క మీద పిడుగు పడ్డట్లుగా అయ్యింది నా పరిస్థితి. వైధవ్యం భరించలేను. దయచేసి శాపం ఉపసంహరించండి. ఆరోగ్యం కుదుటపడేటట్లు ఆశీర్వదించండి. జన్మజన్మలకు మీకు ఋణపడి వుంటాను అన్నది.

మాండవ్యుడు బాధతో మూలిగాడు. అతని నోటి నుండి చెవుల నుండి ముక్కు నుండి రక్తం ధారలు ధారలుగా కారుతూ అతని భుజాల నుండి కారుతూ నేలమీద మడుగులు కట్టింది. మహర్షీ మీ పరిస్థితి దయనీయంగా వుంది.

చివరి దశలోవున్న మీకు ఏ ఉపకారము చేయలేకపోతున్నాం. ఇది గృహస్థాశ్రమానికే విరుద్ధం. ఇందుకు సిగ్గుపడుతున్నాను. నా భర్తను ఈనేల మీద దించలేను. దించి మళ్ళీ భుజాల మీద ఎత్తుకోలేను అశక్తురాలిని. నన్ను క్షమించండి. మహారాజు గర్వాంధుడు. వాళ్ళకి చెవులే కాని కళ్ళు వుండవు. సరే కారణం ఏదయితేనేమి మీరు ఈ భవ సాగరం నుంచి మరికొద్ది సేపట్లో విముక్తులు కాబోతున్నారు. యోగ విద్యాపారంగతులు మీరు అంతరగ్నిని ప్రజ్వలింపజేసుకొని బ్రహ్మగ్రంధితో ముక్తి మార్గాన పయనించగలరు. ఉపాధి తాలూకు నశ్వరత్వం మీకు తెలియంది కాదు. ఈ సమయంలో నా భర్తను శపించి అదీ రోగంతో వున్న బ్రాహ్మణున్ని శపించి నా నొసట వైధవ్యాన్ని లిఖించడం భావ్యంకాదు. కొరతతో మీ ప్రాణాలు తడబడుతున్నాయి. బరువుతో నా పరిస్థితి అలాగేవుంది. దయచేసి శాపాన్ని తొలగించండి. తెలిసి చేసినా తెలియక చేసినా తప్పులకి దండన వుండాలంటే ఇంకో శాపం ఏదైనా ఇవ్వండి. నేను వైధవ్యం భరించలేను. స్వామీ దయచూపండి. శిరస్సు వంచి చేతులు జోడించి నమస్కరిస్తున్నాను. ఇదే సాష్టాంగ నమస్కారమనుకోండి అన్నది.

అప్పుడా మహర్షి ఆమెతో సాధ్వీ! నీ పతి సేవా పరాయణత్వమునకు సంతోషపడుతున్నాను. అయినా ఇచ్చిన శాపం తొలగించలేని అశక్తున్ని. ఇది కూడా దైవలీల. అందుకే నా నోటి నుండి శాపం అలా వచ్చింది. వెంటనే శిరస్సు వ్రక్కలైపోవుగాక అని నేను అనలేదు కదా. సూర్యోదయం వరకు వ్యవధివుంది కదా ప్రయత్నించు. నీ భర్తను కాపాడుకోగలుగుతావు. నీ పాతివ్రత్యమే నీకు శ్రీరామరక్ష వెళ్ళిరా శుభమగు గాక అన్నాడు.

అప్పుడా సుమతి చాలు మహర్షి చాలు ఇంతటి ఆశీస్సులు ఇచ్చారు. ఇంక నాకు భయంలేదు. కానీ ఉపచారములు చెయ్యవలసిన సమయంలో మిమ్మల్ని ఈ స్మశానంలో ఒంటరిగా వదలి వెళ్తున్నాము. మన్నించండి. మీకు ఉత్తమ గతులు కల్గాలని ఇష్టదైవాన్ని ప్రార్థిస్తున్నాను. సెలవు అంటూ బయలు దేరింది.

సుమతి భారంగా ఊపిరి పీల్చింది. చుట్టూ అంతా దుర్గంధం. భర్త పాదాలనురెండు చేతులతో స్పృసించింది. కళ్ళకు అద్దుకుంది. మరల నడక సాగించింది. ఇంత జరిగినా కౌశికుడు ఏమీ పట్టనట్లుగా వున్నాడు. పెద్ద పెట్టున విరగబడి నవ్వుతూ వున్నాడు. ఆ కదలికలకు సుమతి కాళ్ళు తడబడుతున్నాయి. కంగారు పడింది. రెండు పాదాలు పట్టుకొని స్వామీ, నాధా అని పిలచింది. అప్పుడు కౌశికుడు నడు, నడు తొందరగా సానిపాప ఇంటికి చేరే సరికి తెల్లవారేలాగా వుంది అన్నాడు కౌశికుడు.

తెల్లవారితే తన భర్త తనకు లేడు. ఏమిటి చెయ్యడం ఏముంది ఒకటే దారి. సూర్యోదయాన్ని అడ్డుకోవడం. అడ్డుకుంటే సకల సృష్టి అల్లకల్లోలమవుతుంది. ఏమైతే నేమి నా భర్త నాకు ముఖ్యం. సుమతి త్వరగా ఒక నిశ్చయానికి వచ్చింది. "ఈ రేయి తెల్లవారకుండుగాక! సూర్యదేవా! నీకు ఇంక ఉదయాస్తమయాలు లేవు" అని బిగ్గరగా అంది. కౌశికుడు అదిరిపడ్డాడు. "సుమతీ ఏమిటి ఈ శాపం? ప్రత్యక్షదైవం సూర్యనారాయణున్నా నీవు శపించడం? నా కామవాంఛను పొడిగించడం కోసం ఈ రాత్రిని అనంతంగా పొడిగిస్తున్నావా? సూర్యుడే ఉదయించకపోతే సృష్టి అంతా ఏమయిపోతుంది ఆలోచించావా? ఇది మహా పాపం సుమతీ శాపాన్ని ఉపసంహరింపజేసుకో" అన్నాడు కౌశికుడు. నాధా సూర్యుడు ఉదయిస్తే నాకు మాంగళ్యం నిలువదు అంది. అదేమిటి ఎవరు చెప్పారు నేను బ్రతికి ఉండగా నీకు మాంగళ్యం ఉండక పోవడం ఏమిటి? అన్నాడు కౌశికుడు. ఇది మాండవ్యుడిశాపం. ఇపుడేగా శపించాడు. మీకు వినిపించలేదా అంది సుమతి.

ఏమిటి సుమతీ నీవు అంటున్నది. నాకేమీ అర్థం కావడంలేదు. మాండవ్యుడేమిటి శపించడమేమిటి ఈశ్మశానంలోకి ఆయన ఎలా వచ్చాడు? ఎందుకు శపించాడు? మనం ఏం తప్పు చేశాము?

సుమతి ఆశ్చర్యపోయింది. ఏమిటి ఇలా మాట్లాడుతున్నారు. జరిగిన దుఃస్సంఘటన ఈయనకి తెలియదా ఇపుడేగా జరిగింది. ఏమీ తెలియనట్లు జరగనట్లు మాట్లాడుతున్నాడు ఏమిటి నాధా. పరీక్షిస్తున్నారా, లేదా గేలిచేస్తున్నారా కొరతకు వ్రేల్లాడుతున్న మాండవ్యుడు శిరస్సుకి మీకాలు తగిలింది. ఆయన మండిపడుతూ శపించాడు. సూర్యోదయం అయితే నా మాంగళ్యం నిలవదు. ఇది జరిగి రెండు క్షణాలు కాలేదు. ఏమీ ఎరగనట్లుగా అడుగుతున్నారు. వేళా కోళానికి ఇదేనా వేళ?

సుమతీ నిజంగా నాకు తెలియదు. ఏమి జరిగిందో చెప్పు ఇంటి దగ్గర బయలు దేరడం స్మశానంలో నడవడం ఇంత వరకే నాకు తెలుసు. ఆపైన ఏం జరిగిందో ఇసుమంతైనా నాకు తెలీదు. నిజం చెబుతున్నాను. మాండవ్యుడి శిరస్సుకి నా కాలు తగలడం ఏమిటి? అంతటి పాపం చేస్తానా? చేస్తే క్షమించమని ఆ మహర్షి పాదాలు పట్టుకుని క్షమించమని అడగనూ? ప్రాణాలు వదిలేస్తాను గాని పాపంజేసి ప్రాయశ్చిత్తం చేసుకోకుండా వుంటానా? ఏ జన్మలో ఏ పాపం చేశానో ఈ మహారోగం అనుభవిస్తున్నాను. తెలిసి తెలిసి ఇంకా పాపాలు చేస్తానా అసలు ఏం జరిగింది చెప్పు అన్నాడు.

సుమతి నివ్వెరపోయింది. క్షణం క్రింద కళ్ళ ఎదుట జరిగిన సంఘటన నాధుడికి తెలియదు. ఇది మరొక దైవలీల నిజమే తెలిసివుంటే అంతసేపు నోరు మూసుకొని కూర్చుంటాడా? కనీసం క్షమించండి స్వామీ అనడా సరే అని అనుకొని జరిగిందంతా నాధుడికి వివరించింది. కౌశికుడు సిగ్గుపడ్డాడు. భయపడ్డాడు. సుమతీ! వేశ్యా లేదు గీశ్యా లేదు. వెంటనే వెనక్కు వెళ్ళిపోదాం మాండవ్యుడి కొరత దగ్గరకు నన్ను తీసికెళ్ళు మాండవ్యుడు బ్రతికివుంటె క్షమించమని అడుగుతాను. మృత్యువుకి భయపడి మాత్రం కాదు. అధర్మానికి సిగ్గుపడుతున్నాను. ఇంతకీ నా కామ వాంఛ ఇన్ని దురవస్థలు తెచ్చిపెట్టింది. నిన్ను అవస్థలు పెడుతున్నాను. నేను అవస్థలు పడుతున్నాను. శాపంకొని తెచ్చుకున్నాను. ఇంక నేను జీవించేదికొన్ని ఘడియలు మాత్రమే. క్షణం వృధాచేయ వద్దు. తొందరగా మాండవ్యుడికి క్షమాపణ చెప్పి ఇల్లు చేరుకుందాం. హరినామ స్మరణతో చివరి ఘడియలు గడుపుతాను. పదపద అన్నాడు.

పాపం సుమతి వెనక్కుమళ్ళింది. పిచ్చి ఆవేశమేదో ఆమెను ఆవరించింది. త్వరత్వరగా నడిచింది. పరిచయం లేని ప్రదేశం. కారు చీకటి. దుర్గంధం. లోపల ఆందోళన దారి తప్పింది. ఎంత తిరిగినా ఎటు తిరిగినా మాండవ్యుడి కొరత ప్రదేశం కన్పించలేదు. నాధా ఈ శ్మశానంలో మాండవ్యుడి శరీరం ఎక్కడుందో కన్పించడం లేదు. దారి మారి వూరిదారిలో వచ్చేశాం అంది.

సుమతీ నీవు ఏనాడైనా గుమ్మం దాటిన దానవా. ఎంత హింసిస్తున్నాను. పోనీలే ఇంటికి వెళ్దాం. మాండవ్యుడు ఇచ్చిన శాపానికి తిరుగులేదు. కాలయాపన చెయ్యకుండా పద పద అన్నాడు.

సుమతి ఇంటికి చేరుకుని ఇంటి ముంగిటవున్న పంచలోనున్న మంచంపై అతన్నిదింపింది. తాను పెరట్లోకి వెళ్ళి బావివద్ద నీళ్ళతో కాళ్ళు కడుక్కుని తడి చేతులతో భర్త కాళ్ళు, చేతులూ, ముఖం తుడిచింది. అప్పటికే కౌశికుడు ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. అతని చెంత ఆమె పద్మాసనం వేసుకొని కూర్చుని బిగించిన పిడికిలిలా కూర్చుంది. ఉపదేశం పొందిన మంత్రాన్ని ప్రాణాయామ పూర్వకంగా అనుసంధానం చేసింది.

సూర్యరథం తూర్పు కొండకు అవతలి భాగంలో ఆగిపోయింది. సారథి అనూరుడు కొరడా ఝుళిపించాడు. గుర్రాలు కదలలేదు. తోకనిక్కించి చెవులు రిక్కించి దిక్కులు పిక్కటిల్లేలాగా గుర్రాలు సకిలించాయి. సకల శక్తులూ కూడగట్టుకొని ఏడు గుర్రాలు ఒక్కసారిగా ప్రయత్నించాయి. అడుగు కదప లేకపోయాయి. నోటి నుండి నురగలు క్రక్కుకున్నాయి. సూర్యుడు (ధావయధావయ) తోలు తోలు అన్నాడు. సారధి అనూరుడు (లంఘయన్తు లంఘయన్తు) లఘించండి లఘించండి అన్నాడు. గుర్రాలు కదలలేదు. రథం మెదలలేదు. బల్లకు అతికించిన బొమ్మల్లా కొండ ఏటవాలులో సూర్యరథం స్తంభించిపోయింది. ఈ వైపరీత్యం ఏమిటో అనూరుడికి అంతుపట్టలేదు.

మందేహాదిరాక్షసులు సూర్యరథాన్ని చుట్టుముట్టారు. భీకర రూపములతో భయంకరంగా గర్జిస్తూ రథాన్ని పట్టుకోవటానికి సిద్ధంగా వున్నారు. సూర్యభగవానుడు దివ్యదృష్టితో చూచాడు విషయం అర్థం అయ్యింది. సారధి అయిన అనూరునితో అనూరా ఇది పతివ్రతామహత్మ్యం. సుమతి కరుణిస్తే తప్ప మన రథం కదలదు గుర్రాలను విప్పి నీవు కూడా విశ్రాంతి తీసుకో. ఇది మనకు అయాచితంగా దొరికన అవకాశం. విశ్రమించు. మన రథం కదలాలి భూలోకంలో ఉషోదయమవ్వాలి. నైష్టికులు అర్ఘ్యాలు వదలాలి. అప్పటి వరకు ఈ మందేహాది రక్కసుల అలజడితప్పదు. చూస్తూ వుందాం. ఏమి జరుగనున్నదో అన్నాడు. అనూరుడు చిరునవ్వులు చిందించాడు.

భూలోకంలో ప్రాణికోటి మేల్కొంది. ఇంకాసేపట్లో చీకట్లు తొలగుతాయని ఎదురు చూస్తూవుంది. సరోవరాలలో స్నానాలుచేసి నిలబడిన నైష్టికుల చేతుల నుండి అర్ఘ్యజలాలు జారిపోయాయి. ఎంతకూ అరుణోదయం కాకపోవడంతోఇదేదో ప్రళయం అనుకొని గట్లమీదకు చేరుకున్నారు. చెట్ల మీద పిట్టల కువకువలు వినిపిస్తున్నాయే తప్ప ఏ పిట్టా గూడువదలి బయటికి రాలేదు. పువ్వులు రేకులు విప్పడం లేదు. పద్మాలలో తుమ్మెదలు గుంజుకుంటున్నాయి. పశువుల అంబా, అంబా అంటూ అరుస్తున్నాయి. లేగ దూడల ఆకలి అరుపులకు అవి మరింత గుంజుకుంటున్నాయి. కోడి కూసి జాము అయినా ఇంకా వెలుగు రేఖలు రాలేదేమా అని రైతులు విస్తుపోతున్నారు. పొలాలకు చేరే వారు దారిలో గుంపులు గుంపులుగా గుమికూడి చర్చించుకుంటున్నారు. ముంగిళ్ళలో కళ్ళాపు జల్లిన ఇల్లాండ్రు ముగ్గు బుట్టలతో నిలబడి ఇంకా తెల్లవారలేదేమి అని పలకరించుకుంటున్నారు. గంటలు గడుస్తున్న కొద్దీ అందరిలో కలవరం పెరుగుతోంది. ఇంతలోకి ఎవరో గాలిలో పుకారు లేవదీశారు. ఇదేదో ప్రళయమట. ఇవాల్టితో ఇంక సరి అంట, అని వూరూరా రకరకాల పుకార్లు లేవదీశారు. భూగోళం అంతా హా హా కారాలు చెలరేగాయి. మానవులకన్నా దేవతలు మరింతగా కలవరపడ్డారు. సూర్యోదయం ఆగిపోతే కాలాన్ని కొలిచేదెలాగా? నిత్య నైమిత్తిక కర్మలు జరిగేదెలా? పాడి పంటలు అంతరించిపోతాయి. యజ్ఞయాగాదులు నిలచిపోతాయి. ప్రజలకే కాదు మనకూ నైవేద్యములు అర్పించే వారు వుండదు. ఇంతకీ ఈ విపరీతానికి కారణం ఏమిటి? అని దేవతలందరూ దేవ గురువైన బృహస్పతిని శరణు శరణు అన్నారు. ఆయన దివ్యదృష్టిసారించి కారణం చెప్పాడు. అయితే సుమతిని ప్రసన్నురాలిగా చేసుకోవడం ఎలాగ? మాండవ్య శాపాన్ని మళ్ళించడం ఎలాగ? ఏమీ పాలుపోలేదు. బ్రహ్మ దగ్గరికి పరుగులు తీసివెళ్ళారు. అప్పుడు బ్రహ్మ ఆలోచించి వారితో ఇది ఒక పతివ్రత చేసిన ప్రతిజ్ఞ. తన భర్త ప్రాణాలు కాపాడుకొనేందుకు సూర్యోదయాన్ని నిషేదించింది. ఆమె పాతివ్రత్యం ముందు మన శక్తి యుక్తులు సరిపోవు. మరొక పతివ్రత ఎవరైనా పూనుకోవాలి. అత్రి మహర్షి భార్య అనసూయాదేవి మహా పతివ్రతామతల్లి. కరుణామయి. అందరూ వెళ్ళి శరణు వేడండి లోకహితం కోరి ఉపకారం చెయ్యమని అర్థించండి. సుమతికి వచ్చిన ఆపదను తీర్చి ప్రతిజ్ఞను మళ్ళించగల సమర్ధురాలు. ప్రయత్నించండి అన్నాడు బ్రహ్మ.

దేవతలందరూ హుటాహుటిన అత్రిమహర్షి ఆశ్రమం చేరుకున్నారు. అనసూయాదేవి పాదములకు సాష్టాంగ నమస్కారములు చేశారు. లోకానికి వచ్చిన ఉపద్రవాన్ని తొలగించమని వేడుకున్నారు. అంతా విని ఆ తల్లి గంభీరవదనంతో నిశ్శబ్దంగా తలవూపి తమ పర్ణశాలలోనికి వెళ్ళిపోయింది. ఇంద్రాది దేవతలు అవాక్కయ్యారు. ఆశ్రమంలో అల్లంత దూరాన ఒక గున్న మామిడి చెట్టుక్రింద జపం చేసుకుంటున్న అత్రిమహర్షిని చేరుకున్నారు. మీరే కాపాడాలని ప్రాధేయపడ్డారు. సూర్యోదయం కాకపోతే జరిగే ప్రమాదాలన్నీ ఆయకు ఏకరువుపెట్టారు. బ్రహ్మ దేవుని ఆజ్ఞతోనే ఇలా వచ్చామని విన్నవించారు. అనసూయమ్మ అంతా విని లోపలకి వెళ్ళిపోయింది. మాకు భయంగావుంది. రక్షించు మహర్షీ అంటూ దేవతలంతా మూకుమ్మడిగా కాళ్ళమీద పడ్డారు. అత్రి ముని చిన్నగా నవ్వి అనసూయాదేవిని పిలిచాడు. లోకోపకారం కొరకు దేవతలంతా ప్రాధేయపడుతున్నారు. ఒక్కసారి వెళ్ళి సుమతితో మాట్లాడమని అన్నాడు. ఆ అనుమతికోసమే ఎదురు చూస్తున్నట్లుగా సరే అంది. పతి పాదాలకు నమస్కరించి ఆకాశమార్గాన దేవతలంతా వెంటరాగా బయలు దేరింది సుమతి ఇంటికి. సుమతి ఇంటి ముందు నిలిచి ఇంటి ముంగిట పంచలో ధ్యాన నిష్ఠలో నిమగ్నమైవున్న దంపతులను చూసింది. దేవతలందర్ని దూరంగా వుండమని తానొక్కతె శబ్దం చేయకుండా వెళ్ళి సుమతి ముందు కూర్చుంది.

మంచం మీద కుష్టురోగ పీడితుడైన కౌశికుడు ధ్యాన సమాధినిష్ఠలో వున్నాడు. పాదముల చెంత పద్మాసనంలో సుమతి. సుమతి తల మీద చేయివేసి ప్రేమగా నిమిరింది అనసూయమ్మ. ఉపాశ్యదేవత ముగ్గురమ్మల మూలపుటమ్మ అనుగ్రహించి సహస్రార కమలంలో కరుణారస వృష్టి కురిపించిన అనుభూతి కలిగింది సుమతికి. ధ్యాన సమాధి నుండి బయటపడాలంటే ఇంతకు ముందు ఎంతో కష్టపడవలసివచ్చేది. ఇప్పుడేమో సడలింపు తానంత తానుగా కలిగింది. కన్నులు విప్పారాయి. ముంగిట అమోఘతేజస్సు. ఏమిటి పొరపాటున సూర్యోదయం కాలేదు కదా! క్షణకాలం సుమతిలో చైతన్యం నిలిచిపోయింది. కాదు ఇది సూర్యకాంతి కాదు అలాగని చంద్ర తాపము కాదు. కన్నులకు కనిపించని కాంతి. ఆధ్యాత్మిక సాధనలో అనుభవం ఉన్న వారికి మాత్రమే తెలిసేది. పాతివ్రత్యం అనుగ్రహించిన వెలుగు, సుమతి పోల్చుకుంది. మరోసారి మృదువుగా తలనిమిరింది అనసూయాదేవి. సుమతి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అప్రయత్నంగా చేతులు జోడించి నమస్కరిస్తూ అమ్మ ఒడిలో వాలి అమ్మా అంటూ బావురుమంది. అనసూయ గంభీరవదనంతో చిరునవ్వుతో తలపంకిస్తూ సుమతి తల నిమురుతూనే వుంది.

పిచ్చితల్లీ ఎందుకింత భయం! మేమంతాలేమా! ఈ సృష్టిలో నీవొక్కతివే ఒంటరి దానవి అని అనుకుంటున్నావా? లే, లేచి ముఖం తుడుచుకో, ఇదిగో చూడు ఎవరెవరు వచ్చారో అంది.

అమ్మా! బాబయ్యగారు కూడా వచ్చారా? అత్రి ముని వచ్చాడేమో అతిధి మర్యాదలు చెయ్యాలిగదా అనుకొని తలపై కెత్తి చూసింది సుమతి. ఇంటి ముంగిట వైపు చూసింది. బృహస్పతి, దేవేంద్రుడు,అష్టదిక్పాలకులు, సకల ఋషులు, అఖిల దేవతలు తమ తమ దివ్య తేజోమయ రూపాలతో కనిపించారు. అందరూ వినయంగా చేతులు కట్టుకొని నిలిచి వున్నారు. అందరి చూపుల్లో కాపాడుతల్లీ అన్న ప్రాధేయభావం కన్పిస్తూ ఉంది. ఆశ్చర్యపడుతూ అనసూయమ్మ వంక చూసింది సుమతి.

అమ్మా సుమతీ ! అంతా దైవలీల. అతిధి మర్యాదల కొరకు ప్రయత్నించకు. నీ పాతివ్రత్య ప్రభావానికి మెచ్చి

అందరూ నీ ఎదుట నిలచారు. నీ అనుగ్రహం కొరకు అందరూ ఎదురు చూస్తున్నారు. ప్రతిజ్ఞ సడలించు. సూర్య రథాన్ని అనుమతించు. కారు చీకటిలో మునిగిపోయి సృష్టి అంతా వెలుగు కొరకు పరితపిస్తోంది అన్నది అనసూయమాత.

అపుడు సుమతి అమ్మా మరి మాండవ్యశాపం అని అర్థోక్తిలో ఆగిపోయింది. సుమతీ! ఏమీ ఫరవాలేదు. నేను ఉన్నానుగా మాండవ్యశాపము చెల్లుతుంది. నీ మాంగల్యమూ నిలుస్తుంది. పిచ్చితల్లీ మట్టి బొమ్మలు చేసి ఆడుకునేవాడు ఒక బొమ్మకు వంకరవస్తే ఏం చేస్తాడు. ఆ బొమ్మను ముద్దచేసి మళ్ళీ అచ్చులోఒత్తుతాడు. అవునా అదే జరుగబోతుంది. నీ భర్త రోగ విముక్తుడై రూప యౌవనములతో పునరుజ్జీవితుడు కాబోతున్నాడు. అది నేను చేస్తాను అన్నది అనసూయమ్మ.

అమ్మాయి సుమతీ! అన్నీ నీ మంచికే దైవలీలలు చిత్రాతి చిత్రంగా వుంటాయి. ఒక్క విషయం ఆలోచించు. ఏనాడూలేనిది ఆరోగ్యం క్షీణించిన దశలో నీ పతికి కామవాంఛ కలగడం ఏమిటి? అదీ వేశ్యతో, అదీ నీ సహాయాన్నే అతను అర్థించడం. పోనీ మీరున్న వీదిలో ఏనాడైనా సాని పాపలు అడుగు పెట్టే సాహసం చేసారా? మరి సానిపాప ఎలా రాగలిగింది? వచ్చివచ్చి ఇలా మీ ఇంటి ముందే నిలబడాలా? నీ పతినే చూడాలా? అది చూసేసరికి ఇలా ఆయన మనస్సు కరిగిపోవాలా? పిచ్చి దానా ఇదంతా శ్రీమన్నారాయణుని వ్యూహం. శృంగార వాంఛలు రూపయౌవనముల పునరాగమమునకు సంకేతములు. అది సరే కొరతకు వ్రేలాడుతూ కన్పించిన మాండవ్యుడు మళ్ళీ కనిపించాడా? పదిగజాల దూరం మాత్రమే నడిచావు వెనక్కి మళ్ళావు అంతలోనే దారితప్పి పోవాలా ఆలోచించు. అడుగో మాండవ్యమహర్షి బృహస్పతి చాటున నిలబడి ఉపద్రవానికి తన శాపమే కారణము అనుకొని సిగ్గుపడుతున్నాడు. తానే కర్తని అనుకొంటున్నాడు పాపం. ఎంతటి జ్ఞానులకైనా ఈ భ్రమలు తొలగవు కదా!

నీ భర్తకు రోగానుభవకాలం అయిపోయింది. పూర్వ జన్మల పాపనిధులు కరిగిపోయాయి. ఇపుడు రోగ విముక్తుడు కావాలి. అందుకొరకు విధి పన్నిన వ్యూహం ఇది. ఇందులో ఆ సానిపిల్ల, ఈ మాండవ్యుడు పరికరాలు మాత్రమే. తల్లిగా నా మాట విశ్వసించు. నీ పాతివ్రత్యం లోకానికి వెల్లడి అయ్యింది నీకు పతి సేవా పరాయణత్వం లభించింది. ఇన్నాళ్ళూ రోగిష్టి భర్తతో నానా అవస్థలు పడ్డావు. ఇక నుండి నీ జీవితంలో అంతా పండు వెన్నెలే. లే! లేచి సూర్య రథానికి అనుమతి ప్రసాదించు. నా తపస్సు ధారపోసి అయినా నీ మాంగల్యాన్ని నిలబెడతాను. ధ్యాన నిష్టలో వున్న నీ భర్త నిద్ర నుండి మేల్కొన్నట్లుగా సంపూర్ణ ఆయురారోగ్యాలతో దివ్య తేజస్సుతో సుందర రూపంతో లేచి కూర్చుంటాడు అన్నది అనసూయాసాధ్వి.

సుమతి సరేనని ఊపిరి బిగించి కళ్ళు మూసుకొని సూర్యుణ్ణి ధ్యానించింది. సూర్యగమనంపై విధించిన ఆంక్ష సడలించింది. సూర్య రథం కదిలింది. తూర్పు దిక్కున వెలుగు రేఖలు మెల్లమెల్లగా విచ్చుకుంటున్నాయి. సృష్టి అంతా క్రమక్రమంగా చైతన్యం పుంజకుంది. ధ్యాన సమాధిలో కూర్చున్న కౌశికుడు మంచం మీదికి ఒరిగిపోయాడు. అనసూయాదేవి లేచి నిల్చుంది. దేవతల వైపుకి చూసింది. దేవతలంతా మాండవ్యముని వైపు చూసారు. ఆయన తలపంకించాడు. యమధర్మరాజు రెండడుగులు ముందుకు వేసి తన అభయ హస్తం చూపించాడు. అనసూయాదేవి కౌశికుడి శరీరాన్ని రెండు చేతులతో ఆపాదమస్తకమూ స్పృశించింది. అప్పుడు అనసూయమ్మ గంభీరవదనంతో ఇలా అంది. రూప, శీల, వాక్కు, అలంకారములతో నేను పరపురుషుడ్ని భర్తృసమానుడుగా చూడని దానినే అయితే ఈ

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

బ్రాహ్మణుడు ఆరోగ్యవంతుడై పునర్జీవించుగాక! త్రికరణ శుద్ధిగా నిత్యమూ భర్తను ఆరాధించిన దాననే అయితే ఈ ద్విజుడు సంపూర్ణ ఆయురారోగ్యములతో పునర్జీవించుగాక!

కౌశికుడు కళ్ళు తెరిచాడు. ఎదురుగా అనసూయమ్మ కనిపించింది. అమ్మా అంటూ ముకుళిత హస్తములతో లేచి నిల్చున్నాడు. కళ్ళు మూసుకొని కూర్చునివున్న సుమతికి భర్తగొంతు వినిపించింది. రోగగ్రస్తుడు కాని రోజుల్లో భర్త కంఠలో వినిపించిన ధ్వని. కళ్ళు తెరిచింది. నవ యౌవనంతో సుందర రూపంతో కౌశికుడు కనువిందు చేసాడు. సుమతీ అన్నాడు. తనను తాను ఆపాదమస్తకమూ పరిశీలించుకున్నాడు. పతిసేవలో అలసిసొలసి పోయిన ఆమె శరీరం కూడా కొత్తకాంతితో నిండు యౌవనంతో వెలిగిపోతూవుంది. ఆమె శరీరం మీద ఆభరణములు అన్నీ తళుక్కుతళుక్కుమని మెరుస్తూ ప్రత్యక్షమయ్యాయి.

సుమతి ఒక నవ వధువులా మారిపోయింది. అనసూయమ్మ తనవైపే చిరునవ్వులు చిందిస్తూ చిద్విలాసంగా తనవైపే చూస్తూవుంది. సుమతికి ఒక్కసారిగా సిగ్గు ముంచుకొచ్చింది. వీధివాకిలివైపు చూసింది. దేవతలు మాయమ్మైనారు. ఇంటిలోపలికి చూసింది. కొత్త కాంతులతో, రంగవల్లికలతో, పచ్చని తోరణముతో, కళకళలాడుతూవుంది. పాత్ర సామాగ్రి తళతళమని మెరిసిపోతున్నాయి. సుమతీ కౌశికుల ఆనందానికి అవధులు లేవు. తల్లీ, అమ్మా అంటూ అనసూయాదేవికి పాదాభివందనం చేసుకున్నారు సుమతీ కౌశికుల దంపతులు. అర్ఘ్యపాదాలతో పూజించారు. అతిధిమర్యాదలు జరిపారు. అనసూయాసాధ్వి వారిద్దరిని సకల సంపదలతో పుత్రాపౌత్రాభివృద్ధిగా వుండమని ఆశీర్వదించి తిరుగు ప్రయాణానికి సిద్ధం అయ్యింది. ఇంక వెళ్ళొస్తాను సంధ్యకు వేళవుతున్నది. అక్కడ అత్రి మహర్షి ఎదురు చూస్తుంటారు అని చెప్పి బయలుదేరింది. ఇంతలో అక్కడ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రత్యక్షమైనారు. మాతా! మహాసాధ్వి! ముల్లోకాలను రక్షించావు నీ తపశ్శక్తి ధారపోశావు దీనికి ప్రత్యుపకారంగా నీకు వరం ఇవ్వాలని వచ్చాము కోరుకో అన్నారు.

అప్పుడు అనసూయాదేవి ఇలా అంది. త్రిమూర్తులారా! మీరు దర్శనం అనుగ్రహించారు. ఇంతకన్నా ఏమి కావాలి అయినా వరం కోరుకోమన్నప్పుడు కోరాలి కనుక అడుగుతున్నాను. అత్రి మహర్షి అంతరంగం ఎరిగి అడుగుతున్నాను. మీరెలాగూ నన్ను తల్లీ అనిపిలిచారు కనుక ఆ పిలుపు సత్యమయ్యేట్లుగా వరం అనుగ్రహించండి. మీరు ముగ్గురూ నాకు బిడ్డలు అవ్వండి అని వరంకోరుకుంది.

త్రిమూర్తులు తథాస్తు! అని అంతర్ధానం చెందారు. అనసూయాదేవి ముఖంలో కొత్త ఆనందం పరవళ్ళు త్రొక్కింది. అమ్మాయీ, సుమతీ, మీ వల్ల నాకు మేలు జరిగింది. సాక్షాత్తూ త్రిమూర్తులే నాకు పుత్రులు కాబోతున్నారు. ఈ శుభవార్తను అత్రి మహర్షికి తెలియజెయ్యాలి. ఇంక వస్తాను సెలవు అంటూ వెళ్ళిపోయింది.

అనసూయాదేవి రాక కొరకు చిగురించిన గున్నమామిడి చెట్టు క్రింద అరుగు మీద కూర్చొని ఎదురుచూస్తూవున్నాడు అత్రి ముని. సంధ్య ఉపాశించి కూర్చున్నాడు. ఉదయకిరణాలు సోకినప్పుడే అనుకున్నాడు. అనసూయమ్మ విజయం సాధించిందని. కౌశికుని మాట ఏమిటా అని ఆలోచిస్తూవున్నాడు. అదే సమయానికి అనసూయాదేవి ఆకాశమార్గమున తిరిగివచ్చి అత్రి మునికి నమస్కరించింది. పాదాభివందనం చేసింది. మహర్షి ఆమెను లేవనెత్తాడు. నీ ముఖంలో వెలుగు చూస్తుంటే తెలుస్తోంది, సుమతి మాంగల్యం నిలబెట్టావని. ముల్లోకాలకు కలిగిన

ముప్పును తప్పించావు. బహుశా అందరూ నిన్ను పతివ్రతా శిరోమణివని పొగడి వుంటారు. అందుకే ఈ ఆనందం అంతా. అవునా? అంటూ ప్రేమగా పలకరించి దగ్గర కూర్చోబెట్టుకున్నాడు అత్రి మహర్షి.

ఇదొక్కటే కాదు నా ఆనందమునకు కారణం ఇంకోటి వుంది అన్నది అమ్మ. అలాగా ఏమిటో చెప్తే మేమూ విని ఆనందిస్తాం అన్నాడు అత్రి మహాముని. అనసూయామాత త్రిమూర్తులు యిచ్చిన వరం సంగతి చెప్పింది.

నాయనా దీపకా వింటున్నావా అని వేద ధర్ముడు హెచ్చరించాడు. దీపకుడు ఆనందంతో తలవూపాడు. సుమతి తన తండ్రికి చెప్పిన కథ యిది. అనసూయ అత్రి మహర్షులు పుత్రవాంఛతో మదనాగ్నిని ప్రజ్వలింప చేసుకున్నారు. హోమగుండంలో పడబోతున్న హవిస్సును వాయుదేవుడు చెదరగొట్టాడు. ఒక అంశం వచ్చి మహర్షి కుడి కంటిలో పడింది. తక్కిన రెండు భాగాలు క్షణకాలం వ్యవధిలో అనసూయాదేవి గర్భకోశాన ప్రవేశించాయి. అత్రిముని కంటిలోపడిన భాగాన్ని ఆశ్రయించి బ్రహ్మచంద్రుడుగా ఉదయించాడు. అనసూయాసాధ్వి గర్భంలోకి ప్రవేశించిన ద్వితీయాంశను ఆశ్రయించి పురుషోత్తముడు దత్తాత్రేయుడిగా ఆవిర్భవించాడు. తృతీయాంశం రూపాన్ని ధరిస్తూఉండగా హైహయుడు అనే రాజు అడ్డగించాడు. ఇది గ్రహించిన రుద్రుడూ ఆ భాగాన్ని ఆశ్రయించి ఏడు రోజులు గర్భవాసం చేసి తమోగుణ ప్రధానుడై దూర్వాసుడుగా జన్మించాడు.

బ్రహ్మాంశ సంభవుడయిన చంద్రుడు రజోగుణ ప్రధానుడై లోకాలకు వెన్నెలను ప్రసాదిస్తున్నాడు. ప్రజాపతి పదవిని పొందాడు. కళలకు, ఔషధాలకు పోషకుడయ్యాడు. శివాంశ సంభవుడయిన దూర్వాసుడు రౌద్రగుణ ప్రధానుడై శాపాయుధుడై ఉన్మత్త వ్రత దీక్షతో వెలుగొందుతున్నాడు. కేశవాంశ సంభవుడయిన దత్తుడు యోగవిద్యా పారంగతుడై సత్వగుణ ప్రధానుడై తపోదీక్షతో తరచూ ఏకాంత వాసాలతో కాలం గడుపుతూ ఉన్నాడు. ముని పుత్రులు చాలామంది ఆయనకు శిష్యులు అనుచరులు అయ్యారు. అందువల్ల ఆయన ఏకాంతానికి నిష్ఠకు భంగం కల్గుతోంది. వారిని పరీక్షించాలని కూడా దత్తుడు భావించి వెళ్ళి వెళ్ళి ఒక సరస్సులో మునిగిపోయాడు. ఎంతకాలానికి సరస్సు నుంచి బయటకు రాలేదు. అయినా శిష్యవర్గం విడిచిపెట్టలేదు. గట్టున నిలబడి నిరీక్షిస్తున్నారు. ఇదిగో వస్తాడు, అదిగో వస్తాడు అని ఎదురు చూస్తూ ఉండగానే నూరు సంవత్సరాలు గడిచి పోయాయి. అప్పుడు లేచివచ్చాడు. అఖండ తేజోమూర్తి సూర్యకాంతిలాంటి తేజస్సుతో, చంద్రబింబంలా సరస్సునుండి బయటకు వచ్చాడు. శిష్యులంతా కరతాళధ్వనులతో జయజయ నాదాలతో జయగురుదత్తా! శ్రీ గురుదత్తా! అంటూ ఆనంద తాండవం చేసారు. కొందరైతే బుంగమూతులు పెట్టి గోముగా నిష్ఠురాలు పలికారు. అందరినీ సముదాయించి దత్తాత్రేయుడు చిరునవ్వులు పంచి పెడుతూ ఆశ్రమం వైపు నడక సాగించారు. శిష్యులంతా కోలాహలంగా ఆయన్ను అనుసరించారు.

దత్తగురు, ఇంకెప్పుడు మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళకు. మమ్మల్ని ఏకాకుల్ని చేయకు. నిన్ను చూడకుండా క్షణం కూడా ఉండలేము. నీ విరహాన్ని మేము భరించలేము అన్నారు. శిష్యులు మిత్రులు ఇలా అడుగుతూ ఉంటే దత్తుడు చిరునవ్వులు చిందిస్తూ వారితో కొంతకాలం గడిపేడు. వారితో బంధం యోగసాధనకు ఆటంకమవుతోంది. అదీగాక వీళ్ళందరూ నిజంగా తన పట్ల గురుభావంతోనే ఉన్నారా? ఉంటే దాని లోతు ఎంత? వీరు ఎరిగిన విలువలకు భిన్నంగా నేను ప్రవర్తిస్తే ఎంతమంది సహిస్తారు. ఎంతమంది అసహ్యిస్తారు, పరీక్షిద్దామను కున్నాడు.

మరొక రోజు సాయంకాలం సరోవరంలో స్నానానికి దిగాడు, శిష్యగణం, మిత్రగణం కూడా వెంట ఉన్నారు.

ఉన్నట్టుండి దత్తుడు మాయమయ్యాడు. శిష్యులు హాహాకారాలు చేసారు. ఇంతలో ఎవరో శిష్యులలో ఒకడు ఇది మనకు మరో పరీక్ష. కంగారుపడకండి అన్నాడు. అనుకున్నట్టే దత్తస్వామి సరోవర మధ్యభాగంలో ప్రత్యక్షమయ్యాడు. దివ్యాంబరాలు ధరించి, దివ్యమయిన భూషణములతో దత్తుడు ధగధగ లాడుతున్నాడు. చేతిలో మధుపాత్ర ఆరారగా మద్యం సేవిస్తున్నారు. ఎరుపెక్కిన కన్నులు తడబడుతున్న పలుకులు. ఒక అందాలరాశి బంగారు పాత్రతో మద్యం తెచ్చి పాత్రలోనింపింది. దత్తస్వామి ఆమె కొంగు పట్టుకొని లాగాడు. ఆమె వయ్యారంగా నాట్యభంగిమలో వచ్చి స్వామి వారి ఒడిలో వాలింది. ముద్దులు, మురిపాలు ఆలింగనాలు ఈ వ్యవహారాలన్నీ జరుగుతున్నాయి. మధ్యమధ్యలో యిద్దరు ఒకే పాత్రలోని మద్యము సేవిస్తున్నారు. ఒకరు మీద ఒకరు నీళ్ళు చల్లుకుంటున్నారు. కూనిరాగాలు తీస్తున్నారు. గిలిగింతలు పెట్టుకుంటున్నారు. విరగబడి నవ్వుకుంటున్నారు. ఒకరి మీద ఒకరు వాలిపోతున్నారు. బుగ్గలు కొరుక్కుంటున్నారు. నెట్టుకుంటున్నారు. అంతలోకే మళ్ళీ దగ్గరకు లాక్కొంటున్నారు.

గట్టుపై నిలబడి వింతగా చూస్తున్న శిష్యులు, మిత్రులు గుసగుసలు ఆడుకుంటున్నారు. ఏమిటీ దారుణమని ముక్కున వేలేసుకుంటున్నారు. ఇతడ్నా మనం గురువుగా నమ్మింది. ఇతడా మనకు మోక్షం ప్రసాదించేది? యోగ సాధనంటే యిదేనా? మద్యపానము, మదవతీగానమూనా? అయ్యోయ్యో ఎంత పొరపాటు చేసాం, ఎన్ని వందల సంవత్సరాలు వ్యర్థం చేసుకున్నాం. అందరి మనస్సులో యిదే ఆలోచన బయలుదేరింది. పదండి పదండి అనుకున్నారు అందరు. సరస్సువైపు తిరిగి చీత్కారాలు చేస్తూ కొందరు, మెటికలు విరుస్తూ కొందరు, ముక్కున వేలుంచుకుంటూ కొందరు, మొత్తం మీద అందరూ ఈ ఆశ్రమం పరిసర ప్రాంతాలలోనే మనం ఉండకూడదు, దూరంగా పోదాం పదండి అనుకుంటూ వెళ్ళిపోయారు. దత్తాత్రేయుడు హమ్మయ్య అనుకున్నారు. మాయామదవతిని, మధుపాత్రను ఉపసంహరించాడు. నీళ్ళ మీద నడుచుకుంటూ వచ్చి గట్టుకు చేరుకున్నాడు. ఆశ్రమంలోకి ప్రవేశించి యోగనిష్ఠలో కూర్చున్నాడు.

తండ్రీ! విన్నావు కదా, నీ మనస్సులో చాలా సందేహాలు తలెత్తాయని నాకు తెలుసు. **మహాయోగికి సాధ్యాసాధ్యములు లేవు. అతడు సాధారణ నియమాలన్నిటికీ అతీతుడు. తన యోగసిద్ధికోసం అన్నింటినీ వదులు కుంటాడు, ఏదైనా చేస్తాడు. సృష్టి అంతా అతనికి ఒక ఆటబొమ్మ. ఒక్కొక్క బొమ్మతో కాసేపు ఆడుకుంటాడు. మరుక్షణంలో దానినే నిర్దాక్షిణ్యంగా కాలదన్నుతాడు. ఆయన దేనికీ లోనుకాడు. తండ్రీ! దేనిని ఆశించినా వాయువుకి అంటులేనట్లే, మహాయోగులకు కూడా ఏ దోషాలు అంటవు. వారేది చేసినా అది ఒక క్రీడ మాత్రమే. ఈ రహస్యం తెలియాలంటే యోగసాధనలో ఒకమెట్టైనా ఎక్కాలి. లేకపోతే ఆ శిష్య బృందాలవలె, అపార్థాలతో అసహ్యంతో పారిపోవలసివస్తుంది. తెలుసుకోగలిగిన వారు గురుకటాక్షానికి పాత్రులై ముక్తిపొందుతారు. అలా పొందిన వారు చాలా మంది ఉన్నారు. అందులో కార్త వీర్యార్జునుడు ఒకడు.** తండ్రీ, దత్తయోగీంద్రుడని తలచుకుంటే చాలు సకల పాపాలు పటాపంచలవుతాయి. ముక్తి కాంత స్వయంగా మన ఎదురు నిలుస్తుంది.

తన కుమారుడు యింతగా చెప్తుంటే తండ్రికి నమ్మిక నెమ్మది నెమ్మదిగా కుదురుతోంది. నాయనా! సుమతీ! అంతో ఇంతో అనుభవం ఉండి సాత్విక మార్గంలో తపస్సు చేసుకొనే మునికుమారులే దత్తుడి లీలలు అర్థం చేసుకోలేక దూరమయ్యారంటే యిక నేనెంత. నా తెలివెంత? దత్తుని లీలలు అత్యద్భుతంగా ఉన్నాయి. యింకా యింకా

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

వినాలనిపిస్తున్నది. సుమతీ! త్రిమూర్తిస్వరూపుడైన దత్తుని కనిన అనసూయాత్రిదంపతులుఎంత పుణ్యాత్ముల్లో వారి తపోమహిమ ఎంతగొప్పదో కదా అని అడిగాడు.

అప్పుడు సుమతి ఇలా చెప్తున్నాడు. తండ్రీ! అత్రి మహర్షి ఋగ్వేదంలోని శాకల శాఖా పంచమ మండలాన్ని తన తపో మహిమతో దర్శించగలిగాడు. ఆ వేద భాగంలో అగ్నిలింగస్తుతి, అమరేంద్ర ప్రస్తావన మొదలైన అంశాలు ఉండటంవల్ల అది ఐహికాముష్మికాలు రెండింటిని నిరుపద్రవంగా సాధించగల సామర్ధ్యం కలది.

ఒకసారి కృత యుగంలో రోగాలు పెచ్చుపెరిగి ప్రాణిలోకానికి హాని అవుతుంటే అత్రి మహానుభావుడే ఆయుర్వేదమనే ఉపదేశాన్ని సందర్శించి ప్రాణికోటికి అందించాడు. మరొక్కప్పుడు మనువు చేత బోధింపబడిన ధర్మశాస్త్రం దురవగాహంగా వుందని ప్రజలంతా చింతిస్తూ వుంటే, తేట తేట మాటలతో తానే స్వయంగా ఒక ధర్మశాస్త్ర స్మృతిని ప్రవేశపెట్టాడు.

మరొకప్పుడు దేవదానవ యుద్ధంలో సూర్యచంద్రులు శత్రువులకు బందీలైన కారణంగా లోకం అంధకారమయం కాగా దేవతల ప్రార్ధనల వల్ల ఆ మహానుభావుడే తానే సూర్యుడు చంద్రుడు అయ్యి లోకాలకు వెలుగు అందించాడు. అలా అత్రి మహర్షి లోక కళ్యాణ నిమిత్తమై చేసిన అద్భుత కృత్యాలు ఎన్నెన్నో. ఎన్నింటినని మనం చెప్పుకోగలం.

ఇక అనసూయా సాధ్వి గురించి చెప్పాలంటే అద్వితీయ పాతివ్రత్య రూప మహాద్భుత తపః పరమావధియైన అమ్మ చేసిన మహత్తర కృత్యాలకు సాటిలేదు.

ఒకప్పుడు ఎండలు విపరీతమయి గంగానది ఎండిపోతే అనసూయమ్మ మునిజనుల సౌకర్యార్థమై నదిని మరల పునరుజ్జీవింప చేసింది. మరొకప్పుడు మహాక్షామం సంభవించి నేలలో మొలకన్నది కూడా లేకుండా మాడిపోతూ వుంటె అనసూయా సాధ్వి అనేక వందల, వేల మంది మునిజనులకు తానే స్వయంగా వండి వడ్డించింది. వారందరికి కందమూల ఫలాలు ఇచ్చి పోషించింది.

ఇంకొకసారి పాపరతులైన జనుల స్పర్శవల్ల గంగాదేవి తన పవిత్రతను కోల్పోయి నల్లబడగా ఆ తల్లి తనకమండలంలోని జలాన్ని చల్లి గంగాదేవి కాలుష్యాన్నంతా క్షణంలో భస్మంచేసింది. ఇలాంటి మహాకార్యాలు చాలా చేసారు ఆ పుణ్యదంపతులు. అంతటి పుణ్యదంపతుల, తపోతేజోవంతుల గారాలబిడ్డడే మన దత్తుడు.

అంతే కాదు తండ్రీ! త్రిమూర్తులు వారిగర్భాన్నే జన్మించడానికి ఇంకా కారణాలు వున్నాయి. విను చెప్తాను.

ఒకనాడు నారదుడు త్రిలోకాల్లో తిరుగుతూ తిరుగుతూ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల నివాసాలకు వెళ్ళి అనసూయాసాధ్వి గొప్ప దనాన్ని పొగుడుతూ వున్నాడు.

ఏంచిత్రమోగాని ముల్లోకాలుఏలే ముగ్గురు అమ్మలకు సామాన్య మానవ మాత్రురాలను పొగుడుతూ వుంటే అసూయబయలు దేరిందట. దాంతో వారు ఆమెను పరాభవించాలనే ఉద్దేశ్యంతో ఇనుప గుండ్లను సృష్టించి అవి వండించమని నారదుని చేతికిచ్చి పంపారట. నారదుడు ఇనుపగుండ్లను తీసికొని ఋక్షాద్రిపై తపస్సు చేస్తున్న అత్రి అనసూయల ఆశ్రమానికి వచ్చి అత్రి అనసూయల మహాత్మ్యన్ని వేనోళ్ళ పొగిడి తన దగ్గరున్న శనగలు అమ్మచేతికిచ్చి అవి వండి పెట్టమని ప్రార్థించాడట. అవి మాత్రం ఇనుపగుళ్ళలా వున్నాయి. అనసూయామాత చేతి స్పర్శ వాటికి

తగలగానే వాటిలో కఠినత్వం పోయిందట. అమ్మ తన సంకల్పబలంతో వాటిని అవలీలగా మ్రగ్గించి నారదుని చేతికిచ్చిందట. క్రమంగా అవి కమ్మని సువాసనలు వెదజల్లాయట. నారదుడు పరమానంద భరితుడై శెలవుతీసికొని వెళ్ళిపోయాడు.

నారదుని ఎదుట తమకు జరిగిన పరాభవం భరింపరానిదై ముగ్గురమ్మలు పట్టుబట్టి ఈమారు స్వయంగా తమ భర్తల్నే పంపించారు. అమ్మ పాతివ్రత్య మహిమను తగ్గించమని కోరారు. త్రిమూర్తులు వృద్ధ బ్రాహ్మణుల రూపంలో అత్రి ముని ఆశ్రమం చేరుకొని భవతీ భిక్షాందేహి అని అడిగారు.

అప్పుడు అనసూయాదేవి వారిని జూచి అయ్యలారా అత్రిముని తపస్సుకై అరణ్యంలోకి వెళ్ళారు. వారు వచ్చేంతవరకూ కూర్చుని మా ఆతిధ్యాన్ని స్వీకరించమని కోరింది. అప్పుడు వారు అమ్మా మీ వారెప్పుడు వస్తారో తెలియదు. వారు వచ్చే వరకూ మేము ఉండలేము. ఆకలి మమ్మల్ని బాధిస్తున్నది. భోజనం పెట్టు అన్నారు. అనసూయాదేవి కుటీరంలోకి వెళ్ళి భోజనాలు త్వరత్వరగా సిద్ధంచేసి వారు కూర్చుని తినడానికి వీలుగా ఆసనాలుసిద్ధంచేసి వాళ్ళు కాళ్ళు కడుక్కోవడానికి నీరు ఇచ్చి భోజనానికి దయజేయమని వేడుకున్నది. అప్పుడు వారు అమ్మా మాకు ఆతిధ్యమిస్తానని మాట ఇచ్చావు కాని మాదొక నియమం ఉన్నది. నీవు కట్టుకున్న బట్టలను విడిచి నగ్నంగా మాకు వడ్డిస్తేనే మేము భోంచేస్తాము అన్నారు.

అప్పుడు అమ్మ ఆలోచించి ధర్మాధర్మాల మధ్య చేజిక్కించుకో జూచిన వీరు సామాన్యులుకారని తలచి అయ్యలారా అలాగే వడ్డిస్తాను దయజేయమని వేడుకున్నది.

అనసూయదేవి కుటీరము లోపలికి వెళ్ళి అత్రి మహర్షి పాదుకలకు నమస్కరించి స్వామీ గృహస్థుల ఇంటికి దేహి అని వచ్చిన వారికి చేతనయినది సమర్పించవలెనని నియమం. అట్లుగాక ఆ నియమాన్ని మీరితే ఆకలితో తిరిగివెళ్ళిపోయినవారు గృహస్థుల పుణ్యాన్ని తీసికొని పోతారు అన్నది శాస్త్ర వాక్యము. కనుక నేను వారు నా బిడ్డలనే భావంతో భోజనం వడ్డిస్తాను అని చెప్పుకొని నగ్నంగా భోజనం వడ్డించడానికి వెళ్ళేసరికి ఆ ముగ్గురూ పసిపిల్లలై కేరింతలు కొడుతూ వున్నారు. అప్పుడు అమ్మకు స్తన్యం వచ్చింది. బట్టలను ధరించి ముగ్గురు పసిబాలురను మూడు ఉయ్యాలలలో పడుకోబెట్టి జరిగిన కథనే జోలగాపాడుతూ వుంది అమ్మ. ప్రపంచాన్ని సృష్టిచేసి అలసినవాడిలా బ్రహ్మ జగత్తు పాలించి సోలిపోయిన వానిలా విష్ణువు హాయిగా ఉయ్యాలల్లో ఆదమరచి నిద్రపోతున్నారు. ఇంతలో అత్రి మహర్షి వచ్చి జరిగింది తెలుసుకొని వారిని స్తుతించాడు. అతని స్తోత్రములకు తృప్తి చెందిన త్రిమూర్తులు తమతమ నిజరూపాలతో దర్శనమిచ్చారు. అత్రిమహర్షి అనసూయాదేవితో "దేవీ వీరు నీ పాతివ్రత్యం పరీక్షించడానికి వచ్చారు. నీకు కావలసినవరం కోరుకో" అన్నాడు. అప్పుడు అనసూయాదేవి పాపుల్ని ఉద్ధరించడానికి లోకకళ్యాణ నిమిత్తం ధర్మాన్ని సంరక్షించటం కొరకు మీ ముగ్గురు పుత్రులుగా జన్మించాలని కోరిక అంది.

ఇంతలో అక్కడ ముగ్గురమ్మలు ప్రత్యక్షమై సిగ్గుతో తలలువంచుకున్నారు. అప్పుడు త్రిమూర్తులు, చూచారా అమ్మమహిమ అని తమతమ భార్యలతో అన్నారు. వారు మరింత సిగ్గుతో తలలు దించుకున్నారు. అపుడు త్రిమూర్తులు అమ్మతో " అమ్మా! మమ్ము మేము మీకు సంపూర్ణంగా దత్తత చేసుకుంటున్నాము అలనాడు సుమతీ కౌశికుల విషయంలో మీకు వరం ఇచ్చాం కదా అని దివ్యమైన అనుగ్రహాన్ని ప్రసాదించారు. అట్టి వరప్రభావం వల్లనే అనసూయ గర్భాన్ని ధరించి త్రిమూర్తులను తన బిడ్డలుగా చేసుకోగలిగింది అని సుమతి తన తండ్రితో త్రిమూర్తుల ఆవిర్భావానికి గల పుణ్యగాధను వినిపించాడు.

# దత్తుని వైరాగ్య స్థితి - యోగం

తండ్రీ దత్తుని యోగస్థితిని తెలియజెప్పుతాను విను అంటూ చెప్తున్నాడు సుమతి.

ముని కుమారులను పరీక్షించిన దత్తుడు ఆశ్రమం చేరుకున్నాడు. ఇన్నేళ్ళుగా ఎటుపోయాడో ఏమయ్యాడో అనుకున్న అనసూయమ్మ తన ముద్దు బిడ్డను చూచి ఆనందంతో పొంగిపోయింది.

దత్తస్వామి తల్లి పాదాలకు నమస్కరించి అమ్మా భక్త జనులను ఉద్ధరించడానికి నేను సహ్యాద్రి పర్వతానికి వెళ్తాను అనుమతి ఇవ్వు అన్నాడు.

ఎన్నాళ్ళకో ఇంటికొచ్చిన కొడుకుని చూస్తున్న ఆనందం నీరుకారిపోయింది. చిరకాలంగా అనంత తపోసంపన్నురాలయినప్పటికి పుత్రవ్యామోహం ఆమెను దుఃఖసాగరంలో ముంచెత్తింది. వెళ్ళడానికి వీలులేదని దత్తస్వామిని నిర్భంధించింది.

దత్తస్వామి సంకల్పం చాలా కఠినం తానుకూడా వెళ్ళక తప్పదన్నాడు. అనసూయ మాతకు దుఃఖం పట్టరానిదయింది దుఃఖంచేత మోహంచేత ఆమె తెలివి మేఘం కప్పిన ఆకాశంవలె నిండిపోయింది. దత్తయోగీంద్రుడు కూడా మొండిపట్టువదలలేదు.

చివరకు దుఃఖము కోపము ఆగక ఆ తల్లి ఇలా అంది దత్తా నువ్వు యోగివే అవ్వవచ్చు గురువువి అవ్వవచ్చు అయినా నాకు బిడ్డవని మర్చిపోకు. నీకీచర్మ దేహం ఇచ్చింది నేను, మర్చిపోకు. కనుక నువ్వు వెళ్ళదలచుకుంటే నేనిచ్చిన ఈ చర్మం నాకిచ్చి వెళ్లు అన్నది.

అది విని దత్తస్వామి చిరునవ్వులు చిందిస్తూ వున్నాడు. ఆ నవ్వు చూసి అనసూయమాత బిత్తరపోయింది. ఆమె తేరుకునేలోపునే దత్తుడు తన గోళ్ళతో చర్మాన్ని పరపరా చీల్చి అంగీ విప్పినట్లుగా విప్పి తల్లి చేతుల్లో పెట్టాడు. దత్తస్వామి అలా చర్మాన్ని వలుస్తూ వుంటే ఆ తల్లి మనసులోని అజ్ఞాన పొరలు వీడిపోతున్నట్లుగా అనిపించింది. చర్మావరణం లేకుండా రక్తమాంసమయమై దివ్యకాంతులు వెదజల్లుతున్న దత్తస్వామి వికృతరూపం చూసేసరికి ఆమె దృష్టి అంతర్ముఖమైంది. ఆ దృష్టికి అనిర్వచనీయమైన దివ్యజ్యోతి ఒకటి సాక్షాత్కరించింది. ఆ దివ్యజ్యోతి దర్శనంతో ఆమెకు అనన్యమైన, ఆనందమైన శాంతి, కాంతి లభించింది. దుఃఖ స్పర్శలేని ఆనందాన్ని దర్శించిన ఆ తల్లి ప్రశాంత వదనంతో మధురంగా బిడ్డవంక చూచి చేతుల్లో వున్న చర్మాన్ని అంగీ తొడుగుతున్నట్లుగా మరల తొడిగింది.

అమ్మ గంభీరస్వరంతో ఇలా అంది. గురుదత్తా నీవు జగత్తులను చీకటిలో నుండి వెలుగులోకి నడిపించడానికి అవతరించిన జగద్గురుడవు. నీకు అవధులులేవు. జన్మ వినాశనాలు లేవు. నాకీ సత్యాన్ని దర్శింపజేశావు. ఇంక నీ ఇచ్ఛాపరంగా సహ్యాద్రి పర్వతంపై కొలువుండి భక్తుల హృదయాలను ఏలుకో. విశ్వశ్య కళ్యాణమస్తు ! అన్నది.

దత్తుడు ఉల్లాసంగా అమ్మపాదములకు నమస్కరించి అనుజ్ఞ తీసికొని సహ్యాద్రి వైపు బయలుదేరాడు. అలా **దత్తుడు సహ్యాద్రిని రాజధానిగా చేసుకొని ముల్లోకాలలోని భక్తులను ఉద్ధరిస్తూ, సాధుజనులను రక్షిస్తూ, క్రూర రాక్షసులను సంహరిస్తూ, యోగ రాజ్యాన్ని ఏలుతున్నాడు. ఆయన ప్రవృత్తి లోకోత్తరంగా వుంటుంది. ఆయన లీలలు ఊహాతీతంగా వుంటాయి. ఒకప్పుడు ఆయన శాంతమనోహరమైన యతిరూపాన్ని ధరిస్తే మరొకప్పుడు భీభత్స భయంకర రూపాన్ని**

**పొందుతూ వుంటాడు. ఏ రూపంలో వున్నా పైకి ఎలా కన్పించినా ఆయన మాత్రం యోగ నిష్టుడే! ఆయన యోగానికి చ్యుతిలేదు. దానికి భంగంలేదు. ఆయన నామ స్మరణచాలు, మానవుల పాపాల్ని దహింపజేయడానికి. అశాంతిలో అల్లాడుతున్నవారు హృదయాన్ని నిర్మలం చేసుకోవాలంటే ఆయన కథల కన్నా ప్రశస్తమైన సాధనాలు లేవు. ఆయన కథలు, లీలలు అనంతములు. వాటిని వివరించి చెప్పాలంటే వేయితలల ఆదిశేషుడికైనా సాధ్యంకాదు.**

మానవశరీరంతో అవతరించిన దత్తస్వామి ఎంతోమంది మానవులను పరిపరి విధాలుగా ఉద్ధరించాడు. అంటూ సుమతి ముగించాడు. అప్పుడు సుమతి తండ్రి సుమతితో నాయనా రాజవంశంలో పుట్టి రజోగుణంతో జీవించే కార్తవీర్యార్జునుడు దత్తుడి అనుగ్రహానికి పాత్రుడయ్యాడు అంటే ఆశ్చర్యం వేస్తుంది. ఇది ఎలా సాధ్యమయ్యిందో తెలుసుకోవాలని వుంది. ఆ మహావీరుడి కథ చెప్పి, నా సంశయాలు తొలగించు అన్నాడు.

## కార్త వీర్యార్జున వృత్తాంతం

తండ్రీ తప్పకుండా చెబుతాను విను. హైహయవంశంలో కృతవీర్యుడు అనే రాజు వుండేవాడు. మాహిష్మతీపురమును రాజధానిగా చేసుకొని ధర్మబద్ధంగా ప్రజారంజకంగా పరిపాలన సాగిస్తూ వుండేవాడు. సర్వ సద్గుణ సంపన్నుడతడు. వేద విహితకర్మలు తాను ఆచరిస్తూ ప్రజలచేత ఆచరింపజేసేవాడు. ప్రజలకు ఎంత ప్రేమ పాత్రుడో శత్రువులకు అంత భయంకరుడు. ఇతడికి చాలాకాలం సంతానం లేదు. మహారాణి ఎన్నెన్నో నోములు నోచింది. వ్రతాలు చేసింది. తీర్థయాత్రలు చేసింది. కనిపించినదేవతకల్లా మ్రొక్కింది. ఏ దేవత కరుణించిందో గాని ఏ మహనీయుడి ఆశీస్సులు ఫలించాయోగాని, చివరకు ఆమె కడుపుపండి నవమాసాలు మోసిన పిదప మగబిడ్డడు చొట్ట చేతులతో జన్మించాడు. రాజదంపతులు దిగులు చెందారు ప్రజలంతా అయ్యోపాపం అనుకున్నారు. అసలు సంతానమే లేకపోతే ఒకబాధ. కానీ ఈ అవిటివాణ్ణి చూస్తూ రోజూ బాధే. వీడు పరిపాలనకు పనికిరాడే. నా తరువాత ఈ రాజ్య భారాన్ని ఎవరు మోస్తారు, అని కృతవీర్యుడు బెంగపెట్టుకున్నాడు. చూద్దాం రాజవైద్యుల కృషి ఫలితంగా కాని, ఏ మహనీయుడు దయవల్లనో అవిటితనం పోకపోతుందా అని తమని తాము నమ్మపలుకుకుంటూ కాలంగడిపారు ఆ రాజదంపతులు. సకాలంలో జాతకర్మాదిక్రియలన్నీ జరిపించి, భూరిదక్షిణలతో వేదశాస్త్రవిద్వాంసులను సంతృప్తిపరచి అర్జునుడు అని నామకరణం చేసారు. కృతవీర్యుని పుత్రుడు కనుక కార్తవీర్యార్జునుడు అయ్యాడు. చేతులు చచ్చుబడ్డాయి అన్నమాటే గాని అర్జునుడి శరీరం అంతా వజ్ర తుల్యంగా వుంది. తెలివితేటలు అపారం. గురువులు నేర్పుతున్న అన్ని విద్యలలోనూ ఆరితేరుతున్నాడు. క్రమ క్రమంగా యుక్తవయస్సు వచ్చింది. యువరాజుకు పట్టాభిషేకం చేయిద్దామని కృతవీర్యుడు ఉబలాటపడుతున్నాడు. పైకి అంటే ఎవరు ఏమి అంటారోనని గేలిచేస్తారేమోనని సంశయిస్తున్నాడు. తీరా సింహాసనంమీద కూర్చోబెడితే సరిగా పరిపాలన కొనసాగించలేకపోతే బిడ్డడికి ప్రజల ముందు తలవంపులు తెచ్చి పెట్టిన వాళ్ళమవుతామని దిగులుతో వున్నాడు. దీనికి పరిష్కారం ఎలాగ ? అని రేయింబవళ్ళు ఆలోచిస్తున్నాడు. దారి దొరకడం లేదు. చిరవకు ఆయుర్దాయమే తీరిందో లేదా ఆ దిగులే ప్రాణాలు హరించిందో గాని కృతవీర్యుడు హఠాత్తుగా దివంగతుడయ్యాడు.

అరాచకం ఏర్పడకూడదని మంత్రి పురోహితులు అందరూ ఒకనాడు కార్తవీర్యార్జునుణ్ణి సమీపించి పట్టాభిషేకమునకు అంగీకరించమన్నారు. అతడు మాత్రం అంగీకరించలేదు. అవిటివాణ్ణి, ప్రజారక్షణ చెయ్యలేను.

అది చెయ్యలేనపుడు పట్టాభిషేకం జరిపించుకో కూడదు. ప్రజలు పన్నులు కట్టేదిరాజు రక్షిస్తాడని దానికి సమర్థుడు కానివాడు సింహాసనమెక్కి ప్రజాధనాన్ని భోగాలకు ఖర్చుపెడితే వాడు చోరుడు క్రింద లెక్క. రౌరవాది నరకాలకు పోతాడు. పోనీ పరిపాలన రాజ్య సంరక్షణ బాధ్యతలు మీకందరికి అప్పగించి నేను నామ మాత్రపు రాజుగా కిరీటం పెట్టుకొని కూర్చుందామంటే అప్పుడు మీ చేతుల్లో కీలు బొమ్మను అవుతాను. ఇది గుర్తించిన ప్రజలు నన్ను అపహాస్యం చేస్తారు. ఇరుగు పొరుగు రాజులు నవ్వుతారు. అవమానిస్తారు. నేను స్వయంగా నా అంతటనేను చేసుకోలేని పరిపాలన పరుల మీద ఆధారబడిన ఏలుబడి ఎంత అందంగా ఉంటుందో మనందరకు తెలిసిందే. అపరాధుల్ని నిర్ధారించలేము. నిరపరాధుల్ని రక్షించలేము. న్యాయమే జరుగుతుందో అన్యాయమే జరుగుతుందో గుర్తించలేను. ఇంకొకరి ఇష్టాఇష్టాల ప్రకారంగా నిరపరాధుల్ని శిక్షింపజేయవచ్చు. అపరాధుల్ని విడిపించవచ్చు. నా పరిపాలన గ్రుడ్డి దర్బారుగా వుంటుంది. పాపఫలాలు మాత్రం మిగిలి నరకానికిపోతాను. నూరు కళ్ళతో పరిపాలన కొనసాగించిన తెలియక జరిగే అపచారాలు ఉంటాయి. కాబట్టి రాజ్యం నరకం ధ్రువమ్ అన్నారు. అలాంటి నేను మరొకరి చేతుల్లో కీలు బొమ్మనయితే ఈ పుట్టుకలోనే ఇక్కడే నరకం అనుభవించవలసివస్తుంది. ఏ జన్మలో ఎవరికి ఏ అపచారం తెలిసి చేసానో, తెలియక చేసానో ఈ అవిటితనం సంప్రాప్తించింది. ఇప్పుడిక తెలిసితెలిసి పాపం మూటగట్టుకోలేను. అందుచేత ఈ కిరీటాన్ని నేను మోయలేను.

ఏది ఏమైనా రాకుమారా! ఇది నీవు తప్పించుకోలేని బాధ్యత. మీ వంశాలకు, మా వంశానికీ అనుబంధం ఈనాటిది కాదు. మీ తాత ముత్తాతల కాలం నుంచీ మా తాతముత్తాతలు మంత్రులుగా ఉన్నవారే. ఏనాడూ ఎవరూ మీ వంశీకుల్ని తప్పుదారి పట్టించిన దాఖలాలు లేవు. మీ తండ్రిగారికి మేమంతా నమ్మినబంటులం. ఆయనపట్ల అపారమైన గౌరవాదరాలు కలవాళ్ళం. లోకంలో వ్యక్తిగతంగా పదిమంది చేతా ధర్మపరుల మనిపించుకుంటున్న వాళ్ళం. మమ్మల్ని నువ్వు విశ్వసించవచ్చు. నీతో తప్పులు చేయించీ నిన్ను బలహీనపరిచీ మేము బావుకునేదీ ఏమీ ఉండదు. అలాంటి పనులు చేసేవారు తాత్కాలికంగా ఏవో లబ్ధులు పొందినా, చివరికి హత్యలు అవమానాలకూ గురికావడం చరిత్రలో అందరూ ఎరిగినదే. కూర్చున్న కొమ్మనూ నరుక్కునేంతటి మూర్ఖులమో, అహంకారులమో, అజ్ఞానులమో కాము. మమ్మల్ని విశ్వసించు. ధర్మ భంగం కలగకుండా ప్రజారంజకంగా నీ పరిపాలన సాగేటట్టు సహకరిస్తాం. అదీకాక ఒకరిమీద ఒకరికి తెలియకుండా చారులను నియోగించి నిఘాలు పెట్టి ఎక్కడికక్కడ కదలికలు గమనించి ఎప్పటి కపుడు సమాచారం రాబట్టుకునే సువ్యవస్థితమైన పరిపాలనా విధానం మన రాజ్యంలో ఎప్పటి నుంచో నెలకొని ఉంది. దాన్ని మరింత చైతన్యపరిచే చాతుర్యం నీకు సమృద్ధిగా ఉంది. అందుచేత ఏ కోణం నుంచి ఆలోచించినా నువ్వు తిరస్కరించడానికి తగినంత కారణం నాకయితే కనిపించడంలేదు. మిమ్మల్ని విశ్వసించలేను, అనేస్తే చెప్పలేను గానీ నువ్వు నిస్సందేహంగా అంగీకరించవచ్చునని మాత్రం చెప్పగలను.

అమాత్యులారా! దయచేసి నన్ను అపార్థం చేసుకోకండి. మీ మీద నమ్మకంలేక నేను కాదనడంలేదు. నా అశక్తతవల్ల కాదంటున్నాను. అవమాన భయంతో కాదంటున్నాను. పాపభీతితో కాదంటున్నాను. ఇక బాధ్యత అంటారా, మీరందరూ లేరూ, సమర్థులు, అనుభవజ్ఞులు, పరిపాలనకేమి నిశ్చితంగా నిరాటంకంగా సాగుతుంది. నేను వెళ్ళి తపస్సు చేస్తాను. యోగ సిద్ధులు సంపాదిస్తాను. బాహు శాలినై శస్త్రాస్త్రకోవిదుడనై అన్ని సామర్థ్యాలూ సంపాదించుకొని తిరిగివస్తాను.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

అప్పుడు రాజ్యభారం భుజాలకు ఎత్తుకుంటాను. అందాకా మీకిది తప్పదు. అనువంశికంగా వస్తున్న అమాత్యులు కనుక మీరు ఈ బాధ్యతను కాదనటానికి వీలు లేదు.

మరింక అవాక్కులయ్యారు అమాత్యులందరూ. వారి వెంట నిలిచిన గర్గముని కార్తవీర్యుడి నిశ్చయానికి చాలా సంబరపడ్డాడు. పట్టుదలని గుర్తించాడు. తపస్సు చేస్తాడనీ అమోఘ ఫలాలు పొందుతాడనీ గ్రహించాడు. రాకుమారా! నీ నిర్ణయాన్ని అభినందిస్తున్నాను. నీ దృఢ సంకల్పాన్ని ప్రశంసిస్తున్నాను. తపస్సులు ఫలించడమంటే అదొక సుదీర్ఘ యాత్ర. వేల సంవత్సరాల కృషి. లోక శ్రేయస్సు కోసం నీకొక దగ్గరిదారి చెబుతాను. ఆలకించు. సహ్యాద్రి ఎరుగుదువు కదా! దాని లోయల్లో ఒక చోట ఆశ్రమం నిర్మించుకొని దత్తాత్రేయుడు తపస్సు చేసుకుంటున్నాడు. అతడు అమోఘ యోగశక్తి సంపన్నుడు. యోగ విద్యా ప్రవర్తకుడు. ఈ జగత్తును కాపాడటం కోసం విష్ణుదేవుడి అంశతో అవతరించాడు. నువ్వు వెళ్ళి అతడిని ఆశ్రయించు. నీ సంకల్పం సత్వరం సిద్ధిస్తుంది. స్వర్గలోకాన్ని జంభాసురాదులు ఆక్రమించినప్పుడు దేవేంద్రుడంతటివాడు వచ్చి ఈ దత్తాత్రేయుణ్ణి ఆశ్రయించాడు. అతడి కరుణవల్ల రాక్షసుల్ని జయించి మళ్ళీ తన స్వర్గపీఠం తాను అందుకోగలిగాడు. ఇటువంటి విజయగాథలు ఎన్నో ఉన్నాయి. నీకు జయం కలుగుతుంది. వెళ్ళిరా.

ఇది ఆదేశమా, ఆశీర్వచనమా అనిపించేట్టు గర్గముని పలికిన ఈ మాటలు కార్యవీర్యుణ్ణి ఆకట్టుకున్నాయి. అతడివైపు సభక్తికంగా చూస్తూ-మునీంద్రా। నీ ఆదేశం నాకు శిరోధార్యం. అలాగే చేస్తాను. కానీ జంభాసురాదులు ఇంద్ర రాజ్యాన్ని ఎలా అపహరించారు. ఇంద్రుడు దత్తాత్రేయుణ్ణి ఎలా ఉపాసించాడు, తిరిగి తన స్వర్గపీఠాన్ని ఎలా పొందాడు? ఇవన్నీ సవివరంగా తెలుసుకోవాలని ఉంది. దయచేసి నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి.

కార్తవీర్యుడి అభ్యర్థనకు గర్గముని మురిసిపోయాడు. రాకుమారా! తప్పకుండా చెబుతాను. ఆలకించు అంటూ ప్రారంభించాడు.

## ఇంద్రాది దేవతల దత్తోపాసన

వెనుకటి కాలంలో జంభాసురుడు ఘోరతపస్సు చేసి బ్రహ్మదేవుణ్ణి మెప్పించి అనేక దివ్యవరాలు పొందాడు. శివుణ్ణి మెప్పించి అనేక దివ్యాయుధాలు పొందాడు. వీటి గర్వంతో సమస్త లోకాలూ జయించాలనీ సకల సంపదలూ పొందాలనీ ఆశ కలిగింది. మహా రాక్షస సైన్యాన్ని లక్షల సంఖ్యలో సమకూర్చుకుని స్వర్గ మర్త్య పాతాళలోకాలపైకి దండయాత్రకు బయలుదేరాడు. ముందుగా సరాసరి స్వర్గలోకాన్ని చుట్టుముట్టాడు. దేవాసురులకు భీకర సంగ్రామం కొన్ని సంవత్సరాలపాటు జరిగింది. జంభాసురుడూ, అతడి సైన్యమూ వరమహిమవల్ల నానాటికీ బలపడుతుంటే దేవసైన్యం క్షీణిస్తోంది. చివరికి దేవతలు ఓటమి అంగీకరించి స్వర్గలోకం విడిచిపెట్టి పలాయనం చిత్తగించారు. జంభాసురుడు స్వర్గ సింహాసనాన్ని ఆక్రమించి అధిష్ఠించాడు.

తలకొక దిక్కుగా పారిపోయిన దేవతలు ఒకానొక పర్వతారణ్య ప్రాంతంలో గుమికూడారు. అది వాలఖిల్యాది మహర్షులుండే అరణ్యం. దేవ గురువు బృహస్పతి కూడా అక్కడికే చేరుకున్నాడు. అందరూ ఆ మహర్షులతో మంతనాలు జరిపారు. స్వర్గలోకాన్ని మళ్ళీ సంపాదించుకోవాలంటే విష్ణు మూర్తిని శరణువేడుట ఒక్కటే కర్తవ్యమని నిర్ధారించుకున్నారు. ఆ చతుర్భుజుడు ఇప్పుడు దత్తాత్రేయుడుగా అవతరించి సహ్యాద్రిసీమలో విహరిస్తున్నాడని మహర్షులు చెప్పారు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

అయితే అతడు మదవతీ మద్యలోలుడై నింద్యాచారుడుగా కనిపిస్తాడనీ, ఆ మదవతి సాక్షాత్తుగా లక్ష్మీదేవియే అనీ, అతడిని ప్రసన్నుణ్ణి చేసుకోవడం చాలా కష్టమనీ, అయినా మరి గత్యంతరం లేదు కనుక ప్రయత్నించండనీ మహర్షులు ఉపదేశించి నిండా ఆశీర్వదించి పంపించారు. బృహస్పతిని ముందు నిలుపుకుని ఇంద్రాదిదేవతలు సహ్యాద్రి చేరుకున్నారు. దత్తాశ్రమం వెదికి పట్టుకున్నారు. ఆశ్రమ మధ్యభాగంలో తీర్చిదిద్దిన చలువ పందిరి. సుగంధ పరిమళాలను వెదజల్లుతున్న పూల తోరణాలు, బంగారు జరీ నగిషీలు పొదిగిన మేల్కట్టు చాందినీలు. మధ్య భాగంలో పద్మకర్ణికాకారంలో మెత్తని వితర్దిక. దాని మీద దత్తాత్రేయుడు ఒక అందాల భామకు వీపుచేర్చి, ఎడమమోచెయ్యిని మరొక భామామణి ఊరు భాగాన ఆన్చి ఓరవాటుగా కూర్చుని ఉన్నాడు. కుడి చేతిలో బంగారు చషకం. మరొక నారీలలామ (లక్ష్మీదేవి) ముందుగా తాను చవిచూసి రకరకాల మద్యాలను ఆ చషకంలోకి ఆరారగా నింపుతోంది. దత్తయోగి అదే పనిగా సేవిస్తున్నారు. చుట్టూ చిన్న చిన్న వేదికల మీద కూర్చుని గంధర్వాప్సరసల్లాంటి యువతలు అనేక వాద్య విశేషాలను మృదువుగా శ్రావ్యంగా మ్రోగిస్తున్నారు. వాటితో శృతిగలిగిన ఏవో గీతాలు పాడుతున్నారు. వాటిని వింటూ ఒక్కొక్కప్పుడు తాళం వేస్తూ మరొకప్పుడు తానూ గొంతు కలుపుతూ దత్తయోగి ఆనందపరవశుడవుతున్నాడు. అవధులు దాటిన మద్యపానం వల్ల వశం తప్పిన శరీరం వొదులొదులుగా వూగుతోంది. ఎరుపెక్కిన కన్నులు, బూరటెల్లిన బుగ్గలు. చెమట చిత్తడితో జిడ్డుదేరిన ముఖం, చేతి నుంచి జారిపోతున్న మధుచషకాన్ని నారీలలామ అందుకుంటోంది. తానే స్వయంగా దత్తస్వామి నోటికి అందిస్తోంది. మెచ్చుకోలుగా ఆమెను పొదువుకునే ప్రయత్నం చేస్తున్నాడు యోగి. వివశుడై ఆమె పైకి ఒరిగిపోతున్నాడు.

ఇంద్రాది దేవతలకు కనిపించిన దృశ్యమిది. అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. పరస్పరం కన్నులతో సన్నలు చేసుకున్నారు. ఆశ్రమం అంతటా సర్దుకున్నారు. కొందరు పద్మవితర్దిక చుట్టూ చేరుకున్నారు. దత్త యోగికి ఆశ్రమవాసులకూ అందరూ అందరికీ కను సన్నల్లో మెలుగుతున్నారు. ఇంద్రుడు స్వయంగా దత్తయోగికి అంతరంగిక సేవకుడయ్యాడు. కాళ్ళు పట్టడం దగ్గర్నుంచి అన్ని సేవలూ భక్తి శ్రద్ధలతో వినయవిధేయతలతో చేస్తున్నాడు.

ఆశ్రమంలోకి ఇంతమంది సేవకులు ఒక్కసారిగా ఎప్పుడువచ్చిపడ్డారో ఎందుకు వచ్చారో ఎలా వచ్చారో ఆశ్రమ వాసులెవ్వరికీ అంతపట్టడంలేదు. అయినా ఎవరు ఎవరినీ అడిగిందిలేదు. అందరూ అందరితోనూ హాయిగా సేవలు చేయించుకుంటున్నారు. ఆనందిస్తున్నారు. కాలం గడుస్తోంది.

ఒకనాటి ఉదయాన దత్తయోగికి ఇలాంటి సందేహమే కలిగింది. తన అంతరంగిక సేవకుణ్ణి అడిగాడు. ఎవరు మీరందరూ? ఎందుకు మాకు ఈ సేవలు చేస్తున్నారు? మీ రూపురేఖావిలాసాలు చూస్తోంటే దైవాంశ సంభవుల్లా కనిపిస్తున్నారు. మీ వినయవిధేయతలూ సేవాతత్పరతలూ మమ్మల్ని అందర్నీ ఆనందపరవశుల్ని చేస్తున్నాయి. సేవలు చేస్తున్నారు. సంతోషమే. కాని ఏమి కోరి ఈ సేవలు చేస్తున్నారు? సేవలు చెయ్యమని మీకు ఎవ్వరు చెప్పారు? అసలు ఎక్కడి నుంచి వచ్చారు?

దత్తయోగి ఇలా ప్రశ్నల పరంపర కురిపిస్తోంటే దేవేంద్రుడు మరింత చేరువకి వచ్చి సాష్టాంగపడ్డాడు. సన్నిధిలో నిలబడ్డాడు. చేతులు కట్టుకొని ఊర్ధ్వకాయాన్ని వినయంగా వినమ్రంగా రవ్వంత ముందుకి వంచి, తుంపురులు యోగేంద్రుడి మీద పడతాయేమో అనే శంకతో తన అరచెయ్యిని నోటికి గూడులా అడ్డం పెట్టి బదులు పలికాడు. దత్తయోగేంద్రా! అన్నీ తెలిసే ఏమీ ఎరగనట్టు మీరిలా ప్రశ్నించడం విడ్డూరంగా ఉంది. అయినా మీరు అడిగారు

కనుక నేను చెప్పాలి. మనవి చేస్తున్నాను. స్వామీ! నేను దేవేంద్రుణ్ని. ఈ పరిచారకులు అందరూ దేవతలు. జంభాసురుడు స్వర్గలోకం మీద దండెత్తి మమ్మల్ని పారద్రోలాడు. స్వర్గసీమను ఆక్రమించుకున్నాడు. దిక్కుతోచక మేమంతా నీ సన్నిధికి చేరుకున్నాము. మిమ్మల్ని సేవిస్తు మీ అనుగ్రహంకోసం ఎదురు చూస్తూ కాలం గడుపుతున్నాము. ఈనాటికి తమకు దయకలిగింది. ఆ జంభాసురుడ్ని ఓడించి మళ్లీ మా రాజ్యం మాకు ఇప్పించండి. యజ్ఞయాగాది క్రతువులు సజావుగా సాగే అవకాశం కల్పించండి. దానికి మీరొక్కరే సమర్థులు. ఇంక ఎవరివల్లా ఇది సాధ్యంకాదు అనుగ్రహించండి.

ఏమిటీ! నువ్వుదేవేంద్రుడివా! వీరంతా దేవతలా! ఆశ్చర్యంగా ఉందే. అష్టదిక్పాలకులకు అధిపతివి. నీ సేవలు నేను పొందడమా? అపచారం అపచారం. నేనొక సాధారణ తపస్విని. అందునా ఆచార భ్రష్టుణ్ణి. నీ సేవలు నేను పొందడంగానీ నీ దేవతలు సేవలు మా ఆశ్రమవాసులు పొందడం గానీ తగనిపని, తెలియక జరిగిన పొరపాటు. ఈ క్షణం నుంచీ మీరందరూ సేవలు విరమించండి. మీకే మేమంతా సేవలు చేస్తాం. తరిస్తాం. నీ సామ్రాజ్యాన్ని జంభాసురుడు ఆక్రమించుకున్నాడన్నావు. దాన్ని తిరిగి పొందడానికి సహకరించమంటున్నావు. తప్పకుండా మేమంతా సహకరిస్తాం. నీకు తెలుసుగదా మేమెంతటి యుద్ధ వీరులమో. అందుచేత రణరంగానికైతే రాలేం కానీ మీ వెంట ఉండి శిబిరాలలో క్షతగాత్రులకు సేవలు అందించగలం. ఈ పాటి సహకారం అందించడానికి మేమూ ఎప్పుడూ సిద్ధమే. నిజానికి అది మా అదృష్టంగా భావిస్తాం. దీనికి మీరు అభ్యర్థించాలా? ఆజ్ఞాపించండి. అంతటి సువర్ణావకాశం మాకు కలిగించండి. దేవతలకు సహకరించడంకన్నా తపస్వులకు కోరుకోవలసింది ఏమిటి ఉంటుంది ?

దత్తయోగీంద్రా! ఇది చాలా అన్యాయం. మాటలతో మమ్మల్ని మభ్యపెట్టాలని చూస్తున్నారు. స్వామీ! ఇప్పటికే అన్ని విధాలా నలిగిపోయాం. కాపాడవలసిన నాథుడే పరాచికాలాడితే మేము ఏమైపోవాలి? మీరు అనుగ్రహిస్తే స్వర్గలోకం మళ్ళీ మాకు దక్కుతుంది. లేదంటే ఇక్కడే ఇలాగే మీ సేవలో ఉండిపోతాం. ఇంతకన్నా గొప్ప ఆనందమేదీ ఆ సింహాసనంలో లేదు. కాకపోతే నా విధులు నేను నిర్వహించాలి కనక, యజ్ఞయాగాదుల్ని సక్రమంగా జరిపించాలి కనక, ఈ భాధ్యతల్ని అలనాడు మీరంతా నాకు అప్పగించారు కనుక, దుర్మార్గంగా అన్యాక్రాంతమైన స్వర్లోకాన్ని - అదీ రాక్షసాంతమైన స్వర్గసీమను మళ్ళీ నాకు అప్పగించమని అభ్యర్థిస్తున్నాను. తమరు దయమాలి నాతో ఆడుకుంటున్నారు. నా అదృష్టం ఇలా ఉంది. ఏం చెయ్యను. నన్ను నమ్ముకుని ఈ దేవతలు కూడా అగచాట్లు పడుతున్నారు.

దేవేంద్రా! నన్నూ నా మాటల్నీ అపార్థం చేసుకుంటున్నావు. నిన్ను నొప్పించడంగానీ పరాచికాలాడటం కానీ నా ఉద్దేశం కాదు. నేను అంతటి వాణ్నికాను. నేనేమన్నా ఉపేంద్రుణ్ణా ఇంద్రుడితో పరాచికాలాడటానికి సాధారణ తపస్విని. చూశావుగదా నా దిన చర్య. ఎంతటి భ్రష్టాచారుణ్ణో గ్రహించే ఉంటావు. మధ్యపానరతుణ్ణి, మదవతీ లోలుణ్ని, సంయోగమే తప్ప యోగమంటూ ఎరగని వాణ్ణి. ఇదే తపస్సుగా ఇదే అద్వైత స్థితిగా మురిసిపోతున్న వాణ్ణి. ఈ పాటి ఇంద్రియాలనే జయించలేని నేను ఇంద్రుడికి సహకరించడమా? విడ్డూరం. కష్టాలలో ఉన్నావు గనుక ప్రతి గడ్డిపోచా నీ కంటికి ఇలాగే కనిపిస్తుంది. సహజం. కానీ నా శక్తి ఏమిటో నేను తెలుసుకోవద్దూ! అందుకని మరోసారి చెబుతున్నాను. ఆ రాక్షసులేమిటో ఆ యుద్ధాలేమిటో మీరు చూసుకోండి. మేము అందించగల సేవలేమిటో మాకు ఆజ్ఞాపించండి. ఆనందంగా చేస్తాం.

వద్దుస్వామీ వద్దు నీ పరీక్షలు నేనింక తట్టుకోలేను. నువ్వు జగన్నాధుడవని, శ్రీమన్నారాయణుడవని నాకు తెలుసు. ఈ నారీలలామ సాక్షాత్తూ లక్ష్మీదేవియే నాకు తెలుసు. ఈ విలాసిని బృందము ఈ మద్యపానము ఇదంతా

నీ మాయ అని నాకు తెలుసు. భక్తుల్ని ఎంతగా పరీక్షిస్తావో ఎలా బురిడీలు కొట్టిస్తావో నేను ఎరుగుదును. ఎవరు నీవు, ఎందుకు సేవలు చేస్తున్నావంటే నన్ను అనుగ్రహించడానికి అని సంబరపడ్డాను. పరీక్షలు ముగిసాయి అని అనుకొన్నాను. ఇది ఇంకోరకం పరీక్ష అని తెలుసుకోలేకపోయాను. అనఘాత్మా! నువ్వు యోగీనాం యోగివి ఋషీనాంఋషివి కవీనాం కవివి. నీకు అసాధ్యమంటూ లేదు. సంకల్పించాలే కాని సమస్తమూ నీ అధీనంలోదే. ఈ దీనుణ్ణి కనికరించి స్వర్గ సింహాసనం మీద పునః ప్రతిష్ఠితుణ్ణి చెయ్యాలి అనుకోవాలే గాని అది నీకు క్షణాల మీద పని. ఎందరెందరో మహారాక్షసుల్ని చిటికలో తుదముట్టించిన వాడివి. జంభాసురుడు నీకొక లెక్కా. నిజంగా మా సేవలు నీకు నచ్చివుంటే దయచేసి ఈ ఉపకారం చేసిపెట్టు. లేదంటే నీ సేవలో ఇలాగే మరికొంత కాలం గడిపే అదృష్టం కలిగించు. అంతేగాని కల్లబొల్లి మాటలు చెప్పి మమ్మల్ని తప్పించుకోవాలని అనుకోకు. మా అపరాధ సహస్రాలన్నింటికి ఇదే విరుగుడు. అంటూ దేవేంద్రుడు సాష్టాంగపడి నమస్కరించి దీనంగా అడిగాడు.

దత్తాత్రేయుడు పకపకా నవ్వాడు. ఇంద్రుణ్ని లేవనెత్తి గాఢంగా కౌగిలించుకున్నాడు. శచీపతీ ఆందోళన చెందకు. నీ శత్రువుల్ని పారద్రోలి నీ ఇంద్ర లోకాన్ని నీకిప్పిస్తాను. స్వర్గలోకాన్ని రక్షిస్తాను. నిన్ను ఇంద్రలోక సింహాసనంపై కూర్చుండ బెడతాను. ఆ జంభాదిరాక్షసులు నాకు కన్పించేట్లుగా చేయి చాలు మిగతా సంగతి అంతా నేను చూసుకుంటాను. వెళ్ళిరండి మీకు జయమవుతుంది. అని ఆశీర్వదించి పంపించాడు.

ఇంద్రాది దేవతలు సంతోషించి బయలుదేరారు. జగన్నాటక సూత్రధారి ఈ విష్ణుమూర్తి రాక్షస బాధల్ని తప్పించటానికి ఎప్పటికప్పుడు ఏదో ఒక ఉపాయం పన్నుతూంటాడు. ఏదో ఒక కొత్త నాటకం ఆడుతూ వుంటాడు. ఈ సారి ఏమి చేయ సంకల్పించాడో చూద్దామని అనుకుంటూ స్వర్గలోకం సమీపించారు. నందన వనంలో పొదరిళ్ళలో, చెట్ల నీడల్లో, దివ్యభవనాల్లో దేవ కన్యలను అప్సరసలను బలాత్కరిస్తూ క్రూరంగా హింసిస్తున్న రాక్షసుల్ని చూసారు. అన్ని వైపుల నుండి ఒక్కసారిగా చుట్టుముట్టి హై హై - హే హే అంటూ దేవతలు రాక్షసుల మీద విరుచుకుబడ్డారు. రాక్షసులు కూడా సన్నద్ధులై తిరగబడ్డారు. దేవతల్ని తరిమి తరిమి కొడుతున్నారు. వాళ్ళు తరుముతున్నంత సేపూ పారిపోతున్నట్లుగా నటిస్తూ వాళ్ళు ఆగినపుడు మళ్ళీ తిరగబడి ఉసిగొల్పుతూ మళ్ళీ పారిపోతూ మళ్ళీ తిరగబడి ఉసిగొల్పుతూ వాళ్ళు తమ వెంట బడేటట్లుగా చేసుకుని ఎలాగైతేనేమి తెలివిగా రాక్షసుల నందర్నీ దత్తాశ్రమ ప్రాంతానికి లాక్కువచ్చారు దేవతలు.

దత్తాత్రేయుడు యథావిధిగా కూర్చునివున్నాడు. సరసన వున్న అనఘ రాశిపోసిన సౌందర్యంలా కూర్చుని విలాసంగా చిరునవ్వులతో కవ్విస్తూంది. రాక్షసుల దృష్టి హఠాత్తుగా సౌందర్యరాశిపై పడింది. ముఖ సౌందర్యానికి కొందరు, చిరునవ్వులకు కొందరు, కొంటె చూపులకు కొందరు, యౌవన సంపదకు కొందరూ, చేతుల్లోని కేలీ పద్మ విలాసానికి కొందరు. మృదుతర హస్తాంగుళీ విన్యాసానికి కొందరు, రత్న కంకణకాంతి ఝణత్కారాలకు కొందరు, కిరీటతాటంక రత్న హారకాంచీనూపుర శోభా సంపదలకు కొందరూ అంగరాగ ఘుమ ఘుమలకు కొందరూ, వినూత్న పట్టు వస్త్ర ధగధగలకు కొందరూ, పాదాంగుళీ మార్దవాతిశయమునకు కొందరూ ఇలా రాక్షస వీరులందరూ ఆమెను చూచి సౌందర్యానికి ముగ్ధులయ్యారు. కామ వికారంతో వివశులవుతున్నారు. నాయకుడికి నమ్మిన బంటులు కనుక తిరుగులేని నిస్వార్థ మూర్ఖ సేవకులు కనుక, ఆమెకోసం తమలో తాము కలహించుకోకుండా అందరూ కలిసి నిర్ణయించుకొని తమ నాయకుడి కొరకు ఆమెను అపహరించుకు పోవాలి అని అనుకున్నారు. ఆ ఆలోచన వాళ్ళకి రావడమే ఆలస్యం

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

తమ కున్న మాయాశక్తితో బంగారు పల్లకీ సృష్టించారు. ఆ సౌందర్యరాశిచుట్టూ తిరుగుతూ వికటాట్టహాసాలు చేస్తూ పిచ్చి గంతులు వేస్తూ మారుమాట్లాడకుండా ఈ పల్లకీలో కూర్చోమంటూ గద్దించారు. ఆమె ఒక్కసారిగా దత్తాత్రేయుడి వైపు చూసింది. ఆయన చిరునవ్వుతో వెళ్ళమని సైగ చేసాడు. అనుజ్ఞ అందుకొన్న ఆ సౌందర్యరాశి భయాన్ని, బెరుకును, నటిస్తూ లేచి ఒయ్యారంగా నడిచివెళ్ళి పల్లకీలో కూర్చుంది. ఆ చర్య వారి మనసుల్ని మరింత ఆనందింపజేసింది. బంగారు పల్లకీలో వున్న బంగారు రాశిని భుజాల మీద మోసుకొని వెళ్ళడం కన్నా నెత్తి మీద పెట్టుకొని తీసికెళ్తే మరింత శోభగా వుంటుందని ఆమెను తమ నాయకుడు మరింత ఆనందిస్తాడని తలచి రాక్షసులు బంగారు పల్లకీని నెత్తులకు ఎత్తుకున్నారు. ఓ హోం ఓహోం అంటూ పరుగులాంటి నడక అందుకున్నారు. వాళ్ళు అల్లంత దూరం వెళ్ళడం చూచి దేవతలంతా దత్తుడి వద్దకు చేరుకున్నారు.

పల్లకీ వెళ్తున్న వైపే చూస్తూ దత్తస్వామి ఇలా అన్నాడు - అయిపోయింది. ఈ రాక్షసుల పని ఈ రోజుతో అయిపోయింది అన్నాడు. దేవతలకి ఏమీ అర్థంకాలేదు. స్వామివైపు ప్రశ్నార్థకంగా చూసారు.

దేవతలారా మీ కోరిక నెరవేరింది లక్ష్మి రాక్షసులనెత్తికెక్కింది. అంటే ఇంక వాళ్ళు సర్వనాశన మయ్యారన్నమాట. ఇంక వాళ్ళ దగ్గర ఏ లక్ష్మీ నిలవదు. శరీరంలో ఏడు స్థానాలు దాటించి ఎవరైతే లక్ష్మిని నెత్తిపైకెక్కించుకుంటారో వాడు మరు క్షణంలోనే దరిద్రుడవుతాడు. లక్ష్మి పురుషుడికి పాదస్థానంలో వుంటే పెద్ద పెద్ద భవనాల్లో నివసించేటట్లుగా చేస్తుంది. కటిస్థానంలో వుంటే మణి మాణిక్యాలు, అతివిలువైన వస్త్రములను కలిగిస్తుంది. లక్ష్మి గుహ్యంలో వుంటే భార్యా సౌఖ్యం కలిగిస్తుంది. సందిటలో వుంటే సంతాన సంపద కలిగిస్తుంది. లక్ష్మి హృదయస్థానంలో వుంటే అభీష్టాలు సిద్ధింపజేస్తుంది. కంఠ ప్రదేశంలో వుంటే విలువైన రత్నాల హారాలు ధరింపజేసేటట్లు చేస్తుంది. లక్ష్మి ముఖ స్థానంలో వుంటే భోజన సౌఖ్యం, మాటకారితనం, కవన శక్తి, అమోఘవర్చస్సులు ప్రసాదిస్తుంది. ఈ ఏడు స్థానాలు దాటి లక్ష్మి శిరస్సుకి ఎక్కిందంటే ఇక అతణ్ణి విడిచిపెట్టి వెంటనే వెళ్ళిపోతుంది. వెంటనే మరొకన్ని ఆశ్రయిస్తుంది. ఇది లక్ష్మి యొక్క నియమం మీరే చూశారుగదా వీళ్ళు లక్ష్మిని నెత్తి మీద ఎక్కించుకొని వెళ్తున్నారు. ఇంక కొద్ది క్షణాల్లోనే వాళ్ళను విడిచి వస్తుంది.

సామ్రాజ్యలక్ష్మి, విజయలక్ష్మి మిమ్మల్ని వరించడం తథ్యం. ఇదే తగిన సమయం త్వరపడండి మీరు మీ శస్త్ర అస్త్రాలతో రాక్షసుల మీద విరుచుపడండి. ఇప్పటికే వారు నిర్వీర్యులై వున్నారు. ఇప్పుడు మీరు వారిని జయించడం చాలా తేలిక, బయలుదేరండి.

దేవతలు తమ తమ ఆయుధములు ధరించి రాక్షసుల వెంటబడ్డారు. దొరికిన వాణ్ణి దొరిగినట్లు చావబాదారు. అదేమిటో రాక్షసుల వీరుల నుంచి ఏ కొద్దిపాటి ప్రతిఘటన ఎదురుకాలేదు. అందరూ నీరసంగా వ్రేలాడుతూ వున్నారు. జీవచ్ఛవాలుగా దేవతల చేతికి చిక్కుతున్నారు. దేవతలు ఆనందంతో అరటి చెట్లును తెగ నరికినట్లుగా నరికేశారు. చివరకు జంభాసురుడు కూడా ఇంద్రుడి వజ్రాయుధం వేటుకు నేలకొరిగాడు. లక్ష్మీదేవి బంగారు పల్లకీ నుండి ఎగిరివచ్చి దత్తుడి చెంతకు చేరింది. దేవేంద్రుడు తన సింహాసనం అధిష్టించాడు. ఇంద్రుడు వెంటనే దత్తాశ్రమమునకు వచ్చి దత్తుని ముంగిట నిలిచి సాష్టాంగ నమస్కారములు ఆచరించి స్తుతించాడు.

దత్తాత్రేయుడు సంతోషించి ఆశీస్సులు ఇచ్చి పంపాడు. కాబట్టి, రా కుమారా, నువ్వు కూడా దత్త యోగీంద్రుణ్ని సేవించి అభీష్ట సిద్ధిని పొందు అని గర్గముని కార్తవీర్యార్జునికి చెప్పాడు.

## కార్తవీర్యార్జునుని దత్తోపాసన

కార్తవీర్యార్జునుడు వెంటనే గురువైన గర్గముని వద్ద సుముహూర్తం నిర్ణయించుకొని తమ మంత్రి పురోహితాదులైన పెద్దలైన వారి వద్ద శుభాశీస్సులు అందుకొని రాజ్య బాధ్యతలను వారికప్పగించి సహ్యాద్రి పర్వత ప్రాంతానికి బయలుదేరాడు. దత్తాశ్రమం చేరుకున్నాడు. నిరాడంబర వేషధారణలతో ఒంటరిగా పాదచారియై ఆశ్రమంలోకి చేరుకున్నాడు. మణి శిలాపీఠంపై మదవతీ మధు పాన గోష్టిలో ఓలలాడుతున్న దత్తస్వామిని దర్శించాడు. గోత్ర నామాదులు చెప్పుకొని సాష్టాంగ నమస్కారాలు చేసాడు. దత్తస్వామి ఒక వింతైన చిరునవ్వు విసిరారు. కార్తవీర్యుడు మనస్సు కుదుట పడింది. స్వామి తన రాకను గమనించారని అనుమతించారని సంబరపడ్డాడు. తన జన్మ ధన్యమయిందని మురిసిపోయాడు. అలజడి తగ్గి సంశయాలు తొలగి మనస్సులో క్రమక్రమంగా ధైర్యం బయలు దేరింది. దత్త స్వామికి మరింత చేరువయ్యాడు. దత్తస్వామి పాదాలు తన చొట్ట చేతులతో ఒత్తుతూ నేలపై చతికిల బడి కూర్చున్నాడు. కాసేపటికి దత్త యోగిచేతిలో మధుపాత్రఖాళీ అవటంతో తానే లేచివెళ్ళి మధువును నింపి తెచ్చాడు. బంగారు పళ్ళేరాలలో వున్న మధురమైన ఫలాలను, పదార్థాలను అదనుకనిపెట్టి స్వామికి అందిస్తున్నాడు. క్రమక్రమంగా స్వామి దినచర్యలో స్వామి పరిచారక గణంలో కార్తవీర్యుడు ఒక భాగస్వామి అయ్యాడు.

ఉదయం ఫలపుష్పాదులు సమకూర్చడం మధ్యాహ్నం చందనాదులు సిద్ధం చెయ్యడం సాయంకాలం మండపాలను వివిధ రకాల పూల మాలలతో మండపాలు అలంకరించడం, మిగతా పనులన్నింటిని చెయ్యడం, వగైరా పనులన్నింటిని తనే చేస్తున్నాడు. స్వామి వేళ తప్పకుండా భోజనం చేసేటట్లు సిద్ధం చేసి తానే దగ్గరుండి వడ్డిస్తూ కొసరి కొసరి తినిపిస్తూవున్నాడు. స్వామి భుక్తశేషాన్ని కళ్ళ కద్దుకొని భక్తితో తాను భుజిస్తున్నాడు. అవిటి చేతులతో ఇంత చేస్తుంటేస్వామి యొక్క పరిచారక గణం చూచి ఆశ్చర్యపోతున్నారు. స్వామి భక్తి అంటే ఇది అని కొందరు మెచ్చుకుంటున్నారు. మనం ఏనాటి నుండో సేవ చేస్తున్నా నిన్న మొన్న దగ్గరయిన ఇతడు దత్తస్వామికి సన్నిహితుడూ ఆంతరంగికుడు అవుతున్నాడే అని మరి కొందరు లోలోపల అసూయపడుతున్నారు. సూటిపోటి మాటలు అంటున్నారు. కార్తవీర్యార్జునుడు మాత్రం ఇవేవీ పట్టించుకోకుండా నిజమైన భక్తితో రేయింబవళ్ళు స్వామిని కంటికి రెప్పలా చూసుకుంటూ సేవచేస్తున్నాడు. నెలలూ సంవత్సరాలు గడిచిపోతున్నాయి.

ఒక రోజున - దత్త స్వామి కూర్చున్న మణిశిలపై వున్న మెత్తని పరుపులను అతడు సర్దుతున్నాడు. దత్తస్వామి పృష్టభాగం బాధ కలుగకుండా వుండేందుకు వీలుగా సుఖంగా కూర్చునేందుకు వీలుగా సౌకర్యంగా వుండేందుకు పడకను సర్దుతున్నాడు. ఆ సమయంలో దత్తస్వామి పృష్ట భాగం నుండి అపాన వాయువు వెలువడింది. ఆ వాయువు నుండి పుట్టిన వేడికి కార్తవీర్యుడి రెండు లొట్ట చేతులు మాడిపోయాయి. ఓర్చుకోలేనంత బాధ కలిగింది. నొప్పి మంట కలగడంతో గట్టిగా మూలిగాడు కార్తవీర్యుడు. భాధతో మెలికలు తిరుగుతూ కూర్చుండిపోయాడు.

దత్తస్వామి కంగారుగా అయ్యయ్యో ఎంత ప్రమాదం జరిగింది. కొండ నాలికకు మందు వేస్తే వున్న నాలిక పోయినట్లు అయ్యింది. ఎవరో ఏదో చెబితే నన్ను సేవిస్తున్నావు. లొట్ట చేతులు బాగుపడతాయి అనుకున్నావు చూసావా ఏమయ్యిందో వున్న చేతులు కూడా వూడిపోయాయి. ఇకనైనా కళ్ళు తెరువు నువ్వు ఆశించినట్లు, లేదా నీకు చెప్పినవారు

అన్నట్లుగా నేనేమి మహాదివ్యశక్తులు కలిగిన వాణ్ణి కాదు. సాధారణ తపశ్విని. నిజానికి అది కూడా కాదు. నువ్వే చూస్తున్నావుగా నా దినచర్య. స్త్రీలోలుణ్ణి ఎవరికీ అందనివాణ్ణి. నన్ను నమ్మి ఎన్ని సంవత్సరాలు వృధా చేసుకున్నావో చూడు. రాజకుమారుడవి. నీవు భోగ భాగ్యములకు దూరమై ఇన్ని అవస్థలు పడుతున్నావు. వెర్రి వాడా తాగు బోతుల్ని, తిరుగుబోతుల్ని సేవిస్తే లొట్ట చేతులు బాగుపడతాయా. అయ్యిందేదో అయిపోయింది. ఇకనైనా వెళ్ళు ఎవరినైనా శక్తి మంతుణ్ని ఆశ్రయించు అన్నారు దత్తస్వామి.

కార్తవీర్యుడికి గర్గముని చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. దత్తుడు ఇంద్రాది దేవతల్ని పరీక్షించిన కధ గుర్తొచ్చింది.ఇప్పుడు ఇది తనకు కఠిన పరీక్ష. అంటే స్వామి అనుగ్రహించబోతున్నాడన్న మాట. ఇందులో నెగ్గితే తన కోరిక నెరవేరుతుంది. ఈ ఆలోచనలతో ధైర్యం వచ్చింది. దత్త స్వామితో ఇలా అన్నాడు. దత్త యోగీంద్రా నువ్వు సాక్షాత్తూ శ్రీ మన్నారాయణుడవని నా విశ్వాసం. ఈ తల్లి కలుముల కల్పవల్లి మహాలక్ష్మి. ఇక్కడ మీకు సేవచేస్తున్న పరిచారక గణం అంతా గంధర్వులు. వీరితో సహవాసము నీ సేవా భాగ్యము నాకు బహుజన్మ తపఃఫలం ఏ రాజభోగాలు దీనికి సాటి రావు. స్వామీ నీ కఠిన పరీక్షలు గురించి విన్నాను. నీ మాయలు కళ్ళారా చూసాను. ఇంద్రాది దేవతలకే అర్ధంకాదు నీ మాయలు. వాటిని అర్థం చేసుకోవడం నువ్వు పెట్టే పరీక్షల్లో నెగ్గడం నా బోటి సామాన్య మానవుడికి అయ్యేపనా స్వామి నువ్వు కరుణా మూర్తివని వేదాలు శాస్త్రాలు పొగుడుతున్నాయి. అలాంటి నీవు ఒక సామాన్య మానవుణ్ని ఇంతగా కఠిన పరీక్షలకు గురి చెయ్యడం భావ్యమా? నువ్వే వంచిస్తే మాకు దిక్కు ఎవరు? రక్షకుడెవరు? పోనీలే పరీక్షించు నీకు సంతృప్తి కలిగే దాకా పరీక్షించు. రెండు చేతులే కాదు రెండు కాళ్ళు పోయినా ఫరవాలేదు. చివరకు ప్రాణాలు పోయినా ఇబ్బంది లేదు. నీ సేవ వదలను. నీ సన్నిధిని విడిచిపెట్టను. అవతలకి పొమ్మని మాత్రం ఆజ్ఞాపించకు. అదే పదివేలు-అంటూ కార్తవీర్యార్జునుడు ఆపుకోలేని దుఃఖంతో సాష్టాంగపడ్డాడు. కన్నీళ్ళతో కాళ్ళు కడిగాడు. దత్తాత్రేయుడు చిరునవ్వులు చిందిస్తూ మురిసిపోయాడు.

కార్తవీర్యా, లే నీ భక్తికి సంతోషించాను. నీ జ్ఞానానికి ఆనందించాను. నీ సేవలకు సంతృప్తి చెందాను. లే లేచి వరం కోరుకో నీకు కావలసింది ప్రసాదిస్తాను. లక్ష్మీ సమేతుడుగా (అనఘు) నన్ను సేవించిన వారికి మృష్టాన్నమద్యమాంసాదులు నాకు నివేదనలు చేసిన వారికి, వీణా వేణు శంఖాదులు మ్రోగిస్తూ సంగీత సాహిత్య నృత్యాలతో నన్ను ఆరాధించిన వారికి, వేద శాస్త్ర పండితులను సత్కరించే వారికి, నేను కోరికలన్నీ తీరుస్తాను. పుత్ర పౌత్రాభి వృద్ధిని ధన ధాన్య భోగభాగ్య సమృద్ధిని ఆయురారోగ్యములను తనివితీరా ప్రసాదిస్తాను. నన్ను శంకించే వారిని అవమానించే వారిని నిర్దాక్షిణ్యంగా అణిచిపారేస్తాను. కార్తవీర్యార్జునా ఇది నా దీక్ష నీ మీద నాకు అనుగ్రహం కలిగింది. నీకు ఏమేమి కావాలో నిస్సంసయంగా కోరుకో వెంటనే తీరుస్తాను అన్నారు దత్తస్వామి.

కార్తవీర్యుడు మనస్సులో కళ్ళల్లో ఆనదం వెల్లివిరిసింది. కళ్ళల్లో ఆనంద భాష్పాలు రాలాయి. మెల్లగా లేచి నిలబడ్డాడు స్వామి వైపు సవినయంగా చూస్తూ శిరస్సు వంచి మెల్లగా చిన్న స్వరంతో ఇలా అన్నాడు.

దత్త దేవా నా జన్మ ధన్యమైయ్యింది. నీ అనుగ్రహానికి నేను పాత్రుణ్ని అయ్యాను. ఇంతకన్నా నేను కోరుకోవలసింది ఏముంది. అయినా నీ ఆజ్ఞను కాదనలేక, నా రాజధర్మాన్ని విడిచిపెట్టలేక కొన్ని వరాలు అడుగుతున్నాను. నేను చేసే ప్రజాపాలనలో ధర్మార్థాలు వృద్ధిపొందేటట్లు, ఎదుటివారి ఆలోచనలు నాకు తెలిసిపోయేటట్లు, పుణ్య పాప సుఖ దుఃఖాల

ద్వంద్వాలను తెలుసుకునే ప్రసిద్ధి కలిగేటట్లు, నేను కోరుకున్నప్పుడు నాకు వేయి బాహువులు (చేతులు) వచ్చేటట్లు, అణిమాది అష్టసిద్ధులు నాకు వశం అయ్యేటట్లు, పర్వతాలపై, ఆకాశంపై, సముద్రంపై, పృధివిలో పాతాళంలో నిరాటంకంగా సంచరించే శక్తి కలిగేటట్లు నా కన్నా గొప్పవాడు ప్రసిద్ధుడు అయిన వ్యక్తిచేతిలోనే మరణించేటట్లు, నేను దారి తప్పినప్పుడల్లా నాకు సన్మార్గం చూపించే వారు లభించేటట్లు, గొప్ప గొప్ప అతిధులు నిత్యము దొరికేటట్లు, సంపదలు అక్షయంగా వుంటేటట్లు, నన్ను స్మరిస్తేచాలు ప్రజలకు పోయిన వస్తువులు దొరికేటట్లు, నీ పట్ల నిశ్చలమైన భక్తి నిలచేటట్లు అనుగ్రహించుదేవా అని అడిగాడు.

కార్తవీర్యుడు కోరికలన్నీ దత్తుడు అంగీకరించాడు. తధాస్తు అని పలికాడు. నా అనుగ్రహంవల్ల నీవు చక్రవర్తివి అవుతావు వెళ్ళు అన్నాడు. అర్జునుడు పరమానందంతో తన చేతుల్ని చూసుకున్నాడు. చొట్ట చేతుల స్థానంలో బలమైన దృఢమైన చేతులు వచ్చాయి. సంవత్సరముల తరబడి సేవ చేసి అలసిన శరీరం వింతకాంతితో వెలిగిపోయింది. తృప్తిగా శరీరం అంతా చూసుకొని ఆనందంతో మరోసారి సాష్టాంగ నమస్కారంచేసి దత్తస్వామి వద్ద సెలవు తీసికొని బయలుదేరాడు. రాజధాని మహిష్మతీపురం చేరుకున్నాడు. పౌర జానపద సామంత దండనాయక మంత్రి కవి పండితావళి సాక్షిగా పట్టాభిషేకం జరిపించుకున్నాడు. అమరులూ, గంధర్వులూ, అప్సరసలూ వచ్చి సింహాసనం మీద కూర్చుండబెట్టి ఆశీర్వదించి వెళ్ళారు. గురువర మహిమ వల్ల సామ్రాజ్యంలో సకల సంపదలూ వృద్ధి చెందాయి. ప్రజలంతా సుఖ సంతోషాలతో జీవిస్తున్నారు. అర్జునుడు అత్యంత బలిష్టుడై రాజ్య పరిపాలన చేస్తున్నాడు. రాజ్యంలో తాను తప్ప ఎవరూ ఏ ఆయుధమూ చేపట్టరాదని అలా పడితే అతణ్ణి పరహింసా పరాయణుడిగా గుర్తించి శిక్షిస్తామని దీనికి శిక్ష శిరచ్ఛేదమని శాసనం అమలుచేసాడు. అంతే ఆక్షణం నుండి అతని రాజ్యంలో ఎవ్వడైనా ఆయుధం ముట్టుకుంటే ఒట్టు గ్రామ పాలన, క్షేత్రపాలన, పశుపాలన, గోబ్రాహ్మణ సంరక్షణ సమస్తమూ తానే చూసుకుంటున్నాడు. ప్రజలకు చోర, సర్ప, అగ్ని, శత్రు భయాదులు లేకుండా చేసాడు. ఒకవేళ ఎవరికైన ఏదైనా ఆపదవస్తే కార్తవీర్యార్జునుడ్ని తలుచుకంటే చాలు స్వయంగా ప్రత్యక్షమై వారి వారి ఆపదలు తొలగిస్తున్నాడు. అతడి స్మరణతో పోయిన వస్తువులు కూడా దొరుకుతున్నాయి. ప్రజలు హాయిగా సుఖశాంతులతో భోగభాగ్యములతో వర్ధిల్లుతున్నారు అతడి పాలనలో. భూరి దక్షిణలతో యజ్ఞ యాగాది క్రతువులను మహావైభవంగా జరిపిస్తున్నాడు. చుట్టు ప్రక్కల రాజ్యాలన్నింటినీ జయిస్తున్నాడు. ఇతడి ధర్మానురక్తిని, శౌర్య పరాక్రమాలను ఆత్మాభిమానాన్ని కళ్ళారా చూసిన అంగీరసుడు ఆనందం పట్టలేక కార్తవీర్యార్జునుడు అంతటి రాజు మరొకడు లేడని ఘంటాపధంగా ప్రకటించాడు.

దత్తస్వామి తనకు వరాలు ఇచ్చిన రోజు ఏటేటా గుర్తు చేసుకుంటూ ఆ రోజు ప్రత్యేకంగా దత్త పూజా మహోత్సవాలు జరుపుతూవున్నాడు. వీటిలో ప్రజలంతా ఉత్సాహంగా పాల్గొనేటట్లుగా చేస్తున్నాడు. అతడి చేష్టలు చిత్రాతి చిత్రంగా వుంటున్నాయి. ఉన్నట్లుండి ఒక్కొక్క రోజున దత్త దర్శనమున కెళ్తాడు. నమస్కరించి వెంటనే తిరిగి వస్తూ వుంటాడు. ఒక్కొ రోజున అక్కడే ఉండిపోతూ వుంటాడు. ధర్మ శాస్త్రాలు యోగవిద్యలూ పండితులతో చెప్పించుకొని వింటూ వుంటాడు. వారిని బహుదా సేవిస్తూ వుంటాడు. వారిని అనేక విషయాలు అడిగి తెలుసుకుంటూ వుంటాడు. దత్తుడి గురించి తానేమి విన్నాడో అన్నీ తన ప్రజలకు వివరిస్తూ వుంటాడు. అతడికి దాచవలసింది ఏమీ లేదు.

ఒక రోజు కార్తవీర్యుడు తన అంతఃపుర కాంతలతో కలసి రేవానదిలో క్రీడిస్తూ వున్నాడు. ఉన్నట్లుండి అతడికి వింత ఆలోచన వచ్చింది. తనలో నుండి సహస్ర బాహువులను ఆవిర్భవింపజేసాడు. రేవానదిని అడ్డగించాడు. ఒకప్రక్క అయిదువందల చేతులు ఇంకొక ప్రక్క అయిదువందల చేతులు వేసి మధ్యలో తాను వుండి రేవానదికి ఆనకట్ట

వేశాడు. ప్రవాహం ఆగిపోయింది. ఒక్క చుక్క నీరు కూడా ముందుకు సాగలేదు. నీరంతా ఎగదన్నింది. వెనుకవైపున దూరంగా ఎక్కడో విడిది చేసిన రావణాసురుని సేనా శిబిరాలను రేవానది ముంచివేసింది. రావణుడికి కోపం వచ్చింది. మేఘంలేని వానలాగ వర్షంలేని ఈ వరద ఏమిటని హుంకరించి విషయం ఏమిటో తెలుసుకొనిరమ్మని భటులను పంపాడు. వాళ్ళు వచ్చి చూసి సంగతి తెలియజేసారు. ఆడవాళ్ళతో జలకాలాటకు వచ్చిన కార్తవీర్యుడు ఒంటరిగా దొరికాడు కనుక తేలికగా జయింపవచ్చునని భావించాడు రావణుడు. సైన్యంతో వచ్చి చుట్టుముట్టాడు. అర్జునుడు చిద్విలాసంగా నవ్వుతూ నదిలో నుండి లేచి వచ్చాడు. తనకున్న సిద్ధులతో ఎంతమంది రాక్షసులు వున్నారో అన్ని రూపాలను ధరించి అందర్ని క్షణంలో మట్టుబెట్టాడు. రావణాసురుణ్ని వెయ్యి చేతులతో పట్టుకొని బంధించి వాడి ఇరవై చేతులను విరిచికట్టేసి తన రాజ్యానికి తీసికెళ్ళి చెరసాలలో బంధించాడు.

కొన్ని రోజులకు ఈ వార్త లంకాపట్టణమంతా తెలిసి పోయింది. దశకంఠుడి తాతగారు పులస్త్య బ్రహ్మ వచ్చి కార్తవీర్యుణ్ని అభ్యర్థించి మనవణ్ణి విడిపించుకుపోయాడు.

కార్తవీర్యార్జునుడికి ఇలాంటి దివ్యశక్తులూ మహిమలు దత్తస్వామి అనుగ్రహం వల్ల లభించాయి. దత్తాత్రేయుడంటే సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే శంక చక్ర గదాధారి. అతడే పరాత్పరుడు అతడే వాసుదేవుడు. అతడే మహా మాయతో కలసి ఈ చరాచర జగత్తుకి సృష్టి, స్థితి, లయాలు జరుపుతూ వుంటాడు. ఇతడికన్నా అన్వేషింపదగిన వస్తువులేదు. ధ్యానింపదగిన శక్తీలేదు. కర్మబంధనాలు త్రెంచి ముక్తిని ప్రసాదించే హృషీకేశుడు ఇతడే. శ్రీహరికి దత్తరూపమే ఉత్తమోత్తమం. త్రికరణశుద్ధిగా చేస్తే చాలు అనుగ్రహం కురిపిస్తాడు. నేను భక్తికి దాసుణ్ని భక్తితో పత్రంగాని పుష్పంగాని, ఫలంగాని, చివరకు కాసిన్ని మంచినీళ్ళుగాని నాకు సమర్పించండి నేను మిమ్మల్ని కాపాడుతాను. అనేది స్వామి వారి ప్రతిజ్ఞ. దర్మ సంస్థాపనకు అధర్మ నిర్మూలనకు శిష్ట రక్షణకూ దుష్ట శిక్షణకూ బద్ధ కంకణుడై శ్రీహరి దత్తావతారం ధరించాడు.

తండ్రీ! దత్తాత్రేయుణ్ని ఉపాసించి కార్తవీర్యుడు పొందిన దివ్యశక్తుల గురించి క్లుప్తంగా తెలియజేసాను. ఇంక అలర్క జన్మ కర్మాదులు వివరిస్తాను ఆలకించు అని సుమతి తన కధనం కొనసాగించాడు.

## కువలయాశ్వుడి కధ

పూర్వకాలంలో శత్రుజిత్తు అనే రాజు వుండేవాడు. మహావీరుడు. అనేక యజ్ఞాలుచేసి ఇంద్రుడ్ని సంతృప్తి పరచాడు. ఆ పుణ్య ఫలం వల్ల పుత్రుడ్ని పొందాడు. ఋతుధ్వజుడు అని పేరు పెట్టుకున్నాడు. తండ్రికి తగిన పుత్రుడు. బుద్ధిలో బృహస్పతి సమానుడు. విక్రమ లావణ్యాలలో ఇంద్ర అశ్వనీ కుమారులతో సమానుడు. తన ఈడు రాకుమారులతో కలసి ఆడుకుంటూవుంటే ఒక రోజున నాగలోకం నుండి ఇద్దరు రాకుమారులు వచ్చారు. వారిద్దరూ అశ్వతరుడు అనే నాగరాజు కుమారులు. వారు బ్రాహ్మణ బాలకులుగా వచ్చి ఋతధ్వజునితో కలసి మెలసి తిరుగుతూ ఆటపాటల్లో భాగస్వాములయ్యారు. ఋతధ్వజునితో వీరికి గాఢమైన స్నేహం ఏర్పడింది. రోజూ వీరు నాగలోకం నుండి వచ్చి వెళుతూవుండేవారు. చివరికి వీరి స్నేహం ఒకరిని వదిలి ఒకరు ఉండలేని పరిస్థితి ఏర్పడింది. అందువలన ఒక్కొక్కసారి వారిని తిరిగి వెళ్ళనివ్వడంలేదు. తనతోనే స్నానపానాదులు ఏర్పరచి ఉంచుకుంటున్నాడు. ఇలా రోజులు గడుస్తున్నాయి.

అశ్వతరుడు ఒక రోజున తన పుత్రుల్ని పిలచి తరుచుగా మీరు మనలోకంలో వుంటున్నట్లుగా కన్పించడంలేదు. కారణం ఏమిటి? ఎక్కడికి వెళ్తున్నారు. ఇటీవల రాత్రుళ్ళు కూడా ఇంటికి రావడంలేదు. ఏం చేస్తున్నారు అని గద్దించి ప్రశ్నించాడు. నాగకుమారులు తమకు భూలోకంలో ఋతధ్వజునితో కలిగిన స్నేహబంధం గురించి చెప్పారు. అప్పుడా నాగరాజు మానవులతో మనకు స్నేహం ఏమిటని ప్రశ్నించాడు. అప్పుడా నాగకుమారులు ఆ రాజకుమారుడి గుణగణాలను ఆత్మీయతలను ఏకరువుపెట్టారు. మా కోసం ప్రాణాలు సహితం త్యజిస్తాడు. మేములేనిదే బ్రతుకలేడు. మాకు ఎన్నెన్నో బహుమతులు ఇస్తుంటాడు. మేము ఏది అంటే అది జరిపిస్తాడు. అతడు వయస్సులో పెద్ద అయినా మాతో కలసి వుంటాడు. నిండు యౌవనంలో వున్నాడు. అయినా మాలో ఒకడుగా ప్రాణంలో ప్రాణంలా కలిసిపోయాడు. మాతో వున్నప్పుడు సమస్త లోకాల్ని మరిచిపోతాడు. తాను ఆనందిస్తాడు మమ్మల్ని ఆనందంలో ముంచెత్తుతాడు. తండ్రీ మానవుడు కదా అని శంకించవలసిన పనిలేదు. అతడితో మైత్రికి మేము ఎంతగానో గర్వపడుతున్నాము.

పుత్రులిద్దరూ ఏకకంఠంతో చెప్పేసరికి అశ్వతరుడు మరింక ప్రశ్నించలేదు. నాయనలారా సత్సాంగత్యం సకల శ్రేయోదాయకం. మీ స్నేహాన్ని కొనసాగించండి. అతడికి ప్రత్యుపకారంగా ఏమైన బహుమతులు మీరు కూడా ఇవ్వండి అని ప్రోత్సహించాడు.

తండ్రీ ఋతధ్వజుడుకి మనం ఇవ్వగలిగిన బహుమతులు ఏమీ లేవు. అన్నింటా అతడు మనకన్నా సంపన్నుడు. కాకపోతే అతనికి తీరని దిగులు మాత్రం వుంది. దాన్ని మరచిపోవడానికే అతను మాతో ఆటపాటలతో మునిగిపోతూంటాడు. ఆ దిగులు తీర్చగలిగితే అదే నిజమైన ప్రత్యుపకారం.

నాయనలారా మీ మిత్రుడి దిగులు ఒకటి, మీ దిగులు ఒకటీనా! తప్పక తీరుద్దాం శక్తివంచన లేకుండా ప్రయత్నిద్దాం అసలు ఆ దిగులేమిటో చెప్పండి.

జనకా మా మిత్రుడు వివాహితుడు. మదాలస అతని భార్య ఒక గంధర్వరాజకుమారి. సౌందర్యరాశి. ఒక రాక్షసుడి వంచనకు గురి అయి హఠాత్తుగా మరణించింది. అప్పటినుండీ ఋతధ్వజుడు ఆమెనే తల్చుకుంటూ పునర్వివాహమునకు మనసొప్పక కఠిన బ్రహ్మచర్యంతో గడుపుతున్నాడు. మాతోడిదేలోకంగా మెలుగుతున్నాడు. దిగులు మర్చిపోతున్నాడు. తండ్రీ ఆ దిగులు తీర్చగలమా?

పుత్రులారా తప్పక తీర్చగలం ముందు ఆ రాక్షసుడు ఎవరు? ఎలా వంచించాడు? ఆ వివరాలు చెప్పండి.

తండ్రీ మాకు తెలిసింది చెబుతాము ఆలకించండి. గాలవుడు అనే మహర్షి పేరు మీరు వినే వుంటారు. అతడు మహా తపస్వి. ఎక్కడో ఆశ్రమంలో శిష్య బృందంతో ఇతర మునిగణాలతో కలసి తపస్సు చేసుకుంటూ వుండే వాడు. ఒక రోజున ఒక దివ్యాశ్వం అధిరోహించి శత్రుజిత్తు మహారాజు దగ్గరికి ఆకాశమార్గంలో వచ్చాడు. శత్రుజిత్తు మహారాజు ఆశ్చర్యంతో అతిధి మర్యాదలు చేసాడు. గాలవుడు సంతోషించి మహారాజా మా ఆశ్రమంలో తపస్వులకు రాక్షసపీడ ఎక్కువగా వుంది. మా తపశ్శక్తిని ఉపయోగించి ఆ రాక్షసుల్ని శాపాగ్నికి గురిచేద్దామంటె వెనుకటికి విశ్వామిత్రుడు వలె తపస్సును వృధా చేసుకోవడం ఇష్టంలేదు. ఆ రాక్షస పీడను భరిస్తూ మాలో మేమే కుమిలి పోతూవున్నాము. ఒకనాటి మధ్యాహ్నం ఈ దివ్యమైన అశ్వం నాముందు నిలచింది. సూర్యుడి రథాశ్వంలాగా మెరిసిపోతున్న దీన్ని చూసి ఆశ్చర్యంగా

నిలబడ్డాను. అంతలోనే అశరీరవాణి వినిపించింది. గాలవా ఇది దివ్యాశ్వం. దీని పేరు కువలయ. సూర్యుడు నీకు పంపాడు. దీని గమనానికి అడ్డులేదు. ఇది ఆకాశంలో ఎగురుతుంది. నేల మీద పరుగెడుతుంది. పర్వతాల మీద దూకుతుంది. సముద్రాల్లో ఈదుతుంది. నీటిపై నడుస్తుంది. ఇది పాతాళాలలో చుట్టివస్తుంది. ఈ ఉత్తమజాతి గుర్రాన్ని శత్రుజిత్తు మహారాజు కుమారుడైన ఋతధ్వజునికి ఇచ్చి రాక్షస సంహారం చేయించుకో అని చెప్పింది. కాబట్టి శత్రుజిన్మహారాజా నీ దగ్గరకు వచ్చాను. నీ పుత్రుణ్ణి నాతో పంపు మునిజన సంరక్షణ చేసి వస్తాడు. ఈ దివ్యాశ్వంని అధిరోహించడం వల్ల నీ కుమారుడికి కువలాయాశ్వుడు అనే పేరు స్థిరపడుతుంది.

గాలవ ముని అభ్యర్థనను శత్రుజిత్తు మహారాజు ఆజ్ఞగా అంగీకరించి ధశరధ మహారాజు విశ్వామిత్ర మహర్షి వెంట రాముణ్ని పంపినట్లు నేను కూడా మీ వెంట మా చిరంజీవిని పంపిస్తున్నాను అన్నాడు. వెంటనే ఋతుధ్వజుడు తండ్రి పాదములకు నమస్కరించి దివ్యాశ్వముకు మ్రొక్కి దాని సకిలింపును అనుమతిగా గ్రహించి అధిరోహించి గాలవుడుతో సహా ఆశ్రమానికి చేరుకున్నాడు. అక్కడ వున్న ముని బృందానికి నమస్కరించి ఆశీస్సులు పొందాడు. ఆ నిమిషం నుండీ జాగరూకుడై ఆశ్రమ సంరక్షణ బాధ్యతలను స్వీకరించాడు.

ఒకనాటి సాయంకాలం గాలవాదులు సంధ్యోపాసన చేస్తూ వుండగా రాక్షసుడు పంది రూపంలో వచ్చి ఆశ్రమాన్ని అల్లకల్లోలం చేస్తున్నాడు. ఋతధ్వజుడు కువలయాశ్వాన్ని అధిరోహించి ఆ మాయా పందిని వెంబడించాడు. బాణం దెబ్బలు తప్పించుకుంటూ శరవేగంగా పరుగు తీస్తోంది ఆ పంది. కువలయాశ్వుడు వెంటబడి తరుముతున్నాడు. ఎట్టకేలకు ఒక బాణం దాని డొక్కలో గ్రుచ్చుకుపోయింది. అయినా అది లెక్క చేయకుండా పరుగెడుతూ చివరకు అది పాతాళానికి చేరింది. రాకుమారుడు దాని వెంట పాతాళలోకానికి చేరుకున్నాడు. అది ఒక దివ్య భవనంలోకి ప్రవేశించి అదృశ్యమయ్యింది. కువలాయాశ్వుడు ఆ భవనం అంతా వెదికాడు. కానీ ఆ మాయా పంది జాడ కనిపించలేదు. కాని ఒక ద్వారంవద్ద ఒక కాంతామణి కనిపించింది. కువలాయాశ్వుడికి సందేహం వచ్చింది. రాక్షసుడే ఆ రూపం ధరించాడేమోనని, ఆమె రాక్షసుడేనని సంహరిస్తే ఒక వేళ కాని పక్షంలో స్త్రీ హత్యా పాతకం చుట్టుకుంటుందేమో అడిగి చూద్దామని గంభీరస్వరంతో ఇలా అన్నాడు. నారీ ఎవరు నీవు? ఈ దివ్య మందిరం ఎవరిది? నువ్వు ఇక్కడ ఎందుకువున్నావు? ఆ అమ్మాయినోట ఏ ఉలుకూ లేదు పలుకూ లేదు. ఒకసారి కువలయాశ్వున్ని ఎగా దిగా చూసి కనురెప్పలు టపటప ఆర్పి భవనం పైభాగానికి మెట్ల మీదుగా తుర్రుమని జారుకుంది. కువలుడు కూడా సౌధాగ్రం చేరుకున్నాడు. గుర్రం దిగాడు. ఆ సుందరి వెంట తాను కూడా సౌధాగ్ర మందిరంలోకి ప్రవేశించాడు పరుగు పరుగున.

అది ఒక పాలరాతి మందిరం. విశాలంగావుంది. స్తంభాల మీద అపూర్వ శిల్ప సంపద ఉట్టి పడుతోంది. ఆ మందిరంలో ఎక్కడ వాలిన చూపు అక్కడే నిలిచిపోతోంది. మందిర మధ్యభాగంలో బంగారు వేదిక, దాని మీద హంసతూలికాతల్పము. దాని చుట్టూ ఉల్లిపొరల్లాంటి తెల్లని దివ్యాంబరం గొడుగులా వేలాడుతోంది. ఆ తెరలోపల వేదికపై ఒక సుందరి. తెలిమబ్బుల్లో చందమామలా దోబూచులాడుతోంది. పరికించి చూసాడు. కళ్ళు చెదిరిపోయే సౌందర్యం ఆమెది. మన్మధుణ్ని విడిచి వచ్చిన రతీదేవిలావుంది. పాతాళలోకాధి దేవత కాబోలు అనుకున్నాడు ఋతధ్వజుడు. ఆమె కువలయాశ్వుణ్ని చూడగానే తల్పందిగి తలవంచుకొని ఒయ్యారంగా నిలబడింది. కుడికాలిపై బరువు ఆనించి ఎడమకాలి బొటన వ్రేలితో నేలను రాస్తోంది. ఎడమ చేతిలో కమలాన్ని కుడి చేతితో సుతారంగా పొదివిపట్టుకొని పావురం వీపు నిమిరినట్లుగా కమలం రేకులు ముడుచుకొనేలా కలుపుతోంది. కడగంటి చూపులు

విసురుతోంది. అతడు చూస్తుంటే కన్నులు దించుకుంటోంది. చూపులు కలిస్తే కలవరంతో కన్నులు దించుకుంటుంది. ఆమెకు తెలియ కుండానే పెదవులపై చిరునవ్వులు విరుస్తున్నాయి. బుగ్గల్లో గులాబీలు రేకులు విప్పుకుంటున్నాయి. ఋతధ్వజునిలో అభిలాష మొదలయింది. రెండడుగులు ముందుకేశాడు. ఆ సుందరాంగి చేరువలో నిలబడ్డాడు. పలకరించాలని తహతహ బయలుదేరింది. అతిథి మర్యాదలు చేయదా? కనీసం పలుకదా? రండి కూర్చోండి అనదా? అని ఎదురు చూపులు మొదలయ్యాయి. అతడు చేరువకు వస్తున్నకొద్దీ ఆ లావణ్యవతిలో కళవళ బయలుదేరింది. కువలయాశ్వుడి ముఖంలోకి ఒక్కసారిగా చూసి వెంటనే చూపులు దించుకుంటోంది. ఆమె కన్నుల నుండి రెండు అశ్రుబిందువులు హఠాత్తుగా రాలి ఆమె గుండెల మీదకు జారాయి.

కువలయాశ్వుడు ఆశ్చర్యంతో నివ్వెరపోయాడు. ఇంతటి సౌందర్యరాశికి దుఃఖమా? ఇన్ని సంపదలు వుండి కన్నీరా? కారణం ఏమిటో తెలుసుకోవలసిందే అనుకొని మృదువుగా ఇలా పలకరించాడు. సుందరీ నీవు ఎందుకు దుఃఖిస్తున్నావు? నా రాక నీకు ఇష్టం లేదా? ఇంత అందంవుండీ సంపద వుండీ నీకు కన్నీరేమిటి? ఇంతకీ అసలు నువ్వు ఎవరు? పేరేమిటి? నీ తల్లితండ్రులు ఎవరు? ఈ పాతాళ నివాసం ఏమిటి? ఋతధ్వజుడు ప్రశ్నిస్తున్నాడే తప్ప ఆమె మాత్రం సమాధానం చెప్పడంలేదు. ఇంతలో ఇంతకు ముందు సింహద్వారం దగ్గర కనిపించిన సుందరాంగి వచ్చింది. ఆ యువతులు ఇద్దరూ గుసగుసలాడుకున్నారు. ఇంతకు ముందు కనిపించిన సుందరి కువలయాశ్వుడి దగ్గరగా వచ్చి ఇలా అంది. మహావీరా, నీకు స్వాగతం అతిథి మర్యాదలు జరుపని మా అజ్ఞానాన్ని క్షమించు. ఇంతకీ మీరు ఎవరు? కిన్నెర, కింపురుష, గంధర్వులలో ఏ జాతివాడవు? మమ్మల్ని ఈ నరక యాతన నుండి తప్పించడానికి వచ్చిన దేవతవా? ఎవరు మీరు? తెలియజెప్పి మా సందేహసంకటాలను తొలగించండి. అప్పుడు మాత్రమే నేను గాని మా రాకుమారి గాని నీతో ధైర్యంగా మాట్లాడుతాం.

ఈ ప్రశ్నలకు కువలయాశ్వుడు బదులు ఇలా చెప్పాడు. సుందరీ సింహద్వారంలో కనిపించి నా ప్రశ్నలకు జవాబుచెప్పకుండా ఇక్కడికి పరుగుపరుగున వచ్చావు మీకు వచ్చిన ఆపద ఏమిటి? మీరిద్దరూ అసలు ఎవరు? భయపడకండి నేను రాక్షసుణ్ని కాదు, దేవతనూ కాను. సామాన్య మానవుణ్ని రాజకుమారుణ్ని. శత్రుజిత్తుపాలుడి కుమారుణ్ని మీ విషయాలు తెలియజెయ్యండి. చేతనయినంత సహాయం చేస్తాను.

మళ్ళీ సుందరాంగులిద్దరూ చెవులు కొరుక్కున్నారు. పరిచారక లాగ కన్పిస్తున్న సుందరి ఇవతలకి వచ్చి ఇలా అంది. రాకుమారా విశ్వాసువు అనే పేరు వినే వుంటావు. గంధర్వరాజు. వారి గారాల కూతురు ఆమె. పేరు మదాలస. నేను ఈమె ఇష్టసఖిని. నన్ను కుండల అంటారు. ఇది పాతాళలోకం. ఇది ఒక రాక్షసుడి భవనం. వాడిపేరు పాతాళ కేతువు. వీడి తండ్రి పేరు చంద్రకేతువు. వాడూ రాక్షసుడే. గంధర్వలోకంలో ఉద్యానవనంలో హాయిగా విహరిస్తున్న ఈ మదాలసను నన్నూ పాతాళ కేతువు తన తమో విద్యను ప్రయోగించి అపహరించి తెచ్చి ఇక్కడ బంధించాడు. మదాలస తనను వివాహం చేసుకోవాలట. ఎంతగానో ఒత్తిడి చేస్తున్నాడు. అన్ని ఉపాయాలు పన్నుతున్నాడు. ఈమె తిరస్కరిస్తూంది. అయినా ఆ మూర్ఖుడు పట్టువదలడంలేదు. రేపు త్రయోదశినాడు బలవంతంగానైనా పెళ్ళి చేసుకొని తీరతానని నిన్ననే బెదిరించి వెళ్ళాడు. మదాలస భయపడి ప్రాణత్యాగానికి సిద్ధం అయ్యింది. ఇంతలో కామదేనువు ప్రత్యక్షమై ఆమెను వారించింది. మదాలసా తొందరపడకు ఈ రక్కసుడు నిన్ను వివాహం చేసుకోలేడు. ఈ రోజే

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

వీడికి మరణం నిశ్చయం అయ్యింది. కాసేపట్లో వీడు భూలోకానికి వెళ్తాడు. అక్కడ ఒక ముని ఆశ్రమంలో అలజడి సృష్టిస్తాడు. అప్పుడొక రాజకుమారుడు వీణ్ని బాణంతో కొడతాడు. ఆ మహావీరుడే నిన్ను వివాహం చేసుకుంటాడు. ఎక్కడి పాతాళం ఎక్కడి భూలోకం అని ఆశ్చర్యపడకు రేపటికి అంతా నీకే తెలుస్తుంది. ఇలా కామధేనువు ధైర్యంచెబితే మా రాకుమారి ఆత్మ హత్యా ప్రయత్నం నుండి విరమించుకుంది.

సింహద్వారం దగ్గర నీ ప్రశ్నలకు నేను బదులు పలుకలేదు. క్షమించు. నురుగులు కక్కుతూ పంది రూపంలో పారిపోయివస్తున్న పాతాళకేతువును చూశాను. వాడి డొక్కలో నాటుకున్న బాణం చూశాను. కామధేనువు నిన్న చెప్పిన మాటలు ఈ రోజే నిజమైపోతున్నయా అనే సంబరంతో ఈ శుభవార్తను మదాలసకు చెప్పాలనే ఉత్కంఠతో మెట్ల వెంట సౌధాగ్రం మీదకి పరుగులు తీశాను. నిన్నూ నీ ప్రశ్నలనూ పట్టించుకోలేదు. అవును, నేను మెట్లు ఎక్కివచ్చేలోగానే నువ్వు సౌధాగ్రం చేరుకున్నావే. అంత వేగంగా ప్రయాణించే శక్తి నీకు ఎలా వచ్చింది. మానవ మాత్రుణ్ణి అంటున్నావు. ఇది ఎలా సాధ్యం? ఆకాశయానం వాయువేగం ఈ సౌందర్యం ఈ రూపసౌష్టవం - ఇవన్నీ అతిమానుషమైన విషయాలే. దయచేసి నిజం చెప్పు. ఆ పందిగాణ్ని నువ్వే తరుముకుంటూ వచ్చావా? లేకపోతే, కాక తాళీయంగా జరిగిందా?

కుండలా! నీ సందేహం సమంజసమే. గాలవ మహర్షి ఆశ్రమంలో అలజడి సృష్టిస్తున్న పందిని నేనే తరుముకుంటూ వచ్చాను. నా బాణం దెబ్బ తగిలినా వాడు ప్రాణాలతో పారిపోయి వచ్చాడు. గాలవ మహర్షికి సూర్యదేవుడు బహుకరించిన దివ్యాశ్వాన్ని అధిరోహించడంవల్ల నాకు వాయువేగ మనోవేగాలు సాధ్యపడ్డాయి. దీన్ని అధిరోహిస్తే పాతాళానికేమిటి ఊర్ధ్వలోకాలకేమిటి ఎక్కడికైనా క్షణంలో చేరుకోవచ్చు. బహుశ నీకు నీ రాకుమారికీ సందేహాలన్నీ తీరిపోయాయనుకుంటాను. నేను మానవ మాత్రుణ్ణే, ముమ్మాటికీ రాకుమారుణ్ని. మా తండ్రిపేరు శత్రజిన్మహారాజు. నన్ను ఋతుధ్వజుడంటారు. ఈ గుర్రం పేరు కువలయాశ్వం. అందుచేత నన్ను కూడా కువలయాశ్వుడన్నారు ఆశ్రమవాసులు కొందరు.

ఉన్నట్టుండి మదాలస బుగ్గలు ఎరుపెక్కాయి. కన్నులు చెమరించాయి. కన్నుల్లో చూపుల్లో ఒక బెదురు తొంగిచూసింది. ప్రథమ సందర్శనంలో అంకురించిన అభిలాష ఇప్పుడు పల్లవించింది. అతడి ఎదుట నిలబడలేక పోతోంది. అలాగని వెళ్ళిపోనూ లేకపోతోంది. ఈ అవస్థను గుర్తించింది కుండల. రాకుమారుడివైపు చూసి సాభిప్రాయంగా నవ్వింది.

రాకుమారా! కామధేనువు చెప్పిన మానవ మహావీరుడవు నువ్వే. నీ చేతిలో పాతాళకేతువు సంహరింపబడతాడు మా మదాలస తపస్సులు ఫలించాయి. మేము గంధర్వులం. అమంత్రకమైన గాంధర్వ వివాహం మాకు పరిపాటి. ఈ దివ్యాశ్వం మీద అధిరోహింపజేసి మదాలసను మీ రాజ్యానికి తీసుకెళ్ళు. కావలసివస్తే అక్కడ మీ పద్ధతిలో వివాహం జరిపించుకో.

కుండలా! నీ వంటున్న ప్రతి మాటా నాకూ సమ్మతమే. నా మనస్సులో మెదలుతున్న వూహలనే నువ్వు పలుకుతున్నావు. కానీ నాదొక చిన్న అభ్యంతరం. మీరు గంధర్వులు. గాంధర్వ వివాహం మీకు శోభిస్తుంది. మేము మానవులం. సమంత్రకంగానే మాకు వివాహం జరగాలి. అదీగాక నేనింకా తండ్రిచాటు బిడ్డను. తల్లిదండ్రుల అనుమతి

లేకుండా వివాహం జరుపుకోవడం నాకంతగా నచ్చదు. ప్రస్తుతం గాలవమహర్షి అధీనంలో ఆశ్రమ రక్షకుడుగా ఉన్నాను. కాబట్టి వారి అనుమతి కూడా అవసరం.

కువలయాశ్వా! మదాలసను వివాహమాడటం ఇష్టమేనన్నావు. అది చాలు. మిగతా అభ్యంతరాలు నేను తీరుస్తాను. కులగురువులు పితృసమానులని శాస్త్రం చెబుతోంది. నా యోగశక్తితో మీ కుల గురువులు తుందిల మహర్షిని ఇక్కడికి రప్పిస్తాను. వారు మీ కులాచారం ప్రకారం సమంత్రకంగా వివాహం జరిపిస్తారు. దీనితో నీ అభ్యంతరాలన్నీ తొలగిపోతాయి.

ఋతుధ్వజుడు అంగీకరించాడు. కుండల తన యోగ మాయా శక్తితో తుందిల మహర్షిని ఆహ్వానించింది. వారు వివాహానికి అవసరమైన వస్తుసామగ్రితో విచ్చేశారు. సమంత్రకంగా మదాలసా ఋతుధ్వజులకు అగ్నిసాక్షిగా వివాహం జరిపించారు, దక్షిణ తాంబూలాదులు స్వీకరించి తన ఆశ్రమానికి వెళ్ళిపోయారు. కుండల కూడా నవదంపతులను దీవించి తన గంధర్వ లోకానికి తాను వెళ్ళిపోయింది.

పంది రూపంలో పారిపోయివచ్చిన పాతాళకేతువు తన సోదరుడు తాళకేతువుతో మంతనాలు జరిపి రాక్షస మహాసైన్యాన్ని సమకూర్చుకుని తాను మదాలసను బంధించి ఉంచిన సౌధం దగ్గరకి వచ్చాడు. తనను వెన్నంటి తరుముకంటూ వచ్చిన కువలయాశ్వుడు అక్కడే గదా ఆగిపోయాడు. ఒంటరిగా దొరుకుతాడు. సైన్యంతో చుట్టుముట్టి మట్టు పెడదామని ఆశించి వచ్చాడు.

మదాలసను తన దివ్యాశ్వం మీద ఎక్కించుకొని భూలోకానికి బయలు దేరపోతున్నాడు కువలయాశ్వుడు. సరిగ్గా అదే సమయానికి పాతాళకేతువు సైన్యంతో వచ్చిపడ్డాడు. జాగ్రత్తగా కూర్చోమని మదాలసను హెచ్చరించి కువలయాశ్వుడు ధనుష్టంకారం చేశాడు. ఆ దివ్యాశ్వం మీద అనూహ్యామైన వేగంతో అనుహ్యామైన దారుల్లో మెరుపుతీగలా తిరుగుతూ మొత్తం దైత్యమహాసైన్యాన్ని అవలీలగా సంహరించాడు. పాతాళకేతువును ఖండించి విజయశంఖం పూరించాడు. తాళకేతువు తన అనుచరులు మరికొంతమందితో పలాయనం చిత్తగించాడు.

మదాలసా సహితుడై కువలయాశ్వుడు భూలోకానికి వచ్చి గాలవమహర్షికి నమస్కరించి పాతాళ కేతు వధను వివరించి ఆశీస్సులు అందుకొని తన రాజధానికి వెళ్ళిపోయాడు. కువలయాశ్వానికి తగిన విడిది ఏర్పాటు చేయించాడు. తల్లిదండ్రులకు ఆ నవ దంపతులుపాదాభివందనం చేసి, దీవెనలు అందుకొని, అంతఃపురంలో ప్రవేశించారు. రాజభోగాలు అనుభవిస్తూ శృంగార క్రీడా విలాస వినోదాలతో మురిసిపోతున్నారు.

## తాళ కేతువు కుతంత్రం

కొడుకూ కోడళ్ళ అనుకూల దాంపత్యాన్ని చూసి సంబరపడి పోతున్న శత్రుజిన్మహారాజు ఒకరోజు కొడుకును చేరబిలచి ఇలా అన్నాడు. నాయనా కుమారా అప్పుడప్పుడు సాయంకాలం వేళల్లో అయినా ముని వాటికల వైపుకి వెళ్ళి ఆశ్రమవాసుల క్షేమ సమాచారములు తెలుసుకొని వస్తూవుండు. వారి కుశలమే మన కుశలం. వారి దీవెనలే మనకు శ్రీరామరక్ష. ఇది మనరాజ ధర్మం కూడా. అని మృదువుగా ఉపదేశించాడు. ఋతుధ్వజుడు అంగీకరించి మరునాటి సాయంకాలం కువలయాశ్వాన్ని అధిరోహించి పవిత్ర యమునాతీరంలోని అడవిలోకి వెళ్ళాడు. అక్కడొక దివ్యమైన ఆశ్రమం కనిపించింది. చిత్ర విచిత్ర విరాజితమైన పర్ణశాలలు కనిపించాయి. ఒక్కొక్క పర్ణశాలలో నేల కూడ ఒక్కొక్క

రంగులో వుంది. ఆ పర్ణ శాలల చుట్టూతా తీర్చిదిద్దబడిన అందమైన ఉద్యానవనములు. ఆ వనాలలో వివిధ రూపాల్లో ఉన్న పొదరిల్లులు. కొన్ని దేవతామూర్తుల రూపాల్లో, కొన్ని రథాకారాలలో కొన్ని గజాశ్వాది జంతువుల ఆకృతిలో కొన్ని వివిధ పక్షి జాతుల రూపాలలో ఉన్నాయి. వివిధ కంఠ స్వరాలతో పలకరిస్తున్న పక్షులు జంతువులు కనీ వినీ ఎరుగని పువ్వులు, ఫలాలు. ఆశ్చర్యచకితుడై ఋతధ్వజుడు ఆశ్రమం అంతటా తిరిగాడు. తను ఏ ప్రక్కకు వెళ్ళినా పచ్చని స్వాగత తోరణాలు అప్పుడే తనకోసమే కట్టినట్లుగా వున్నాయి. ఋతధ్వజుని ఆనందానికి అంతులేకుండా పోయింది. పర్ణశాలల నుండి మెల్లగా పెల్లుబికి వస్తున్న హోమధూపం. బూడిద వర్ణంలో వినువీధికి ప్రయాణం చేస్తుంది. పెద్ద వృక్షవాటికల క్రింద వేదపనసలకు సంతచెప్పుకుంటున్న శిష్యబృందాలు. ఇంతలో ఒక పర్ణశాల దగ్గర ఒక మహర్షి తన కోసమే ఎదురు చూస్తూవున్నట్లుగా అర్ఘ్యపాత్రతో కనిపించాడు. ఆ మహర్షి ముఖంలో తేజస్సు కన్పిస్తోంది, కాని కన్నుల్లో ప్రశాంతి కనబడటం లేదు. ఆ మహర్షి ఏదో కలత చెంది కలవరపడుతున్నట్లు అనిపించింది. ఋతధ్వజుడు దగ్గరికి వెళ్ళి పాదాభివందనం చేశాడు. మహర్షి సాదరంగా ఆత్మీయంగా దారితీసాడు. మహర్షీ తమరెవరు? మీ చూపుల్లో ఏదో కలవరపాటు కన్పిస్తోంది నిజమో అది నా భ్రాంతియో. మీ ఆశ్రమానికి ఏ రాక్షసుల పీడలు లేవుగదా క్రూరమృగాల బెడద కూడా లేదు కదా. ఫలం, పుష్పం సమిధలు, జలం ఇవన్ని మీకు సమృద్ధిగాలభిస్తున్నాయా? మా తండ్రిగారు శత్రుజిన్మహారాజు మిమ్మల్ని దర్శించి కుశల వార్తలు తెలుసుకొని రమ్మన్నారు అన్నాడు.

అప్పుడా మహర్షి నాయనా రాకుమారా! తండ్రికి తగిన తనయుడవు నీవు. చాలా సంతోషంగావుంది. అడవిలో కందమూల ఫలాదులు తింటూ జీవించేవాళ్ళం అడవిలో మాకు ఎలాంటి బాధలు లేవు హాయిగా మా జపాలు మా తపస్సులు చేసుకుంటున్నాం అయినా అడివిలోకి వచ్చి మా క్షేమ సమాచారములు కనుక్కొనే పాలకులు వుండడం మా అదృష్టం. అయితే నా కన్నుల్లో దాగిన కలవర పాటును నీవు గ్రహించావు. దానికి కారణంవుంది. నేను ఒక యజ్ఞం చేస్తున్నాను. అది ముగింపుకొచ్చింది. ఇప్పుడు భూరిదక్షిణలు సమకూర్చుకోవాలి. ఎలాగా అనే దిగులు. బహుశ అదే నా కన్నుల్లో నీకు కనిపించివుంటుంది. నీకు అభ్యంతరం లేకపోతే నీ మెడలో ధగధగలాడుతున్న రత్న హారాన్ని ఇచ్చి వెళ్ళు అన్నాడు. ఆ మహర్షి అడగడమేమిటి రాకుమారుడు ఇవ్వడం తక్షణం జరిగిపోయాయి. అప్పుడా మహర్షి రాకుమారా నీ దాతృత్వం నన్ను మురిపిస్తోంది, సంతోషం. ఇక్కడేవుండు. నేనొకసారి యమునానదికి వెళ్ళి జలాధి దేవతను అర్చించి ఇప్పుడే వస్తాను. నీకు ఆశీస్సులిస్తాను. అవి అందుకొని వెడుదువుగాని - అంటూ ఆ మహర్షి త్వరత్వరగా నదివైపుకి వెళ్ళాడు.

పిచ్చివాడు నన్ను నిజంగానే మహర్షి అనుకుంటున్నాడు. ఇది నిజంగానే ఆశ్రమం అనుకొంటున్నాడు. కన్నుల్లో కలవరపాటుని గుర్తించాడు కానీ నన్ను తాళకేతువుగా గుర్తించలేకపోయాడు. నా అన్న పాతాళ కేతువును సంహరించిన ఈ దుష్టుడికి తగిన ప్రతీకారం చేస్తాను. నా అన్న ఆత్మకు శాంతి కలిగిస్తాను అనుకున్నాడు దొంగ మహర్షి. ఋతధ్వజుడు చేతికి చిక్కాడన్న సంబరంతో తాళకేతువు యమునా నదిలోకి దిగాడు. తన మాయాశక్తితో అదృశ్యమై వెళ్ళి శత్రుజిన్మహారాజు ముందు ప్రత్యక్షమయ్యాడు.

భార్యతో, కోడలితో కూర్చుని ఆ మహారాజు ఏదో వినోదం తిలకిస్తున్నాడు. హఠాత్తుగా ప్రత్యక్షమైన మహర్షిని చూసి ఆశ్చర్యంతో అందరూ లేచి నిలబడ్డారు. పరిచారకులు అర్ఘ్యపాద్యాదులు సమకూర్చారు. అతిథి మర్యాదలు జరిపారు. మహారాజా నాకు నోరు రావడంలేదు. ఇంతటి అప్రియమైన వార్తను నీకు అందించవలసిన దుఃస్థితి నా

నొసటరాశాడు భగవంతుడు. ఇదిగో కంఠహారం మీ కుమారుడిది. ఎవడో మాయావిరాక్షసుడు ఋతధ్వజున్ని పొట్టన బెట్టుకున్నాడు. కువలయాశ్వాన్ని అపహరించుకుపోయాడు. మా ఆశ్రమానికి చేరువలోనే ఈ ఘోరం జరిగింది. ఆశ్రమ వాసులందరూ కలసి రాకుమారుని పార్థివ శరీరానికి అంత్యక్రియలు జరిపించారు. ఈ రత్న హారాన్ని మీకు అందించి మిమ్మల్ని ఓదార్చి ధైర్యం చెప్పి రమ్మని నన్ను పంపించారు మా ఆశ్రమవాసులందరూ. నా తపశ్శక్తిని ధారపోసి వాయువేగమనోవేగములతో నీ ముందు ప్రత్యక్షమయ్యాను. మహారాజా అనిత్యాని శరీరాణి అన్నారు. జాతస్యహి ధ్రువో మృత్యుః అన్నారు. నీకు తెలియనివికావు. తాపసులం మమ్మల్నే ఈ సంఘటన కంటతడి పెట్టించింది. ఇక కన్నవారి సంగతి కట్టుకున్న వారి సంగతీ వేరే చెప్పాలా? గుండె దిటవు చేసుకోండి. చిన్నపిల్ల మదాలసను ఓదార్చండి అంటూ వచ్చినంత వేగంగానూ మాయ మయ్యాడు.

ఋతధ్వజుడి తల్లితండ్రులు ఈ పిడుగులాంటి దుర్వార్తను తట్టుకోలేక మూర్ఛపోయారు. మదాలస అయితే ప్రాణాలనే వదిలేసింది . కాసేపటికి తెలివి వచ్చిన అత్తమామలుకి ఈ వార్త మరొక అశనిపాతమయ్యింది. రాజధానిలో విషాద వాతావరణం అలుముకుంది. రాజధానిలో మాయమైన కపట మహర్షి తాళకేతువు మళ్ళీ ఇక్కడ ఆశ్రమంలో ప్రత్యక్షమైనాడు. తన రాక కొరకు ఎదురుచూస్తున్న ఋతధ్వజుడ్ని మృదువుగా కౌగలించుకొని చిరంజీవ చిరంజీవ అని ఆశీర్వదించాడు. నాయనా రాకుమారా నన్ను కృతార్థుణ్ణి చేసావు. చాలా సంతోషం. నేను చెయ్యాలని అనుకున్న వన్నీ చేసేశాను. నీకు ఆశీస్సులు కూడా ఇచ్చేశాను. కనుక నువ్వు ఇంక నీ రాజ్యానికి బయలుదేరవచ్చు అన్నాడు.

ఋతధ్వజుడు మాయా మహర్షికి మరో మారు సాష్టాంగ నమస్కారం చేసి సెలవు తీసికొని తన కువలయాశ్వం అధిరోహించి రాజధానికి చేరుకున్నాడు. తనను చూసిన పౌరులందరూ గుసగుసలాడు కుంటూ నివ్వెరపోయి చూస్తున్నారు. పోనీలే బ్రతికేవున్నాడు. ప్రాణాలతో తిరిగివచ్చాడు అదృష్టవంతులం చిరంజీవ చిరంజీవ అంటూ వున్నారు. రాకుమారుడు ఇది ఏమిటో ఎందుకిలా వారు అంటున్నారో అర్థంకాలేదు రాజమందిరం చేరుకున్నాడు. దాసదాసీజనం ద్వారపాలకులు అందరూ విస్తుపోయారు. అందరూ గొణుక్కుంటూ చెమ్మగిల్లిన కళ్ళతో దీవిస్తున్నారు. తల్లితండ్రులూ ఆశ్చర్యపోయి అవాక్కయి అలాగే చూస్తూవుండిపోయారు. పాదాభివందనం చేసిన తనను తండ్రి ఆనందభాష్పాలు రాలుస్తూ ఉక్కిరి బిక్కిరి అవుతూ ఆప్యాయంగా ప్రేమతో కౌగలించుకున్నాడు. నాయనా మనం అదృష్టవంతులం నువ్వు జీవించేవున్నావు చాలు అంటూ ప్రేమగా శిరస్సు నిమిరాడు. తల్లి కూడా అలాగే దుఃఖం ఆనందం కలగలపి అవును అవును అంటూ ప్రేమగా వీపు నిమిరింది.

ఋతధ్వజుడు తండ్రితో - తండ్రీ ఏమిటి ఇందతా? ఏమయ్యింది మీకు? నేను బాగానే వున్నాను. నీ ఆజ్ఞప్రకారం యమునా తీరంలోని ఆశ్రమాలకి వెళ్ళాను. మునుల్ని సందర్శించాను. ఆశీస్సులు అందుకున్నాను. ఒక మహర్షి అడిగితే నా కంఠంలోని రత్నహారం బహుకరించాను. సంపూర్ణ ఆశీస్సులు అందుకొని హాయిగా తిరిగివచ్చాను. ఇంతకీ ఏదీ నా ప్రాణ ప్రియ మదాలస కనిపించడంలేదు? ఎక్కడికెళ్ళింది? అన్నాడు.

కొడుకుకి ఏం సమాధానం చెప్పాలో ఆదుర్వార్తను ఎలా అందించాలో అర్థంకాలేదు. నాయనా అన్యాయం జరిగిపోయింది. ఎవడో కపట ఋషి అన్యాయంగా మోసం చేసాడు. నీ కంఠ హారం తెచ్చియిచ్చి నిన్ను రాక్షసుడెవడో హత్య చేసాడని నమ్మపలికాడు. తట్టుకోలేక మూర్ఛపోయాం మేము. నీ భార్య ప్రియ మదాలస ఆ మాటలు నమ్మి

ప్రాణాలు వదిలేసింది. నువ్వు తిరిగి రానిలోకాలకు వెళ్ళి పోయావుగదా అని నేనే ఈ పాపిష్టిచేతులతో కోడలికి ఉత్తరక్రియలు జరిపించాను. ఇదిగో ఋషిఇచ్చిన కంఠహారం అంటూ హారాన్ని అందించాడు తండ్రి శత్రుజిన్మహారాజు.

ఋతధ్వజుడు ఈ వార్త విని అవాక్కయ్యాడు. విషయం అర్థం అయ్యింది. మనస్సు కుతకుతలాడింది. కువలయాశ్వాన్ని ఎక్కి యమునా తీరానికి వెళ్ళాడు. అక్కడ ఇంతకు ముందు కనిపించిన ఆశ్రమంగాని, పర్ణశాలలు గాని, చిత్ర విచిత్ర రూపాల స్వాగత తోరణాలు గాని ఏ ఒక్కటీ ఆనవాలుకైనా లేవు. అన్ని పిచ్చిమొక్కలు -పొదలతో ఆ ప్రదేశం నిండివుంది. ఇది కచ్చితంగా రాక్షసుల కుట్ర. పాతాళ కేతువును సంహరించినందుకు వాడి సోదరుడు తాళకేతువు ఇలా కుట్ర పన్ని కసితీర్చుకున్నాడన్నమాట. అలనాటి యుద్ధంలో వాణ్ని కూడా సంహరించివుంటె సరిపోయేది. పారిపోయి పిరికిపంద ఇలా దొంగదెబ్బ తీసాడు. నా ప్రియ మదాలసను పొట్టన బెట్టుకున్నాడు. నాకు కడలేని దుఃఖం మిగిల్చాడు. సరే ఇప్పుడేమి విచారించి ఏమి లాభం కనిపించని శత్రువు మీద కసితీర్చుకొనేదెలాగ? కనిపించని లోకాలకు వెళ్ళిపోయిన ప్రాణ ప్రియపట్ల ఋణం తీర్చుకొనేదెలాగ? ఇవే ఆలోచనలతో క్షణంలో రాజధానికి తిరిగి వచ్చాడు. ఏ రాక్షసుడు ఈ మోసం చేసాడో తండ్రికి వివరించాడు. యాగరక్షణకు వెళ్ళి నందుకు, ముని వాటికలకు రాక్షస పీడ తొలగించినందుకు శ్రీరామచంద్రుడికి దక్కిందేమిటి? రాక్షసాగ్రహం సీతాపహరణం. తండ్రీ నాకు అదే జరిగింది. గాలవ ముని వెంట పంపుతూ నాకు మీరు ఆపోలిక కూడా తెచ్చారు. నిజమే అప్పుడు మీరు ధశరధులయ్యారు. ఇప్పుడు నేను భార్యావియోగినయ్యాను. దుఃఖంలో శ్రీరామచంద్రుణ్ని అయ్యాను. ఆ శ్రీరామప్రభువులాగే నేనూ దీక్షను స్వీకరిస్తున్నాను. ఏక పత్నీ వ్రతదీక్ష తండ్రీ ఈజన్మలోగానీ మరొక జన్మలో గాని నాకు భార్యంటూ ఏర్పడితే అది మదాలస మాత్రమే అవుతుంది. ఇంకెవరినీ చేపట్టను. నన్ను వలచి ఎక్కడో గంధర్వలోకం నుంచి వచ్చి నాకు దాంపత్య జీవన మాధుర్యాలు పంచిన ప్రాణసఖి మదాలస కోసం ఎన్ని జన్మలైనా నిరీక్షిస్తాను. ఋణం తీర్చుకుంటాను అన్నాడు ఋతధ్వజుడు. ఇలా భీషణ ప్రతిజ్ఞ చేసి ఆనాటి నుండి తన యౌవనాన్ని పరిత్యజించి అన్నెంపున్నెం ఎరుగని బాల్యంలోనే గడుపుతూవున్నాడు మా వయస్సు పిల్లలతో తాను ఒకడుగా కలిసిపోయి ఆటపాటలతో క్షణంతీరిక లేకుండా కాలక్షేపం చేస్తున్నాడు. తండ్రీ నాగరాజా ఇదీ మా మిత్రుడికి జరిగిన అన్యాయం. తాళకేతువు చేసిన మోసం. దీనికేమైనా విరుగుడు ఆలోచించి మా ప్రాణమిత్రుడి దిగులు తొలగించగలిగితే అది మనమివ్వదగిన సరియైన బహుమానం అవుతుంది. అప్పుడు మేము స్నేహ ఋణం తీర్చుకొన్నవాళ్ళం కాగలుగుతాము.

పుత్రులిద్దరూ ఏక కంఠంగా బ్రతిమాలుకున్నారు. నాగరాజు అశ్వతరుడు క్షణం ఆలోచించాడు. తనయుల్లారా మీరింతగా చెబుతున్నారు కనుక తప్పకుండా ప్రయత్నం చేద్దాం. పరోపకారం కన్నా పరమ ధర్మం ఏముంది. ప్రయత్నం చేద్దాం ఫలప్రదాత ఆ దైవం ఉండనే వున్నాడు. ధైర్యేలక్ష్మీః ప్రశీదతి అన్నారు పెద్దలు. కాబట్టి నా ప్రయత్నం నేను చేస్తాను. ఇలాంటివి నెరవేరాలంటె తపస్సొక్కటే సాధనం. మీ మిత్రుడికోసం సరస్వతీదేవిని ఆరాధిస్తాను. ఆమె తప్పక అనుగ్రహిస్తుంది. అంటూ అశ్వతరుడు ఆ క్షణంలోనే తపస్సుకు బయల్దేరి సరాసరి హిమాలయాలకు చేరుకున్నాడు. ఒక గిరిశిఖరంపై స్థిరచిత్తంతో యమ నియమాలతో తపస్సుకి కూర్చున్నాడు. సర్వార్థ ప్రకాశికయైన వాగ్దేవిని (సరస్వతిని) త్రికరణ శుద్ధిగా ఆరాధించాడు. ఇలా స్తుతించాడు.

# అశ్వతర కృత సరస్వతీ స్తుతి

జగద్ధాత్రీ! మహాదేవీ! వేదజననీ! సరస్వతీ! మోక్షాదికమని చెప్పబడుతున్న ఏ అసత్తు కలదో దానికి ఆశ్రయ భూతులు అయిన అసత్తులు వున్నారో-అవి అన్ని చిద్రూపిణి, నాదరూపిణి అయిన నీలో సంయోగ సంబంధంతో ప్రకాశిస్తున్నారు. అందుచేతనే నీవు పరాత్పర రూపమైన అక్షర పరబ్రహ్మవు. దారువులో అగ్ని దాగివున్నట్లు, పంచ భూతాలలో పరమాణువులు వున్నట్లూ ఈ కారణ రూప పరబ్రహ్మలో కార్యరూపమైన జగత్తులో నువ్వు లీనమై ఉన్నావు. చరాచర జగత్తు అంతా ఓంకారంలో ఇమిడివుంది. అది అకార ఉకార మకారాత్మకం. సృష్టిలో ఇదీత్రిపుటి. సర్వత్రా కన్పిస్తోంది. అందుచేత ఇందులో అది వుంది ఇది లేదు అనడానికి వీలులేదు. అన్నీ ప్రణవంలోనే వున్నాయి. మూడు లోకాలు, ముగ్గురు దేవతలు. మూడు వేదవిద్యలు, వహ్నులు మూడు, జ్యోతిస్సులు మూడు, బ్రాహ్మణాది వర్గాలు మూడు, ధర్మార్థకామాలు మూడు, గుణాలు మూడు, శబ్దాలు మూడు, రాగద్వేషాలోభాది దోషాలు మూడు బ్రహ్మచర్యాది ఆశ్రమాలు మూడు, కాలాలు మూడు, అవస్థ (జాగ్రత్‌స్వప్న సుషుప్తి)లు మూడు, పితృపితామహ ప్రపితామహులు ముగ్గురు. దివనిశా సంధ్యలు మూడు, దేవ పితృ మనుష్య జాతులు మూడు, ఇలా విశ్వమంతా త్రిపుటీ మయమే. అందుకే ప్రణవంలోనే అన్నీ వున్నాయని పెద్దలు చెబుతున్నారు. ఇలాంటి ఓంకారమే నీవు అని తెలుసుకున్న వారు ముక్తులు. అన్య మార్గానుకూలురు అముక్తులు.

ఓంకార రూపిణీ! కర్మఠులు ఏ మాత్రం ఉచ్ఛరించాలన్నా నిన్ను జపించవలసిందే, అగ్నిష్టోమం, అత్యగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం- అప్తోర్యామం అనేవి శ్రౌతసాంప్రదాయంలోని సప్త సోమ యజ్ఞ సంస్థలు అగ్న్యాధానం, అగ్నిహోత్రం దర్శపూర్ణమాసలు- చాతుర్మాస్యాలు, ఆగ్రయణం, నిరూఢపశుబంధం, సౌత్రామణి అనేవి స్మార్తపద్ధతిలోని సప్తపాక యజ్ఞ సంస్థలు. ఇవన్నీ బ్రహ్మవాదులచేత ఓంకృతి పూర్వకంగానే నిర్వహింపబడుతున్నాయి.

అమ్మా వాగ్దేవీ! అర్ధమాత్రా స్థితమైన నీ పరరూపం అందరికీ సులభసాధ్యం కాదు. అది అవికారి, అక్రియం, దివ్యం, పరిణామవివర్జితం కాబట్టి నీ రూపం వాక్కులకు అందనిది. వాగింద్రియాలకు చిక్కనిది. నీ రూపం ఒకొక్కప్పుడు అనేకం ఒకొక్కప్పుడు ఏకం. సూర్యచంద్రుల కాంతి నీ స్వరూపమే. నీవు విశ్వరూపవు. విశ్వాకాశానివి. విశ్వాత్మవు. పరమేశ్వరివి. వేదాలు, వేదాంగాలు, సాంఖ్యాది యోగాలు నిన్ను ఆది మధ్యాంతరహితవని బోధిస్తున్నాయి. కార్యకారణ రహితవనీ నిర్గుణ పరబ్రహ్మవనీ కీర్తిస్తున్నాయి. సమిధలో అగ్ని వున్నట్లు ఈ ధీవృత్తిలో నువ్వు సర్వత్రా వ్యాపించి ఉంటావట. నువ్వు అనాఖ్యవు, షడ్గుణాఖ్యవు, బహ్వాఖ్యవు, త్రిగుణాశ్రయవు కాబట్టి చైతన్య శక్తి మంతాలయిన పదార్థాలన్నింటిలో నీ మహా మహానంద స్వరూపం భక్తి యోగులకు దర్శనమిస్తూ వుంటుంది. సకలము, నిష్కలము అయిన జగత్తునందంతటా నువ్వే వ్యాపించియున్నావు. అద్వైతబ్రహ్మం, ద్వైతబ్రహ్మం, నిత్య పదార్థాలు అనిత్య పదార్థాలూ, స్థూల, సూక్ష్మ, సూక్ష్మాతిసూక్ష్మ పదార్థాలు భూమి మీదనూ అంతరిక్షంలోనూ అంతరాళంలోనూ ఇతరత్రా ఉన్న సకల పదార్థాలూ అవి మూర్తాలు కావచ్చు అమూర్తాలు కావచ్చు పంచభూతాలు కావచ్చు వాటిలో ఒక్కొక్కటే కావచ్చు - సమస్తాన్నీ స్వరవ్యంజన రూపిణి అయిన నీమహిమచేతనే గుర్తించగలుగుతున్నాం.

అశ్వతరుడు చేసిన ఈ స్తోత్రానికి వాగ్దేవి ప్రసన్నురాలయింది. ప్రత్యక్షమయ్యింది. తానుగా పలికింది. నాగరాజా నీ తపస్సుకి సంతోషించాను నీస్తోత్రం నన్నెంతగానో మురిపింపజేసింది. ఏమి వరం కావాలో కోరుకో నీ ఇష్టం వెంటనే అనుగ్రహిస్తాను - అంది.

విష్ణు జిహ్వాస్వరూపిణీ! సరస్వతీ! ధన్యుణ్ని తల్లీ! నీ అనుగ్రహాన్ని మించిన బలం మరొకటి లేదు. సంగీత రూపంగా అనుగ్రహాన్ని వర్షించు నాకూ నా సోదరుడు కంబలుడికీ సంగీత స్వర సంపదను సమగ్రంగా ప్రసాదించు. ఆ శాస్త్రంలోని లోతులూ రహస్యాలూ అన్నీ మాకు కటాక్షించు.

అశ్వతరా నీ కోరికకు సంతసించాను. నీకు, కంబలునికీ సంగీత శాస్త్రం అంతా ప్రసాదిస్తున్నాను. స్వీకరించండి. ముల్లోకాల్లో మీకు సాటి వచ్చే సంగీత విద్వాంసుడు లేడు. ఉండడు. ఈ క్షణం నుండీ మీదే అగ్రపీఠం. నువ్వు చేసిన స్తోత్రంలో నా రూపాన్ని గుణాలను అద్భుతంగా వర్ణించావు. చాలా సంతోష పడుతున్నాను. దీన్ని భక్తితో తెల్లవారు జామునే పఠించిన వారికి అభీష్టాలన్నీ తీరతాయి. విద్య, తేజస్సు, ధనం, ధాన్యం పశుగేహ సుతాది సమృద్ధి అన్నీ సిద్ధిస్తాయి. ఇది నా ఆశీస్సులు. అని పలికి ఆ సప్తజిహ్వ సరస్వతీ దేవి అంతర్ధానం చెందింది.

కంబలాశ్వతరులిద్దరూ గాంధర్వ విద్యాధురీణులు అయ్యారు. హిమాలయాల నుండి సరాసరి కైలాసానికి వెళ్ళారు. తమ దివ్య సంగీత విద్యతో పార్వతీ పరమేశ్వరులను స్తుతించారు. తంత్రీలయ సమన్వితంగా సప్తవిధ గీతాలతో కీర్తించారు. త్రిసంధ్యలలోనే కాదు అర్ధ రాత్రి కూడా ఆ త్రినేత్రుణ్ని ఆరాధించారు. ఉబ్బులింగడు అన్న మాటేగానీ ఒక పట్టాన కైలాసం దిగిరాలేదు. చాలా సంవత్సరాలు గడచిపోయాయి. సోదరులలో భక్తి, నిష్టాపట్టుదల, మరింతగా వృద్ధి చెందాయి. షట్కాలాలలో సంగీతంతో శివార్చన చేస్తున్నారు. అప్పటికి పరాత్పరుడికి అనుగ్రహం కలిగింది. ప్రత్యక్షమయ్యాడు. వరంకోరుకోండి అన్నాడు.

సర్పభూషితాంగా! కందర్ప దర్పభంగా! ఇంత కాలానికి కటాక్షించావా తండ్రీ! సరస్వతీదేవి ప్రసాదించిన సంగీత విద్య చరితార్థమయ్యింది. అష్ట మూర్తి పశుపతీ మా ఇద్దరిదీ ఒకే కోరిక కువలయాశ్వుడి ధర్మపత్ని మదాలస రాక్షస మాయకు లోనై ప్రాణాలు విడిచింది. అదే వయస్సుతో అదే మదాలసను నాకు బిడ్డగా అనుగ్రహించు. జాతి స్మరురాలై మునుపటిలాగానే శాంతికీ సహనానికీ పెట్టిందిపేరై బ్రహ్మ విద్యా పరాయణురాలై యోగినిగా యోగమాతగా విరాజిల్లేట్లు కరుణించు.

నాగరాజా! మీరు నాకు ఆభరణములు. అందుకని మీరు అంటేనే నాకు ప్రత్యేకమైన ప్రేమ. ఈ కోరికతో అది రెట్టింపు అయ్యింది. కువలయాశ్వుడి సౌఖ్యం కోసం మీరు వరమడుగుతున్నారు. మీ కోరిక తప్పక నెరవేరుతుంది. మదాలస నీ ఇంట కూతురై పునర్భవం పొందుతుంది. దీనికి నీవు చేయవలసిన పని ఒకటుంది. నీ యింట జరిగే పితృతిధినాడు మధ్యమ పిండాన్ని నువ్వు భుజించాలి. మదాలసను తలుచుకుంటూ భుజించాలి. పితృ పూజ చెయ్యాలి. ఆ క్షణంలోనే మదాలస యధాతధంగా అంటే మరణించినప్పటి వయోరూప గుణాలతో ఆవిర్భవిస్తుంది.

కంబలాశ్వతరులను ఆశీర్వదించి కాలకంఠుడు అదృశ్యమయ్యాడు. సోదరులిద్దరూ సంతోషంగా పాతాళానికి తిరిగి వెళ్ళారు. పితృతిధి వచ్చింది. ఈ సారి సోదరులిద్దరే ఏకాంతంగా శ్రద్ధగా శ్రాద్ధ విధులు నిర్వహించారు. మధ్యమ పిండాన్ని శివుడి ఆజ్ఞ ప్రకారం మదాలసను స్మరిస్తూ అశ్వతరుడు భుజించాడు. చిన్నగా నిట్టూర్పు విడిచాడు. అదే సమయంలో అతడి మధ్యమ ఫణాగ్రభాగం నుండి మదాలస సద్యోయౌవనంతో ఆవిర్భవించింది. ఈ విషయాన్ని రహస్యంగా వుంచాలని సోదరులిద్దరూ నిర్ణయించుకున్నారు.

తమకు విశ్వాస పాత్రమైన ఇద్దరు నాగకన్యలను పిలచి మదాలసకు తోడుఇచ్చి రహస్య స్థావరంలో విడిది ఏర్పాటు చేసారు.

ఋతుధ్వజునికి బహుకరించడంకోసం మదాలసను పునరుజ్జీవితురాలిని చేస్తానని తపస్సుకు వెళ్ళిన తండ్రి ఇంటికి తిరిగి వచ్చాడే తప్ప తెచ్చిందేమీ కనిపించలేదు నాగకుమారులకి ఏమయ్యిందని అడిగే ధైర్యంలేక మిన్న కుండపోయారు. ఎప్పటిలాగే బ్రాహ్మణ బాలుర రూపాలు ధరించి భూలోకానికి వెళ్ళి ఋతుధ్వజుడితో ఆడుతూ వున్నారు. ఒక రోజు నాగరాజు తన బిడ్డలిద్దరిని దగ్గరికి పిలచి చెరొక తొడపై కూర్చోపెట్టుకొని ఇలా అన్నాడు. మీరిద్దరూ భూలోకినికెళ్ళి ఋతుధ్వజునితో క్రీడిస్తూవున్నారు. బాగానే ఉంది. ఒక్కసారి అయినా అతన్ని మన లోకానికి తీసుకురాలేదేమి. ఇదేనా స్నేహమంటే! అతడికి మీరు ఏదో ప్రత్యుపకారం చెయ్యాలని అనుకున్నారు. మళ్ళీ ఆ మాటే అడగలేదు. ఏ లోకంలోనైనా ప్రయాణం చేసే కువలయాశ్వం అతని దగ్గరవుంది అన్నారుగదా దాన్ని ఎక్కి రమ్మనండి. నా ఆహ్వానంగా చెప్పండి అన్నాడు నాగరాజు.

నాగ కుమారులు సంబరపడ్డారు. తండ్రి ఎందుకో చెప్పడంలేదు కానీ ఏదో కథవుంది అని ఊహించారు. వెంటనే బయలుదేరి భూలోకం చేరుకున్నారు. బ్రాహ్మణ బాలకులుగా మారిపోయారు. ఋతుధ్వజుణ్ని కలుసుకున్నారు. కాసేపు ఆట పాటలు అయ్యాయి. మిత్రమా మనం ఇన్నాళ్ళు కలసి మెలసి తిరిగాం నువ్వు మాత్రం ఒక్కసారి అయినా మా యింటికి రాలేదు. రమ్మని పిలవందే రాకుమారుడివి ఎలా వస్తావు? పిలవనితప్పు మాదే. మా తండ్రిగారు ప్రత్యేకంగా చెప్పమన్నారు. వారు నిన్ను చూడాలంటున్నారు. నీ రాచమర్యాదలకు భంగం కలగదు అనుకుంటే మా ఆహ్వానం మన్నించు. మా ఇంటిని ఒకసారి దర్శించు. అని బ్రాహ్మణ బాలురు పలుకుతూ వుంటే ఋతధ్వజుడు ఎంతో ఆనందించి సంబరపడ్డాడు. ఎప్పుడో ఎందుకు ఇప్పుడే వెడదాం పదండి. మిత్రుల ఇళ్ళకు వెళ్ళడానికి రాచమర్యాదలు ఎందుకు? మీ తండ్రిగారు రమ్మన్నారు అన్నారుగదా వారికి నా మీద ప్రేమ కలుగడం నిజంగా నా అదృష్టం. వారిని దర్శించి ఆశీస్సులు పొందుతాను. పెద్దల ఆశీస్సులు అమోఘంగా పనిచేస్తాయి. నడవండి వెళదాం మీ ఇల్లు ఎక్కడో నాకు తెలీదు. దూరమా దగ్గరా? నడిచి వెడదామా! లేదా కువలయాశ్వాన్ని పిలవనా? అని అడుగుతూంటే ఋతధ్వజుడి అంగీకారానికి మురిసిపోయారు నాగ కుమారులు.

మిత్రమా, సంతోషం నువ్వు వస్తానని అన్నావు అంతే చాలు. మేము దగ్గరుండి తీసికెళ్తాం. మా ఇల్లు దగ్గరంటే దగ్గరే. దూరమంటే దూరమే. కువలయాశ్వన్ని పిలవవలసిన అవసరం లేదు. గౌతమీ నది దారిలో వెళ్ళాలి. అని ముగ్గురూ బయలు దేరారు. గౌతమీ నది చేరుకున్నారు. మిత్రమా ఇక్కడ ఒక్క క్షణం ఆగుదాం పవిత్ర నదికి ఆచమించి సూర్యునికి ఆర్ఘ్యం ఇవ్వడం మన విధి. నువ్వు నదిలో దిగి దోసిట నీళ్ళు పట్టి కళ్ళు మూసి తెరిచేలోగా మనం మా ఇంటి దగ్గర వుంటాం. నిజం నువ్వే చూస్తావుగా అన్నారు. అన్నట్లుగానే ఋతధ్వజుడు కళ్ళు మూసి తెరిచే సరికి నాగలోకంలో వున్నారు. తన మిత్రులు బ్రాహ్మణ కుమారులిప్పుడు సర్పశిరస్సులతో నాగకుమారులయ్యారు. ఇదేమిటి అని ఆశ్చర్యపోతున్నాడు ఋతధ్వజుడు.

చెలికాడా! క్షమించు మేం బ్రాహ్మణ కుమారులం కాదు. నాగరాజు కుమారులం. ఇది నాగలోకం నీతో స్నేహాన్ని వదులుకోలేక నిజం చెబితే నువ్వు మాతో స్నేహం చెయ్యవని తలచి ఇంతకాలం బ్రాహ్మణ కుమారులుగా గడాపాం. ఇది మా ఆనందం కోసం చేసిందే తప్ప నిన్ను మోసగించాలని మాత్రం కాదు. ఐనా స్నేహధర్మానికి విరుద్ధంగా నీ నుండి ఈ ఒక విషయాన్ని దాచాం కనుక క్షంతవ్యులం అన్నారు.

ఋతధ్వజుడు ప్రేమగా మిత్రులారా అంతమాట లెందుకు, ఫరవాలేదు. మీ ఆనందంకోసం అయినా నాకూ

ఆనందం పంచారు గనుక ఇందులో క్షమార్పణల ప్రసక్తి లేదు. మన స్నేహం ఇలాగే కలకాలం కొనసాగాలని నా ఆకాంక్ష. అది సరే గాని నడవండి మీ నాగలోక అందాలన్ని నాకు చూపించండి అన్నాడు.

ముగ్గురూకలసి నాగలోక ప్రధాన వీధులన్నీ తిరిగారు. ఋతధ్వజుడు అక్కడి సిరిసంపదలకు మురిసిపోయాడు. సాయంకాలం అయ్యేసరికి నాగకుమారులు ఋతధ్వజుణ్ని తమ ఇంటికి తీసికొచ్చారు. తండ్రికి పరిచయం చేసారు. ఋతధ్వజుడు వినయవిధేయతలతో సాష్టాంగ నమస్కారం చేసాడు. అశ్వతరుడు ఋతధ్వజుడ్ని ఆనందంతో ప్రేమగా లేవనెత్తి కౌగలించుకొని శిరస్సు నిమురుతూ చిరంజీవ అని ఆశీర్వదించాడు. నాయనా మా పిల్లలు రోజు చెప్తుంటారు నీ గురించి. నీ గుణగణాలు, నీ సౌహార్దం, నీ మంచి మనస్సు, నీ గాంభీర్యం, నీ ప్రతిజ్ఞ, నీ సౌశీల్యం నీ పరాక్రమం అన్నీ విన్నాను. ఎప్పటి నుండో నిన్ను చూడాలని ఇప్పటికి ఇలా పొసగింది. రా ఇలా వచ్చి ఈ ఆసనంపై కూర్చో. ఈ రోజు మాకు పండగ, మా ప్రియమైన అతిధివి. రాక రాక మొదటిసారిగా వచ్చావు. తగ్గ మర్యాదలు చెయ్యనీ. దయచేసి దేనికీ అడ్డు చెప్పకు. ఇవి నేను ప్రేమతో చేస్తున్నవి. కాదనడానికి వీలు లేదు. స్వీకరించవలసిందే అశ్వతరుడు ఇలా మాట్లాడుతూనే ఋతధ్వజున్ని సముచితాసనంపై కూర్చుండబెట్టి గంధమాల్యాదులు అలంకరించి రత్నఖచిత నానావిధ స్వర్ణ భూషణాలు ధరింపజేసాడు. నూతన పట్టు వస్త్రాలు అందించాడు. నాయనా ఇపుడు నాకు చాలా తృప్తిగా వుంది నీకేమైనా వరమివ్వాలని అనుకుంటున్నాను. ఏమికావాలో ఇష్టమైనది కోరుకో అన్నాడు.

ఋతధ్వజుడు ఆసనం దిగి నాగరాజుకి పాదాభివందనం చేసాడు. నాగవల్లభా దైవానుగ్రహంవల్ల మీవంటి పెద్దల ఆశీస్సులవల్లా నాకు ఏలోటు లేదు. మా ఇంట సకల సంపదలు సమృద్ధిగా వున్నాయి. అందువల్ల నేను కోరుకోవలసింది ఏమీలేదు. అయినా మీ సంతృప్తికోసం అడుగుతున్నాను. నా బుద్ధిలో ఎప్పుడూ అధర్మ చింతన కలుగకుండా మీ పట్లా, తల్లితండ్రులపట్లా, గురువుల పట్లా నాకిలాగే ప్రగాఢమైన భక్తి ఎల్లప్పుడూ వుండాలి. ఈ వరాలు ఇవ్వండి చాలు అన్నాడు.

రాకుమారా, నీ సంస్కారం గొప్పది. చాలా ముచ్చటగావున్నది. నిన్ను చూస్తుంటే నువ్వు అడిగినవి నీ దగ్గర వుండనే వున్నాయి. అవి ఎల్లప్పుడూ వుంటాయి. ఇందులో నేనిచ్చేదేముంది నీవు పుచ్చుకొనేదేముంది. అందుచేత బాగా ఆలోచించుకొని నీకు అత్యంత ప్రియమైన దేదో అదికోరుకో మొహమాట పడకు. అది ఎంతటి దుర్లభమైనా ఫరవాలేదు కోరుకో తీరుస్తాను సంశయించకు సుమా! నా మాట సత్యం అన్నాడు నాగరాజు.

ఋతధ్వజుడు నవ్వుతూ నాగ కుమారులవైపు చూసాడు. వారిద్దరు తండ్రి పాదాలకు నమస్కరించి తమ మిత్రుడు ఋతధ్వజునికి అత్యంత ప్రీతిపాత్రమైనది ఏదో, ఏది అడగడానికి సందేహిస్తున్నాడో వారికి తెలుసు కనుక అది చెల్లించమని మిత్రుడి పక్షాన అడిగారు. నాగరాజు చిరునవ్వులు చింది రాకుమారా! నాయనా! కాల ధర్మం చెందిన వారిని బ్రతికించి అదే శరీరంతో తీసుకు రావడం అసాధ్యం. అది దేవతలకైన కష్టసాధ్యం. కానీ నీ కోరిక తీర్చడం నా విధి. కనుక మదాలసను నీకు చూపుతాను. కేవలం చూసి సంతోషించి వూరుకోగలవా?

నాగరాజా! మాయా మదాలస అయినా సరే ఒక్క సారి నాకు చూపించి పుణ్యం కట్టుకోండి. ఇదొక్కటే నా కోరిక అంటూ మరలా పాదాభివందనం చేసాడు ఋతధ్వజుడు. నాగరాజు లేవనెత్తి ప్రేమగా వీపు నిమురుతూ చేయి పట్టుకొని నడిపించుకుంటూ రహస్య స్థావరం దగ్గరకి తీసికెళ్ళి మదాలసను చూపించాడు. ఋతధ్వజుడు ఆశ్చర్య ఆనందాలతో

ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. ప్రియా అంటూ ఆమెను అందుకోడానికి వెళ్ళబోయాడు. నాగరాజు పట్టుకొన్న చెయ్యిని వదలలేదు.

నాయనా ఋతధ్వజా! ఇది మాయా మదాలస నీవు ముట్టుకుంటె మాయమవుతుంది. ఇలాగే దూరంగా నిలబడి చూసి ఆనందించు. ఇప్పటికి ఇంతే అన్నాడు. ఇంకా ఆ మాటలు పూర్తికాక ముందే ఋతధ్వజుడు మూర్ఛపోయాడు. మదాలస అయోమయంతో నాగరాజు వైపు చూసింది. చిరునవ్వులు చిందిస్తూ ఆమెకు ధైర్యం చెబుతూ ఋతధ్వజుని కలత దీర్చాడు నాగరాజు. తాను తన బిడ్డల కోరికపై మదాలస గురించి తపస్సు చెయ్యడం సరస్వతీ, మహాదేవుల ప్రసాదంగా ఆమె పునరుజ్జీవించడం అంతా వివరించి, మదాలసా ఋతధ్వజులను ఒకరికొకర్ని అప్పగించాడు. దంపతులు ఒకేసారి సాష్టాంగపడ్డారు. పుత్రపౌత్రాభిరస్తు అని ఆశీర్వదించాడు నాగరాజు. ప్రియ మిత్రులు నాగకుమారులిద్దరూ ఆనందభాష్పాలతో పులకించిపోతూ తప్పట్లు కొడుతూ కేరింతలు కొట్టారు. మల్లె మొగ్గలూ ముత్యాలు కలిపి దోసిళ్ళ కొద్దీ ఆనవదంపతుల మీద గుమ్మరించారు. మదాలసా ఋతధ్వజులు ఆ రోజు అక్కడే వుండి అమృతమయమైన విందులు ఆరగించి విశ్రమించారు. మరునాడు అందరివద్దా సెలవు తీసికొని కువలయశ్వాన్ని స్మరించాడు. అది వచ్చింది. ఇద్దరూ ఎక్కారు. నాగరాజు ఆశీర్వదించాడు. అప్పుడప్పుడూ వస్తూవుండండి ప్రియ మిత్రులు ఇక్కడవున్నారన్న మాట మర్చిపోవద్దు అన్నారు. నాగ కుమారుల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

మిత్రమా నీ చిరకాల వాంఛ నెరవేరింది. సంతోషమే. కానీ రేపటి నుండి మన ఆటపాటలు వుండవు కదా పోనీలే మీ పిల్లల్ని ఆడించడానికి వస్తుంటాము. జ్ఞాపకం పెట్టుకొని పిలవండి. వెళ్ళిరండి - అంటూ ఇంక అక్కడ వుండలేక లోపలికి వెళ్ళిపోయారు. ఋతధ్వజునికీ దిగులుగానే వుంది. కానీ ప్రియ మదాలస మరల లభించడంతో ఆనందంగా మనస్సు రాజధానివైపు పరుగులు తీస్తోంది. నాగరాజుకి మరొక్కసారి నమస్కరించి బయలుదేరారు. మదాలసా ఋతధ్వజులు.

కువలయాశ్వం మీద ఆకాశమార్గాన వస్తున్న మదాలసా రాజకుమారులను చూసి ప్రజలంతా ఆశ్చర్య ఆనందాలతో మునిగిపోయారు. చనిపోయాడనుకున్న రాకుమారుడు తిరిగి రావడం ఆశ్చర్యం అయితే తమ కన్నుల ఎదుటే ప్రాణాలు వదిలిన మదాలస పునర్జీవితమై రావడం ఈనాటి ఆశ్చర్యం. ఏమైతేనేమి కథ సుఖాంతం అయ్యింది. దేవతలు దయతలిచారు. అంతే చాలు అని ప్రజలు జయజయధ్వానాలు చేసారు. కోలాహలం ఏమిటి? అని రాజదంపతులు రాజప్రసాదం వెలుపలికి వచ్చి చూసారు. ఎట్ట ఎదుట కువలయాశ్వం మీద కొడుకు కోడలు. కలా? నిజమా? అనుకొనే లోపలే దంపతులు అశ్వందిగి వచ్చి పాదాభివందనం జేసారు. కొడుకును తండ్రీ, కోడల్ని తల్లీ కౌగలించుకొని ఆనంద భాష్పాలలో మునిగారు. అందరు తేరుకున్నాక జరిగిందంతా పూసగ్రుచ్చినట్లుగా వివరించాడు ఋతధ్వజుడు. రాజు గారు రాజ్యంలో పెద్ద ఉత్సవం జరిపించారు. సకల దేవతలకు ఆరగింపులు జరిపారు. భూరి,దక్షిణలతో అందర్నీ ఆనందపరిచారు.

మదాలసా కువలయాశ్వులు ఇష్టోపభోగాలు అనుభవిస్తూ కేళీ విలాసాలతో తేలియాడుతున్నారు. నెల ఒక రోజుగా కాలం పరుగులు తీస్తోంది. శత్రుజిన్మహారాజుకు వృద్ధాప్యం సంభవించి ఒకనాటి సాయంకాలం కన్ను మూశారు. అంతఃపురంలో హాహాకారాలు మిన్ను ముట్టాయి. రాజ్యమంతటా విషాద వాతావరణం అలుముకుంది. ప్రతి పౌరుడి

కన్నూ ఏకధారగా కన్నీరు కారింది. ఎందరు విలపిస్తేనేమి ఎంతగా పిలిస్తేనేమి? ఏదీ ఆగదు కదా! యధా విధిగా ఉత్తరక్రియలు శ్రద్ధతో జరిపాడు. కువలయాశ్వుడు తదనంతరం పట్టాభిశక్తుడై పరిపాలనా భాధ్యతలు స్వీకరించాడు. ప్రజలను సొంత బిడ్డల్లా చూసుకుంటూ ప్రజారంజకంగా పరిపాలన చేస్తూ వున్నాడు.

దేవతలు కరుణించి మదాలస గర్భంధరించింది. చెంపకు చారెడు కన్నులతో మగబిడ్డ జన్మించాడు. కువలాయాశ్వుడు సంబరపడి రాజ్యమంతటా ఉత్సవం జరిపించాడు. పుట్టిన బిడ్డకి జాతకర్మాదులన్నీ జరిపించి విక్రాంతుడు అని నామకరణం చేసారు. రాజోద్యోగులు, బంధుమిత్రులు అందరూ సంతోషించారు. ఆ సమయంలో మదాలస మాత్రం ఆదోలా నవ్వింది. విక్రాంతుడు శుక్లపక్షంలో చంద్రుడులా ఎదుగుతున్నాడు. రెండేళ్ళ గడిచాయి. మదాలస మళ్ళీ గర్భం ధరించి నవమాసాలు మోసి పండంటి బిడ్డను ప్రసవించింది. మళ్ళీ మగబిడ్డే కువలయాశ్వుడు ఆనందించి జాత కర్మాదులన్నీ జరిపించి రాజ్యం అంతా ఉత్సవములు జరిపించాడు. ఈసారి బిడ్డడికి సుబాహువు అని నామకరణం చేసాడు. మదాలస మళ్ళీ ఎప్పటి లాగానే అదోలా నవ్వింది. కాలం గడుస్తోంది. మళ్ళీ కొంతకాలానికి మదాలస గర్భం ధరించి నెలలు నిండగానే మూడవసారి కూడా మగబిడ్డనే ప్రసవించింది. ఈ సారి బిడ్డడికి శత్రుమర్ధనుడు అని నామకరణం చేసారు. మదాలస మళ్ళీ ఎప్పటిలాగే నవ్వింది. కాకపోతే ఈ సారి బిగ్గరగా నవ్వింది. కువలయాశ్వుడికి సందేహం వచ్చింది. ఎందుకు నవ్వావు? అడిగాడు అందుకామె బదులు చెప్పలేదు. కొంతకాలానికి నాలుగో బిడ్డ కూడా కలిగాడు. ఈ నామకరణం చెయ్యిబోతూ కువలయాశ్వుడు, మదాలసా! ముగ్గురు బిడ్డలకి నేనే పేర్లు పెట్టాను. అప్పుడల్లా నువ్వు నవ్వావు. కారణం చెప్పావుకాదు. ఇప్పుడైనా చెప్పు బహుశ నేను పెట్టిన పేర్లు నీకు నచ్చలేదేమో అందుచేత ఈ బిడ్డడికి నువ్వే పేరుపెట్టు-అన్నాడు.

అప్పుడు మదాలస ప్రాణవల్లభా పేర్లు నచ్చడం నచ్చకపోవడమూ కాదు. నా నవ్వుకు కారణం వేరే వుంది. అది తరువాత చెబుతాను. ముందు ఈ బిడ్డడికి అలర్కుడు అని నామకరణం చేయండి వీడు చిరంజీవిగా వర్ధిల్లుతాడు - అంది. కువలయాశ్వుడు అలాగే చేసాడు. విక్రాంతుడు, సుబాహువు, శత్రుమర్ధనుడు, అలర్కుడు నలుగురు బిడ్డలు దిన దిన ప్రవర్ధమానం అవుతున్నారు.

సుమతి తన తండ్రికి చెప్తున్న వృత్తాంతాన్ని వేదధర్ముడు దీపకునితో చెబుతున్నాడు. శ్రద్ధగా వింటున్న దీపకుడి కుతూహలం పెరిగింది. గురుదేవా అనంతర కథ ఏమిటి? మదాలస ఎందుకు నవ్వింది? అందులో ఏదో అంతరార్ధం ఉండి వుంటుంది. ఆమె యోగ మాత మహాయోగినికదా పైగా సరస్వతీ మహాదేవుల వరప్రభావంవల్ల పునర్జన్మించిన దాయె. గురుదేవా ఇవన్నీ ఆసక్తి కలిగిస్తున్న అంశాలే. ఆ తండ్రీ కొడుకుల సంభాషణగా సాగిన అనంతర కథను త్వరత్వరగా చెప్పండి కథలో గొప్ప పట్టువుంది. మీరు చెబుతూంటే అది మరింతగా రక్తి కట్టి కుతూహలంతో వూపేస్తోంది అన్నాడు. వేదధర్ముడు సరే నని తండ్రీ కొడుకుల సంభాషణని యధాతథంగా వివరిస్తున్నాడు.

ఒకనాడు కువలయాశ్వుడు ప్రాణప్రియా మదాలసా! ఇంతకీ నా సందేహం నీవు తీర్చలేదు. బిడ్డలకి నామకరణం చేసినప్పుడల్లా నీవు నవ్వేవు. ఎందుకు? ఆ పేర్లు నచ్చలేదందామా అంటే అవి చాల చక్కటి పేర్లు, పోనీ నువ్వు నాలుగోవాడికి పెట్టిన పేరు ఏమన్నా గొప్పదా? అందులో విపరీత అర్ధాలువున్నాయా? ఏమీలేదు. అలర్క శబ్దానికి పిచ్చి కుక్క అని అర్ధం. అంతగా హేళన చేసి నువ్వు పెట్టిన పేరు గొప్పగా వుందా! అసలు నీవు ఎందుకు నవ్వావో చెప్పు యోగవిద్యా

రహస్యాలు తెలిసిన దానివి. బిడ్డల భవిష్యత్తు వూహించి నవ్వావా? ఏమిటి? అడిగాడు. తన నవ్వును అవహేళనగా భావించి భర్త ఇలా నిగ్గదీస్తుంటె మదాలస కంగారుపడింది. సమాధానం చెప్పకపోతే భర్త మనసునొచ్చుకుంటుంది అని గ్రహించి నాథా! నిన్ను కించపరచాలని నవ్వలేదు. బిడ్డల భవిష్యత్తు దర్శించినవ్వలేదు. కొంచెం ఆలోచిస్తే నేనెందుకు నవ్వానో మీకే తెలుస్తుంది. పెద్దవాడికి విక్రాంతుడు అనే పేరు పెట్టారు. క్రాంతి అంటె గతి అని అర్థం. ఈ పేరు దేహానికి పెట్టినట్లా? ఆత్మకి పెట్టినట్లా? దేహమైతే జడ పదార్థం కనుక కదలలేదు. మరి దేహానికి క్రాంతి అనే పేరు ఎలాకుదురుతుంది.? ఆత్మ అనేది సర్వవ్యాపకం అంతటా వ్యాపించిఉన్న దానికి ఇంక కదలడం ఎలాకుదురుతుంది.? కాబట్టి విక్రాంతుడు అనే పేరు ఇటుదేహానికి ఆత్మకి కుదిరేదికాదు. ఇలాంటి పేరు పెట్టారేమిటి అని నవ్వువచ్చింది. రెండో వాడికి సుబాహువు అని పేరు పెట్టారు. మంచి ధృఢమైన బాహువులు కలవాడు అని అర్థం. ఆత్మ పదార్థం నిరవయం (అవయములు లేనిది) కాబట్టి దానికి ఈ పేరు అన్వయించదు. జడమైన శరీరానికి బాహువులుండి ప్రయోజనంలేదు. అందుచేత ఈ పేరూ నాకు నవ్వు రప్పించింది. మూడో వాణ్ని శత్రుమర్ధనుడు అన్నారు అవునా? ఇక్కడా నాకు అవే సందేహాలు. అనశ్వరమైన ఆత్మ పదార్థం సర్వవ్యాపి. అంతటా తానే. దానికి శత్రువులూ లేరు మిత్రులూ లేరు. మరి ఎవరి శత్రువులని మర్ధిస్తుంది.? సమాధానం వున్నదా? అదీగాక అహంకార కల్పితాలైన క్రోధాదిభావాలు స్వపరభేదాలు దానికెక్కడివి? జడమైన శరీరానికి మర్దనం పొసగదు. అందుచేత ఈ పేరు కూడా నవ్వురప్పించింది. ఎవరు ఎవరికి ఏ పేరు పెట్టినా ఈ తగవుతప్పదు. సార్ధకనామధేయ అసంభవం. కానీ లోకం వ్యవహారం సాగాలి కనుక అందుకని ఏదో ఒక పేరు పెట్టాలి. ఎంతో అందమైన పేరు పెట్టామని మురిసిపోవడం అదొకవెర్రి, పిచ్చి. అందుకని అర్థం పర్థం లేకుండా ఆలోచించకుండా అలర్కుడన్నాను. మీరు పెట్టినవీ పేర్లే నేను పెట్టిందీ పేరే. వ్యవహారం కోసం ఏదో ఒక పేరు అంతే.

కువలయాశ్వుడు మరింక మాట్లాడలేదు. గంభీరవదనంతో ఇంతటి తాత్విక తార్కిక దృష్టివున్న ఈ మదాలస ఆనాడు నామరణ వార్త వినగానే ప్రాణాలు ఎందుకు వదిలేసిందో అనుకుంటూ భారంగా కదిలాడు.

మదాలస తన బిడ్డల్ని పెంచడంలో కూడా ఇదే తత్వదృష్టితో పెంచింది. పెద్దవాణ్ని ఉయ్యాల్లో వేసినప్పట్నుంచీ వైరాగ్యగీతాలు జోలపాడింది. బిడ్డా ఎందుకు రోదిస్తావు నామ రూపాలు లేని శుద్ధాత్ముడవు. నీకు విక్రాంతుడు అని ఈ పేరు ఎలా పెట్టారనా? పంచ భూతాలతో ఏర్పడిన ఈ శరీరానికి ఏ శబ్దం అన్వయిస్తుందనా? ఎవడు ప్రభువనా? ఎందుకు ఏడుస్తున్నావు?

ఒక భూతం నుండి మరొక భూతం అభివృద్ధి చెందినట్లే ఈ శరీరం కూడా అన్నపానాదులతో ఎదుగుతుంది. వాటి వల్లనే క్షీణిస్తుంది. వృద్ధి క్షయాలకు సాక్షిగా నిలిచే నీవు ఆత్మవు. నిజానికి బిడ్డా నీకు హానివృద్ధులు లేవు. ఈ శరీరం నీకు తొడుగులాంటిది. ఇందులో నీవు బందీవి. చావు పుట్టుకల చక్రంలో తగుల్కొని అస్వతంత్రునిగా తిరుగుతూంటావు. తల్లితండ్రులనీ, బంధుమిత్రులనీ, నాదనీ, నీదనీ, అహంకార మమకారాలతో బంధనాలు ఏర్పరచుకుంటావు ఎందుకురా నాయనా ఇదంతా. అజ్ఞానకృతమైన ఈ అహంకారాలను విడిచి పెట్టు. కర్మలూ కర్మ బంధాలూ అన్నీ పటాపంచలవుతాయి. అదే నిజమైన తెలివి. దుఃఖాలు తొలగించుకోవాలనీ సుఖాలను కలిగించుకోవాలనీ అందరూ ప్రయత్నిస్తుంటారు. ఇది అవివేకం నీకు దుఃఖాలు వద్దు సుఖాలు వద్దు. రెండింటినీ వదిలించుకోవడమే నిజమైన వివేకం. నిజమైన జ్ఞానం. ఇది అలవరచుకో కుమారా.

ఈ సృష్టిలో కామపురుషార్థానికి లొంగని వాడు లేడుగదా నారీమణి అంటేనే నరకానికి మారు పేరు. తనలాగే-పుట్టి తనలాగే పెరిగిన వనితలో అదనంగా ఏమి ఆకర్షణవున్నదో చెప్పగలడా? మలమూత్రాలకి నిలయమైన మర్మాంగాలు సుఖాన్ని కలిగిస్తాయి అనుకోవడం మూఢత్వంకదూ. పోనీ సౌందర్యరాశి అని కులుకుతున్న నీ శరీరంగానీ నీ తరుణీమణి శరీరంగాని శాశ్వతంగా నిలుస్తాయా? ఎదుగుదల అంతా పతనాభిముఖంగానే. యవ్వనం ప్రవాహంలా పారిపోగానే వార్ధక్యం ఆవరించి నీ శరీరం నీకే అసహ్యమవుతుందే. ప్రేయసిపై ఏవగింపు కలుగుతుందే. ఆకర్షణలు కళ్ళముందే కరిగిపోతున్నా ఎన్ని తరాలు గడిచినా గుర్తించరేమి? అనిత్యానిశరీరాణి అన్నారు. అందువల్ల శరీరాన్ని నమ్ము కోవడమేమిటి? దీని మీద మమకారం పెంచుకోవడం ఏమిటి? ఎంతపిచ్చి? ఎంతవెర్రి? కుమారా నువ్వు మాత్రం నిత్యమూ సత్యమూ శివమూ సుందరమూ అయిన పరతత్వాన్ని నమ్ముకో. సుఖదుఃఖాలకు అతీతంగా జీవన్ముక్తుడవై వర్ధిల్లు.

ఈ రకమైన జోలలతో, బోధలతో బిడ్డల్ని పెంచింది. మొదటి ముగ్గురూ విరాగులై సామ్రాజ్యాన్ని సంసారాన్ని తృణీకరించి మునివృత్తిని స్వీకరించి అడవులకు వెళ్ళిపోయారు. తండ్రిగానీ రాజ గురువులుగానీ చేసిన ఏ ఉపదేశమూ వారి చెవికెక్కలేదు. బ్రహ్మవాదినియైన కన్నతల్లి చెప్పినదే వారికి వేదమయ్యింది. అదే రుచించింది. బ్రహ్మజ్ఞానులై వెళ్ళిపోయారు. కువలయాశ్వుడికి దిగులు పట్టుకుంది. నాల్గవవాడినైనా దక్కించుకోకపోతే సింహాసనమే కాదు వంశమే నిలబడదని గ్రహించాడు. అలర్కుడికి వైరాగ్య గీతాలు జోలలు పాడకుండా కట్టడిచేశాడు. నువ్వు నిజంగా పతివ్రతవే అయితే నా మాటజవదాటకూడదు. అలర్కుడికి జీవితంపట్ల రుచికలిగించు.అనుకూల చింతననూ కలిగించు. నివృత్తి మార్గం కాదు. ప్రవృత్తి మార్గం బోధించు. సమర్ధుడిగా, సద్గుణసంపన్నుడిగా, సౌశీల్యం కలవానిగా మహావీరుడుగా, పరిపాలనా దక్షకుడిగా తీర్చిదిద్దు. ప్రయోజకుణ్ణి చెయ్యి. దీనికి కావలసినవి అన్ని నూరిపొయ్యి. అటువంటి బుద్ధి పాటవాలను కలిగించు. ఇదేదో నావంశాన్ని నిలబట్టుకోవడానికో నా రాజ్యాన్ని కాపాడుకోవటానికో చెబుతున్న మాట కాదు.

ఒక్కసారి ప్రశాంతంగా ఆలోచించు. అందరూ బ్రహ్మజ్ఞానులైపోయి నివృత్తి మార్గం వైపే ప్రయాణం చేస్తే కాంతాకనకాలను పరిత్యజిస్తే మరి గృహస్థాశ్రమం ఏమైపోవాలి? అదే లేకపోతే పితృదేవతలకి పిండ ప్రదానం చేసేదెవరు.? పితృదేవతల ఆత్మ సంతృప్తి చెందేదెలాగ? బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాస ఆశ్రమవాసులందరికీ పోషకుడు కదా గృహస్థు. దేవతలకూ అతిధులకూ పశుపక్ష్యాది జంతుమూలాలన్నింటికీ అన్నోదకాలు అందించేది గృహస్థులే కదా! ప్రజాతంతువు అవిచ్ఛిన్నంగా కొనసాగాలంటే, గృహస్థాశ్రమమే కదా మూల కందం. అందుచేత ఓ సాధ్వీమణీ! బ్రహ్మవాదినీ! ఈయన నాలుగో బిడ్డకు ఐహికా ముష్మిక జ్ఞానాలు రెండూ సరి సమానంగా భోదించు. సత్కర్మాచరణపట్ల గురికుదుర్చు.

కువలయాశ్వుడి కోరిక ఆ పతివ్రత మదాలస అంగీకరించింది. ఆనాటి నుండి అలర్కుడికి సర్వధర్మాలను ఉపదేశించింది. రాజనీతిలో తీర్చి దిద్దింది. యుద్ధ విద్యల్లో పారంగతుణ్ణి చేసింది. ధర్మాధర్మ వివేకం కలిగించింది. ప్రవృత్తి - నివృత్తుల సమ్మేళనం నేర్పింది. వర్ణాశ్రమ ధర్మాలు, శ్రాద్ధకల్పం యజ్ఞదాన విధులూ ప్రజారంజక పరిపాలనం ఇలాగ ప్రవృత్తి మార్గం నేర్పింది. అలర్కుడు అన్ని విధాలా ప్రయోజకుడు అయ్యాడు తల్లిని మించినదైవమే కాదు. గురువుకూడా లేడు. కువలయాశ్వుడు కుమారుణ్ణి చూసి సంబరపడి గర్వించాడు. తనకు చేదోడు వాదోడుగా

నిలుస్తూ సహకరిస్తున్న వేళ అలర్కుడి బుద్ధి కుశలతనూ, ధర్మ నిష్టనూ, కార్య నిర్వహణ దక్షతనూ గ్రహించి సంతృప్తి చెందాడు. రాజ్యభారం కొడుకు భుజాల మీద పెట్టవచ్చునని నిశ్చయించుకొని ఒక మంచి సుముహూర్తాన రాజ్య పట్టాభిషేకం జరిపించాడు. సింహాసనం అప్పగించాడు. మదాలసా సమేతుడై తాను వానప్రస్థానికి బయలుదేరాడు. మదాలస అలర్కుడ్ని ప్రేమగా దగ్గరకు తీసికొని మృదువుగా చివరి మాటగా కామోపభోగ ప్రక్షాళన కరమైన హితవు చెప్పింది. నాయనా నీవు గృహస్థ ధర్మంలో వున్నావు. రాజ్యభారాన్ని భుజాల మీదకు ఎత్తుకున్నావు. ఇవి రెండూ దుఃఖహేతువులే. మమకారాలకు బానిసయైన గృహస్థు తనకు తానే దుఃఖం కొనితెచ్చుకుంటున్నాడు. అందుచేత నీకు ఎప్పుడైనా భరింపలేని దుఃఖం కలిగితే అప్పుడు మాత్రమే, ఇదిగో నేను ఇస్తున్న ఈ ఉంగరం ముద్రను విప్పి అందులో బంగారు రేకు మీద సూక్ష్మాక్షరాలలో వున్న శాసనాన్ని చదువు-అని చెప్పి ఉంగరాన్ని ఒక చిన్న బంగారు పెట్టెలో భద్రపరచి అందించింది.

శుభంభవతు! కళ్యాణమస్తు! అని అలర్కుణ్ని ఆశీర్వదించి మదాలసా కువలయాశ్వులు నిర్మలంగా అడవులకు వెళ్ళిపోయారు. రాజ్యపాలన బాధ్యత స్వీకరించిన అలర్కుడు వివాహం చేసుకొని గృహస్థాశ్రమంలో అడుగుపెట్టాడు. భోగ భాగ్యాలు అనుభవిస్తూనే తన ప్రజలను కన్న బిడ్డల్లా చూసుకుంటూ ధర్మబద్ధంగా పాలన చేస్తున్నాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణలు చేస్తూ ధర్మబద్ధంగా శిక్షలు అమలు జరుపుతూ వున్నాడు. అనేకానేక యజ్ఞయాగాదులు నిర్వహించి ఆత్మసంతృప్తినీ అఖండ కీర్తినీ సంపాదించాడు. ఆత్మజ్ఞానియై ధర్మంతో అర్థాన్ని, అర్థంతో ధర్మాన్ని పెంపొందించుకున్నాడు. ఈ రెండింటికీ మించిన విషయసుఖాలును అనుభవించాడు.

ఎన్ని వేల సంవత్సరాలు పరిపాలన కొనసాగించినా రాజభోగాలు అనుభవించినా అలర్కుడికి తనివితీరడం లేదు. భోగాసక్తుడై వెంపర్లాడుతున్నాడే తప్ప వైరాగ్య భావనలు రావటం లేదు. రాజ్యాన్ని పుత్రులకు అప్పజెప్పి తాను తండ్రిలాగే అడవులకు పోదాం ఆముష్మికం గురించి ఆలోచిద్దాం ముక్కు మూసుకొని కాసేపు తపస్సు చేసుకొందాం. ఇలాంటి చింతనలే కలుగడం లేదు. అన్నగారైన సుబాహువు అలర్కుడి పరిస్థితి గమనించాడు. ఇతణ్ని నివృత్తి మార్గంలోకి మళ్ళించటం ఎలాగా అని దీర్ఘంగా ఆలోచించి కష్టాలలోకి నెడితే భగవంతుడు జ్ఞాపకం వస్తాడు. ఈ పని చేయాలనుకుంటే ఇతడి శత్రువులను ఆశ్రయించాలి. ఇరుగుపొరుగు రాజ్యాలు సహజశత్రువులు. అందువలన కాశీరాజును ఆశ్రయిస్తాను.

సుబాహువు వెంటనే కాశీరాజును కలుసుకున్నాడు. మదాలసాకువల యశ్వులకు మేము నలుగురు పుత్రులం. పై ముగ్గుర్నీ కాదని నాల్గవవాడు అలర్కుడు రాజ్యం కాజేశాడని ఇది అన్యాయం కనుక నువ్వు దండెత్తి అతణ్ని ఓడించి రాజ్యభ్రష్టుడ్ని చేసి తమ రాజ్యం తమకు అప్పగించమనీ వేడుకున్నాడు. కాశీరాజు ముందే దండయాత్రకు అంగీకరించలేదు. ముందుగా యోగ్యుడైన దూతను పంపాడు. సహజంగనే అలర్కుడు అహంకారంతో కాశీరాజు ప్రతిపాదనను తిరస్కరించాడు. సుబాహువునే స్వయంగా వచ్చి అర్థించమనండి మంచిగా అడిగితే ఇస్తాను. అంతేగానీ శత్రువులను ఆశ్రయించి ఇలా దూతలను పంపిస్తే మాత్రం బెదిరింపులకు లొంగను అని సమాధానం పంపాడు. సుబాహువు తన అభిమానం దెబ్బతిన్నట్లుగా నటించాడు. కాశీరాజును మాటలతో ఎగత్రోశాడు. మీరు పంపిన సందేశాన్ని తిరస్కరించటం అంటే మిమ్మల్ని తిరస్కరించటమే సమర్థుడైన క్షత్రియుడు తిరస్కారాలను భరిస్తాడా?

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

వెళ్ళియాచిస్తాడా? ఇంకదండోపాయ మొక్కటే మార్గం అన్నాడు. కాశీరాజు అవునని సర్వసేనాసమేతుడై అలర్కుడిపై దండెత్తాడు. గిరిదుర్గాలను, వనదుర్గాలను ఆక్రమించుకుని ఆటవికరాజులను లోబరుచుకుని అలర్కుడి సామంతులను తొలగించి తన వారికి అప్పగించి ఇలా ఒక పథకం ప్రకారం అలర్కుడి రాజ్యాన్ని అన్నివైపుల నుండీ ఆక్రమించాడు కాశీరాజు. అలర్కుడి యొక్క ప్రతిఘటనలు, ప్రయత్నాలు ఫలించలేదు. దైవమే అనుకూలించనప్పుడు అన్నీ ఎదురుదెబ్బలే. అన్ని అపజయాలే వృధాగా అహంకరించటం తప్ప మానవమాత్రుడు ఏ పాటి. అలర్కుడిలో భరింపరాని విషాదం అలుముకుంది. అలనాడు తల్లి ఇచ్చిన ఉంగరం గుర్తుకు వచ్చింది. భరింపరాని దుఃఖం కలిగినప్పుడు అది తెరిచి అందులో వున్న శాసనాన్ని చదవమంది తల్లి మదాలస. త్వరత్వరగా స్నానం చేసి శుచిగా ఆ వుంగరం విప్పిచూశాడు. అందులో చిన్న బంగారురేకు వుంది. మెల్లగా పైకితీశాడు. కళ్ళకి అద్దుకున్నాడు. ఆ రేకు మీద సన్నటి అక్షరాల్లో రెండు శ్లోకాలు వున్నాయి.

**1. శ్లో :** **సంగసర్వాత్మనా త్యాజ్యః సచేత్ త్యక్తుం న శక్యతే ।**
**స సద్భిస్సహ కర్తవ్యః సద్భిస్సంగో౽ స్స భేషజమ్॥**

**2. శ్లో :** **కామస్సర్వాత్మనా హేయః హాతుం చేత్ శక్యతే న సః।**
**ముముక్షాం ప్రతి కర్తవ్యో సావై తస్యాపి భేషజమ్॥**
**విడువవలయు విడువవలయు సంగమ్ము విడువవలయు**
**విడువలేని ఎడల వలయు సత్సంగ మొనరింపవలయు**
**సతవము సంగ రోగౌషధము సత్సంగ మిలలో-**
**విడువవలయు విడువవలయు కామమ్ము విడువవలయు**
**విడువలేని ఎడల మోక్షకామమునెప్పుడు కోరవలయు**
**కామరోగౌషధమ్ము మోక్షకామమ్ము ఇలలో.**

**దేనితోనూ సంగం పనికిరాదు. దాన్ని పూర్తిగా విడిచిపెట్టాలి. విడవడం సాధ్యం కాకపోతే దాన్ని సత్సంగంగా మలుచుకోవాలి. సజ్జనులతో సాంగత్యం పెంచుకుంటే అదే సంగవిముక్తికి మహౌషధం. అలాగే కామమనేది అన్ని విధాల ప్రమాదకరమైనది. దాన్ని కూడా వదిలించుకోవాలి. అది శక్యంకాకపోతే దాన్ని మోక్షం వైపుకి మళ్ళించాలి. ముక్తి కాముకుడు కావాలి. కామత్యాగానికి ఇదొక్కటే సరియైన మందు.** ఈ రెండు శ్లోకాలు పదాలు పదే పదే ఉచ్చరించాడు. భావం హృదయానికెక్కింది. ముక్తికామమే ఉత్తమోమమని నిశ్చయించుకున్నాడు. దాన్ని సాధించాలంటే సత్సంగం మొదటి మెట్టు అని గ్రహించాడు. సాధు సజ్జనుల కోసం ఆలోచించాడు. దత్తాత్రేయుడు గుర్తుకి వచ్చాడు. క్షణం కూడా ఆలస్యం చేయకుండా సహ్యాద్రికి బయలుదేరాడు. దత్తుణ్ణి దర్శించాడు. పాదాలపై బడిసాష్టాంగ నమస్కారం చేశాడు. మహాత్మా నిన్ను శరణు వేడుతున్నాను. నీవేదిక్కు కరుణించు. దుఃఖార్తుడనై వచ్చాను. దయచేసి నా దుఃఖం తొలగించు - అని దీనాతిదీనంగా ప్రార్థించాడు.

# అలర్కుడికి దత్తుడు ఉపదేశించిన యోగమార్గం - దర్శనం

దత్తాత్రేయుడు కరుణించాడు. రాజా! నీ దుఃఖాన్ని ఇప్పుడే తొలగిస్తాను. నిజం చెప్పు. నీకసలు ఈ దుఃఖం ఎందువల్ల కలిగింది? నువ్వు ఎవరివి? ఈ దుఃఖం ఎవరిది? 'నువ్వు' అంటే ఈ అవయవాలా? వీటి సంపుటియైన దేహమా? లేక అందులో దాగి ఉన్న ఆత్మయా? వీటిలో ఏది నువ్వు? ఈ దుఃఖం ఎవరిది? ఇది కొంచెం ఆలోచించి చెప్పు. దుఃఖం ఎవరిదో దుఃఖకారణమేమిటో దుఃఖం ఎక్కడ ఉన్నదో తెలిశాక దాన్ని తొలగించటం ఏ పాటి. చిటికెలో పని.

అలర్కుడు ఆలోచనలో పడ్డాడు. నిజమే నేనెవణ్ని? నేను అంటే అవయవాలా? దేహమా? ఇవి రెండూ జడపదార్థాలుగదా! అవి "నేను" అని ఎలా అనుకుంటాము? అలా అనుకునేదేదో తెలిస్తే అదే దుఃఖానికి స్థానమవుతుంది. నేను అంటే శరీరం కాదు. అది పంచభూతాలతో నిర్మితమయ్యింది. కనుక నేను అనేది పంచభూతాలలో ఏ ఒక్కటీకాదు. మొత్తం వీటి కలయిక అయిన ఈ దేహాన్ని నేనుగా భ్రమపడుతున్నాను. ఈ భ్రాంతి వల్లనే సుఖదుఃఖాలు రెండూ కలుగుతున్నాయి. దీనికి సంభవించే సుఖదుఃఖాలకూ, ఈ దేహానికి అతీతుడనైన నాకూ ఏమిటి సంబంధం? నేను నవ్వడమేమిటి. నేను ఏడ్వడమేమిటి? నేను నిరంజనుణ్ని, నేను నిస్సంగుణ్ని. నేను నిత్యుణ్ని, నేను నిర్మలుణ్ని. ఎక్కువలూ, తక్కువలూ, పడటాలూ, లేవడాలు నాకు లేవు. మరి నాకు దుఃఖమేమిటి సుఖమేమిటి? ఏదీ లేదు.

ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలూ, ఐదు ప్రాణాలు, మనస్సు, అహంకారమూ అనే ఈ పదిహేడు తత్త్వాలతో కూడిన సూక్ష్మశరీరం ఒకటి ఉంది. ఈ రెండింటికి అతీతంగా నిలబడి వాటిని విడివిడిగా చూడగల్గుతున్న నాకు సుఖమేమిటి? దుఃఖమేమిటి? అంతా వట్టి భ్రాంతిగాక.

సుఖదుఃఖాలకు ఉనికి పట్టు మనస్సు. కనుక అవిదానివే తప్ప నావికాదు. నాకు వాటితో ఏ సంబంధమూ లేదు. నేను మనస్సును కాదుగదా! బుద్ధినీకాను. అహంకారమునూ కాను. స్థూలసూక్ష్మ శరీరాలు రెండూ కాను. వీటికి అతీతుణ్ని. వీటికన్నా విలక్షణుణ్ని. నాకు అత్యంత సమీపంలో ఉండి భ్రాంతి మూలకమే అయినప్పటికీ ఏదో కొంత సంబంధమే ఉన్న ఈ శరీరమే నేను కానప్పుడు, దీనికున్న అంతర్బహిరవయవాలలో ఏదీ నేను కానప్పుడు, ఎక్కడో దూరంగా ఏ సంబంధమ లేకుండా ఉన్న చతురంగ బలాలూ, కోశాగారాలూ, అంతఃపురాలూ, సింహాసనాలు- ఇవి "నేను" ఎలా అవుతాయి? వాటికీ నాకు సంబంధం ఏమిటి? అంతా భ్రమ. నాకు ఏమీ లేవు. రాజ్యం లేదు. సైన్యం లేదు. కోశం లేదు. శత్రువు లేడు. మిత్రుడు లేడు. ఒక్కటే ఆకాశం అనేక పాత్రలలో విభిన్న రూపాలతో కన్పిస్తున్నట్టు ఒక్కటే ఆత్మ-ఉపాధి భేదాలను బట్టి అనేకంగా కనబడుతోంది. ఆలోచించి చూస్తే అందరిలోనూ ఉన్నది ఒక్కటే ఆత్మ. సుబాహువులో, కాశీపతిలో, ఈ అలర్కుడిలో ఉన్న 'నేను' అనబడే పదార్థం ఒక్కటే. మరి మేము ముగ్గురం విభిన్నులం ఎలా అవుతాం? ఉపాధులు వేరు. ఆ ఉపాధి 'నేను' కాదు. నేనైనది ముగ్గురిలోనూ ఒక్కటే. అంచేత మాకు శత్రుత్వమేమిటి? మిత్రత్వమేమిటి? అంతా ఒక్కటే ఆత్మ! పరమాత్మ!

అలర్కుడికి జ్ఞానోదయమయ్యింది. చిటికెలో దుఃఖం తొలగిపోయింది. దత్తాత్రేయులవారికి మళ్ళీ సాష్టాంగపడ్డాడు. సవినయంగా విన్నవించాడు. దత్తదేవా సమదృష్టితో ఆలోచించాను. తెలిసిపోయింది నాకు దుఃఖమన్నదే లేదు. అజ్ఞానం వల్ల ఇంతకాలమూ దుఃఖార్ణవంతో త్రెళ్ళుతున్నాను. ఇప్పుడు తేలికపడ్డాను. **దుఃఖకారణం తెలిసిపోయింది.**

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

**మమకారమొక్కటే దుఃఖహేతువు. ఏకైక హేతువు. ఏయే వస్తువుల పట్ల మమత్వం పెంచుకుంటామో అదల్లా చివరికి దుఃఖమే మిగులుస్తుంది. ఒక పిల్లి మన పెంపుడుకోడిని చంపేస్తే మనకు దుఃఖం వస్తుంది. అదే పిల్లి ఏ ఎలకనో, పిచికనో భక్షిస్తే, మనకేమీ అనిపించదు. దానికి కారణం? కోడిని పెంచి దాని మీద మమకారం పెంచుకోవటం, ఎలుక మీదా, పిచుక మీదా అలా పెంచుకోకపోవటం.**

నేను ప్రకృతి కంటే పరుణ్ని. కనుక నేను సుఖినీ కాదు. దుఃఖినీ కాదు. పంచభూతాల చేతనే పంచభూతాలకూ సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. వాటికి అతీతుడనైన నాకు అవి రెండు లేవు.

ఈ మాటలకు దత్తాత్రేయుడు సంతోషించాడు. అలర్కభూపతీ! నువ్వన్నది ముమ్మాటికీ సత్యం. **"మమ" అనేది దుఃఖానికి మూలం. "న మమ" అనేది పరమసుఖానికి హేతువు.**

నేను వేసిన ఒక చిన్నప్రశ్నతోనే నీకు ఇంతటి జ్ఞానం ఉదయించింది. క్షణంతో మమకారాన్ని దూదిపింజలా ఎగరగొట్టగలిగావు. ఇంక నీకు నేను ఉపదేశించవలసింది ఏముంది? నీ దుఃఖాన్ని నువ్వే తొలగించుకున్నావు. మహారాజా! మానవుల మనస్సుల్లో ఒక మహాతరువుంది. దానికి 'అహమ్' అనేది బీజం. "మమ" అనేది కాండం. ఇల్లు వాకిలీ పొలమూ పుట్రా అన్నవి శాఖోపశాఖలు. భార్యాపుత్రాదులు చిగుళ్ళు. ధనధాన్యాలు ఆకులు. అన్ని ఋతువుల్లోనూ ఎళ్ళవేళలా ఎదిగే వృక్షమిది. పాపపుణ్యాలు దీని పువ్వులు. విచికిత్సలు తుమ్మెదలు. సుఖదుఃఖాలు దీని ఫలాలు. మోక్షమార్గానికి అడ్డంగా ఎదిగే మహావృక్షమిది. మూఢులు దీని నీడకు చేరతారు. దీన్ని పెంచి పోషిస్తారు.

సంసార మహాయాత్రలో అలిసిపోయి భ్రాంతచిత్తులై దీని నీడకు చేరినవారికి ఆత్యంతిక సుఖమనేది ఎలా లభిస్తుంది చెప్పు? **సత్సంగం అనే రాయి మీద బాగా పదును బెట్టిన జ్ఞానఖడ్గంతో ఈ మమతా మహాతరువుని నరికి వెయ్యగలిగిన వారికి ఆత్మమార్గం కనిపిస్తుంది.** వారు ఆ దారిన ప్రయాణించి శాంతమూ నీరజస్కమూ నిష్కంటకమూ అయిన బ్రహ్మవనాన్ని చేరుకుంటారు. అప్పుడు అక్కడ పునరావృత్తి వర్జితమైన నివృత్తిని పరాప్రజ్ఞను అందుకుంటారు. పంచభూతాలతో పంచేంద్రియాలతో నిర్మితమైన ఈ స్థూలశరీరం నువ్వుకావు. నేనూ కాను. పంచతన్మాత్రికాధికంతో ఏర్పడిన సూక్ష్మశరీరం నువ్వూ కావు, నేను కాను.

రాజా! గుణాత్మకమూ సంఘాత రూపమూ అయిన ఈ దేహంతో ప్రధానుణ్ని దర్శించగలుగుతున్నావా? మేడిపండు, మశకమూ, నీరు, చేప, నిషీకమూ ముంజుగడ్డి (ధర్భ) వీటి సంబంధం లాంటిదే క్షేత్ర ఆత్మల సంబంధం. వీటి లోతును తెలుసుకున్నావు సంతోషం.

అలర్కుడికి దుఃఖం తొలగిపోయింది. కానీ మళ్ళీ అదే విషయాలు - రాజ్యమూ రాజభోగాలూ ఆక్రమణలూ యుద్ధాలూ జ్ఞాపకం వస్తున్నాయి. దుఃఖం తొలగినట్టే తొలగి మళ్ళీ వచ్చి ఆవరిస్తోంది. శాశ్వతంగా దుఃఖాన్ని తొలగించుకోవాలనుకున్నాడు. దత్తాత్రేయులవారిని ప్రశ్నించాడు.

దత్తదేవా! నీ దయ వల్ల నాకు జ్ఞానోదయం అయ్యింది. ప్రకృతి-పురుష వివేకం కలిగింది. నేను అంటే ఏమిటో తెలిసింది. దుఃఖం అంతరించింది. కానీ ఈ స్థితి స్థిరంగా ఉండేట్టు కనిపించటం లేదు మళ్ళీ అజ్ఞానం ఆవరించి దుఃఖానుభవం తొంగి చూస్తోంది. దుఃఖరహితస్థితిని స్థిరపరచుకొనే ఉపాయం చెప్పు. ప్రకృతి బంధాన్ని శాశ్వతంగా

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

తెంచుకోవటం ఎలాగో ఉపదేశించు. పునర్భవం లేకుండా నిర్గుణ పరబ్రహ్మంతో శాశ్వతంగా ఐక్యం పొందే మార్గం చూపించు. నువ్వు తప్ప నాకు శరణ్యులు లేరు. అనుగ్రహించు. అలర్కుడి ప్రార్థనను దత్తుడు మన్నించాడు. అతడిలో భక్తినీ, ఆర్తినీ గుర్తించి అతి రహస్యమైన యోగవిద్యను ఇలా ఉపదేశించాడు.

అలర్క నృపాలా! నీ జిజ్ఞాసకుఆనందించి ఈ రహస్య విద్యను ఉపదేశిస్తున్నాను. శ్రద్ధగా గ్రహించు. **ప్రకృతి పురుషులు వేరు వేరని తెలుసుకున్నావు గదా! పురుషుడు ఆ ప్రకృతి గుణాలతో కలిసిపోకుండా బ్రహ్మపదార్థంతో కలవటమే ముక్తి అంటే.**

ఈ శరీరం తుచ్ఛమూ, నశ్వరమూ అయినా, ఇది పూర్తిగా తిరస్కరింపతగినది, త్యజింపదగినది కాదు. దీని వల్ల కొన్ని ప్రయోజనాలు కూడా ఉన్నాయి. ధర్మసాధనకు, కర్మసాధనకు మూలం ఇదే. ఈ శరీరంతోనే స్థిరమైన వివేకాన్ని సంపాదించుకోవాలి. **అవివేకం వల్ల మమకారం, మమకారం వల్ల సంగం, సంగం వల్ల దుఃఖం కలుగుతున్నాయి. కనుక సంగాన్ని వదులుకోవాలి. అప్పుడే యోగసిద్ధి కలుగుతుంది. అదే ముక్తి అంటే. వీటిని తొలగించుకుంటూ వెళ్తూ సంగం వదిలించుకుంటే మమకారం నశిస్తుంది. మమకారం నశిస్తే వైరాగ్యం ఉదయిస్తుంది. ఇది ఉదయించగానే సృష్టిలో ఉన్న సమస్త పదార్థాలలో దోషాలు కనిపిస్తాయి. దోషాలు కనిపించినపుడు ఆ పదార్థాల మీద అనురాగం కలుగుతుందా? కలుగదు. అందుచేతనే జ్ఞానికి ఉన్న చోటనే ఇల్లు. తిన్నదే భోజనం. దేని మీద మమకారం ఉండదు. అభిలాష ఉండదు. ఈ కొంచెం (దినుసు) వైరాగ్యాన్నే జ్ఞానం అంటారు.** ఇదే మోక్ష సాధనం. తక్కినదంతా అజ్ఞానం. జ్ఞానము, వైరాగ్యము పరస్పర పోషకాలు. విరాగి, జ్ఞాని అనేవి కూడా పూర్ణ అర్థంలో ఒక్కటే. **ఈ విరాగి ప్రారబ్ధాలను అనుభవిస్తూ, నిష్కామర్మ కర్మలు చేస్తూ క్రమంగా ముక్తిపొందుతాడు. అతడికి మరింక పునర్జన్మ లేదు. సకామంగా కర్మల్ని ఆచరిస్తే అనుభవించటానికి మళ్ళీ, మళ్ళీ పుట్టవలసిందే. ఫలానుభవం ఆశిస్తే కర్మలు నశింపవు. అందుకనే ఈ కర్మబంధాలు జన్మ పరంపరను కలిగిస్తాయి. నిష్కామ కర్మాచరణమొక్కటే దీనికి తరుణోపాయం. అప్పుడు కర్మబంధాలు ఉండవు. జన్మ పరంపరలు ఉండవు. ఇది జన్మరాహిత్యప్రదమైన జ్ఞానమార్గం.** ఇక యోగమార్గం చెబుతాను శ్రద్ధగా విను.

యోగమార్గంలో ప్రయాణించాలి అంటే ముందుగా మనస్సునూ ఇంద్రియాలను జయించాలి. ఇది అంత తేలిక కాదు. దృఢ నిశ్చయం తీవ్ర ప్రయత్నం నిరంతర సాధన ఉండాలి. ముందుగా ప్రాణాయామాన్ని అభ్యసించాలి. దీనితో శరీరంలోని కఫాది దోషాలన్నీ నశిస్తాయి. రెండవది - ధారణ - దీని వల్ల మనస్సులోని కిల్బిషాలన్నీ తొలగిపోతాయి. దాని తర్వాత ప్రత్యాహారం దీనితో ఇంద్రియ సంసర్గ దోషాలన్నీ నశిస్తాయి. ధ్యానం మూడవది. ఇది అనీశ్వర గుణాలను తొలగిస్తుంది. అంతరంగాన్ని శుద్ధి చేస్తుంది. రాగి, బంగారంలాంటి లోహాలను కొలిమిలో కాలిస్తే వాటిలోని దోషాలుపోయి శుద్ధి అయినట్లు ఈ ప్రాణాయామం వల్ల ఇంద్రియాలు పరిశుద్ధమవుతాయి. **ప్రాణాయామము అంటే - ప్రాణాపాన నిరోధం.** ఇది లఘువు - మధ్యమం - ఉత్తమం అని మూడు విధాలు. ఇక్కడ కాలప్రమాణం గురించి నీవు తెలుసుకోవాలి. ఇక లఘువును ఉచ్ఛరించటానికి పట్టేకాలాన్నీ లేదా కనురెప్పమూసి తెరవటానికి పట్టే కాలాన్ని - ఒక "మాత్ర" అంటారు. పన్నెండు మాత్రల సేపు ప్రాణవాయువును నిరోధిస్తే దాన్ని లఘు ప్రాణాయామం అంటారు. దీని వల్ల స్వేదదోషం నశిస్తుంది. ఇరవై నాలుగు మాత్రలకాలం చేస్తే దాన్ని మధ్యమప్రాణాయామం అంటారు. దీనివల్ల వణుకు రోగం తగ్గుతుంది. ముప్పది ఆరు మాత్రలకాలం ప్రాణాయామం చేస్తే దాన్ని ఉత్తమం అంటారు. దీనితో విషాదదోషం

అంతరిస్తుంది. ప్రాణవాయువును ఇంతంతసేపు నిరోధించటం సాధ్యమా అని విస్తుపోవద్దు. మహా మహా క్రూర జంతువులే మనిషికి మచ్చిక అవుతున్నాయి. చెప్పినట్టు వింటున్నాయి. అలాగే సాధన వల్ల ప్రాణవాయువు, మహాయోగికి చెప్పుచేతల్లో వుంటుంది. ప్రారంభంలో మావటివాడులాగా దానికి మనం లొంగి వుంటాం. ఆపైన ఆ ఏనుగు మనకు లొంగివస్తుంది.

మానవునికి మచ్చిక అయిన సింహశార్దూలాలు మానవుల్ని చంపటం మానేస్తాయి. అవును కదా అలాగే ఈ స్వాధీనం అయిన ప్రాణాయామం స్వదేహాన్ని హింసించదు. పోషిస్తుంది. కిల్బిషాలను మాత్రం శోషింపజేస్తుంది.

ప్రాణాయామానికి నాలుగు దశలు వున్నాయి. అవి ధ్వస్తి - ప్రాప్తి - సంవిత్తు - ప్రసాదం అని. మొదటి దశలో వున్న మనిషికి మనస్సు కషాయపక్వంగా ఉంటుంది. ఇష్టా ఇష్టాలు పాపపుణ్యాలు మనస్సు నుండి తొలగిపోతాయి. రెండవ దశలో (ప్రాప్తి) ఉన్న ప్రాణాయామ సాధకుడు, ఐహికాముష్మిక వాంఛలను అన్నింటినీ పొందుతాడు. మూడవ దశకు చేరుకున్న సాధకునికి దివ్యదృష్టి లభిస్తుంది. దూరంగా వున్న వాటిని, కంటికి కనిపించకుండా ఉన్న వాటిని భూత, భవిష్యత్తులనూ దర్శించగలుగుతాడు. సూర్యచంద్రాదులతో సమానమైన జ్ఞానప్రభావాన్ని పొందుతాడు. ఇక నాల్గవ దశకు చేరుకున్న ప్రాణాయామసాధకుడి మనస్సు, పంచధాతువులు, పంచేంద్రియాలు, ఇంద్రియార్థాలు, అన్నీ ఎంతో ప్రసన్నమవుతాయి. అపుడు అతడు బ్రహ్మనిష్ఠుడై బ్రహ్మానందాన్ని పొందుతాడు.

ప్రాణాయామాన్ని అభ్యసించి క్రమక్రమంగా నాల్గవ దశకు చేరుకోవటం యోగాభ్యాసంలో మొదటి మెట్టు మాత్రమే. ఆపైన చెయ్యవలసిన యోగాభ్యాసం గురించి చెబుతాను తెలుసుకో.

ఆసనం - పద్మాసనం, అర్ధపద్మాసనం, స్వస్తి కాసనం - ఈ మూడూ యోగసాధనకు అనువైనవి. వీటిలో తనకిష్టమైన ఏదో ఒక ఆసనం వేసుకొని కూర్చోవాలి. వెన్నుపూసను నిటారుగా నిలబెట్టాలి. శిరస్సును సమస్థాయిలో వుంచాలి. నోరు తెరువకూడదు. దంతాలు పరస్పరం తాకకూడదు. చూపుల్ని నాసికాగ్రం మీద నిలపాలి. హృదయంలో ఓంకారాన్ని జపించాలి. తమోగుణాన్ని రజోగుణంతో, రజోగుణాన్ని సత్వగుణంతో, అణిచివెయ్యాలి. అందువల్ల నిర్మలాంతః కరణం సిద్ధిస్తుంది. నాభి నుండి కంఠం వరకూ వాయువును పూరించాలి. మనఃప్రాణేంద్రియాలను ఆయా విషయాల నుండి లోపలికి ఉపసంహరించాలి. తాబేలు తనశిరః కర, చరణాలను డొప్పలోకి ముడుచుకున్నట్లు వీటిని ఉపసంహరించాలి. బాహ్యాభ్యంతరాలను పూర్తిగా మరచిపోవాలి. దృష్టిని లోపలికి సారించాలి. తనలో తనను చూసుకోవాలి. కామాలను ప్రత్యాహరించటం కాబట్టి దీన్ని ప్రత్యాహారం అంటారు.

ప్రాణాయామంలో పూరక, కుంభక, రేచకములని మూడు ఉపాంగాలు వున్నాయి. ఇలాంటి పన్నెండు ప్రాణాయామాలకి ఒక ధారణ అని పేరు. రెండు ధారణలు ఒక యోగం. ఈ యోగం వల్ల మానసిక కిల్బిషాలన్నీ నశిస్తాయి. స్థిరచిత్తం ఏర్పడుతుంది. ఆత్మదర్శనం అవుతుంది. ఈ అనుభవాన్ని రుచిచూసిన యోగి ప్రకృతినీ దానికన్నా వేరైన ఆత్మనూ తేలికగా గుర్తిస్తాడు. వీరు మితాహారులై నిరంతరాభ్యాసంతో క్రమక్రమంగా ఉన్నతోన్నత స్థితులను పొందగలుగుతాడు.

**ప్రాణవాయువును నియమించటం ప్రాణాయామమైతే, ఇంద్రియాలు ఉపసంహరింపబడటం ప్రత్యాహారం అవుతుంది. మనస్సును నిశ్చలపరచటం "ధారణ" అంటారు.** ఈ ధారణ సమయంలో మనస్సును నాభి - హృదయం

- ఉరస్సు - కంఠం - ముఖం - నాశికాగ్రం - నేత్రాలు - భ్రూమధ్యభాగం - మూర్ధం - బ్రహ్మరంధ్రం ఈ భాగాలలో క్రమక్రమంగా నిలుపుకుంటూ వెళ్ళాలి. ఈ పదవస్థానంలో నిల్పడాన్నే ఆత్మైక్యం అంటారు.

ప్రాణవాయువును పూరకం చేసేటప్పుడు కొద్ది కొద్దిగా నెమ్మది నెమ్మదిగా పీల్చాలి. యంత్రనాళాల నుండి దాహార్తుడు నెమ్మదిగా జలాన్ని పీల్చినట్లు వాయువును పూరించాలి. అలాగే రేచకము కూడానూ. లేదంటే వ్యాధులు సోకే ప్రమాదముంది.

ఆకలి - అలసట - మనోవ్యాకులత - ఇవి ఉన్నప్పుడు ప్రాణాయామంగానీ యోగాభ్యాసం కాని చెయ్యరాదు. అలాగే అతివేడి వున్న సమయంలో, అతి చల్లగా వున్న సమయంలో, అతిగా వాయువు వీచే వేళ అభ్యసించరాదు. ధ్వని కాలుష్యం, చెమ్మనేల, భీకర ప్రదేశం. ఎండుటాకులు ఉన్న చోట్లా, రచ్చపట్టులు, నదీకూపాలు వున్న చోట్లా నాలుగు కాళ్ళ క్రూరజంతువులు వుండే చోటా, పాములు మిగతా విషజీవులు సంచరించే ప్రాంతాలలో యోగానికి పనికిరాని ప్రదేశాలు. అన్నీ అనుకూలంగా చూసుకొని మనస్సులో సత్వగుణం ఉదయించినప్పుడు మాత్రమే యోగాభ్యాసం చెయ్యాలి. మలమూత్రాలు కానప్పుడు భుక్తాయాసంతో వున్నప్పుడు ఇది అస్సలు చెయ్యరాదు.

ఈ విధి నిషేధాలు పాటింపకుండా ఎప్పుడుపడితే అప్పుడు ప్రాణాయామం చేస్తే బదిరత్వం, జడత్వం, అంధత్వము ఏర్పడే ప్రమాదం వుంది. ప్రమాదవశాత్తు ఇవివస్తే యోగంతోనే చికిత్స చేసుకోవాలి. తేలికగా జీర్ణమయ్యే జావను గోరువెచ్చగా త్రాగి యోగానికి కూర్చోడం మంచిది. ఇలా కూర్చుని రోగశాంతికి మనస్సులో ప్రత్యేకధారణలు చెయ్యాలి. వేడి తగ్గాలంటే శీతాన్ని, శీతం తగ్గాలంటే వేడిని, కఫం తగ్గాలంటే మహాశైలాన్ని, అతిదాహం ఉపశమించాలంటే నాలుక మీద ఆమ్ర ఫలాన్ని, చెవుడు తగ్గాలంటే చెవుల్లో సుస్వర సూక్తులనూ ధారణ చెయ్యాలి. మతిమరుపు తగ్గాలంటే శిరస్సుపై చెయ్యవలసిన ప్రత్యేకధారణలు వున్నాయి.

ఇవికాక ప్రకృతి శక్తుల వల్ల అనారోగ్యం కలిగితే వాటిని తగ్గించుకోడానికి యథావసరంగా పంచభూతాలను ధారణ చెయ్యాలి. ధర్మార్థ మోక్షాలకి శరీరమే ప్రధాన సాధనం కనుక యోగి తన శరీరాన్ని దృఢంగా ఆరోగ్యంగా వుంచుకోవాలి. అభ్యాసం కొనసాగుతున్నప్పుడు కొన్ని చిత్రవిచిత్రమైన యోగసిద్ధులు కలుగుతాయి. వీటిని పరులకు చెప్పకూడదు. గర్వంగా ప్రదర్శించకూడదు. అలా చేస్తే ఆసిద్ధులు అంతరించిపోతాయి. కాబట్టి రహస్యంగా వుంచుకోవాలి.

ఆరోగ్యం, మృదుస్వభావం, శరీరకాంతిసౌరభాలు, ప్రసన్నత, కంఠస్వర సౌమ్యత, మూత్రపురీషాల అల్పత్వం- ఇవీ యోగసిద్ధికి తొలిచిన్నెలు. ప్రజలకు తన యందు అనురాగం కలగడం, తనగుణగణాలను పరోక్షంగా కొనియాడటం. మిగతా ప్రాణికోటి తనను చూసి భయపడకపోవటం. అలాగే వాటిని చూసి తాను బెదరకపోవటం, అత్యుష్ణ, అతిశీతల బాధలు తనకు లేకపోవటం - ఇత్యాదులు యోగసిద్ధికి లక్షణాలు.

యోగసిద్ధులు కలుగుతున్న వేళ యోగికి కామ్యకర్మల మీద మనస్సుపోతుంది. రసాయన- రసక్రియాదులపైకీ దేవత్వ- అమరేశత్వ ప్రకటనల మీదికి జల-అగ్నిప్రవేశాల వైపుకీ చిత్తం పరుగులు తీస్తుంది. దీన్ని మాత్రం ప్రయత్నపూర్వకంగా నిలుపుదల చేసుకోవాలి. లేకపోతే యోగం చెడిపోతుంది.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

మనస్సును బ్రహ్మ పదార్థంలో సంలగ్నం చెయ్యడం ద్వారా దాని చాంచల్యాలను అదుపు చేయవచ్చు. అలా వీటిని జయంచి యోగాభ్యాసం కొనసాగిస్తుంటే మరికొన్ని అవరోధాలు ఎదురవుతాయి. వీటినే ఉపసర్గలు అంటారు. యోగాభ్యాసానికి ఇవి కూడా అవరోధాలే. ఇవి అయిదు వున్నాయి. ప్రాతిభం - శ్రావణం - దైవం - భ్రమం - ఆవర్తం. ఈ పంచవిధో పసర్గలూ సత్వరజస్తమో గుణాల నుండి ఆవిర్భవించి యోగానికి విఘ్నం కలిగిస్తాయి.

పంచవేదాలలోనూ పురాణేతిహాసాదిశాస్త్రాలలోనూ ఉన్న విషయాలు సమస్తం - వివిధ కళాశిల్ప రహస్యాలు యోగికి కరతలామలకములు అవుతాయి. అప్రయత్నంగానే స్ఫురిస్తాయి. దీనినే ప్రాతిభం అంటారు. వేలకొలదీ యోజనాల దూరంలో ఉన్నప్పటికీ మనుష్య పశుపక్ష్యాదుల స్వరాలు శబ్దాలు వాటి అర్థాలు ఇతడికి తెలుస్తాయి. ఈ శక్తిని శ్రావణం అంటారు. దేవ, పిత్రు, సిద్ధ, సాధ్యాది, అష్టవిధ దేవగణాలు ఇతడికి కనిపిస్తారు. దీన్నే దైవము అంటారు. నిరాలంబంగా ఆకాశంలో మనోదోషం వల్ల పరిభ్రమింపగలుగుతాడు. ఈ శక్తిని భ్రమం అంటారు. సుడిగుండంలో నీళ్ళు తిరుగుతున్నట్లు యోగి హృదయంలో సమస్త జ్ఞానమూ సుళ్ళు తిరుగుతూ అతడిని అల్లకల్లోలం చేస్తుంది. ఈ శక్తిని ఆవర్తం అంటారు.

ఇవేకాదు ఇంకా భయంకరమైన ఉపసర్గలు ఒక దాని వెంట ఒకటిగా జయించిన కొద్దీ వస్తూనే వుంటాయి. యోగిని ఊరిస్తూనే వుంటాయి. వీటికి లొంగిపోక ప్రదర్శనలకు దిగక నిలువరించుకోవటం చాలా అవసరం. మనోమయమైన ఆచ్ఛాదన కప్పుకొని పరబ్రహ్మాన్ని ధ్యానిస్తూ చిత్తాన్నితత్త్వణం చెయ్యడం ఒక్కటే వీటిని జయించే మార్గం. ఇలా విఘ్నాలను దాటుకుంటూ యోగాభ్యాసం కొనసాగించాలి.

అలర్కా! ఇప్పుడు నీవు ధారణా సప్తకం గురించి తెలుసుకోవాలి. నియమితాహారుడూ, జితేంద్రియుడు అయిన యోగి మూర్ధభాగంలో ధరిత్రిని ధారణ చెయ్యాలి - దాని సూక్ష్మత్వం పొందాలి అనగా ధరిత్రీత్వం పొందాలి. దానిగుణమైన గంధాన్ని తానే వదలాలి. ఇలాగే వరుసగా పంచభూతాలనూ ధారణజేసి తత్తన్మయుడు అవుతూ తత్తద్గుణాలను తానుగా వదలాలి. ఆపైన తన మనోబుద్ధులను సర్వభూతా మనోబుద్ధులతో కలిపి వాటి సూక్ష్మత్వాలను విడిచిపెట్టాలి. ఇలా ఏడు వృత్తులనూ విడిచియోగి తాను ప్రవృత్తిరహితుడై ముక్తిపొందాలి. సృష్టి అంతా ఏడు వృత్తులలోనే ఉంది కాబట్టి దీన్ని అభ్యసించిన యోగి దేవా సుర గంధర్వాదుల దేహాలలో ప్రవేశించినా సంగరహితుడుగానే ఉండగలుగుతాడు. ఇతడినే శుద్ధాత్ముడు - యోగ సిద్ధుడు అంటారు. ఇతనికి అణిమాది అష్టైశ్వర్యాలూ సిద్ధిస్తాయి. ఇవి ముక్తికి సూచకాలు.

అణిమ - అణువుకన్నా సూక్ష్మ స్థితిని పొందడాన్ని అణిమ అంటారు.

మహిమ - సమస్త జగత్తుచేత పూజింపబడటం మహిమ

లఘిమ - తేలికగా అతి శీఘ్రంగా ప్రయాణించగలడం లఘిమ

ప్రాప్తి - తానింకపొందవలసింది ఏదీలేదు అన్నంతగా సమస్తాన్ని పొందడం ప్రాప్తి

ప్రాకామ్యం - సమస్త ప్రదేశాలకు తాను వ్యాపింపగలగడం - ప్రాకామ్యం

ఈశిత్వం - తానే ఈశ్వరుడవ్వడం ఈశిత్వం

వశిత్వం - తాను సమస్తాన్ని వశపరుచుకోగలగడం వశిత్వం

గరిమ - పరం - ఏదికోరుకోదగిన స్థానమో ఏది సమస్త ఐశ్వర్యములకు నిలయమో అదియే గరిమ - పరం

వీటినే అష్ట సిద్ధులు అంటారు. వీటిని విడిచిపెట్టి ముందుకు సాగగలిగితేనే నిర్వాణం లభించేది. వీటిలో దేనికి లొంగిపోయినా పతనం తప్పదు.

యోగసాధనతో ముక్తి పొందడం అంటే - అపునర్భవ స్థితిని పొందడం. ఇది జనన మరణాలు లేని స్థితి. గర్భవాసం - జననం - వృద్ధి - వార్ధక్యం - కృశత్వం - మృతి అనే ఆరు రకాల వికారాలు ముక్తుడికి వుండవు. పంచభూతాల సాంగత్యంతో భేదం - క్లేశం - దాహం ఇత్యాదులు ఇతడికి వుండవు. భోక్తకాడు, భోజ్యుడు కాడు, తనకు నిత్యసన్నిహితమైన యోగాగ్నితో సమస్త దోషాలను దగ్ధం చేసుకొని యోగి నిర్మలుడై బ్రహ్మపదార్థంలో శాశ్వతంగా కలిసిపోతాడు. వేరే ఆలోచనే వుండదు. నీరునీటిలో కలిసినట్లు ఎన్నడూ, ఎవ్వరూ, ఎలాగూ వేరుచెయ్యడానికి వీలు లేనట్లుగా కలిసిపోతాడు. పరమాత్మతో ఆత్మ సామ్యాన్ని పొందుతాడు. దీన్నే బ్రహ్మైక్యం అంటారు.

ఇటువంటి యోగి చర్యలు ఎలా వుంటాయి చెప్పమని అలర్కుడు అడిగాడు. దానికి దత్తాత్రేయుడు అంగీకరించి ఇలా చెప్తున్నాడు. అలర్కా మానావమానాలు మానవులందర్కి ఆనందాన్ని ఉద్వేగాన్ని కలిగిస్తాయి. యోగివిషయంలో ఇవి విపరీతం. అంటే మానంవల్ల దుఃఖం అవమానం వల్ల ఆనందం పొందుతాడు. ఇతడికి మొదటిది విషం, రెండవది అమృతం.

ఇతడి దినచర్యకు చాలా నియమాలు వున్నాయి. చక్షుపూతమైన ప్రదేశంలోనే అడుగుపెట్టాలి. వస్త్రపూతమైన జలమే త్రాగాలి. సత్యపూతమైన వాక్కునే పలకాలి. బుద్ధి పూతమైన దానినే ధ్యానించాలి. ఆతిధ్యాలకు, శ్రాద్ధ భోజనాలకు, దేవతల ఊరేగింపులకూ, ఉత్సవాలకు, జనసమ్మర్థం కోలాహలం ఎక్కువగా వుండే ప్రదేశాలకు యోగసిద్ధ్యర్థి వెళ్ళరాదు. ఆ ఇంటిలో అందరి భోజనాలు అయినాక అది నిర్ధారించుకొని ప్రశాంతంగా వున్న ఇంటికి తాను వెళ్ళి భిక్ష అడగాలి. పొగలు గ్రక్కుతున్న ఇంటి నుండి గాని, బొగ్గులు గుమ్మంలో ఆరబోసిన ఇంటి నుండి గాని బిక్ష యాచించరాదు. రోజూ ఒకే ఇళ్ళకు బిక్షకు వెళ్ళరాదు. జనం తనను చూసి అవమానించే వేషధారణలో సంచరించాలి సజ్జన ధర్మాన్ని తప్పరాదు. యాయవారుల ఇండ్లకు, గృహస్థుల ఇండ్లకు వెళ్ళి భిక్ష తీసికోవాలి. యాచకుల ఇండ్లకు ఇంకా తక్కినవారి ఇండ్లకు భిక్షకు వెళ్ళడం అంతశ్రేయస్కరం కాదు.

యోగికి బియ్యపుజావ, మజ్జిగ, పాలు, యవలజావ, పండ్లు, దుంపలు, పేలపిండి, నూకల అన్నం, ఇవి శుభం కలిగించే ఆహారాలు, యోగసిద్ధికరాలు. మౌనంగా కూర్చుని ఏకాగ్రచిత్తంతో భుజించాలి. ముందుగా కొంచెం నీళ్ళు త్రాగాలి. అటు తర్వాత పంచప్రాణహుతులతో భుజించాలి. అనగా ప్రాణాయస్వాహా, అపానాయస్వాహా, సమానాయస్వాహా, ఉదానాయ స్వాహా, వ్యానాయస్వాహా అంటూ అయిదు మార్లు మెతుకులు గోటితో వేసుకుని ఆ తర్వాత భుజించాలి. చివరలో మళ్ళీ మంచి నీరు పుచ్చుకొని ఆచమించాలి. చేతులు కాళ్ళు కడుక్కోవాలి. ఓసారి హృదయంపై చేయివేసి స్పృసించాలి.

అచౌర్యం - బ్రహ్మచర్యం - త్యాగం - అలోభం - అహింస, అనేవి అయిదూ యోగి ఆచరించవలసిన వ్రతాలు. అక్రోధం - గురుశుశ్రూష - శౌచం - మితాహారం - నిత్యస్వాధ్యాయం అనేవి అయిదూ నిత్యం పాటించవలసిన నియమాలు.

లోకంలో జ్ఞానాలు, విజ్ఞానాలు అనేకం వున్నాయి. వాటిని అన్నింటినీ కబళించి వెయ్యాలనే అత్యాశ పనికి రాదు యోగికి. సారవంతము, శక్తి సాధనమూ, ముక్తి సాధనము అయిన జ్ఞానాన్ని మాత్రమే ఉపాసించాలి. లేకపోతే ఎన్ని జన్మలకైనా అది తెమలదు. ప్రధానమైన యోగోపాసన సాగదు.

నిస్సంగుడై అరిషడ్వర్గాలను జయించినవాడై మితహారుడై జితేంద్రియుడై బుద్ధి ద్వారాలను అన్నింటినీ మూసి వేసి మనస్సు ధ్యానంలో నిమగ్నం చెయ్యాలి. శూన్య ప్రదేశాలలో, గుహలలో, వనాలలో, ధ్యానం నిర్విఘ్నంగా సాగుతుంది. సమాధి స్థితి కుదురుతుంది **వాగ్దండం, కర్మదండం, మనోదండం అనే మూడు దండాలను నియమంగా ధరించే యతిని 'త్రిదండి' అంటారు.**

అలర్కా! జగత్తు అంతా ఆత్మమయంగా కనిపించే యోగికి ప్రియాప్రియాలు ఉంటాయా ? రాగద్వేషాలుంటాయా? మిత్రులనీ శత్రువులనీ ఉంటారా ? అతడి బుద్ధికి బంగారపు ముద్ద అయినా మట్టిగడ్డ అయినా ఒకటే. యోగీశ్వరుడు శాశ్వతము, అవ్యయమూ అయిన పరాత్పర స్థానం చేరుకొని పుట్టుకలేని స్థితిని పొందుతాడు. వేదాధ్యయనంవల్ల యజ్ఞక్రియా ప్రాప్తి, దానివల్ల జాప్యం జాప్యంవల్ల జ్ఞానం, జ్ఞానం వల్ల ధ్యానం, ధ్యానం వల్ల నిస్సంగత్వం, దానివల్ల నిరతిశయం, నిత్యానందస్థితి లభిస్తాయి. సమాహిత చిత్తుడూ, బ్రహ్మమయుడు, ప్రసన్నుడు, రుచి, ఏకాంత ప్రియుడు, జితేంద్రియుడు, అయిన మహామతి యోగవిద్యను ఉపాసిస్తే విముక్తి పొందుతాడు అనడంలో ఏ సందేహమూ లేదు.

యోగ మార్గాన్ని ఎంచుకున్న వారు ఓంకారాన్ని ఉపాసించి తీరాలి. విష్ణు స్వరూపుడూ, విశ్వపాద శిరోగ్రీవుడూ, విశ్వేశుడూ, విశ్వభావనుడూ, అయిన ఆ పరమాత్మను ప్రత్యక్షంగా దర్శించగలగాలి అంటే మహా పుణ్యప్రదమైన ఓంకారాన్ని జపించాలి. ఆ ప్రణవాక్షరస్వరూపం ఏమిటో వివరిస్తాను. అకార - ఉకార - మకారాల కలయిక ఇది. మూడూ మూడు మాత్రలు. అటు పైన యోగులకు మాత్రమే వుంది. అదే నిర్గుణమైనది. అదే అర్ధమాత్ర. గాంధారస్వర సంశ్రయంతో ఇది గాంధారి అవుతుంది. యోగీశ్వరుడు ధ్యానంలో కూర్చుని ఈ ప్రణవాన్ని జపిస్తే మూర్ధభాగంలో చీమ కదిలిన స్పర్శానుభూతి కలుగుతుంది.

ఓంకారోపాసన చేసే యోగి ఓంకారమయుడు అవుతాడు. అక్షరుడవుతాడు. ఈ ప్రణవమే ధనస్సు, ఆత్మయే బాణం, లక్ష్యమేమో పరబ్రహ్మతత్వం.

ఓంకారమే త్రిమూర్తులు. ఓంకారమే త్రిలోకాలు. మూడు అగ్నులు, త్రివిక్రమ పదాలు. మూడు గుణాలు, ఋగ్యజుస్సామాలు, ఇదే. దీనిలో 'అ'కారం భూర్లోకం - 'ఉ'కారం భువర్లోకం - 'మ'కారం స్వర్లోకం. అలాగే 'అ'కారం - వ్యక్తం 'ఉ'కారం అవ్యక్తం - 'మ'కారం చిచ్ఛక్తి పై నున్న కొసరు అర్థమాత్ర - ఇదే పరమపదం - 'అ'కారం - హ్రస్వం - 'ఉ'కారం - దీర్ఘం - 'మ'కారం - ప్లుతం - పైనున్న అర్ధమాత్ర వాగతీతం. ఇంతటి శక్తివంతమైన 'ఓం'కారాన్ని పరబ్రహ్మగా గుర్తించి ఉపాశించిన యోగి సంసార చక్రాన్ని వదలి బంధన త్రయాన్ని ఛేదించుకొని పరబ్రహ్మతత్వంలో లీనమవుతున్నాడు. కర్మబంధనాలు తెంచుకోలేక అపశకునాలతో మృత్యువు నెరిగి ప్రాణం వెళ్ళే సమయంలో ఈ ప్రణవాన్ని స్మరించిన భ్రష్టయోగి తిరిగి యోగిగా పునర్జన్మ పొందుతాడు. కనుక సిద్ధ యోగులు గాని అసిద్ధ యోగులు కానీ చివరి కాలాన్ని సూచించే అపశకునాలను (అరిష్టాలు) తెలుసుకోవడం చాలా అవసరం. లేకపోతే అవసానదశను గుర్తించలేక దెబ్బతింటారు.

# అరిష్ట సూచనలు

కాబట్టి, అలర్కా ! యోగికి మరణ సూచకాలైన అరిష్టాలు (అపశకునాలు) ఏమిటో తెలియజేస్తున్నాను గ్రహించు. దేవమార్గం (భ్రూమధ్యం), ధ్రువం (నాసికాగ్రం), శుక్రం (రేతస్సు క్షీణించడం), సోమచ్ఛాయ (జిహ్వాగ్రం), అరుంధతి (ఘటిక) - వీటిని చూడలేనివాడు సంవత్సరకాలంలో గతిస్తాడని తెలుసుకో.

(దేవమార్గమంటే కృష్ణ పక్షంలో ఆకాశాన కనిపించే గంగాప్రవాహ సదృశ దృశ్యమనీ, ధ్రువనక్షత్రం - శుక్ర గ్రహం - అరుంధతీ (సప్తర్షి మండలంలో) నక్షత్రం అనీ, సోమచ్ఛాయ అంటే చంద్రబింబంలో కనిపించే మచ్చ అనీ మరొక వ్యాఖ్య ఉంది). కిరణాలు లేని సూర్యబింబాన్ని కిరణాలున్న అగ్నినీ చూసినవాడు పదకొండు నెలల్లో మరణిస్తాడు. కలలోగానీ మెలుకవతోగానీ వెండిబంగారు రంగుల్లో మూత్ర పురీషాల్ని వదిలినవాడు పదినెలలకు వెళ్ళిపోతాడు. ప్రేతపిశాచాది గంధర్వ నగరాలనూ (ఆకాశంలో కనిపించే నగరాకార దృశ్యం = గంధర్వనగరం) బంగారు చెట్లనూ కలలోగానీ (ప్రత్యక్షంగా గానీ) దర్శించినవాడు తొమ్మిది నెలల్లో అసువులు వదులుతాడు. స్థూలదేహంవాడు హఠాత్తుగా చిక్కిపోవడం, సన్నటి మనిషి ఒక్కసారిగా లావెక్కడం - ఇలాంటి ప్రకృతి విరుద్ధాలు జరిగితే అతడు ఎనిమిది నెలలకన్నా బ్రతకడు. బురదలో గానీ, దుమ్ములోగానీ కూరుకుపోయిన తన పాదం తన చూపులకే ముక్క విరిగినట్టు కనిపిస్తే అతడు ఏడు నెలల్లో దివంగతుడవుతాడు. గ్రద్ద - పావురం - కాకి - జెముడు కాకి - మాంసం తింటున్న నల్లని పక్షి - ఇవి ఏవైనా తలమీద వాలితే వాడు ఆరు నెలలకి మించి జీవించడు. కాకులు అకారణంగా నెత్తిమీద తన్నితే వాడు అయిదునెలలకూ, తన నీడ తనకే తలకిందులుగానో, మరో రూపంగానో కనపబడితే వాడు నాలుగు నెలలకూ, మేఘాలు లేకుండా దక్షిణ దిక్కున మెరుపులు కనిపించినవాడు మూడు నెలలకూ, నెయ్యి నూనె నీరు అద్దాలలో తలలేని తన మొండెం కనిపించినవాడు ఒక్కనెలకూ, శరీరం గొర్రె వాసనగానీ, పీనుగు కంపుగానీ కొడితే వాడు పదిహేను రోజులకూ, స్నానం చేసిన వెంటనే హృత్పద్మమూ - కాళ్ళు ఎండిపోవడం మంచినీళ్ళు ఎన్ని తాగినా ఇంకా దాహమవ్వడం - ఇలాంటివి జరిగినవాడు పదిరోజులకీ, గాలి తగిలితే చాలు మర్మస్థానంలో మంటబుట్టేవాడూ వెన్నెల హాయిగొల్పనివాడూ నాలుగయిదు రోజులకు మరణిస్తాడని గ్రహించు.

ఎలుగుబంటిని గానీ, కోతిని గానీ ఎక్కి పాడుతూ దక్షిణ దిక్కుకి పోతున్నట్టు కలగన్న వాడికి మృత్యువు సమీపించిందని అర్థం. ఎర్రని చీర లేదా నల్లని చీర ధరించిన ఒక స్త్రీ జుట్టు విరబోసుకొని పాడుతూ విరగబడి నవ్వుతూ తనను దక్షిణ దిశకు లాక్కుపోతున్నట్టు కలవస్తే వాడు కూడా ఆసన్నమృత్యువే. దిగంబరుడు నిలబడి పగలబడి నవ్వుతున్న క్షపణకుడు స్వప్నంలో కనిపిస్తే అది కూడా ఆసన్నమృతినే సూచిస్తుంది. బురదగుంటలో గానీ మలమూత్రరూపంలో గానీ తలమునిగేలా కూరుకుపోతున్నట్టు కలగన్నవాడు అట్టేరోజులు బ్రతుకడు. అలాగే - భీకర వికృతాకారులై నల్లని పురుషులు ఆయుధాలు ధరించి వచ్చి రాళ్ళతో తనని బాదుతున్నట్టు కలగన్నవాడు కూడా అట్టేరోజులు ఉండడు.

సూర్యోదయ సమయంలో ఒక నక్క విపరీతంగా ఊళపెడుతూ ఎదురువచ్చి తనకు అపసవ్యంగా వెళ్ళినా, అన్నం కడుపునిండా తిన్నా వెంటనే మళ్ళీ ఆకలి అవుతున్నా, పంటిలో కురుపు (వ్రణదంతః) లేచినా, దీప నిర్వాణ గంధాన్ని, అన్న గంధాన్ని గుర్తించలేకపోయినా (దీపాన్న గంధంనోవేత్తి), రాత్రిపూట ధూమవహ్ని కంటి చూపులకి తెలియకపోయినా (ధూమవహ్నిం తథానిశి), ఎదుటవారి కనుగుడ్డులో తన ప్రతిబింబం తనకు కనిపించకపోయినా

(నాత్మానం పరనేత్రస్థం వీక్షతేన సజీవతి) అర్ధరాత్రి హరివిల్లూ - పట్టపగలు నక్షత్రాలూ కనిపించినా - ఇవి సద్యోరిష్ట సూచకాలని గ్రహించు. వెంటనే మృత్యువు సంభవిస్తుంది. ఉన్నట్టుండి నిష్కారణంగా ముక్కు వంకర తిరిగినా, చెవులు ఎగుడు దిగుడులైనా, ఎడమ కన్ను ఉత్తినే నీరు కారుతున్నా, ముఖం ఎర్ర బారడం నాలుక నల్లబారడం జరిగినా ఆయుర్దాయం క్షీణించిందని తెలుసుకోవాలి. ఒంటెలుగానీ, గాడిదలు గానీ పూన్చిన బండిమీద దక్షిణ దిక్కుగా ప్రయాణిస్తున్నట్టు కలగన్నవాడికి సద్యోమృత్యువని తెలుసుకో. చెవులు రెండు మూసుకున్నప్పుడు లోపలి ఘోష వినబడకపోయినా కళ్ళతో కాంతి తరిగిపోయినా అతడూ అట్టేనాళ్ళు జీవించడు. గుంటలో తాను పడినట్టు దానిమీద ఎవరో ఏదో వేసినట్టు తాను పైకిలేచి రాలేకపోతున్నట్టు కలగన్నవాడి పని అయిపోయినట్టే. మిడిగుడ్లుపడి రెప్పవాలకపోయినా కనుగుడ్లు ఎరుపెక్కి అప్రయత్నంగా గిరగిరతిరుగుతున్నా అకారణంగా ముఖం ఆవిరులు కక్కుతున్నా నాభిప్రదేశం చల్లబడినా (సుషీరా చనాభిః - శశిరాచనాభిః) అతడికది చరమసమయమని తెలుసుకో. తాను నిప్పుల్లోను, నీళ్ళల్లోను పడ్డట్టూ లేచి రాలేకపోతునట్టు కలగన్నవాడికి అదే తుదిఘడియ. కోపించి భూతపిశాచాలు రేయింబవళ్ళు తనను చితకబాదుతున్నట్టు ఎవడికి అనిపిస్తుందో వాడు వారం తిరక్కుండా సెలవుపుచ్చుకుంటాడని గ్రహించు. నిర్మలమైన తెల్లని వస్త్రాన్ని ధరించినా అది - ధరించినవాడి కంటికే ఎర్రగానో నల్లగానో కనిపిస్తే వాడు కొన్ని గంటల్లో హరీ అంటాడని చెప్పి వెయ్యవచ్చు. అకారణంగా స్వభావంలో మార్పుగానీ, ప్రకృతి విపర్యయంగానీ అరిష్ట సూచకాలు. వినయవిధేయతలతో తానింతవరకూ పూజించిన తల్లితండ్రుల్నీ, గురువుల్నీ, అత్తమామల్నీ జ్ఞానుల్నీ, విప్రుల్నీ, యోగుల్నీ అవమానించాలనే బుద్ధి తనకే పుడితే వాడు ఆసన్నమృత్యువే.

అలర్క నృపతీ ! యోగులకు మరణ సూచకాలైన అరిష్టాలు ఇవ్వి. వీటివల్ల కనీసం ఒక సంవత్సరం ముందుగా మరణసమయాన్ని తెలుసుకోవచ్చు. తెలుసుకొని యోగాభ్యాసాన్ని తీవ్రతరం చేస్తే ఫలం దక్కుతుంది. ఒక్కొక్కసారి యోగమధ్యంలో మరణం తప్పిపోవచ్చుకూడా. ఇంతకీ ఈ అపశకునాలు ముందుగా మృతిని తెలుపుతాయి కనుక యోగి మరణభయాన్ని జయించి దానికోసం సన్నద్ధుడై ఎదురుచూడగలగాలి. అప్పటి వరకూ ధృడచిత్తంతో రేయింబవళ్ళు యోగసాధనను కొనసాగించాలి. ఎక్కడ ఎప్పుడు అరిష్ట సూచన లభిస్తుందో అక్కడే అప్పుడే యోగసాధనను గాఢం చేసుకోవాలి. ఆత్మవంతుడై కాలాన్ని జయించాలి. గుణ వికారాలను అణచుకొని పరమాత్మలో మనస్సును లీనం చెయ్యాలి. ఆత్మపరంగా తన్మయుడై చిదృత్తిని సైతం విడిచిపెట్టాలి. అప్పుడు - అతీంద్రియమూ అగోచరమూ అబోధ్యమూ అనాఖ్యేయమూ అయిన పరమ నిర్వాణాన్ని ఆ యోగి పొందుతాడు, అనుభవిస్తాడు.

సుమతి తన తండ్రితో చెప్పిన కథను వేదధర్ముడు దీపకుడికి చెబుతున్నాడు. సంభాషణ కొనసాగింది. దత్తయోగీంద్రుడు అలర్కుడిపట్ల కరుణగలవాడై యోగ విద్యామహిమలను ఇంకా వివరించాడు.

అలర్క నరేంద్రా ! చంద్రకాంతమణి వెన్నెల సోకితేనే స్రవిస్తుంది. సూర్యకాంతమణి ఎండతాకితేనే నిప్పులు కక్కుతుంది. ఇవి రెండూ యోగికి ఉపమానాలు. యోగికి యోగం వల్లనే ముక్తి. మధ్యలో తపస్సనీ ఇంకొకటనీ దారులు మారకూడదు. చీమలు, ఎలుకలు, ముంగిసలు, బల్లులు కపింజలాలు (కముజులు) మొదలైనవి గృహస్థుల ఇళ్ళల్లో యజమానులతో సరిసమానంగా నివసిస్తుంటాయి. బుద్ధి పుట్టినప్పుడు వేరే ఇంటికి పోతుంటాయి. ఒకవేళ ఏదైనా కారణంగా యజమానుడి ఇల్లు ధ్వంసమైపోతే ఇవి ఏమీ దుఃఖించవు. హాయిగా మరొక ఇల్లు చూసుకుంటాయి.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

అలాగే యోగి కూడా తన శరీరంలో తానుంటూ ఎప్పుడైనా దానికి హాని సంభవిస్తే నిర్విచారంగా మరో ఉపాధికి మారగలగాలి. యోగం సిద్ధించేవరకు ఇదే వరస. ఎప్పటికి ఇది సిద్ధించేను ? అసలు సిద్ధించేనా అని బెంబేలు పడకూడదు. చెదపురుగు యోగికి చక్కని ఆదర్శం. అది ఎంత అల్పజీవి. అయితేనేమి ఆ చిన్ని ముట్టితో మట్టికణాల్ని తొలచి ఎంతెంత పుట్టలు పెడుతుందో చూసే ఉంటావుగదా ! యోగికూడా ఈ మృద్దేహికలాగానే పరిశ్రమించి క్రమక్రమంగా యోగసిద్ధిని కైవసం చేసుకోవాలి. అంతేగాని నేనేపాటి అనుకోకూడదు.

ఆవుదూడ కొమ్ము చూడు తొలి నాళ్ళలో చిన్న బొట్టంత (తిలకాకృతి) ఉంటుంది. దూడతోపాటు ఎదుగుతూ ఎంతెంత కొమ్ములవుతాయో, యోగి కూడా ఇలాగే తన యోగాభ్యాసంలో ఆత్మాకాశవృత్తిని క్రమంగా వృద్ధి పొందించుకోవాలి, ధృడపరుచుకోవాలి. పశుపక్షి మనుష్యాదులు తన ఆకుల్నీ కొమ్మల్నీ బెరడుల్నీ కాజేస్తున్నా వృక్షం ఎలాగైతే తన ఎదుగుదలను కొనసాగించి ఫలిస్తుందో అలాగే యోగికూడా తనదేహానికి కలిగే పీడనల్ని లెక్కచెయ్యకుండా సిద్ధిపర్యంతం యోగాభ్యాసాన్ని కొనసాగించాలి. నిండుగా నీటికుండను తలపై పెట్టుకొని దారిని చూసుకుంటూ ఎత్తులకు ఎక్కేవారిని చూడు. యోగి కూడా ఇలాగ ఏకాగ్ర చిత్తంతో ధారణతో ఉన్నత స్థితికి చేరుకోవాలి. అంతేగానీ కేవలం ప్రాణాయామంతో ఒరిగేది ఏమీలేదని గ్రహించు.రాత్రిగడిచి తెల్లవారుతున్న తరుణంలో సకలప్రాణి కోటికీ చలన చేష్టాది చైతన్యం కలుగుతోంది. దీని తత్త్వం ఆకళించుకొని యోగి తన మార్గంలో కృతకృత్యుడు కావాలి. అలర్కనరేంద్రా ! ఒక్కమాట చెబుతాను సారాంశంగా గుర్తుంచుకో, యోగ్యియైనవాడు అన్ని విషయాలలోను నిర్మమంగా ఉండాలి. తానెక్కడ ఉంటే అదే గృహంగా, ఏది తింటే అదే భోజ్యంగా (ఉన్నదే ఇల్లుగా తిన్నదే తిండిగా) ఏది ఉంటే అదే ధనంగా సంబరపడాలి.

గృహస్థుడు ఆయా పనుల్ని భృత్యులతో పుత్రులతో (కరణములు) చేయించుకుంటాడు. అలాగే యోగికూడా తన బుద్ధ్యాదుల్ని కరణాలుగా (సాధనాలుగా) వినియోగించుకొని పరాన్ని సాధించుకోవాలి. ఏనాడూ ఏమరకూడదు. రాజా ! యోగవిద్యా రహస్యాలు చాలా చెప్పాను. కనువిప్పు కలిగిందా ? ఇవి నీ బుద్ధిలోకి ఇమిడాయా ?

అలర్కుడు వినయ వినమిత శిరస్కుడై - మహానుభావా ! ఎంత అదృష్టవంతుణ్ణి, సాక్షాత్తు యోగవిద్యాస్వరూపుడి నుంచి యోగవిద్యా రహస్యాలు తెలుసుకోగలిగాను. నీ అనుగ్రహానికి ఇలా నోచుకున్న నా జన్మ ధన్యం. ఇంతకీ కారణం - నాకు జరిగిన అవమానం. నాకు వచ్చిపడ్డ అపజయం. నన్నావరించిన ప్రాణాపాయభయం. కాశీ నరేశ్వరుడి సేనా బలపరాక్రమాలు నీ చరణ సన్నిధికి నన్ను తెచ్చి పడవేశాయి. అదృష్టవశాత్తు నాకు అంతటి సైన్యబలం లేకపోయింది. అదృష్టవశాత్తు నా భృత్యులంతా హతులయ్యారు. అదృష్టవశాత్తు నాకోశం తరిగిపోయింది. అదృష్టవశాత్తు నాలో నీతి మేల్కొంది. వీటితో ఏ ఒక్కటి జరగకపోయినా నేనీపాటికి కాశీరాజుతో యుద్ధం చేస్తూ ఉండేవాణ్ని. నా అదృష్టం బాగుండి ఇలా జరిగింది. సరిగ్గా తగిన సమయానికి నీ పాదయుగళం గుర్తుకి వచ్చింది. నువ్వు అనుగ్రహించావు అదృష్టం బాగుండి నీ ప్రతిమాటా నా హృదయంలోకి ఇంకింది. నీ సాంగత్యం వల్ల నాకు జ్ఞానోదయమయ్యింది. అదృష్టం బాగుండి నువ్వు నామీద దయతలచావు. కలిసివచ్చే కాలానికి అపకారం (అనార్యం) కూడా ఉపకారమవుతుందంటే ఇదేననుకొంటాను. నాకు కలిగిన పరాజయదుఃఖం నీ సంగమం వల్ల ఇంతటి మహోపకరంగా పరిణమించింది.

యోగీశ్వరా ! ఇలా నీ సన్నిధికి నన్ను వచ్చేట్టు చేసిన సుబాహువూ కాశీనరేశ్వరుడూ నాకు నిజంగా మహోపకారులు. నీ అనుగ్రహాగ్ని జ్వాలలో నా అజ్ఞాన కిల్బిషాలన్నీ పూర్తిగా దగ్ధమైపోయాయి. ఏనాడూ ఇంక ఏ దుఃఖమూ నన్ను ఆవరించకుండా జాగ్రత్తపడతాను. జ్ఞానదాతవైన నువ్వు అనుమతిస్తే ఇప్పుడే ఇక్కడే, ఆర్తీ - దుఃఖమూ అనే వృక్షాలకు అడవివంటిదైన గృహస్థాశ్రమాన్ని పరిత్యజిస్తాను - అంటూ అలర్కుడు దత్తస్వామికి సాష్టాంగపడ్డాడు.

స్వామి ప్రేమగా అలర్కుణ్ణి లేవనెత్తి తలపై నిమిరి - రాజేంద్రా ! నీకు శుభమగుగాక. ఇంక బయలుదేరు. నువ్వు అన్నట్టే చేయి. నా మాటలన్నీ గుర్తుంచుకో. నిర్మముడవూ, నిరహంకారుడవూ అయి ముక్తికోసం ప్రయత్నించు అన్నాడు. అలర్కుడి కన్నుల్లో భాష్పాంబు కణాలు పెల్లుబికాయి. ప్రేమ విహ్వలుడై దత్తదేవుణ్ణి స్తుతించాడు.

## అలర్కుడు చేసిన దత్త స్తుతి

దత్తదేవా యోగవిద్యను ప్రవర్తింపజేయడం కోసమే అవతారం ధరించినవాడవు నువ్వు. స్వరూప ఆవిర్భావంతో దేహాన్ని తుచ్ఛీకరించిన వాడవు. విజ్ఞానానికి నిలయం నీవు. అధిష్ఠాన దేవతవు నీవు. సుర సిద్ధసాధ్య కిన్నెర కింపురుషాదులు నీ పాద పద్మాలు సేవిస్తూ ఉంటారు.

ఓ మహానుభావా ! భక్తులను అనుగ్రహించు అణోరణీయుడవు. మహతోమహీయుడవు. బ్రహ్మాండమంత విశాల దేహము నీదే. సూక్ష్మ చిత్ శక్తి నీవే. దిగంబరుడవు నీవే. విచిత్ర దివ్యాంబర ధారివి నీవే. ఇదే నీకు నా నమోవాకం. యోగీశవంద్యుడవు, యోగవిఘ్ననాశకుడవు. మహానుభావుడవు, వృద్ధుడవు, బాలుడవు, సర్వమూ నువ్వే. కాంతతో సరసములాడుతూ సశరీరంతో నున్న నవ యవ్వన యువకుడవు నీవే. నిన్నర్థం చేసుకోవడం చాలా కష్టం. నమోనమః నమోనమః. జనన మరణ పరంపరలకు భయపడి మునులు సమాధి నిష్టతో నిన్ను ధ్యానిస్తూంటారు. మన్మధున్ని జయించిన విరాగుల మనస్సులలో నిరంతరం మెదిలే పరతత్వానివి నీవు. సదసత్తులకు అతీతమైన పరం - ఆత్మద్వైతానివి. నీలో లీనమైన ఈ యోగులు, విరాగులు మరికదేనినీ ఎరుగరు. వారికి నువ్వు తప్ప మరొకటిలేదు. పరము, అవ్యయము, దివ్యము విజ్ఞాన చైతన్యము అయిన బ్రహ్మతత్వానివి నీవు. స్వతఃసిద్ధము, సనాతనము అయిన సాక్షాత్తు పరంజ్యోతివి నీవు. సర్వదేవతామయుడవు. పురుషోత్తముడవు, వాచామగోచరుడవు, నిర్గుణ పరమాత్మవు. నీకిదే నా ప్రణతి. నారాయణా ! పద్మనాభా ! జగద్రూప ! జగత్కారణ ! వాక్యశక్తి ! వాచకశక్తి ! శరణాగత వత్సల! ప్రణతరక్షక ! పూర్ణప్రబోధా ! యోగేశ్వరా నమస్తే నమస్తే. విశ్వంభర ! గరుడ కేతన ! గోపాలక, అజ్ఞానమనే అజగరం మింగేస్తున్న ఈ విశ్వాన్ని ఉద్ధరించు. శ్రీపతి, భూపతి వేదశాస్త్రాలకు పురుడుపోసిన వాక్పతి ! వేదాంత వేద్యా ! సర్వ ప్రమాణ గోచరా ! నమోస్తుతే !

మూఢులై అజ్ఞానతిమిరంతో కొట్టుమిట్టాడే జనులకు జ్ఞాన చక్షువును అందించే యోగభాస్కరా, బ్రహ్మవంశ సంభవా, మునీశ్వరా, మౌనశాలి, అనసూయా తనయ, మునిసుత, నమోస్తుతే నమోస్తుతే! స్వేచ్ఛా విహారి ! వర్ణాశ్రమ వివర్జిత ! నిజానికి నీకు ఏ రూపం లేకపోయిన బ్రాహ్మణ రూపం ధరించి కనిపించేవాడా ! యోగీ ! వేద బ్రాహ్మణ రక్షక ! కైటభమర్దనా! వైకుంఠ ! వైకుంఠానికి ఈ విశ్వానికి బెడదతెచ్చే వ్యక్తులను, శక్తులను నాశనం చేసేవాడా ! మురారాతి ! కేశినిషూదనా ! కంస విధ్వంసి ! కృష్ణా ! పదేపదే నీకు శిరసువంచి అంజలి ఘటిస్తున్నాను. దేవదేవ

జగత్పతి ! నీ అనుగ్రహంవల్ల కృతార్థుణ్ణి అయ్యాను. నువ్వు ఆజ్ఞాపించిన తత్వాన్ని పూర్తిగా అభ్యసిస్తాను, అని ఆనందాతిశయంతో బొంగురుపోతున్న గొంతుతో, ఒణికిపోతున్న శరీరంతో సాష్టాంగపడి ఆనందభాష్పాలతో దత్తదేవుని పాద పద్మాలు కడిగి అలర్క మహారాజు స్వామి వద్ద సెలవు తీసుకొని బయలుదేరాడు.

సహ్యాద్రి నుండి అలర్కుడు సరాసరి రాజధానికి వెళ్ళాడు. అక్కడ తన సోదరుడు సుబాహువూ కాశీపతి కొలువు తీరియున్నారు. అలర్కుడు ప్రవేశించి చిరునవ్వులు చిందిస్తూ ఇలా అన్నాడు. రాజ్యకాముకా కాశీపతీ అనుభవించు మహోర్జితమైన ఈరాజ్యాన్ని ఇదిగో ఇప్పుడే నీకు ధారపోస్తున్నాను. స్వీకరించి ఆనందంగా అనుభవించు. లేదా సుబాహుకి అప్పగించుకో. నీ యిష్టం ఎలా కావాలంటే అలా చేసుకో, ఇదిగో తీసికో.

హఠాత్తుగా అలర్కుడు ఊడిపడటం నుంచి తేరుకోని కాశీరాజు ఈ మాటలకు మరీ నివ్వెరపోయాడు. ఏమిటి అలర్కా ! నీవు అంటున్నది ? రాజ్యాన్ని వదిలేస్తున్నావా ? యుద్ధం మానుకున్నావా ? ఇది క్షత్రియధర్మమేనా ? నువ్వు అసలు సిసలు క్షత్రియుడివి. క్షత్రియ ధర్మాలన్నీ ఎరిగినవాడివి ఏమిటి ఈ వింత ? రాజ్యాన్ని నాకు ధారపోయడం ఏమిటి ? అమాత్యులు, సామంతులు, సేనాపతులు, అందరూ ఓడినా క్షత్రియుడన్నవాడు మరణ భయాన్ని దగ్గరికి రానీయకుండా శత్రువు మీదకు బాణాలను గురిపెడుతూ రణరంగంలో నిలబడాలే గానీ ఇదేమిటి ? - ఈ రాజ్య త్యాగం నాకేమీ అర్థంకావడం లేదు. చాలా వింతగావుంది. యుద్ధాలు చెయ్యాలి. శత్రువులను జయించాలి. రాజ్యభోగాలను సంతృప్తిగా అనుభవించాలి. పరలోక సుఖాలకోసం మహాయజ్ఞాలు చెయ్యాలి, ఇదీ మన ధర్మం.

కాశీరాజు ఇంకా ఏదో మాట్లాడబోయాడు. అలర్కుడు అడ్డు తగిలాడు. కాశీనరేశా ఒకొప్పుడు నీలాగే నాకు ఇలాంటి ఆలోచనే వుండేది. ప్రస్తుతం నా పరిస్థితి వేరు. ఆలోచనలన్నీ మారిపోయాయి. కారణం చెబుతాను విను. గడ్డిపరక ఎలా పెరుగుతుందో ఈ సృష్టిలో ప్రతీ ప్రాణీ అలాగే పెరుగుతుంది. అన్నింటిలో వుండే చిత్‌శక్తి ఒక్కటే అదే ఆత్మ - అదే పరమాత్మ. అటువంటప్పుడు రాజు ఏమిటి, పేద ఏమిటి శత్రువేమిటి ? మిత్రువు ఏమిటి ? ఇన్ని భేదాలు ఎక్కడవున్నాయి? అంతటా వున్నది నేనే. నేనేవరితో యుద్ధం చెయ్యాలి ? కాశీరాజా దత్తస్వామి నాకు ఈ జ్ఞానం ఉపదేశించారు. కనువిప్పు కలిగించారు. ఇంద్రియాలను జయించి సర్వసంగపరిత్యాగినై మనస్సును పరబ్రహ్మంలో అనుసంధానం చేస్తాను. అసలైన జయమంటే ఇదే. పరమజయం ఇది.

ఇంతకన్నా నాకు సాధించవలసింది ఏదీ కనిపించడం లేదు. ఇప్పుడు నువ్వు నాకు శత్రువుకాదు. నేను నీకు శత్రువునీ కాదు. సుబాహువుకూడా అంతే అంతటా నేను ఆత్మనే దర్శిస్తున్నాను. అంచేత ఓరాజా నీకు యుద్ధం చెయ్యడానికి ఓ శత్రువు కావలసి వస్తే ఇంకెవరినైనా వెతుక్కో.

అలర్కుడి మాటలు వింటున్న కాశీపతి ముఖం వెలవెలబోతూ వుంటే సుబాహువు ముఖం మిలమిల మెరుస్తూ వుంది. అలర్కుడ్ని ఆనందంతో కౌగిలించుకున్నాడు సుబాహువు. కాశీపతి దీనికోసమే -మా సోదరుడిలో ఈ మార్పు రావడం కోసమే - నేను నిన్ను శరణుకోరాను. నా కోరిక నెరవేరింది. నా పన్నాగం ఫలించింది. నేనింక బయలుదేరుతాను నీకు సుఖమగు గాక అని సుబాహువు అన్నాడు.

సుబాహూ అలర్కుడ్ని జయించి తాతతండ్రుల రాజ్యాన్ని అప్పగించమని కదా నీవు అడిగావు. ఇప్పుడు నీకు ఆ అవకాశం వచ్చింది. రాజ్యాన్ని తీసికొని భోగాలు అనుభవించు. వెళ్లిపోతానంటావేమిటి ? అని అడిగాడు కాశీపతి.

అప్పుడు సుబాహువు ఇలా అన్నాడు, రాజా ఇంతప్రయత్నమూ నేనెందుకు చేసానో నీతో చేయించానో నువ్వు గ్రహించు. నా తమ్ముడితడు. తుచ్ఛమైన రాజ్యభోగాలలో గ్రామ్య సుఖాలలో మునిగిపోయాడు. బ్రహ్మతత్వానికి దూరమవుతున్నాడు. ఇతడ్ని దారిలోకి తీసుకురావడం ఎలాగా అని నాకు దిగులుపట్టింది. మా కన్నతల్లి మదాలస బాల్యం నుండే నాకూ నాపై వాళ్ళిద్దరికీ బ్రహ్మతత్వాన్ని జోలలుగా పాడింది. స్తన్యంనోటితో, బోధ చెవులతో త్రాగించింది. మేము ముగ్గురం అమ్మదయవల్ల బ్రహ్మజ్ఞానులమై దుఃఖ రహిత పరమానందస్థితిని అనుభవిస్తున్నాం. కడగొట్టు తమ్ముడు వీడు. ఇతడు ఒక్కడూ ఇలా ఇంద్రియ సుఖాలకు దాసుడై ఎండమావులవెంట పరుగెత్తుతున్నాడు. చిన్న నాటనే అమ్మ వీడికి ఆబోధలు చెయ్యలేదే అనే దిగులుపడ్డాను. పదిమంది మంచివారు ఒకదారిలో వెళ్తూవుండగా ఒకడు మధ్యలో దారి తప్పితే ఎలాగుంటుంది. మిగిలిన వారికి బాధగా వుండదా ? అలాంటిది సొంత తమ్ముడు భోగబంధాలలో చిక్కుకొని చెడిపోతూ వుంటే నా మనస్సు విలవిలలాడదూ ? ఉద్ధరించాలి అనుకున్నాను. భోగాల నుండి విరక్తికలగాలంటే దుఃఖం వల్లనే కలుగుతుంది. మరి ఆ దుఃఖం విత్తనాశనం వల్లనే కలుగుతుంది. అంచేత ఇతడి రాజ్యాన్ని కొల్లగొట్టే ఏర్పాటు నీ ద్వారా చేసాను.

మావాడికి దుఃఖం కలిగింది. అందులో నుండి వైరాగ్యం బయలుదేరింది. దత్తదేవుడి కృపవల్ల సద్గురు బోధ లభించింది. బ్రహ్మజ్ఞాని అయ్యాడు. నా కోరిక నెరవేరింది. మరింక నాకు శలవు. నువ్వు చేసిన ఉపకారానికి నేను కృతజ్ఞుణ్ణి. నిన్నొక సాధనంగా వుపయోగించుకున్నానని బాధపడకు. చిన్నబుచ్చుకోకు, ఈ రాజ్యం కూడా అందుకొని సుఖించు. మదాలసవంటి యోగమాత కడుపునబుట్టిన వాళ్ళం. ఆ తల్లిపాలు త్రాగిన వాళ్ళం మా తమ్ముడు కూడా మా తల్లి ఉపదేశించిన బ్రహ్మమార్గంలోనే ప్రయాణించాలని మేము కోరుకోవడంలో తప్పులేదు కదా ! సమర్థులు వుండగా అయినవాడు అపమార్గం పడితే అది ఎవరి తప్పు అవుతుంది ? లోకం మమ్మల్నే కదా ఆడిపోసుకుంటుంది.

సుబాహువు ప్రసంగంతో కాశీరాజు కలత చెందిన మనస్సుతో సాధు పుంగవా ! సుబాహూ ! అలర్కుడికి ఉపకారం చెయ్యాలనుకున్నావు. మరి నాకు ఉపకారం చెయ్యాలని ఎందుకు అనుకోలేదు. సజ్జనులతో కలయిక నిష్ఫలంకావడానికి వీలులేదు. సత్ఫలాన్ని అందించు, అంచేత నీ కలయికవల్ల నాకు కూడా ఉన్నతిని కలిగించు. జ్ఞానోపదేశం చేసి పుణ్యం కట్టుకో.

కాశీపతీ ఇలా అడిగావంటేనే నీలో మార్పు తెలుస్తోంది. సంతోషం, ఆలకించు. ధర్మార్థ కామమోక్షములని నాలుగు పురుషార్థాలు వున్నాయి. వీటిలో మొదటి మూడింటినీ నీవు సాధించావు.

ఇప్పుడిక నాల్గవ దానికోసం ప్రయత్నించు. దాన్ని సాధించడం ఎలాగో క్లుప్తంగా చెప్తాను. సావధాన చిత్తంతో విను. విని బాగా ఆలోచించి శ్రేయస్సాధన కొరకు ప్రయత్నించు. మమ - అహమ్ అనేవి రెండూ దరిజేరకుండా చూసుకో. నేనెవడను ? ఎవడి వాడను ? - అని లోలోపల తర్కించుకో - పరిపాలనా బాధ్యతలు అయ్యాక అర్థరాత్రి ఒంటరిగా కూర్చుని తర్కించుకో నీ ఆలోచల్ని అంతర్ముఖంగా ప్రయాణం చెయ్యనియ్యి వ్యక్తా వ్యక్తాలు తెలుసుకో. అప్పుడు నేను ఏమిటో తెలుస్తుంది. అది తెలిస్తే అన్నీ తెలిసిపోతాయి. ఆత్మ కానిదాన్ని ఆత్మగా భావించడమే అజ్ఞానం. అదే విమూఢత, దీన్ని తొలగించుకుంటేచాలు. రాజా నేను సర్వగతుడ్ని అయినా నువ్వు అడిగావు కాబట్టి లోక వ్యవహారాన్ని బట్టి సంక్షేపంగా సారాంశం తెలియజేసాను. సెలవు వస్తాను - అంటూ సుబాహువు బయలుదేరాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

కాశీపతి ఒక్కనిమిషం అంటూ అన్నదమ్ములిద్దరికీ పాదాభిషేకం చేసాడు. ఇది మీ రాజ్యం మీ యిష్టం అని తన రాజధానికి బయలుదేరాడు.

సుమతీ ఆ తర్వాత ఏమయ్యింది ? విరక్తుడైన అలర్కుడు రాజ్యాన్ని ఎవరికి అప్పగించాడు ? సుబాహువు మరి తన తమ్ముడ్ని ప్రశంసించలేదా ? ఇలా ప్రశ్నిస్తున్న తన తండ్రికి తరువాత కథను సుమతి ఇలా వివరించాడు. అది కూడా నీకు చెబుతాను - అంటూ వేదధర్ముడు దీపకుడికి అలర్కకథను ఇలా చెప్తున్నాడు.

కాశీరాజు వీడ్కోలు చెప్పాక అలర్కుడు సుబాహువుకు పాదాభివందనం చేసాడు. అన్నా నన్ను కృతార్థుడ్ని చేసావు. కృతజ్ఞుణ్ని చిన్నప్పుడు అమ్మ మీ ముగ్గురికీ బ్రహ్మజ్ఞానం నూరిపోసింది. నాకు ఆ అదృష్టం లేకపోయింది. లౌకిక మార్గంలో పడి రాజ్యపాలన అంటూ జడుడ్ని అయ్యాను. నీ దయవల్ల ఇప్పటికి విముక్తుడ్ని కాగలిగాను అని ఆనందభాష్పములు రాలుస్తూ వణుకుతున్న కంఠంతో మాట్లాడుతున్న తమ్ముణ్ణి ఆర్ద్రంగా కౌగలించుకున్నాడు సుబాహువు. తమ్ముడూ! నీ బ్రహ్మజ్ఞానం మీద నాకు నమ్మకం కుదిరింది. ఏది చెయ్యాలో అది చేసావు. కాబట్టి ఇంక నీ యిష్టం. రాజ్యమే ఏలుకుంటావో, అడవులకే వెడతావో నిర్ణయించుకో. ఇందులో నాకు కృతజ్ఞతలు చెప్పవలసింది ఏదీ లేదు. అంతా దత్తాత్రేయుడి అనుగ్రహం. శుభమగుగాక అని ఆశీర్వదించి సుబాహువు నిర్లిప్తంగా నడిచి వెళ్ళిపోయాడు.

అలర్కుడు అంతఃపురానికి వెళ్ళి ఆ రోజే తన పెద్ద కొడుకుకి రాజ్యపట్టాభిషేకం జరిపించి పరిపాలనా బాధ్యతలు అప్పగించి తాను ధర్మపత్నీ సమేతుడై వానప్రస్థానికి వెళ్ళాడు. అక్కడ కొంతకాలం యోగాభ్యాసం చేస్తూ కొంత కాలానికి నిర్ద్వంద్వుడూ, నిష్పరిగ్రహుడూ అయి యోగసిద్ధిని పొందాడు. నిర్వాణఫలాన్ని చవిచూసాడు. ఆ స్థితి నుండి ఈ జగత్తు అంతా తిలకించాడు. దేవ, అసుర, మానవగణాలతో పశుపక్ష్యాది జాతులతో అనేక రకములై వృక్షసంపదలతో కిటకిటలాడుతున్న జగత్తు సత్వ, రజస్తమో గుణాలనే బంధాలలోబడి కొట్టుమిట్టాడుతున్న వైనం కనిపించింది. బిడ్డలనీ, తోబుట్టులనీ, మిత్రులనీ, శత్రువులనీ, తనవారనీ, పరాయివారనీ ఏవేవో బంధాలు - సంబంధాలు కల్పించుకుంటూ తన్నులాడుకుంటున్నారు. కామక్రోధాదులకులోనై దుఃఖార్తులవుతున్నారు. అజ్ఞానమనే బురదగుంటలో పడిదొర్లుతున్నారు. ఉద్ధరించే దిక్కు లేక అల్లల్లాడుతున్నారు. తానొక్కడూ గట్టు మీద నిలబడి చూస్తునట్లు దర్శనం అయ్యింది. అప్పుడు అతని నోటి నుండి అప్రయత్నంగా ఇలా అన్నాడు.

ఓహో! ఒకప్పుడు నేను అనుభవించిన రాజ్యభోగాలు సుఖాలు ఇప్పటి ఈ నిర్వాణానుభవంతో పోలిస్తే అవి ఏ పాటి? యోగాన్ని మించిన పరమ సుఖం లేదు గాక లేదు. కాంతాకనకాలు - వస్తు వాహనాలు - ధనధాన్యాలూ - లోకంలోని ఏ ఐశ్వర్యమైనా, అది అందించే ఆనందమైనా యోగం అందించే ఆనందంలో పదహారవవంతు కూడా కాదు.

కోరికలు వదులుకుని ఆత్మానందాన్ని అనుభవించటం చేతకాక ఈ లోకులంతా కోరికల వెంట పరుగులు తీస్తున్నారు. దుఃఖభాజనులు అవుతున్నారు. సత్యమూ, జ్ఞానమూ, అనంతమూ, జ్యోతిస్స్వరూపమూ, సనాతనమూ, అయిన ఏ పరబ్రహ్మమైతే ఉన్నదో అదే నేను. అదే ఆత్మ. దత్తాత్రేయుడి దయవల్ల తల్లిదండ్రులు అనుగ్రహం వల్ల సోదరుడి కృషి వల్ల నేను కృతార్థుణ్ని కాగలిగాను. నిజంగా నిస్సంశయంగా కృతార్థుణ్ని కాగలిగాను.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

తండ్రీ, దత్తస్వామి అలర్కుడికి బోధించిన యోగవిద్య అంతా నీకు నేను తెలియచేశాను. దీన్ని నీవు అభ్యసించి ఆచరణలో పెడితే బ్రహ్మానంద స్థితిని పొందుతావు. ముక్తికి యోగమొక్కటే ఉత్తమమార్గం. యజ్ఞాలు, జపాలూ, తపాలు, ఇవన్నీ ఎందుకుగానీ యోగవిద్యను ఉపాసించు. జనకా దయచేసి నాకు అనుజ్ఞ ఇవ్వు అడవులకు వెళ్ళి యోగాభ్యాసం కొనసాగించి నిర్ద్వందుణ్నీ నిష్పరిగ్రహుణ్నీ అయ్యి బ్రహ్మభావం పొందటానికి, ముక్తిని పొందటానికి నిర్వృతిని పొందటానికి ప్రయత్నిస్తాను.

తండ్రికి ప్రదక్షిణం చేసి సాష్టాంగ నమస్కారం చేసి లేచి అనుమతి తీసుకుని సుమతి అడవులకు వెళ్ళిపోయాడు. అప్పుడు ఆ తండ్రి ఏమి చేసాడంటే కన్నకొడుకు తనను విడిచి ఎక్కడికో వెళ్ళిపోతున్నాడనే ఆలోచనలతో గుండెల్లో కమ్ముకున్న మమకార దుఃఖం నుండి క్షణంలో తేరుకొని కొడుకు చెప్పిన యోగవిద్యా రహస్యాలను మననం చేసుకుంటూ ఆ క్షణం నుండే యోగాభ్యాసం ప్రారంభించాడు. కొంతకాలానికి పరిణితి చెంది వానప్రస్థం స్వీకరించాడు. ఆపైన మరికొంతకాలానికి నాల్గవదైన సన్యాసాశ్రమం స్వీకరించి యోగసిద్ధి పొందాడు.

నాయనా దీపకా! విన్నావు గదా ఇది దత్తమహిమ. ప్రసక్తానుప్రసక్తంగా పితాపుత్రుల కథ. కార్తవీర్యుడి గాథ. అలర్కోపదేశం - అన్నీ నీకు తెలిపాను. దత్త మహిమను ఎవరు ఎప్పుడు చెప్పినా, విన్నా, వారికి దత్తుడి అనుగ్రహం వల్ల సమస్తకిల్బిషాలు తొలగిపోతాయి. సంసార సంబంధమైన దుఃఖాలు నశిస్తాయి. ఐశ్వర్యాలు లభిస్తాయి. అహంకార మమకారాలు తొలగి మనస్సు తేలికపడుతుంది. ఈ జీవితం, ఈ జీవకోటి, ఏ సూత్రం మీద నడుస్తున్నాయో అవగతమవుతుంది. ఆత్మకు ధైర్యమూ, చైతన్యమూ ఏర్పడతాయి. యోగాభ్యాసం పట్ల గురికుదిరి అంతిమంగా నిర్వాణానుభూతి కలుగుతుంది- అని చెప్పి వేదధర్ముడు కాసింత విశ్రాంతి తీసుకున్నాడు అంటూ బ్రహ్మకలి పురుషునితో చెప్పాడు.



# శ్రీదత్త పురాణము

## తృతీయ భాగం

దీపకుడు వేదధర్మునికి పాదాభివందనం చేసి ఇలా అడిగాడు. ఆధ్యాత్మిక జ్ఞానరాశీ! గురుదేవా! నాదొక సందేహం. దేవాదిదేవుడూ జగద్విధాత అయిన పరమేశ్వరుడు అనసూయా- అత్రిమహర్షులకు తనయుడుగా జన్మించి మునియై- విరాగియై అనాచారాన్ని ఎందుకు ఆశ్రయించాడు? పెద్దలు ఏది ఆచరిస్తే ఏది ఉపదేశిస్తే తక్కిన వారంతా అదే ఆచరణీయం కాబోలు అనుకుని అనుసరిస్తారు గదా!

## దీపకుని సందేహ నివారణ

ఆనందకందమైన పరమాత్మ అసలువిప్రుడుగా ఎందుకు జన్మించాడు? లోకంలో బ్రాహ్మణుడు అంటే ధర్మప్రవర్తకుడూ మోక్ష మార్గోపదేశకుడు కదా! మరి బ్రాహ్మణుడుగా పుట్టి ఇలా విరుద్ధంగా ప్రవర్తించటం ఏమిటి? ఇది సత్సంప్రదాయమేనా? దయానిధీ - విశ్వబంధూ - ఇది నా సందేహం దయచేసి దీన్ని తొలగించు. ఆప్తకాముడూ, పరమానంద స్వరూపుడూ అయిన ఈశ్వరునికి ఏ దోషమూ అంటదన్నట్లయితే అసలు బ్రాహ్మణుడుగా పుట్టడం ఎందుకు? పుట్టినపుడు ఆ ఉపాధికి తగినట్లుగా ప్రవర్తింపక నిరంతరం స్త్రీ సంగమ సంయుక్తుడై, మద్యపానరతుడై, మదఘూర్ణి నేత్రుడై మట్టి కొట్టుకున్న దేహంతో ఆడ ఏనుగుకి లొంగిపోయిన మదమాతంగంలా ప్రవర్తించటం. అందరికీ దర్శనం అనుగ్రహించటం ఇది ఏమిటో నాకు తెలియడం లేదు. ఇది నా దృష్టికి సమంజసంగా తోచటం లేదు. ఇందులో ఏదో రహస్యం వుంటుంది. అది తెలియచేసి నా సందేహాన్ని తొలగించండి. అప్పటికిగానీ నా మనస్సు కుదుటబడదు అన్నాడు దీపకుడు.

నాయనా దీపకా నీకు కలిగిన సందేహమేనా ఇది? ఏమో ఎందుకు అడిగావో మనస్సులో పెట్టుకొని మల్లగుల్లాలు పడకుండా అడిగి మంచి పనిచేసావు. చెబుతాను విను. లోకంలో ఇలాంటి సందేహాలు లేవనెత్తేవాళ్ళు వుంటారు అంటూ వేదధర్ముడు చిరునవ్వులు చిందిస్తూ ఇలా చెప్తున్నాడు.

నాయనా వర్ణాశ్రమధర్మాలు దేవతలకు వేరు - మనుష్యులకు వేరు - పక్షులకు వేరు - జంతువులకు వేరు - సదాచార పరాయణులైన మంచివారిలో కూడా వర్ణాశ్రమాచారాలు విధులు వేరు వేరుగా వుంటాయి. పరమార్థనిష్ఠతో నివృత్తికాములైన ఈ శిష్టులు చిత్తశుద్ధి కొరకు అవసరమైన సత్కర్మలు చేస్తుంటారు. వీరిలో కొందరు యోగమార్గాన్ని ఆశ్రయిస్తే కొందరు తపస్సును, కొందరు దానధర్మాలను ఆశ్రయిస్తున్నారు. మరికొందరు శత్రు వినాశనం - రాజ్య సుస్థిరత - స్వర్గం - యశస్సు - భార్యాపుత్రులు - ధనం - ఇంట్లాంటివి కావాలని కోరుతూ సకాములై వేదవాద విమోహితులై యజ్ఞయాగాదులు చేస్తున్నారు. ఇన్ని భేదాల్లో ఏవి నింద్యాలు ? ఏవి శిరోధార్యాలు ? ఎవరు పండితులు? ఎవరు కారు? అన్ని మార్గాలు వేదాలను అనుసరిస్తున్నవే. వేదసమ్మతాలే. అన్నీ ప్రశస్తాలే. ఈ వేదమే పరమేశ్వరుణ్ని శుద్ధజ్ఞాన స్వరూపమని చెప్పింది. ఇలాంటి నిర్లిప్తుడు సృష్టి మొదలు నుండీ కాలానుగుణంగా నింద్యకర్మలూ, అనింద్య కర్మలూ చేస్తూనే వున్నాడు. లీలామానుషరూపాలు అనేకం ధరించి భూమిపై అవతరించీ, అవతరించకా - దుష్టశిక్షణ

శిష్ట రక్షణ అనాదిగా చేస్తున్నాడు. వీటిలో ఏది దోషమంటావు? ఏది కాదంటావు? అన్ని ధర్మాలకు మూలమైన వేదమే ప్రవృత్తి- నివృత్తి మార్గాలను రెండింటినీ సమతుల్య ప్రధానంతో ప్రబోధిస్తోంది. పరస్పర విరుద్ధాలైన ఈ రెండింటిని ఒకే కర్త ఒకేసారి అవలంభించగలడా? అవలంభించలేడు. కనుక ఇవి వేరు వేరు వ్యక్తుల కోసం అని మనం గ్రహించాలి. అధికార భేదాన్ని బట్టి ఆచారభేదము, ధర్మభేదము, మార్గభేదము ఏర్పడతాయి. **అందుచేత మనం అనుకునే సదాచార - దురాచార భేదం పరమాత్మకు వర్తించదు. ఆ పరమేశ్వరుడి పాదపద్మపరాగాన్ని శిరసావహించి, యోగాభ్యాసంతో కర్మబంధాలన్నీ వదిలించుకున్న మునీశ్వరులే దేనికీ బద్ధులు కాకుండా అన్నింటికి అతీతులై స్వేచ్ఛగా, స్వేచ్ఛాధృతశరీరులై సంచరిస్తూ వుంటే ఇక పరమాత్మకా, ఈ బంధనాలు నియమనిష్టలూనూ? అతడికి సదాచారమేమిటి? దురాచారమేమిటి? కార్యమేమిటి? అకార్యమేమిటి? ఏదీ లేదు.**

యోగీశ్వరుడైన శ్రీహరి సర్వజగత్తుకూ సాక్షాత్తూ ఆత్మ. సర్వభూతములందు వుండువాడు. లీలా విగ్రహధారి. ఈ విజ్ఞాననిధి భూతదయతో సజ్జనులకు అభయం ఇవ్వడం కోసము ఇలా అనసూయా అత్రి దంపతులకు ముని కుమారుడై అవతరించాడు. కనుక పరమాత్మ ధర్మాతిక్రమణం చేస్తున్నాడు అనడం సాహసం వంటిదే. సర్వభక్షకుడైన అగ్నికి ఏ దోషమూ అంటనట్లే పరమాత్మకూ అంటదు. మదవతీమదరతుడై కనిపించాడని మూర్ఖత్వంతో మనమూ ఆ పనులు చేస్తే ధర్మభ్రష్టులము అవుతాము నశిస్తాము. శివుడు విషం త్రాగాడు కదా అని మనమూ త్రాగుతామా? త్రాగి బ్రతుకుతామా? అందుచేత ఈశ్వర అవతారాలు చెప్పినట్లు మనం చెయ్యాలే తప్ప వారు చేసినట్టు మనం చేయకూడదు. అహంకార మమకారాలను పూర్తిగా త్యజించిన వారికి ఇక సదాచారము - దురాచారము అంటూ వుండదు. దానివల్ల లాభంగానీ దీని వల్ల నష్టంగానీ వుండదు. అఖిలభూతాలకూ దేవ, మానవ, తిర్యగ్జాతులకూ అందరికి కుశలప్రదుడైన పరమాత్మకు ఆచార హాని ధర్మహాని వల్ల నష్టం ఏమీ వుండదు. అన్నింటికి అతీతులు అవతార పురుషులు అంటే. కనుక నాయనా దీపకా! ఇలాంటి సందేహాలు బుర్రలోకి రానివ్వకు. తగిన శిక్షణ లేని మూఢులు వేసే ఇలాంటి ప్రశ్నలు ఇంకెప్పుడూ వేయకు.

సకల భువనాలకు ఆశ్రయుడైన పరమాత్మ లీలావిగ్రహ శరీరుడై దత్తాత్రేయుడుగా అవతరించి లోకానికి సదాచారం నేర్పటం కోసం తానుగా (శేచాచార) ఆచారవిధుల్ని పాటించాడు. స్నానసంధ్యలూ, దానధర్మాలు, భిక్షాటనం, ఉపవాసం, యోగాభ్యాసం, వనవాసం, గుహానివాసం, అశ్వత్థవృక్ష ఛాయానివాసం, ఆశ్రమవాసం, గ్రామపర్యటనలు, నగర పర్యటనలు, ధ్యాన పరత్వం, మౌనస్వీకారం, దివ్యాంబరధారణ, దిగంబరస్థితి, నానాలంకారధారణ, నిరలంకార స్థితి, రథ - గజ - తురంగ యానం - పాదయాత్ర అన్నింటినీ ఆచరించాడు. ఈ లోకాన్ని ఒక్కొక్కప్పుడు ప్రశంసించాడు. ఒక్కొక్కప్పుడు కర్మ నిర్మితంగదా, అని విమర్శించాడు, నిందించాడు. ఒకప్పుడు దివ్యాంగనారతు డయ్యాడు. మరొకప్పుడు విరక్తుడయ్యాడు, మద్యమాంసప్రియుడుగా ఒకప్పుడు, శుద్ధ సత్వనిధిగా మరొకప్పుడు, శివలింగార్చనాపరుడుగా హరిసేవాపరాయణుగా మరొకప్పుడు, శక్తినిష్ఠుడుగా ఒకప్పుడూ, గణపతి ఉపాసకుడుగా ఒకప్పుడు, సౌరసాంప్రదాయిగా, హయగ్రీవోపాసకుడుగా, శివలింగ ప్రతిష్ఠాపనకర్తగా, కాశీలో పార్వతీ పరమేశ్వరులను అర్చిస్తూ ఒకప్పుడూ - ఇలా లోకానికి విభిన్న దేవతామూర్తుల ఉపాసనా విధానాన్ని స్వయంగా ఉపదేశించాడు.

**దత్తాత్రేయుడు ఒకానొకప్పుడు కాశీలో విశ్వేశ్వరుడికి దక్షిణంగా, త్రిపురాంతకలింగానికి పశ్చిమంగా, తానొక**

**శివలింగాన్ని ప్రతిష్ఠించాడు. దానికి ఎదురుగా కూర్చుని యోగనిష్టతో శివధ్యానం చేసాడు. అది ఇప్పటికీ చాలా పవిత్రమైన చోటు. దీన్నే "దత్తాత్రేయతీర్థము" అంటారు. అక్కడ స్నానం చేసినా, ధ్యానం చేసినా, భక్తుల సంసార రోగ సంబంధ దుఃఖాలన్నీ క్షణంలో తొలగిస్తానని దత్తాత్రేయుడే స్వయంగా ప్రకటించాడు.** అక్కడ దత్త ప్రతిష్ఠితా లింగం సకల శ్రేయస్సులు నేటికీ అందిస్తుంది. వేదధర్ముడు దీపకునికి చెబుతున్నట్టుగా బ్రహ్మదేవుడు కలికి చెబుతున్న దత్తమహిమలు శ్రద్ధగా ఆలకిస్తున్నారు గదా అని సూతమహర్షి శౌనకాదిమునులను ఒకసారి హెచ్చరించి అందరూ శ్రద్ధతో వింటున్న సంగతి గమనించి సంతృప్తి చెందాడు.

సూతమహర్షీ! నీ రుణం తీర్చుకోలేం భవరోగాలకు దివ్యఔషధం లాంటి దత్తమహిమలు చెప్తున్నావు. దీపకుడు ఆపైన గురువైన వేదధర్ముణ్ణి ఏమి అడిగాడు? మహాతపస్వులకు సైతం ఆదర్శప్రాయుడైన వేదధర్ముడు ఏమి చెప్పాడు? అది అంతా మాకు సవిస్తరంగా తెలియజెయ్యి - లీలా మునికుమారుడైన దత్తగాథలు, చెబుతున్నవారినీ వింటున్న వారినీ శుద్ధిపరుస్తాయి. మహాయోగ ఫలాలు అందిస్తాయి. వర్ణాశ్రమధర్మాలను అతిక్రమించిన వారికి సైతం పుణ్యఫలం అందిస్తాయి అంటే ఇక మనవంటివారికి ఇంకా అధిక పుణ్యఫలాన్ని అందిస్తాయి. అందుచేత సూతమహర్షీ! మిగతా వివరాలన్నీ మాకు వినిపించి పుణ్యం కట్టుకో అని శౌనకాదులు అభ్యర్థించారు. అప్పుడు సూతుడు ఇలా చెప్తున్నాడు.

శౌనకాదిమునులారా! గురుసేవాపరాయణుడూ, ఉత్తమభక్తుడూ అయిన శిష్యుడు దీపకుడు. వేదధర్ములవారికి పాదాభివందనం చేసి ఏమి అడిగాడో దానికి ఆ గురువుగారు ఏమి చెప్పారో కలికి బ్రహ్మ స్వయంగా వినిపించాడు. దాన్ని మీకు నేను వినిపిస్తాను అంటూ సూతమహర్షి ఇలా చెప్తున్నాడు.

గురుదేవా! చిదానందమహోదధి అయిన శ్రీమన్నారాయణుడి లీలావతార చరిత్రను ఇంకా సవిస్తరంగా వినాలని నా మనస్సు కుతూహలపడుతోంది. శ్రుతి, స్మృతి, పురాణాల్లో మహర్షులచేత కీర్తింపబడిన ఆరహస్యాలను శ్రద్ధతో వింటున్న నాకు దయచేసి ఎరుకపర్చండి. పువ్వుల నుండి మకరందాన్ని తుమ్మెదలు బొట్టుబొట్టుగా స్వీకరించి పొట్టనింపుకున్నట్లు దత్తమహిమలు సేకరించి నా గుండెలు నింపండి. ఈ దత్తమహిమలు విన్నవాడెవడూ గర్భావాసక్లేశాన్ని పొందడుగాక పొందడు.

దీపకుడి అభ్యర్థనకు మరింత సంబరపడ్డాడు వేదధర్ముడు. బిడ్డా దీపకా సమస్త పురాణాలసారాన్ని బొట్టు బొట్టుగా స్వీకరించి దత్తకథగా నీకు మొత్తం వినిపిస్తాను. శ్రద్ధగా ఆలకించు.

యోగులకు పరమగురువూ, జ్ఞానవిజ్ఞానాల పెన్నిధీ, విశ్వవంద్య పదాంభోజుడూ, జగదీశ్వరుడూ, అత్యంత సుందరమైన పురుషశరీరం ధరించినవాడూ అయిన శ్రీ దత్తాత్రేయుడు ఒకానొక శుభవేళ సహ్యపర్వత ప్రాంతంలో పద్మాసనం వేసుకొని ధ్యానిమగ్నుడై నిశ్చలంగా నిష్టగా కూర్చుని వున్నాడు. ఈ దత్తదేవుణ్ని దర్శించాలనే కోరిక కలిగి మాహిష్మతీపురం అధిపతి, కృతవీర్యుని కుమారుడు, యోగవిద్యాప్రవీణుడు, సహస్ర బాహువులు కలవాడు, మహాతేజస్వి అయిన కార్తవీర్యార్జునుడు ధనుర్ధారియై మరొక దేవేంద్రుడిలా సహ్యాద్రికి వచ్చాడు.

అనేకరకాలైన అమృతమయమైన ఫలవృక్షములతో అద్భుత సువాసనలు అందిస్తున్న అనేకానేక పుష్పజాతులు విరబూసి నందనవనంలా వున్నది ఆ ప్రాంతం అంతా. అక్కడే ఒక పర్ణశాల గుమ్మం ముందు శుభప్రదంగా

నిలువెల్లా చిగురించి గుబురుగా ఎదిగిన గున్నమావిచెట్టు మొదట పద్మాసనం వేసుకుని చిన్ముద్రలు ధరించి కన్నులు మూసుకొని నిశ్చలంగా ధ్యానం చేసుకుంటున్న దత్తాత్రేయస్వామిని దర్శించి దత్తపాదస్పర్శతో పునీతం అయిన ప్రాంతం కాబట్టి భూమికి నమస్కరించి ఆనందంతో, ప్రేమతో, భక్తితో, విశ్వాసంతో, ఒక్క ఉదుటున సాష్టాంగపడ్డాడు. చాలాసేపు అలాగే వుండి మాటిమాటికి తలపైకెత్తి చూసాడు. ఆనందంతో మరల మరల నమస్కరించాడు. దత్తస్వామి ధ్యాననిష్ఠలోనే వున్నాడు. కార్తవీర్యార్జునుడు తన వెయ్యి చేతులను సంకల్పించి రప్పించి వెయ్యిచేతులతో రకరకాల వాయిద్యాలను మోగిస్తూ ఆడుతూ పాడుతూ దత్తస్వామిని సేవించాడు. ప్రొద్దుగూకింది. రాత్రి గడిచింది. తెల్లవారింది. అతడి నృత్యగీతసేవ కొనసాగుతూనే వుంది. కానీ జగత్పతి మాత్రం ధ్యానం వదలేదు. కన్నులు తెరుచుకోలేదు. అప్పుడు భక్తిరసం ఉట్టిపడుతుండగా కార్తవీర్యార్జునుడు దత్తస్వామిని అపూర్వంగా ఇలా స్తుతించాడు.

## కార్తవీర్య కృత దత్తస్తుతి

దేవాది దేవా! మహానుభావా! నువ్వు అనంతుడివి! స్వయంప్రకాశకుడివి! నీలో స్వప్న తుల్యమైన ఈ జగత్తు మాయవల్ల వాస్తవంగా కనిపిస్తుంది. ఈ సృష్టి అంతా నీకు మనసా కల్పితం. ఒక్కటే చైతన్యం మాయాగుణంకారణంగా అనేక రూపాలతో భాసిస్తుంది. లేనిది ఉన్నట్లుగా అది అలా కనిపించటానికి ఆధారమైన నీకు ఇదే శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. పరమాత్ముడవైన నీకు జాగ్రత్, స్వప్న, సుషుప్త్యాది అవస్థలన్నీ మాయా కల్పితాలు. ఇది తెలుసుకున్న జ్ఞానులు (అనుమాణ ప్రమాణం) గురూపదేశం అనే రెండంచుల జ్ఞానఖడ్గంతో హృదయంలోని అహంకారగ్రంధిని ఛేదించుకుని అఖిలగురుడవైన నిన్ను శరణు  శరణు అంటున్నారు. విశ్వేశా! శరణన్నవారి భవరోగ దుఃఖాలను తొలగించి జ్ఞానకాంతుల్ని వెలిగించి ముక్తుల్ని చేసే గురూత్తముడవి నీవు. త్రిగుణమాయానియామకుడవు. గోవిందా, అచ్యుతా, అజా, పరేశా, నీకేదే నా కోటి నమస్కారములు. నీవు నిత్య ముక్తుడవు పరిశుద్ధుడవు. విబుద్ధుడవు. ఈశుడవు, సర్వదేవ రక్షకుడవు అనన్య సిద్ధుడవు అటువంటి నిన్ను దేహేంద్రియాది స్వరూపుణ్ని నేను ఇదే శరణు కోరుతున్నాను.

సచ్చిదానందా - పురాణ పురుషా, నారాయణా - జగత్కారణకారణా - పురుషోత్తమా- ఈ సంసారబిలంలో పడ్డాను నేను. ఇక్కడ ఏదో గొప్ప సుఖం ఉంది. అనుభవిద్దామని సంబరపడుతూ వచ్చిపడ్డాను. కాలం నన్ను కాటు వేసింది. ఇప్పుడు అలమటిస్తున్నాను. దయాళూ నిర్వాణానుభవ మహానందాన్ని అందించే నీ బోధామృత వాగ్బిందువుల్ని నా మీద జల్లి నా ఆర్తిని దుఃఖాన్ని తొలగించు. మాయామయుడవై ఈ విశ్వాన్ని సృష్టిస్తావు - పోషిస్తావు- లయిస్తావు. అంతా నీ ఇచ్ఛాశక్తితోనే జరుగుతుంది. దాన్ని బ్రహ్మాదులు కూడా తెలుసుకోలేరు అంటే మానవమాత్రులం మేము తెలుసుకోగలమా? భావపరంపర యాత్రలో చిక్కుకుని జనన మరణాల కోరల్లో నలిగిపోతూ తాపత్రయాలలో మాడిపోతూ పరితపిస్తున్న నాకు-స్వామీ-నీపాద పద్మాలే దిక్కు- నీ వాక్కే ఉపశమనం మరొక దిక్కులేదు. విశ్వరూపా మహామునులకు కూడా అందని భక్తియోగాన్ని వైరాగ్యాన్ని విశుద్ధ విమల విజ్ఞానాన్ని నాకు ప్రసాదించు. అఖిల దుఃఖాలకు మూలబీజం అహంకారం, మమకారం. వీటిని తొలగించు వైకుంఠధామా! నువ్వు దత్తాత్రేయుడుగా అవతారం ధరించింది యోగప్రచారానికే జ్ఞానప్రసారానికే అంటారే మరినువ్వే కరుణించకపోతే ఇక నాబోటి వారికి దిక్కెవరు తండ్రీ.

అన్ని అనర్థాలకు నిలయం ఈ శరీరం. ఇందులో పడి కొట్టుమిట్టాడుతున్న జీవుణ్ని ఉద్ధరించటం కోసం నువ్వు

ఎన్నో అవతారాలు ఎత్తుతుంటావట. సత్వగుణంతో దేవతల్ని రజోగుణంతో పాలకుల్ని తమోగుణంతో భూతాదుల్ని కల్పించి గుణాలన్నింటికి నువ్వే నియతంగా నిలబడి తర్వాత నువ్వే అతీతంగా నిలుస్తావట. ఆదిపురుషా! జగదీశా! నిన్ను తెలుసుకోవటం నాబోటి మందబుద్ధులకు సాధ్యమా? సకామంగా నిన్ను సేవిస్తే అష్టైశ్వర్యాలు ఇస్తావట. నిష్కామంగా నీపాదుకలు నిత్యం పూజిస్తే చాలు అనశ్వరమైన బ్రహ్మపదాన్నే అనుగ్రహిస్తావట.

పరాత్పరా నిజంగా నేను మందబుద్ధిని. రాజభోగాలలో తల వరకు మునిగాను. అవి నశ్వరాలని దుఃఖహేతువులని గ్రహించలేకపోయాను. ఇప్పటికి కళ్ళు తెరిచాను. నాకు ఈ రాజ్యాలు వద్దు. భోగాలు వద్దు. నీ పాద రేణువుననుగ్రహించు. సిద్ధులైనవారు ఈ జగత్తు మిధ్య అంటారు. మనోభ్రమ వల్ల సత్యంలాగా కనబడుతుంది అంటారు. నిజంగా ఇదంతా వట్టి మిధ్యే అయితే ఇది ఇంత ఖచ్చితంగా సత్యంలాగా కన్పించటం సంభవమేనా? నిన్ను శరణు పొందాను. నా సందేహాన్ని తీర్చి అచ్చమైన తెలివిని కలిగించి ధన్యున్ని చెయ్యి - భయనివారకా!ఈ సంసారం అనే మొసలికి భయపడినంతగా నేను మరి ఇంక ఏ శత్రువుకూ, ఏ భూతానికీ, ఆఖరికి మృతువుకు కూడా భయపడను. అందుకే రాజ్యవైభవాలన్నీ వదిలేసి నీ చరణ సన్నిధికి వచ్చాను. నీ పాదాల చెంత శిరస్సు వంచి ప్రార్థిస్తున్నాను. నా భవభయం తొలగించు. సత్యము, శాశ్వతమూ అయిన సుఖం కలిగించు. తాపత్రయంలో మాడిపోతున్న నాకు నీ అమృతమయమైన వాక్కులతో ఉపశమనం కలిగించి, సేద తీర్చు. విశ్వాత్మా, విశ్వేశా, నీపాదాలకు నమస్సులు యోగమార్గానుకూలురు కర్మబంధాలు త్రెంచుకుని యోగసిద్ధిలో ఏపరతత్వాన్ని చూస్తున్నారో అది నువ్వే. అలాంటి నీపాదాలకు వందనములు. ఇంద్రియాలను తృప్తిపరచటం కోసం సుఖానుభూతితో పాపజలంలోపడ్డాను. ఎన్నో ఏళ్ళు గతించాయి. ఒడ్డూ దారీ కనిపించటం లేదు.

ఈ మనస్సుకి ఎన్నటికీ ఏవగింపు కలగడం లేదు. ఇదేమి దురదృష్టమో మహారాక్షసులు చివరికి పశుపక్ష్యాదులు కూడా సత్సాంగత్యం వల్ల ఆత్మజ్ఞానం పొంది సంసార సముద్రాన్ని దాటగలిగారు. నేనో? క్షత్రియవంశంలో పుట్టి ఎంతోకాలం నీ సేవజేసి, రాజభోగాల లంపటంలో పడి మరింత ఇరుక్కున్నానే తప్ప కాసింతయినా బంధ విముక్తుణ్ని కాలేకపోయాను. నా మీద నాకే అసహ్యం వేస్తోంది. రాజ్యసంపదలలో పిచ్చివాణ్నయి మిధ్యావిలాసాల్లో మిధ్యాసుఖాల్లో తగుల్కొన్నాను. ఎట్టెదుట కాపువేసి వున్న మృత్యువును పసిగట్టలేకపోయాను. నాకన్నా మందమతి ఇంకెవరైనా వుంటారా? నువ్వే జాలిపడి కరుణించాలి. నీ అనుగ్రహాన్ని నా మీద పూర్తిగా ప్రసరింపజెయ్యాలి. అది ఒక్కటి తప్ప నేను ఇంకేమీ కోరను. నాకు శాంతిని ప్రసాదించే మార్గం ఇదొక్కటే. సకల సృష్టికీ నువ్వు సార్వభౌముణ్ని చేస్తానన్నా ఇంద్ర పదవి కట్టబెడతానన్నా చివరకు పరమేష్టిని చేస్తానన్నా నాకు వద్దు. వాటిలో సుఖం లేదని తెలిసిపోయింది.

ఆర్తి హరా! జగదీశ్వరా! నీ ఉపదేశమనే కొడవలితో నాలోని అహంకారగ్రంథిని మొదలంటా నరుకు. విశుద్ధ విజ్ఞానఘనా! సదానందా! లీలావిగ్రహ శరీరా! పురాణ పురుషా! నమోనమః నమోనమః పద్మనాభా! అజ్ఞానంలో పడి నీ పాదపద్మాలను సేవించని వాళ్ళని సైతం ఉద్ధరించటానికి అవతరించిన దయామయుడవు అని పెద్దలు చెబుతున్నారు. అలాంటిది నీ పాదధూళిని శిరసా వహించిన నాబోటి వారికి నీ దయ అనుభవంలోకి రాకపోవటం, ఇంకా భవరోగులమై బాధపడటం వింతగా ఉంది. అనసూయా అత్రి మహర్షుల తపస్సుకి మెచ్చి వారికి పుత్రుడుగా నిన్ను నువ్వు దత్తం చేసుకున్నావు. అలా దత్తదేవుడవయ్యావు. అంతటి దయాళుడవూ అంతటిదాతవూ ఎందుకో మరి నా మొర ఆలకించటం లేదు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

నిర్గుణ పరబ్రహ్మవైన నిన్ను చెప్పేటప్పుడు కన్నులుండవు అయినా చూస్తుంది. చెవులుండవు అయినా వింటుంది. అని వేదాంతులు చెప్తుంటారు. ఇప్పుడేమో లీలా స్వీకృత శరీరుడవై దత్తాత్రేయుడుగా మా ముందు నిలిచావు. చూసే కళ్ళూ, వినే చెవులూ మాట్లాడే నోరూ అన్నీ వున్నాయి. మరినన్ను కరుణించను అంటే ఎలా? దత్తస్వామీ మీ పాద పద్మాలు వలచి వచ్చిన తుమ్మెదను నేను. వీటిని విడచి వెళ్ళను. వెళ్ళలేను. నీ కన్నులతో ఒక్కసారి చూసి నా హృదయానికి ఆనందాన్ని కలిగించు దయాంబురాశీ నీవే తప్ప వేరుదిక్కులేదు. అనన్య శరణుణ్ని. నీ పాదసేవ తప్ప నాకు వేరే విధీ, కర్తవ్యమూ లేదు. ఈ భవసాగరం నుండి కడతేర్చు. నామరూప రహితుడవైన నువ్వు అవతారాలు ధరించేది ఇందుకేనటగదా. నన్ను ఉద్ధరించు. పుండరీకాక్షా! నమస్తే! పురుషోత్తమా! నమస్తే! విశ్వవంద్య, పదాబ్జా నమస్తే! యోగివరా! వాసుదేవా! సూక్ష్మరూపా! సర్వాధ్యక్షా! నమస్తే నమస్తే నమస్తే! ఈ పాప సముద్రం నుండి కాపాడు. వాక్కులకే కాదు మనస్సుకు కూడా అందనివాడా! భక్త హృదయనివాసా! పంకజనాభా, పంకజ మాలికా ధారీ - పంకజనేత్రా - పంకజాంఘ్రీ నమస్తే! ఆనంద స్వరూపా కరుణించు. పరమేశ్వరా దయచూపించు. ఆది - వ్యాధులనే విషసర్పాలు నన్ను కాటువేసాయి ప్రభూ నన్ను ఉద్ధరించు.

సాయంకాలం అయ్యింది కార్తవీర్యార్జునుడు ఇలా ఎంత స్తుతించినా ఆడినా, పాడినా, దత్తస్వామి ధ్యాననిష్ఠ నుండి కన్నులు తెరచిచూడలేదు. ఖిన్నుడై అర్జునుడు అలాగే అలసి సొలసి నమస్కరించి నిలబడ్డాడు.

వేదధర్ముడు చెబుతూంటే శ్రద్ధగా వింటున్న దీపకుడికి సహజంగానే మరో సందేహం వచ్చింది. తనకిష్టుడైన కార్యవీర్యార్జునుడు అంతగా స్తుతిస్తే దత్తస్వామి ఎందుకు కన్నులు తెరువలేదు? అసలు తెరిచాడా లేదా? ఎప్పుడు తెరిచాడు? ఏమి అన్నాడు? ఇవన్నీ మనస్సులో కుతూహలం రేకెత్తించాయి. అనంతర కథను త్వరగా చెప్పమని అభ్యర్థించాడు వేదధర్ముడు ఇలా చెప్తున్నాడు. నాయనా దీపకా విను.

కార్తవీర్యార్జునుడు అలా స్తుతించి, స్తుతించి స్వామి ఎదుట తలవంచుకొని అంజలి ఘటించి నిలబడ్డాడు. రాత్రి గడుస్తోంది. మరొక ఘాములో తెల్లవారుతుంది అనగా దివ్య విమానముల నుండి సిద్ధపురుషులు అన్ని దిక్కుల నుండి అక్కడకు వచ్చి నేల మీద దిగి దత్తస్వామికి సాష్టాంగ నమస్కారములు ఆచరించి స్తోత్రాలు మౌనంగా జపించి దగ్గరలో మౌనంగా నిలబడి వున్న కార్తవీర్యార్జునుడ్ని ఓరకంట చూసి తిరిగి స్వామికి పదే పదే నమస్కరిస్తూ తమ తమ దివ్య విమానాలు ఎక్కి తేజస్సుతో దశదిశలా ప్రకాశింపజేస్తూ వెళ్ళిపోయారు. ఆ వెంటనే పది దిక్కుల నుండి యోగీశ్వరులు వచ్చారు. సహ్యాద్రి గుహల్లోనే ఉంటున్న కొందరు యోగులూ జత కలిసి అందరూ స్వామి పాదాలకు సాగిలపడ్డారు. చేతులు చాచి నమస్కరించారు.

దేవా! మహాదేవా! యోగవిద్యా గురూ! ఆధ్యాత్మదర్శనా! అత్రివంశ ప్రకాశకా! జయము జయము - అనిస్తు తించి తిరిగి తిరిగి నమస్కరిస్తూ అందరూ వచ్చినట్లే ఆకాశమార్గంలో తిరిగిపోయారు. ఆ వెంటనే సహ్యాద్రి ప్రాంతంలో ఆశ్రమాలలో నివాసం వుంటున్న వానప్రస్థులూ, సన్యాసులూ, వేదశాస్త్ర పారంగతులైన బ్రాహ్మణులు ఎవరికి వారు వచ్చి దత్తాత్రేయుడికి సాష్టాంగ దండ ప్రణామాలు ఆచరించి వేదమంత్రాలతో, శ్లోకాలతో స్తుతించి వెళ్ళిపోయారు.

తూర్పు దిక్కున ఎరుపురేకలు కనిపించాయి. కాసేపటికి అవి తెల్లదనం సంతరించుకున్నాయి. అప్పుడు దత్తాత్రేయుడు ధ్యాననిష్ఠను క్రమక్రమంగా సడలించాడు. మెల్లగా కళ్ళు తెరిచాడు. పద్మాసనం నుండి లేచాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

నైఋతి దిక్కుగా నడిచాడు. శాంతతపుడు అనే శిష్యుడు అందించిన మట్టితో నీళ్ళతో కాలకృత్యాలు తీర్చుకున్నాడు. తిరిగి వచ్చాడు. సత్యవాక్కు అనే ముని అందించిన గోమయి - మృత్ - కుశ - భస్మవల్కలాలను తీసికొని వెంటరాగా దత్తస్వామి అక్కడికి చేరువలోనే నదీతీరానికి వెళ్ళి నియమపూర్వకంగా స్నానం చేశాడు. దేవ-పితృ-ఋషి తర్పణాలు వదిలిపెట్టాడు. ఉదయిస్తున్న సూర్యభగవానున్ని విధి విధానంలో ఉపాసించాడు. అహ్నికాలు నిర్వర్తించాడు. అంతా అయ్యేసరికి మధ్యాహ్నం అయ్యింది. కోల్హాపుర లక్ష్మీదేవి వద్దకు వెళ్ళి భిక్ష స్వీకరించి క్షణకాలంలో మళ్ళీ సహ్యాద్రి పర్వత ఆశ్రమానికి చేరుకున్నాడు. పర్ణశాల ముందు ఎప్పటిలాగే గున్నమావి చెట్టు నీడలో మట్టితిన్నెపై కూర్చున్నాడు.

చుట్టుప్రక్కల ఆశ్రమాల నుండి మునులూ యోగులు వివిధ ఆశ్రమాలవారు వచ్చి దత్తస్వామికి నమస్కరించి తిన్నె చుట్టూ అర్ధచంద్ర వలయాకారంలో కూర్చున్నారు. నోరువిప్పి ఏది పలికితే అది విని తరిద్దామని ఆశగా ఎదురుచూస్తున్నారు. అల్లంత దూరాన కార్తవీర్యార్జునుడు నిలబడి వున్నాడు. శిరస్సుపై రెండు చేతులు వుంచి అంజలి ఘటిస్తూ స్వామివైపు చూస్తున్నాడు. అతడిని ఏదో భయం ఆవరించింది. చిన్నగా వణుకుతున్నాడు. ఇది గమనించిన శాంతతపుడు అనే శిష్యుడు దత్తస్వామికి నివేదించాడు. దత్తస్వామి కార్తవీర్యార్జునుని వైపు ప్రసన్నంగా దృష్టి సారించి చిరునవ్వులు చిందిస్తూ నాయనా కార్తవీర్యా! ఎందుకు భయం? ఎందుకు ఆ వణుకు? ఎందుకు దుఃఖం? ఇలారా దగ్గరగా కూర్చో నీ దుఃఖమూ భయమూ ఖిన్నతా అన్నీ తొలగిపోతాయి. నువ్వు కోరుకుంటున్న చిత్తశాంతి లభిస్తుంది. రా ఇలా రా అని ఆప్యాయంగా పిలిచాడు. కార్తవీర్యుడుకి ధైర్యం వచ్చింది. అప్రయత్నంగా కన్నులు వరదలు కట్టాయి. తల్లి పిలుస్తుంటే ఒడిలోకి పరుగుతీస్తున్న పిల్లవాడిలాగా దగ్గరకు చేరి సాష్టాంగపడి దగ్గరగా మౌనంగా కూర్చున్నాడు. దత్తస్వామి అతడి ఆర్తినీ ఆవేదననూ గుర్తించాడు. నాయనా భయపడకు. దిగులు చెందకు నీకేమికావాలో అడుగు చెబుతాను. నీ అజ్ఞానం తొలగిస్తాను. దుఃఖం పోగొడ్తాను. నువ్వు నాకు పరమభక్తుడివి. అనన్య సేవలు చేసిన వాడివి. నాకు ఆప్తుడవి. నువ్వు కోరితే చెప్పరానిదంటూ ఏదీ లేదు. ఏది అడుగదలచుకొన్నావో అడుగు సమాధానం చెబుతాను. సంశయాలు తీరుస్తాను. గురువు అంటేనే ఇదికదా! సందేహించక అడుగు. దత్తస్వామి ఇలా ప్రేమగా చనువిచ్చి ప్రోత్సహించేసరికి కార్తవీర్యార్జునుడు తేరుకొని ఇలా అడిగాడు.

స్వామీ నన్ను చాలాకాలంగా వేధిస్తున్న సంశయాలు కొన్ని ఉన్నాయి. వాటిని మీ ముందు ఉంచుతాను. అవి తొలగించి నాలో జ్ఞానకాంతులు నింపండి. సత్తూ అసత్తూ, స్థూలమూ, సూక్ష్మము, కార్యము, కారణమూ, వ్యక్తమూ అవ్యక్తమూ- సమస్తము పరబ్రహ్మమైన నువ్వే కదా! అద్వితీయమూ, అవ్యయమూ, స్వయంప్రకాశమానమూ అయిన ఆ పరబ్రహ్మంలో నశ్వరమూ మాయా కల్పితమూ అనిత్యమూ అయిన ఈ విశ్వభ్రాంతి వల్ల అద్దంలో ప్రతిబింబంగా కనిపిస్తుంది అని వేదాంతులు అంటున్నారు. రజ్జు సర్పభ్రాంతి- శుక్తి రజతభ్రాంతి- ఇలాంటివి ఉదాహరణలుగా చూపిస్తున్నారు. మరికొందరు ఇదే వేదాన్ని ప్రమాణంగా చూపుతూ జగత్తు మిథ్య అయితే ఇంతకాలం స్ఫుటంగా కంటికి కనిపిస్తుందా? దీనికి బోధన కూడా లక్ష్యం కాదు. దీనికి ఆది ఎక్కడ? అంతమెక్కడ? ఒక్కటే ప్రవాహం అని వాదిస్తున్నారు. అది అద్వైతమూ ఇది ద్వైతము అంటున్నారు. ఇక మీమాంసకులు ధర్మమే పరమనీ జగత్తు నిత్యమూ సనాతనమూ అని శ్రుతుల్ని ప్రమాణంగా చూపించి మరి ప్రతిపాదిస్తున్నారు. సాంఖ్యులు సృష్టికి "ప్రధానం" కారణం అంటున్నారు. పురుషుడు నిమిత్తమాత్రుడంటున్నారు. యోగులూ ఇదే నిజమని అంగీకరిస్తున్నారు. తార్కికుడు ప్రపంచాన్ని

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

నిత్యమంటున్నారు. ఇవన్నీ వేదోక్తులు ప్రమాణంగా చూపుతున్న సిద్ధాంతాలే. వాదాలే. వేదప్రామాణ్యాన్ని అంగీకరించని బుద్ధిమంతులు కొందరు వున్నారు. వీళ్ళల్లో కొందరు ప్రపంచాన్ని క్షణికం అంటున్నారు. ఇన్ని రకాల వాదాలు, భేదాలు ప్రపంచంలో కన్పిస్తూ, విన్పిస్తూ వుంటే వీటిలో దేన్నీ ప్రామాణికంగా స్వీకరించాలి అనేది ముముక్షువులకు పెద్ద సందేహం అవుతోంది. దేన్ని అనుసరిస్తే ఏ ప్రమాదం వచ్చిపడుతుందో ఏ ప్రాయశ్చిత్తం చేసుకోవలసి వస్తుందో అని మల్లగుల్లాలు పడుతున్నారు. శ్రుతి, స్మృతి, పురణేతి ఆగమశాస్త్రాలకు సమన్వయం కుదిర్చి పరస్పర వైరుద్ధ్యం తొలగించి ఏకవాక్యం బోధించగల గురుస్వామివి నువ్వే కాబట్టి ఈ సంశయం తీర్చి పరమపదమునకు దారి చూపించవలసిందిగా కోరుతున్నాను. ఏది మాకు ఆచరింపదగినదో ఏది వదిలెయ్యవలసినదో తేల్చి చెప్పప్రార్థన. ఇలాగే ఆచారాలలో కూడా తేడాలు వున్నాయి. సదాచారాలు ఏమిటో అనాచారాలు ఏమిటో తెలియక కొట్టుకుంటున్నాం. నువ్వు సర్వాచారనిధివని సర్వాచార ప్రవర్తకుడవనీ పండితులు చెబుతున్నారు. బహిర్ముఖంగా నువ్వు అనాచారుడువని కొందరు అంటున్నారు. ఇంతకీ నువ్వు ఆచారలభ్యుడవా? లేక అనాచారలభ్యుడవా? పనిలో పనిగా ఈ సంశయాన్ని కూడా తీర్చుభగవాన్! త్రిమూర్తులూ, పంచభూతాలూ సకల దేవతలు నువ్వేనని భుక్తి, ముక్తి ఫలప్రదాతవైన నిన్ను బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు, ప్రజాపతులూ, మునీంద్రులూ ధ్యానిస్తూవుంటారని మహర్షులు చెప్పగా విన్నాను. అటువంటి నువ్వు ఇలా రోజుల తరబడి ధ్యాననిష్ఠలో కూర్చుంటున్నావు. నువ్వు ఎవరిని ధ్యానిస్తున్నట్టు? అందరికీ ధ్యేయుడవైన నీకు వేరే ధ్యేయం ఉన్నదా? ఉంటే అదేమిటి?

ఈ సంశయాలు తొలగించమని అడగడం తప్ప నాకు ఇంక ఏ కోరికా లేదు. నీ దయ వల్ల సకల శత్రువులనూ జయంచి సప్తద్వీపాలతో అలరారే వసుంధరను ఏకఛ్ఛాత్రిదిపత్యంగా పరిపాలించాను. నీ కృపావలేశంతో యముణ్ని కూడా ఎదిరించగలను. సకల రాజభోగాలు తనివి తీరా అనుభవించాను. ఇక నాకు ఏమీ వద్దు. తురీయ పురుషార్థాన్ని అందుకునే శక్తి ప్రసాదించు ముక్తిని అనుగ్రహించు.

ఇలా కార్తవీర్యార్జునుడు వినయవిధేయలతో అర్థించాడు అని చెప్పి వేదధర్ముడు ఒక్క నిముషం ఆగాడు. గురుదేవా, నాకు కలిగిన సందేహాలే కార్తవీర్యుడికీ కలిగాయి. వీటికి దత్తస్వామి ఏమి సమాధానం చెప్పారో తెలుసుకోవాలని మనస్సు ఉబలాటపడుతోంది. తరువాత కథను సెలవియ్యండి అని దీపకుడు తొందర చేసాడు. వేదధర్ముడు ఇలా చెప్తున్నాడు.

కార్తవీర్యార్జునుడు అడిగిన సందేహాలకు అక్కడ సమావేశమైన మునులందరూ వింటూ వుండగా దత్తస్వామి ఇలా సమాధానం చెప్పాడు. కార్తవీర్యా! నీ విజ్ఞాపనం- నీ వాంఛితం నీ ప్రశ్నలు నాకునచ్చాయి. నువ్వు చేసిన స్తోత్రం ఇంకా నచ్చింది. సమాధినిష్ఠలో వున్నా దివ్యశక్తితో అంతాచూసాను. ముందే గ్రహించాను. నీ విజ్ఞాపనలు అన్నింటికీ సమగ్రంగా సమాధానం చెబుతాను ముక్తిని అందిస్తాను. మహా బాహా! బాధపడకు దుఃఖం విడిచిపెట్టు. నువ్వు నన్ను వశపరుచుకున్నావు నా భక్తుడికి ఈ లోకంలో ఏదీ దుర్లభం అంటూ వుండదు. నువ్వు చేసిన స్తోత్రము అతి పురాతనమైనది. నా తత్త్వమూ రహస్యమూ అన్నింటినీ అందులో దాచి వుంచాను. నీ ముఖతః అది ఇప్పుడు లోకానికి వెల్లడి అయ్యేలా చేసాను. లోకోపకారం కోసం ఇలా చేసాను. దీన్ని ప్రాతఃకాలంలో పఠించిన వారు, నాకు అత్యంత ప్రీతిపాత్రులవుతారు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

వేదశాస్త్రాలలో పరస్పర వైరుధ్యాలు వున్నాయని బుద్ధిమంతుడవై చాలా మంచి ప్రశ్న వేశావు. అది కేవలం బుద్ధిహీనుల ఆక్షేపణ మాత్రమే. ముందు నీ సందేహాల్ని తొలగించి ఆ తర్వాత సప్రమాణంగా మోక్ష విద్య తెలుపుతాను. ఎందుకంటే సందేహాలు తొలగనిదే ఏది చెప్పినా నిరర్థకం. ఈ సందర్భంగా నీకొక గాథ చెబుతాను. దీన్ని పూర్వ కాలంలో దేవగురువైన బృహస్పతి ఇంద్రుడికి చెప్పాడు. ఇందులో నీ సందేహాలకు సమాధానాలుగా ఏడు ఉదాహరణలు దొరుకుతాయి.

## ఇంద్ర - బృహస్పతి - సంవాదం

## సప్తోదాహరణలు

## వాస్తుశాస్త్రం - శిల్పశాస్త్రం - జ్యోతిష్యం

ఒకానొకప్పుడు దేవగురువైన బృహస్పతి తన మనస్సులో ఏదో వుంచుకొని బహుశా రాక్షసుల్ని సమ్మోహపరచటానికి కావచ్చు- కామశాస్త్రం- దండనీతి శాస్త్రం, వాస్తుశాస్త్రం- శిల్పశాస్త్రం- సమగ్రంగా రచించి యోగ్యులు, బుద్ధిమంతులూ అయిన శిష్యులకి స్వయంగా బోధించటం ప్రారంభించాడు. ఇంద్రుడు ఇది గమనించి ఒకనాడు బృహస్పతి ఇంటికి వచ్చి పాదాభివందనం చేసి గురుదేవా తమరు ఏమీ అనుకోనంటే నాదో సందేహం అంటూ మొదలుపెట్టాడు. గురువర్యా! ఆత్మతత్త్వ విచక్షణా! లౌకిక సాధారణ పండితుల్లా సర్వజ్ఞులైన మీరు కూడా ఇలా చెయ్యడం భావ్యమా? తత్త్వబాహ్యాలైన ఈ శాస్త్రాలను ఎందుకు రచించారు? మానవుల్ని ఇంకా సమ్మోహనపరచటానికి, విషయవాంఛల్లో ముంచటానికి తప్ప ఇవి ఇక ఎందుకు ఉపకరిస్తాయి? జీవి అసలు పుట్టుకతోనే రాగలంపటుడు అవుతున్నాడు. ఇది తెలిసిన పండితుడు-శాస్త్రకర్త - ఏమి చెయ్యాలి? ఉద్ధరించాలా లేక, గ్రుడ్డివాణ్ణి నూతిలోకి నెట్టేసినట్టుగా ఇంకా చెడగొట్టాలా? గురుదేవా ఏ ఫలాన్ని ఆశించి తమరు ఈ పనిచేసారో గానీ నాకు మాత్రం ఉచితంగా తోచటం లేదు. మరి ఇందులో ఇంకా ఏదైన పరమార్థం, మహారహస్యం ఉంటే, అది నేను తెలుసుకోదగినది అయితే దయ చేసి వివరించండి అన్నాడు ఇంద్రుడు.

ఇంద్రుడి ప్రశ్నలోని ఆందోళనను గుర్తించాడు దేవగురువు. స్థిమితంగా సమాధానం ఇలా చెప్పాడు. ఇంద్రా ఇందులో వున్న తత్త్వరహస్యాన్ని తెలుసుకోవాలనుకుంటున్నావు. సరే చెబుతాను విను. నేను రచించి శిష్యులకు బోధిస్తున్న ఈ శాస్త్రాలన్నీ తత్త్వరహస్యాలే. తత్త్వోపదేశాలే. పారంపర్యంగా చివరికి తత్త్వప్రాప్తికి కావలసిన చిత్తశుద్ధిని ఇవి కలిగిస్తాయి. ఈ విషయాల్ని తెలియచెప్పే ఏడు ఉదాహరణల్ని నీకు చెబుతాను శ్రద్ధగా విను. అంతా నీకే తెలుస్తుంది. అప్పుడు నీ అభిప్రాయం చెబుదువుగాని.

అనగా అనగా కాంపిల్య నగరం అనే పట్టణం వుండేది. ఆ నగరంలో విధిజ్ఞుడు అనే శిల్పశాస్త్రపండితుడు వుండేవాడు. అతను శిల్పశాస్త్రంలోనే కాక వాస్తుజ్యోతిష్య శాస్త్రములలో కూడా విశేష ప్రతిభ కలిగినవాడు పైగా నీతిమంతుడు. మంచి, చెడు విచక్షణా జ్ఞానం కలవాడు. ఆ నగరంలో ఎవరు ఇల్లు కట్టుకోవాలని అనుకున్నా ఇతడినే పిలుస్తారు. దానితో ధనం బాగా సంపాదించాడు. ఇతడిని ఆశ్రయించి బ్రతుకుతున్న వాళ్ళు చాలా మంది ఉన్నారు. వాళ్ళకి శాస్త్ర పరిజ్ఞానము లేదు. వాళ్ళు విధిజ్ఞుడుతో వుంటూ అతను చెప్పింది చేస్తూ వేతనాలతో బ్రతుకులు గడుపుతున్నారు. విధిజ్ఞుడు మాత్రం తనకున్న విద్యను ఉపయోగించి బాగా పుష్కలంగా ధనం సంపాదించాడు. ఆ

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ధనంతో దానధర్మాలు, శ్రాద్ధవిధులు, దేవతా పూజలు ఘనంగా జరిపించేవాడు. అందువల్ల రాజ్యంలో అందరికీ ఆప్తుడయ్యాడు. ఇష్టుడయ్యాడు. కీర్తిప్రతిష్టలు పెరిగాయి. అవి ఇరుగుపొరుగు రాజ్యాలకు కూడా వ్యాపించాయి. దానితో పెద్ద పెద్ద ధనవంతులకూ, మంత్రులకూ, రాజవంశీకులందరుకూ తలలో నాలిక అయ్యాడు. ఇతర దేశాల రాజులు కూడ విదిజ్ఞుడ్ని పిలిపించి గౌరవించి భవనాలు, దేవాలయాలు, తటాకములు నిర్మింపజేసుకుని పుష్కలంగా బహుమతులు ఇచ్చి సాగనంపుతుండేవారు. ఆ ధనంతో విదిజ్ఞుడు ఇంకా ఇంకా దానధర్మాలు ఆచరించాడు. ఇలా వాస్తుశాస్త్రంతో, శిల్పాశాస్త్రంతో, జ్యోతిష్యంతో ధర్మబద్ధంగా ధనాన్ని కీర్తిని గడించి కొంతకాలానికి అతడు స్వర్గస్తుడయ్యాడు. దేవలోకంలో అతడు ఆచరించిన పుణ్యఫలాల ఫలితంగా చాలాకాలం స్వర్గసుఖాలు అనుభవించాడు. ఆ తర్వాత కాంపిల్య నగరానికి రాజుగా జన్మించాడు. రాజధనంతో యజ్ఞయాగాదులు అసంఖ్యాకంగా చేసి ధర్మబద్ధమైన పాలనతో ప్రజలను రంజింపచేసి దేవాలయ - ఆరామ - కూప - వాపీ - తటాకాదులు ఎన్నెన్నో నిర్మింపచేసి ఎంతో మంచి పేరు తెచ్చుకొని కొంతకాలానికి స్వర్గస్థుడయ్యాడు. చేసిన పుణ్యాలకు ఫలంగా స్వర్గభోగాలు అనుభవించి మళ్ళీ భూలోకంలో ఈసారి బ్రాహ్మణుడుగా జన్మించాడు. బ్రహ్మచర్యంతో సర్వశాస్త్రాలు అభ్యసించాడు. గృహస్థాశ్రమంలో వేదాంతశీలుడై నిరంతర ధ్యాననిష్టతో గొప్ప గొప్ప వ్రతాలు, పూజలు చేసి చివరకు యోగవిధులకు వంద్యుడైన యోగి అయ్యాడు. వానప్రస్థం స్వీకరించాడు. పరిపక్వత సాధించాడు. చివరికి నాల్గవదైన సన్యాసాశ్రమం కూడా స్వీకరించాడు. ఆత్మ సాక్షాత్కారం పొంది జీవన్ముక్తుడై చివరకు విదేహ కైవల్యం పొందాడు. ఇంద్రా విన్నావుగదా వాస్తుశాస్త్రం, శిల్పశాస్త్రం, జ్యోతిష్యం ఆయా శాస్త్రాల ప్రావీణ్యం విధిజ్ఞుడికి క్రమంగా ముక్తికి సాధనమయ్యింది. మరొక ఉదాహరణ చెబుతాను ఆలకించు అన్నాడు బృహస్పతి.

## లలిత కళాశాస్త్రం - కామశాస్త్రం

ఇంద్రా మాహిష్మతీ నగరంలో విశాలాక్షుడు అనే బ్రాహ్మణ యువకుడు వుండేవాడు. పేరుకు తగ్గట్లే పెద్ద పెద్ద కన్నులతో కోటేరులాంటి ముక్కుతో బంగారు రంగు వంటి దేహంతో ఆకట్టుకొనే ముఖవర్ఛస్సుతో మరొక మన్మధుడిలా వుండేవాడు. ఆ అందానికి తోడు మంచి మాట నేర్పరితనమూ వుంది. చక్కగా పాడేవాడు, ఆడేవాడు, కవిత్వం చెబుతాడు. అన్నింటిని మించి ఇతడు కామశాస్త్రంలో ఆరితేరిన దిట్ట. ఉత్తమ లక్షణాలు కలిగిన కన్యను వరించాలనే తపనతో తానే స్వయంగా కన్యను అన్వేషిస్తూ దేశదేశాలు తిరుగనారంభించాడు. ఒకానొక దేశంలో రాజకుమారి సర్వాంగ సుందరి అని తెలుసుకుని అక్కడకు వెళ్ళి రాజుగారికి తనని తాను పరిచయం చేసుకొని, తను కన్య లక్షణాలు చూసి వరుడి వివరాలు చెప్పే వ్యక్తిగా పరిచయం చేసుకున్నాడు. రాజు అంతఃపురంలోకి తీసికెళ్ళి తన కూతురైన సుశీలను చూపించాడు. విశాలాక్షుని సౌందర్యానికి ఆకర్షితురాలైన రాకుమారి అతడినే వివాహమాడతానని తల్లిదండ్రులకు ఆ క్షణంలోనే తేల్చి చెప్పేసి వెంటనే విశాలాక్షునికి శీతలోపచారాలు చేసింది. అతడు తేరుకున్నాడు. రాజు ఇద్దరికి ఓ సుముహూర్తాన ఘనంగా వివాహం జరిపాడు. బంగారు దివ్యాభరణాలు, దాసదాసీ జనం, అన్నీ సమృద్ధిగా బహూకరించి రాజు చివరకు తన రాజ్యంలో కొంతభాగాన్ని కూడా అల్లుడైన విశాలాక్షుడికి ధారపోశాడు.

సౌందర్యంలో అనురాగంలో పరస్పరం ఒకరినొకరు పుణికిపుచ్చుకొన్న సుశీలా విశాలాక్షి దంపతులు రాజభవనంలో హంస తూలికా తల్పాల మీదా, సరోవరాలలో, ఉద్యానవనాల్లో, కేళీ విలాసంతో హాయిగా దాంపత్యసుఖాలు

అనుభవిస్తున్నారు. కామశాస్త్రకుశలుడు అయిన విశాలాక్షుడు పొందుతున్న ఆనందానికి అవధులు లేవు. మానుషానందం - రాజానందం - సార్వభౌమానందం - దేవేంద్రానందం - చివరికి బ్రహ్మానందం కూడా అతడు పొందే ఆనందానికి సాటి రావటం లేదు. సత్యమూ, నిత్యమూ, అవాఙ్మానసగోచరమూ అయిన ఆనందానుభూతిని పొందుతున్నాడు. అలాంటి ఆనందానుభూతినే రాకుమారి సుశీలకూ అందిస్తున్నాడు. ఎలాగైనా మరో ప్రాణికి సంతోషం - ఆనందం కలిగించాలట. ఇది బుద్ధిమంతుల లక్షణం అట. ఇంతకుమించిన ఈశ్వరార్చన లేదట.

అలాగని ఇంతటితో సంతృప్తి చెందలేదు. ఈ విశాలాక్షుడు. ఆ సౌందర్యరాశితో కలిసి యథాశాస్త్రంగా ధర్మ - అర్థ - కామ పురుషార్థాలను మూడింటినీ పుష్కలంగా పండించుకుంటున్నాడు. ఏ సమయంలో ఏది చెయ్యాలో అది చేసి కృతకృత్యుడయ్యాడు. ధనలోభం లేకుండా యజ్ఞయాగాలు చేసాడు. దానధర్మాలు చేసాడు. చిన్నపాపంగాని, కొంచెం దుఃఖంగాని అతడు చేయలేదు పొందలేదు. ఆపదలే అతడు వినలేదు.

మనస్సుకి నచ్చిన ఆ సుందరాంగితో పేరుకి తగిన ఆ సుశీలతో కలిసి హాయిగా గాంధర్వవేదం పాడుకుంటూ కాలానుగుణంగా అభిరుచికి అనుగుణంగా సుఖసంతోషాలు అనుభవిస్తున్నాడు. వాటి అంచులు రుచి చూస్తున్నాడు. సంవత్సరాలు రోజులుగా దొర్లిపోతున్నాయి. చివరకు కాలధర్మం చెందారు. కానీ తాము ఉపాసించిన గాంధర్వ కామశాస్త్రాల మహిమ వల్ల అతడు గంధర్వుడుగా ఆమె గంధర్వ కన్యగా గంధర్వ లోకంలో పునర్జన్మలు పొందారు. అక్కడా దంపతులయ్యారు. ఆడుతూ పాడుతూ ఇష్టం వచ్చినట్లుగా భోగాలు తనివితీరా ఆస్వాదిస్తున్నారు. ఒకనాడు కైలాసానికి దగ్గరలో వున్న ఉద్యానవనంలో వీరికి పార్వతీ పరమేశ్వరులు విహరిస్తూ కనిపించారు. దంపతులిద్దరూ సాష్టాంగపడ్డారు. నాదవేత్త అయిన గంధర్వుడు మంజుల స్వరం విప్పి మెల్లగా ఆదిదంపతులపై స్తుతిగీతం అందుకున్నాడు. గంధర్వసుందరి వీణ మీటినట్లుగా గొంతు కలిపింది. పార్వతీ పరమేశ్వరులు ఎంతగానో సంతోషించారు. నాదజ్ఞుడైన శివుడైతే మరింత ప్రసన్నుడై ఆనందంతో ఇంతటి ఉత్తమగీతాన్ని సంగీతాన్ని నేనెప్పుడ వినలేదు. గంధర్వుడా నువ్వు ధన్యుడవు, కృతకృత్యుడవు. నువ్వూ, నీ భార్యా ఇంద్రలోకం వెళ్ళండి ఇది నా ఆజ్ఞ అని వరమిచ్చాడు. గంధర్వ దంపతులు ఆనందంతో మరింతగా స్తుతించారు. ఇంతలో ఒక దివ్య విమానం వచ్చి వీరి దగ్గర నిలిచింది. దాన్ని ఎక్కి గంధర్వ దంపతులు (సుశీలా విశాలాక్షులు) ఇంద్రలోకం చేరుకొన్నారు. అక్కడ నందనవన సీమలలో ఇంద్రాది దేవతలను తమ తమ దివ్యగాన మాధుర్యంతో రంజింపచేస్తూ తాము రంజిల్లుతున్నారు. ఇలా వుండగా ఒక రోజున దేవతలందరూ సత్యలోకానికి వెళ్ళవలసి వచ్చింది. సరస్వతీ చతుర్ముఖుల సమక్షంలో పేరోలగం సాగుతోంది. ఇంద్రుడు ప్రత్యేకంగా ఈ నవదంపతులను (సుశీలా విశాలాక్షులు) తీసుకెళ్ళాడు. ఆ మహోత్సవంలో అప్సరసలు అందరూ ఆడారు పాడారు. వీణా వేణు మృదంగాలు శృతిపేయంగా వినిపిస్తున్నాయి. దేవగాయకులు దివ్యగానామృతాన్ని పంచుతున్నారు. బ్రహ్మానుగ్రహం కోసం వీణాపాణి మెప్పు కోసం ఎవరిమటుకు వారే తమ ప్రతిభావ్యుత్పత్తులను అపరిమితంగా ప్రదర్శిస్తున్నారు. ఆ సందర్భంలో దేవేంద్రుడు ఈ దంపతుల గాంధర్వ విద్య గురించి విరించికి సూచించాడు. గళం విప్పండి అని వీరికి కనుసైగ చేశారు. తక్కినవారి సంగీత నృత్యాలను చేతిసంజ్ఞతో నిలుపుదల చేశారు. అప్పుడు సుశీల, విశాలాక్ష దంపతులు గొంతు సవరించారు. నారదతుంబురలకు సైతం అన్నప్పుడే లభించని సువర్ణావకాశం తమకు లభించటంతో ఇద్దరూ మైమరచి తమ గాన కళానైపుణ్యాన్ని ప్రదర్శించారు. విభిన్నస్థాయిలలో వివిధ రాగాలను యథాశాస్త్రంగా ఆలపించారు. వాణీ చతుర్ముఖులను స్తుతించే కీర్తనలు గానం చేశారు. సంగీత సరస్వతి తానై ఎంతగా

సంబరపడిందో ఆ సంతోషాన్ని ప్రకటించటానికి ఆ వాగ్దేవతకు కూడా మాటలు చాలలేదు. బ్రహ్మదేవుడు ఆనందంతో ఆదరంతో పులకించిపోయాడు. ఎనిమిది కన్నుల నుంచీ ఆనందాశ్రువులు జాలువారాయి. చాలాసేపటికి తేరుకున్నాడు. విశాలాక్షా! నువ్వు నాదబ్రహ్మతత్వాన్ని తెలుసుకున్నావు. ఇదిగో నీకు ప్రజాపతి పదవి ఇస్తున్నాను. ఇక నుంచి మీ నివాసం ఇక్కడే, ఈ సత్యలోకంలోనే, మాతో పాటే ఆనందించండి. వేదగోచరమైన బ్రహ్మతత్వాన్ని నీకు నేను ఉపదేశిస్తాను అని అనుగ్రహించి అవ్యయమూ, సచ్చిదానందమూ అయిన పరబ్రహ్మతత్వాన్ని ఉపదేశించాడు. ఇంద్రా! ఇతివృత్తం (యథార్థంగా జరిగిన కథ) విన్నావుగా. ఇప్పుడేమంటావ్! కామగాంధర్వశాస్త్రాలు అంతర్బహిర్శుద్ధిని కలిగిస్తాయని ఒప్పుకుంటావా?

## మంత్ర తంత్ర శాస్త్రాలు

శచీపతి! మరొక ఉదాహరణ చెబుతాను. ఆలకించు. వెనుకటికి విశాలనగరంలో వేదశర్మ అనే ఒక పండితుండేవాడు. శాంతి (బహిరింద్రియ నిగ్రహం) దాంతి (అంతరింద్రియ నిగ్రహం) ఉన్నవాడు. అరిషడ్వర్గాలను జయించినవాడు. వేదధర్మాలను తు.చ. తప్పకుండా పాటించేవాడు. ఇతడికి ఒక కుమారుడు కలిగాడు. సుశీలుడు అని నామకరణం చేశాడు. ఆ బిడ్డడు పూర్వజన్మలో చేసుకున్న పాపకర్మలు ఏమోగానీ పుట్టినప్పటి నుంచీ ఏడుగురు బ్రహ్మరాక్షసులు అతణ్ణి ఆవరించారు. ఆ ఏడుగురు పరస్పరం కలహించుకుంటూ పరస్పరం వధించుకునే ప్రయత్నాలు ముమ్మరంగా చేస్తుంటే సుశీలుడు విలవిలలాడిపోతూ దారుణంగా రోదించేవాడు. ఒక్కొక్కసారి విపరీతంగా నవ్వేవాడు. గంతులు వేసేవాడు. నృత్యం చేసేవాడు. ఉన్నట్టుండి మూర్ఛపోయేవాడు. ఇతడి చేష్టలన్నీ వింతగానూ విపరీతంగానూ ఉండేవి. తినటం మొదలుపెడితే భక్ష్యాభక్ష్య వివేచన లేకుండా అమితంగా తినేవాడు. మానేస్తే ఘోరంగా పస్తులుండేవాడు. ఉన్నట్టుండి ఘోరంగా రోదించేవాడు. బాధ ఏమిటో నివారణోపాయం ఏమిటో ఏమీ తెలియక వేదశర్మ దంపతులు పడే ఆవేదనకు అంతు ఉండేదికాదు. దెయ్యాలో భూతాలో పట్టుకున్నాయని వాటిని వదిలించాలనీ ఆ పండితుడు చాలా ప్రయత్నాలు చేశాడు. హోమాలు చేశాడు. వ్రతాలు చేశాడు. నోములూ తీర్థయాత్రలూ అన్నీ అయ్యాయి. ఏదీ ఫలించలేదు.

ఒక రోజున వేదశర్మ వైశ్వదేవం ముగించుకుని అతిథి కోసం ఎదురుచూస్తున్నాడు. ఒకానొక బిక్షువు వచ్చాడు. దుమ్ముకొట్టుకుపోయినట్టు ఒళ్ళంతా బూడిద. మాసిపోయి పీలికలుగా వేలాడుతున్న గుడ్డలు. గుప్పుమని కొడుతున్న దుర్గంధం. ఈగలూ, నుసమలూ ముసురుతున్నాయి. అభ్యాగతః స్వయం విష్ణుం అన్నారు గదా అని ఆ బిక్షువుకి అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆదరాతిశయంతో ఆతిథ్యం ఇచ్చి తాను కూడ ప్రసాదం స్వీకరించివచ్చి భిక్షువుకి వింజామర వీస్తూ కూర్చున్నాడు. ఎందుకో వేదశర్మ మనస్సులో ఈయన దత్తాత్రేయుడు కాదుకదా అనే ఆలోచన మెదిలింది. దత్తదేవుడు ఈ నగరంలోనే సంచరిస్తున్నాడనీ భిక్ష స్వీకరిస్తున్నాడనీ వింటున్నాను. ఈయనే దత్తదేవుడైతే అంతకన్నా కావలసింది ఏముంది? నా జన్మ తరించినట్టే అనుకున్నాడు. క్రమక్రమంగా ఆలోచన బలపడింది. దత్తాత్రేయుడే అని నిశ్చయం కలిగింది. అంతలోకి ఆ భిక్షువు నేనింక వెడతానంటూ బయలుదేరాడు. బయలు దేరడమేంటి రెండు

అంగట్లో వీధిలో నిలిచాడు. వేదశర్మ అతడి వెంటబడ్డాడు. భిక్షువు-పొమ్మంటున్నా వినకుండా వెంబడించాడు. చేతికి అందిన కర్రతో రాయితో ఇటుకముక్కతో అదీ ఇదీ అని లేదు ఏది దొరికితే దానితో వేదశర్మను కొడుతున్నాడా భిక్షువు. అయినా ఇతడు వెంటబడుతూనే ఉన్నాడు. దెబ్బలు ఓర్చుకుంటున్నాడు. నెత్తురు కారుతున్నా లెక్కచేయడం లేదు. వెంట నడుస్తున్నాడు. కొంత దూరం వెళ్ళేసరికి అక్కడ చచ్చిపడి ఉన్న గాడిద కళేబరం కనిపించింది. దాని శరీరం నుంచి ఇంత మాంసం ముద్ద పెకిలించి ఆ భిక్షువు వేద శర్మదోసిట్లో పడేసి "ఇంద-తిను" అన్నాడు. వేదశర్మ భద్రంగా ప్రసాదంలా ఆ ముద్దను అలాగే దోసిట పట్టుకొని అతడివెంట నడిచాడు. చేరువకు రానిచ్చి భిక్షువు కాలితో ఒక్క తాపు తన్నాడు. వేద శర్మ తట్టుకొని నిలబడ్డాడు. చకచకా పరుగులాంటి నడకతో భిక్షువు వెళ్ళి వెళ్ళి ఒక కొండ గుహలో దూరాడు. వేదశర్మ కూడా ప్రవేశించాడు. అక్కడ ఒక శిలావేదిక మీద కూర్చుని ఆ భిక్షువు-ఏమయ్యా నావెంట బడ్డావు? తిట్టినా వదలవు. కొట్టినా వదలవు. నాతో ఏమిటి పని? చూస్తున్నావుగా కంపుగొడుతున్న నా రూపాన్ని. నేనేమి చెయ్యగలనని? ఏమికోరి నా వెంట బడ్డావు? రూక్షంగా ప్రశ్నించాడు.

వేదశర్మ అపుకోలేని దుఃఖంతో భళ్ళుమన్నాడు. భిక్షువు పాదాల మీద పడ్డాడు. తన ఒక్కగానొక్క కొడుక్కి పట్టిన దురవస్థను చెప్పి వాడి దుఃఖాన్ని తొలగించమని అర్థించాడు. భిక్షువు ప్రసన్నుడయ్యాడు. ఏడు మంత్రాలను బీజాక్షర సహితంగా ఉపదేశించాడు. నీ కొడుకుని ఏడుగురు బ్రహ్మరాక్షసులు పట్టి పీడిస్తున్నారు. రోజుకొక మంత్రాన్ని జపించి ఆ ఉదకాన్ని బిడ్డడి మీద జల్లు. ఒక్కొక్క రాక్షసుడూ వదిలిపోతాడు. ఒకేసారి ఏడుగురునీ వెళ్ళగొట్టడం ఏ మంత్రానికీ సాధ్యంకాదు. అదీగాక - ఒక మూఢుణ్ణి విద్వాంసుణ్ణి చెయ్యాలంటే అన్ని శాస్త్రాలూ ఒకేసారి నేర్పుతామా? కొన్ని అవిద్యల్ని న్యాయశాస్త్రంతో, కొన్నింటిని మీమాంసాశాస్త్రంతో, సాంఖ్యంతో కొన్నింటిని పతంజలి యోగ విద్యతో కొన్నింటిని - ఇలా క్రమక్రమంగా అవిద్యావాసనలను పూర్తిగా తొలగించి చిత్త పరిశుద్ధి చేసి అప్పుడుగదా బ్రహ్మవిద్యను ఉపదేశించాలి. అలాగే ఈ బ్రహ్మరాక్షసుల్ని కూడా ఒక్కొక్కరుగానే వెళ్ళగొట్టాలి. అటుపైని నీ బిడ్డడు నీ అంతటి పండితుడూ కర్మఠుడూ అవుతాడు. ఇక వెళ్ళు-అన్నాడు.

విప్రుడు పునఃపునః నమస్కరించి ఇంటి దారి పట్టాడు. ఇందాక గాడిద కళేబరం కనిపించినచోట ఇప్పుడు రక్తచందన వృక్షం కనిపించింది. తన చేతిలోని మాంసపుముద్ద రక్తచందన పుష్పమయ్యింది. భిక్షువు దత్తుడే అని ధృఢమయిన నమ్మకం కలిగింది. ఇంటికి వచ్చాడు. నియమ నిష్ఠాగరిష్ఠుడై క్రమం తప్పకుండా రోజుకు ఒక మంత్రాన్ని తీవ్రంగా జపించాడు. మొదటి రోజున దుర్ధరుడు అనే రాక్షసుడు ఘోరంగా ఏడుస్తూ వెళ్ళిపోయాడు. ఆ రోజుతో బిడ్డడు ఏడవటం మానేశాడు. ఇలాగే ఆయా మంత్రాల తేజస్సులు తట్టుకోలేక మిగతా ఆరుగురు రాక్షసులు పరుగు పరుగున పలాయనం చిత్తగించారు. ఏడవరోజుకి సుశీలుడు తన సహజమైన రూపాన్నిపొంది రోగ విముక్తుడై హాయిగా సుఖంగా తల్లిదండ్రుల్లోకి వచ్చాడు. దేవేంద్రా విన్నావుగదా! ఇప్పుడేమంటావు. మంత్ర తంత్ర శాస్త్రాలను క్షుద్ర శాస్త్రాలంటావా! లేదా పరంపరగా ముక్తిసాధనాలు అవుతాయని ఒప్పుకుంటావా! బాగా ఆలోచించి చెప్పు. ఇప్పుడు నాలుగో నిదర్శనం కూడా చెబుతాను. అది కూడా శ్రద్ధగా విను అని బృహస్పతి ఇలా చెప్తున్నాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

# వేదాంతశాస్త్రం - సదాచారం - విష్ణుదత్తుడు

సహ్యాద్రి సమీపంలో మాతాపురం అనే గ్రామ మున్నది. అది చాలా ప్రసిద్ధమైన నగరం. ఆ నగరంలో విష్ణు దత్తుడు అనే బ్రాహ్మణుడు వున్నాడు. అతడు వేద శాస్త్రపారంగతుడు. మంచి నైష్టికుడు. అతడి ధర్మపత్ని పేరు సుశీల పేరుకుతగ్గ పతివ్రత. వీళ్ళ ఇంటి ఆవరణలో ఒక రావిచెట్టు వుంది (అశ్వత్థ వృక్షం) దాని మీద ఒక భయంకర రాక్షసుడు నివాసముంటున్నాడు. విష్ణుదత్తుడు రోజూ నిత్యకర్మానుష్టానాలు అన్నీ పూర్తి చేసుకొని రోజూ భోజనం చేసే ముందు భూత బలిని (వైశ్వదేవం) ఇంటి ఆవరణలో గల రావిచెట్టు క్రింద సమర్పిస్తుండేవాడు. రోజూ విష్ణుదత్తుడు వేసే భూతబలిని చెట్టుపై ఉన్న రాక్షసుడు కాకి రూపంలో వచ్చి తింటూవుండేవాడు. రోజూ విష్ణుదత్తుడు వేసే భూతబలి తింటున్నందువల్ల ఆ బ్రహ్మ రాక్షసునిలో తమో గుణం నశించి సాత్విక చింతన బయలు దేరింది. ఒక రోజున ఆ రాక్షసుడికి ఒక మంచి బుద్ధి పుట్టింది. ఎంతో కాలంగా తిండి పెడుతున్నాడు గదా! ఇతడికి ఏదైనా ఉపకారం చెయ్యాలనే తలంపుతో విష్ణుదత్తుడి ఎదుట ప్రసన్న రూపంతో ప్రత్యక్షమయ్యి ఇలా అన్నాడు. విప్రవర్యావిష్ణుదత్తా! రోజూ నువ్వు పెడుతున్న అన్నం తింటున్నాను. సంతృప్తి చెందాను. నీకు ఏదైనా ప్రత్యుపకారం చేద్దామని అనిపించింది. ఏదైనా చెయ్యగల సమర్థుణ్ణే. కనుక ఏం ఉపకారం చెయ్యమంటావో చెప్పు అన్నాడు. విష్ణుదత్తుడు ధర్మపత్ని సుశీలతో ఆలోచించి రాక్షసోత్తమా, చాలాకాలంగా మాకు తీరని కోరిక ఒకటి వుండిపోయింది. దత్త స్వామి ఈ పర్వత ప్రాంతంలోనే సంచరిస్తూ వుంటారని వినడమేగాని ఎప్పుడూ వారి దర్శనం కాలేదు. దయచేసి వారి నొక్కసారి చూపించు.

అప్పుడా రాక్షసుడు చాలా మంచికోరిక కోరావు. తప్పకుండా చూపిస్తాను. అయితే ఒక్క షరతు. దత్తస్వామిని అల్లంత దూరం నుండి నీకు మూడు మార్లు చూపించే ప్రయత్నం చేస్తా. ఆయన చిత్రవిచిత్ర రూపాల్లో సంచరిస్తూ వుంటారు. గుర్తించ గలిగి పట్టుకోగలిగితే నీ అదృష్టం- ఈ షరతుకు విష్ణుదత్తుడు అంగీకరించాడు. అయితే సిద్ధంగా వుండు. స్వామివారు ఆ చుట్టు ప్రక్కలలో తిరుగుతున్నప్పుడు హఠాత్తుగా రాక్షసుడు ప్రత్యక్షమయ్యాడు. రా, రా అన్నాడు. పాపం విష్ణుదత్తుడు పడుతూ లేస్తూ వెళ్ళాడు. మద్యమాంసాలు విక్రయించే వీధిలో ఉన్మత్తవేషంలో ఒక వ్యక్తి కనిపించాడు. తాగిన మత్తులో దుమ్ముగొట్టుకొనిపోయి పిచ్చివాని రూపంలో వున్న ఆ వ్యక్తిని చూపించి అతడే దత్తస్వామి వెళ్ళి దర్శించు. అని రాక్షసుడు వెళ్ళిపోయాడు. విష్ణుదత్తుడు నమ్మలేకపోయాడు. ఇంత అనాచారుడా తన స్వామి. అబ్బే ఈ రాక్షసుడు ఏదో ఆట పట్టించడానికి ఇలా అన్నాడు అని అనుకున్నాడు. ఇలా తనలో తాను తర్కించుకుంటూ వుండగానే ఆ ఉన్మత్తుడు అలా అలా దూరమై అదృశ్యమైనాడు. రాక్షసుడు తిరిగివస్తూనే ఏమి మందమతివయ్యా విష్ణుదత్తా నీకు ముందే చెప్పాను గదా స్వామి చిత్రవిచిత్ర రూపాల్లో తిరుగుతుంటాడని మరచి పోయినట్లున్నావ్. గుర్తించలేకపోయావు బంగారం లాంటి అవకాశాన్ని జారవిడచుకున్నావు. పోనీలే చింతించకు. మరోసారి చూపిస్తాను అని వూరడించి వెళ్ళిపోయాడు.

మరొక రోజున మరింత హడావిడిగా వచ్చాడు రాక్షసుడు. విష్ణుదత్తా రా, రా మహాదేవుడు ఇక్కడే దగ్గర్లో సంచరిస్తున్నాడు అన్నాడు. విష్ణుదత్తుడు బయలు దేరాడు. అది స్మశానం. శ్మశానవాటికలో దుమ్ము కొట్టుకొని పోయివున్న ఒక మనిషి కనిపించాడు. అతడి చుట్టూ కుక్కలు గుమికూడి తిరుగుతూ వున్నాయి. అతడి చేతిలో కపాలం వుంది. కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి. ఎముకల్ని శరీరంనిండా ఆభరణాలుగా ధరించి వున్నాడు. స్వామికి ఇది

మరొకరూపం కాబోలు అనుకొని విష్ణుదత్తుడు దగ్గరికి చేరబోయాడు. ఆ పెద్దమనిషి కస్సుమన్నాడు. అందుబాటులోవున్న పొడవాటి ఎముక ముక్కను తీసికొని విష్ణుదత్తున్ని కొట్టాడు. విష్ణుదత్తుడు భయపడిపోయాడు. కాళ్ళల్లో వణుకు బయలుదేరింది. కళ్ళు తిరిగాయి. పడిపోబోయి నిలద్రొక్కుకున్నాడు. బ్రతికుంటే బలుసాకు తినిబ్రతకొచ్చు అనుకొని వెనక్కి తిరిగి చూడకుండా పరుగు లంఘించాడు. దూరం నుండి రాక్షసుడు ఇదంతా చూస్తున్నాడు. రాక్షసుడు అయ్యో ఈ వెర్రి బాపడు ఈసారి అవకాశం కూడా పోగొట్టుకున్నాడే దైవం అనుకూలించకపోతే దైవ దర్శనం కాదు. విష్ణుదత్తుడు సిగ్గుపడుతూ ఇంటికి చేరుకున్నాడు.

ఇంకొక రోజున ఆ రాక్షసుడు విష్ణుదత్తుణ్ణి పిలచి నీకు దత్తస్వామిని మూడు మార్లు చూపిస్తాను అని చెప్పాను గదా ఇది చివరి ప్రయత్నం నాతో రా అని తీసికెళ్ళాడు. సుశీలమ్మ కూడా భర్తకు బాగా ధైర్యం నూరి పోసింది. ఏమైనా సరే ఈ సారి విజయం సాధించితీరాలి. అని గట్టిగా చెప్పి పంపించింది. తానూ దృఢంగా సంకల్పించుకున్నాడు. మూడో మారు కూడా భయపడి వెనుదిరిగితే ఈ సృష్టిలో నాకన్నా దౌర్భాగ్యుడు ఇంకొకడు వుండడు. ఏమైనా ధైర్యం చెయ్యవలసిందే. స్వామి రూపం ఎంతభయంకరంగా వుండనీ జుగుప్సాకరంగా వుండనీ, నన్ను తిట్టనీ, కొట్టనీ, ఈ మారు స్వామి పాదాలు వదలనుగాక వదలను. అని ఆలోచించుకుంటూ రాక్షసుడి వెంటవెళ్ళాడు. గ్రామందాటారు. వెలివాడ చేరుకున్నారు. అల్లంత దూరాన ఒక వికృతాకారుడు కనిపించాడు. చచ్చిపోయిన గాడిద శరీరం నుండి మాంసం ముద్దలు పెకిలించి కాకులకూ, గ్రద్దలకూ-కుక్కలకూ, నక్కలకూ-విందులు పంచుతున్నాడు. బ్రాహ్మణోత్తమా అతడే దత్తుడు. త్వరగా వెళ్ళు వెళ్ళి కాళ్ళ మీదబడు-అని మెల్లగా చెప్పి రాక్షసుడు చల్లగా జారుకున్నాడు. విష్ణుదత్తుడు సర్వశక్తులూ కూడ గట్టుకున్నాడు. ధైర్యం తెచ్చుకున్నాడు. గబగబా వెళ్ళి ఆ వికృతా కారుడి కాళ్ళమీద బడ్డాడు. రెండు పాదాలూ రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. కళ్ళు మూసుకొని. ఆయన ఎంత విదిలించినా వదలలేదు. మాంసం ముద్దలతో వీపు మీద ఎంత బాదినా పట్టు సడలించలేదు. తన శరీరంపై గాడిద మాంసం గుట్టలాగా పడింది. అయినా అసహ్యించుకోలేదు. అలా పాదాలు పట్టుకొని సాష్టాంగపడ్డవాడు పడ్డట్టే ఉన్నాడు.

ఓరి మూఢుడా నన్ను ఏడిపించుకుతింటావేమిరా? నిన్ను చంపేస్తాను నీకసలు నాతో పని ఏమిటి? - అని వికృతాకారుడు కర్ణకఠోరంగా గద్దించాడు. అయినాసరే తన పనిసాధించుకోవాలనే పట్టుదలతో విష్ణుదత్తుడు పాదాలువదలలేదు. అప్పటికి స్వామి ప్రసన్నుడయ్యాడు. వికృతాకారం వదిలేసాడు. మృదువుగా శ్రావ్యంగా ఇలా అన్నాడు. విష్ణుదత్తా! ఈ వికృతాకారుడితో నీకు పని ఏమిటయ్యా? నాకోసం మూడుమార్లు వచ్చావు-అన్నాడు. స్వరంలో వినిపించిన మార్దవం మాధుర్యం విష్ణుదత్తుణ్ని పులకింపజేశాయి. వీపు మీద మాంసం ముద్ద బరువు ఎవరో తీసేసినట్లయ్యింది. పట్టుకున్న కాళ్ళు, నేలా రమణీయంగా మారిపోయాయి. విష్ణుదత్తుడు మెల్లగా కళ్ళు తెరచాడు. ఆ పాదాల మీద పట్టు పీతాంబరపు ఎర్రంచు వ్రేళ్లాడుతూ కనిపించింది. నల్ల కలువల లాంటి పాద పద్మాలు తనచేతుల్లో వున్నాయి. ఆ పాదాలపై శిరస్సు ఆన్చి గబగబా మూడుమార్లు కళ్ళకి అద్దుకున్నాడు. లేచి నిలబడ్డాడు. చిరునవ్వులు చిందిస్తూ ప్రసన్న ముఖారవిందంతో పర్ణశాలముందు గున్నమావిచెట్టు నీడన తిన్నె మీద త్రిమూర్తి స్వరూపుడు దివ్యాభరణ, దివ్యాంబరములు ధరించిన వాడు, తులసీదళదామ విరాజితుడు. పుష్పమాలికా సమలంకృతుడు, పారిజాత పరిమళాలు వెదజల్లుతూ దర్శనమిచ్చాడు. కనుచూపు మేరలో ఎక్కడా వెలివాడ లేదు. మాంసపు ముద్దలూ లేవు. కంటికి ఇంపుగొల్పే పచ్చని ఆశ్రమ వాతావరణం పర్ణశాలలు, కుటీరాలు. శుచియై శాంతుడై ఎట్టఎదుట ఆశీనుడైవున్న

దత్తస్వామికి మళ్ళీ మళ్ళీ సాష్టాంగ దండప్రణామాలు చేసి ఆనందభాష్పములతో దోసిలి యొగ్గి ఆనందభాష్పములతో నిండిన కళ్ళను తుడుచుకొని గద్గద స్వరంతో ఇలా పలికాడు.

మహేశా! ఈ జగతీ తలంలో నేను ధన్యుణ్ని నన్ను కన్న తల్లిదండ్రులు ధన్యులు. యోగివంద్య పదార విందుడవైన నీ దర్శన భాగ్యం కలిగింది - అని మరొకసారి పాదాల మీద పడ్డాడు. విష్ణు దత్తా నాతో నీ పనేమిటో చెప్పావు కాదు అన్నాడు దత్తాత్రేయుడు. అప్పటికి తేరుకున్న విష్ణుదత్తుడికి భార్య సుశీల చెప్పిన మాటల జ్ఞాపకం వచ్చాయి. అడగవలసింది ఏదో స్ఫురించింది. స్వామీ ఈ రోజు మా తండ్రి గారి ఆబ్ధికం. తమరిని భోక్తగా నియంత్రించుకుంటాను. తమరు తప్పకుండా రావాలి - అన్నాడు. విష్ణుదత్తుడి అభ్యర్ధననూ స్వామి అంగీకరించారు. అలాగే తప్పక వస్తాను. నువ్వు ముందు నడువు కాసేపట్లో స్నానం సంధ్యా ముగించుకొని నీవెనుకనే నీ ఇంటికివస్తాను. నీ ప్రయత్నం సఫలం అయ్యింది కదా ఇకపద - అన్నారు దత్తస్వామి.

విష్ణుదత్తుడు పరుగుపరుగున ఇంటికి చేరుకున్నాడు. పట్టరాని ఆనందంతో ఒగురుస్తూ సుశీలమ్మకు జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు వివరించాడు. శ్రాద్ధవిధికి వంట సిద్ధం చెయ్యమన్నాడు. అవిడ కూడా చాలా సంబర పడింది. స్నానం చేసింది. తడిగుడ్డలతో తద్దినపు వంటలో మునిగిపోయింది. విష్ణుదత్తుడు స్నానం చేసి మిగతా సామాగ్రి అంతా సిద్ధం చేస్తున్నాడు. సరిగ్గా వంట అయ్యింది. దత్తస్వామి గుమ్మంలో ప్రత్యక్షమైనాడు. విష్ణుదత్తుడు భక్తి శ్రద్ధలతో ఎదురు వెళ్ళి అర్ఘ్యపాద్యాలిచ్చి లోపలికి తీసుకొచ్చాడు. మడి బట్టలు కట్టుకుని పీట మీద కూర్చున్నాడు. సుశీల అరిటాకులందించింది. సాధ్వీ! నా సహపంక్తికి మిగతా ఇద్దరూ ఏరి? నాలాటి వాళ్ళని ఎవరిని పిలిచారు? అని అంటూ కుశలం అడుగుతున్నట్లుగా ప్రశ్నించాడు. అప్పటికి గాని గుర్తురాలేదు, మిగతా ఇద్దరినీ పిలవలేదని. గాబరాపడకుండా, గంభీరంగా సమాధానం చెప్పింది, సుశీల. దేవదేవా నీతో సమానుడైన భోక్త ఉన్నాడు. వస్తున్నాడు అంటూ వంటింటిలోంచి పెరట్లోకి వచ్చింది. ఆకాశంలో నడినెత్తిన సూర్యుడు ధగధగలాడుతు కనిపించాడు. సుశీల సూర్యునికి నమస్కరించి సూర్యదేవా జగదేకబంధు, సర్వాత్మకా, సర్వధీసాక్షీ నమోనమః రవి ప్రభూ! అచేతనమైన ఈ సమస్త విశ్వాన్ని నీ చేతులతో సచేతనం చేస్తున్నావు. సర్వద్రష్టవూ సర్వాత్మకుడవూ పరాత్పరుడవూ అయిన నిన్ను నేను ప్రత్యక్షంగా పిలివవలసింది ఏముంది? మాయాశక్తి సంపన్నుడైన నువ్వు ఈ వివిధ వికార భూతజాలంలోకి అంతరాత్మగా ప్రవేశించి అంతరాలోచనలకు బహిచ్చేష్టలకు ఏకైక సాక్షిగా వెలుగొందుచున్నావు.

ఈ ప్రార్ధనకు సంబరపడ్డాడు అంబరవిహారి. సౌమ్యుడై విప్రరూపంలో దర్శనమిచ్చాడు. సాధ్వీ ఏమి ఆజ్ఞ ? అన్నాడు. ఆబ్ధికంలో రెండవ భోక్తగా కూర్చోవాలి నాయనా - అంది. సరే అన్నాడు. లోపలికి వచ్చి విష్ణుదత్తుడి నుండి అర్ఘ్యపాద్యాదులు అందుకొని రెండో పీట మీద కూర్చున్నాడు. అరిటాకు పరిచాడు విష్ణుదత్తుడు.

సాధ్వీ! విశ్వదేవస్ధానంలో మేమిద్దరం కుదిరాము. బాగుంది. మరి పితృదేవస్థానంలో కూర్చోడానికి మాకు సాటి మనిషి ఏడి? అని అడిగారు దత్తస్వామి చిరునవ్వులు చిందిస్తూ.

స్వామీ తొందరపడకండి ఇపుడే వస్తాను - అంటూ సుశీల తమ నిరతాగ్ని శాలలోకి వెళ్ళింది. ఇలవేల్పు అగ్ని దేవుడ్ని ప్రార్ధించింది. సర్వశుచీ! సర్వభక్షకా! లే మరో రూపం ధరించు. త్వరగా రా. శ్రాద్ధభోక్తగా వచ్చి కూర్చున్న

దత్తస్వామి నీ కోసం ఎదురు చూస్తూ వున్నాడు. తమకు సాటివచ్చే మూడవ వాడివి నువ్వేనని భావిస్తున్నాడు. సురోత్తమా - సురవర్యా- వైశ్వానరా- హవిర్భుజా - అగ్నిముఖావై దేవాః అంటుందివేదం. దేవతలకు నీవు ముఖ స్థానీయుడవు. ధూమకేతూ- గృహపతీ-కర్మాధ్యక్షా- నీకు ఇదే నమస్కరిస్తున్నాను అనుగ్రహించు.

ఆ పతివ్రత ఇలా ప్రార్థించేసరికి ఒకానొక అగ్ని గుండం నుండి ఒక అంశతో అగ్నిదేవుడు ఆవిర్భవించాడు. మరొక అంశతో కుండంలోనే వున్నాడు. వచ్చిన అగ్ని దేవునికి కూడ అర్ఘ్యపాద్యాదులు సమర్పించాడు విష్ణుదత్తుడు. సరాసరి పీట మీదకెళ్ళి కూర్చున్నాడు. అరిటాకు సిద్ధంచేసాడు విష్ణుదత్తుడు. ఆపాతివ్రత్య మహత్మ్యాన్ని చూస్తున్న దత్తస్వామి ఆనందం పొందాడు. సూర్యాగ్నులూ దత్తదేవుడూ ఆహుతులై ఆయాస్థానాల్లో కూర్చుంటే విష్ణుదత్తుడు పితృయజ్ఞాన్ని అపూర్వంగా నిర్వహించాడు. ఇంతటి ఉత్తమ విప్రులు ఎవరికైనా ఎన్నడైనా దొరుకుతారా? ముగ్గురూ శ్రాద్ధవిధి నియమాలకు అనుగుణంగా భోక్తృత్వం నెరపి సంతుష్టులై తృప్తాస్మః అని ముక్త కంఠంతో పలికారు. విష్ణుదత్తుడి పితృపితామహ, ప్రపితామహులకు అక్షయ పుణ్యలోక ప్రాప్తి కలగాలని ఆశీర్వదించారు. సుశీలా విష్ణు దత్తులు సాష్టాంగపడ్డారు. లేచి అంజలి ఘటించి శిరస్సు వంచి నిలబడ్డారు. అప్పుడు ఆనందంతో భక్తిశ్రద్ధలతో విష్ణుదత్తుడు దత్తాత్రేయుడ్ని స్తుతించాడు.

## విష్ణు దత్త - దత్త స్తుతి

**దత్తాత్రేయం హరింకృష్ణ మున్మాదం ప్రణతోఽ స్మ్యహం**
**ఆనందదాయకం దేవం మునిబాలం దిగంబరమ్ ॥**
**పిశాచ రూపిణం విష్ణుం వందేఽహం జ్ఞాన సాగరమ్ ।**
**యోగినం భోగినం నగ్న మనసూయాత్మ జం కవిమ్ ॥**
**భోగ మోక్ష ప్రదం వందే సర్వదేవ స్వరూపిణమ్ ।**
**ఉరుక్రమం విశాలాక్షం పరమానందవిగ్రహమ్ ॥**
**వరదం దేవదేవేశం కార్తవీర్య వరప్రదమ్**
**నానారూప ధరం హృద్యం భక్త చింతామణిం గురుమ్ ॥**
**విశ్వవింద్య పదాం భోజం యోగిహృత్ పద్మవాసినమ్।**
**ప్రణతార్తి హరం గూఢం కుత్సితాచార చేష్టితమ్ ॥**
**మితాచారం మితాహారం భక్ష్యాభక్ష్య వివర్జితమ్ ।**
**ప్రమాణం ప్రాణ నిలయం సర్వాధారం నతోఽ స్మ్యహమ్ ॥**
**సిద్ధసాధకం సంసేవ్యం కపిలం కృష్ణపింగళమ్ ।**
**విప్రవర్యం వేదవిదం వేదవేద్యం నియత్సమమ్ ॥**
**పరాశక్తి పదాశ్లిష్టం రాజరాజ్య ప్రదం శివమ్ ।**
**శుభదం సుందరగ్రీవం సుశీలం శాంత విగ్రహమ్ ॥**

**యోగినం రామయాస్పృష్టం రామరామం రమాప్రియమ్।**
**ప్రణతోస్మి మహాదేవం శరణ్యం భక్తవత్సలమ్ ॥**
**వీరంవరేణ్యం ఋషభం వృషాచారం వృషక్రియమ్ ।**
**అలిప్త మనఘం మేధ్యమనాది మగుణం పరమ్ ॥**
**అనేక మేక మీశాన మనంతమని కేతనమ్ ।**
**అధ్యక్ష మసురారాతిం శమంశాంతం సనాతనమ్ ॥**
**గుహ్యం గభీరం గహనం గుణజ్ఞం గహ్వరప్రియమ్ ।**
**శ్రీదం శ్రీశం శ్రీనివాసం శ్రీ వత్సాంకం పరాయణమ్ ॥**
**జపంతం జపతాం వంద్యం జయంతం విజయప్రదమ్ ।**
**జీవనం జగతస్సేతుం జానానం (=సర్వజ్ఞమ్) జాతవేదసమ్ ॥**
**యజ్ఞమీజ్యం యజ్ఞభుజంయజ్ఞేశం యాజకంయజుః ।**
**యష్టారం ఫలదంవందే సాష్టాంగం పరయాముదా ॥**

బ్రాహ్మణోత్తమా ! విష్ణు దత్తా ! నీకు పూర్తిగా ప్రసన్నుణ్ని అయ్యాను. వరం కోరుకో. నా భక్తుడవైన నీ వాంఛితం తీరుస్తాను. దివ్యమైన నా అష్టోత్తర శతనామావళిని నీవు ఈ విధంగా ప్రకాశింపజేసావు. సులభసుందరశైలిలో అందరికీ విన్నంతనే అర్థం అయ్యే భాషలో నా తత్వాన్ని నా రహస్యాన్ని ఆవిష్కరించావు. అతి పురాతనమైన ఈ స్తోత్రాన్ని సమాహిత చిత్తంతో పఠించిన వ్యక్తిపై నాకు అత్యంత ప్రీతి ఏర్పడుతుంది. ఆ వ్యక్తికి యోగసిద్ధి కలుగుతుంది. నీ భార్య సుశీల గుణవంతురాలు. నిజంగా పతియే దైవముగా కలది. ఈమె ప్రభావం ఎంతటిదో ఈనాడు ప్రత్యక్షంగా చూశాను. ఈమె సమస్త కళ్యాణగుణ సంపన్న. నువ్వు సర్వవిద్యానిధివి. మీదంపతులు ఇద్దరూ ఒకరికొకరు తగినవారు. సమానశీలురు. నాకు అత్యంతమూ ఆనందదాయకులు.

దంపతులారా ! నా అనుగ్రహంవల్ల మీరు జీవితాంతమూ సుఖ సంతోషాలు అనుభవిస్తూ యోగవిద్యాతత్పరులై పరమానందాన్ని పొందండి. చివరికి - పరమానంద స్వరూపమైన నాతో లీనమవ్వండి. ద్విజవర్యా! నీకొక మంత్రాన్ని ఉపదేశిస్తాను. స్వీకరించు. దీనివల్ల నువ్వు ఎవరిని అనుగ్రహించి ఆశీర్వదిస్తే వారికల్లా ఆయురారోగ్య ఐశ్వర్యాలు ధనధాన్య యశఃశ్రీ సమృద్ధులూ పుత్రపౌత్రాభివృద్ధి, వంశాభివృద్ధి ఒకటేమిటి వారు కోరుకున్న వన్నీ క్షణంలో సిద్ధిస్తాయి. ఇందులో సందేహం లేదు.

నువ్వు ఈరోజు నిర్వహించిన శ్రాద్ధవిధివల్ల నీ పితృదేవతలందరూ కర్మపాశ విముక్తులై శాశ్వతమైన బ్రహ్మలోక నివాసం పొందారు. అత్యంత దుర్లభమైన ముక్తిని వారికి ప్రసాదిస్తున్నాను.

నీ యింటి ముంగిట రావిచెట్టు మీద ఉంటున్న రాక్షసుడు నీకు చాలా మహోపకారం చేసాడు. నేటి శ్రాద్ధవిధిలో ఉచ్ఛిష్టపాత్రాన్నాన్ని తిని అతడు ముక్తుడవుతాడు. స్వర్గలోకం చేరుకుంటాడు. ఇలా పలికి దేవ దేవుడు ఆ విష్ణుదత్తుని చెవిలో దివ్యమంత్రాన్ని ఉపదేశించాడు. అతడు దాన్ని తన భార్యకు ఉపదేశించాడు. ఇద్దరూ ఏకాగ్రచిత్తంతో జపించారు. దత్తదేవుడు తన అమృత హస్తాన్ని వారి శిరస్సులపై వుంచి ఆశీర్వదించి మెరుపు తీగలాగా అదృశ్యమైనాడు.

సూర్యభగవానుడు కూడా సంతోషించి ప్రసన్నుడై ఆదంపతులకు దివ్య స్థితిని అనుగ్రహించాడు. కామాగమనం కలిగిన దివ్య విమానాన్ని బహుకరించాడు. తలుచుకున్న వెంటనే దర్శనం ఇస్తానని వరమూ అనుగ్రహమూ ఇచ్చాడు. దంపతులిద్దరూ సాష్టాంగపడ్డారు. కర్మసాక్షి వినువీధికి చేరుకున్నాడు.

ఇలవేల్పు అగ్నిదేవుడు కూడా దంపతులకు వరాలు అనుగ్రహించాడు. అమ్మా! నువ్వు ఎప్పుడు తలుచుకుంటే అప్పుడు ప్రత్యక్షమవుతాను. నువ్వు ఏదికోరితే అది నెరవేరుస్తాను. విష్ణుదత్తా నువ్వు నన్ను నిత్యమూ యధావిధిగా ఆరాధిస్తున్నావు కనుక నీకు కర్మ సిద్ధిని అనుగ్రహిస్తున్నాను. నువ్వు మహాతేజస్వివి - అనుల్లంఘశాసకుడవీ- నిత్య సుఖివీ- సర్వదేహ సుఖ ప్రదుడవు అగుగాక - అని దీవించి అగ్నిదేవుడు తన యాగ కుండంలోకి ప్రవేశించాడు.

రాక్షసుడు వచ్చి ఉచ్ఛిష్టాన్ని భక్తితో భుజించి రాక్షసరూపాన్ని విడిచిపెట్టి దివ్య సుందర దేవతామూర్తిగా మారిపోయి దివ్య విమానం ఎక్కి విష్ణుదత్తుడికి ప్రీతితో వీడ్కోలు పలుకుతూ స్వర్గలోకానికి వెళ్ళిపోయాడు.

## పీడాతుర వృత్తాంతం

బృహస్పతి చెబుతూవుంటే శ్రద్ధగా వింటున్న ఇంద్రుడికి ఒక సందేహం వచ్చింది. ఇన్ని దివ్యవరాలు పొందిన విష్ణుదత్తుడు తన శేష జీవితాన్ని ఎలా గడిపాడు? ఆ శక్తుల్ని సద్వినియోగం చేసాడా? తెలుసుకోవాలి అనిపించింది. గురువర్యా తక్కిన ఉదాహరణల్ని తరువాత చెబుదురుగాని ముందు ఈ విష్ణుదత్తుడి కథ పూర్తి చెయ్యండి. వరాలు పొందిన తరువాత అతడి జీవితం ఎలా సాగింది తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది చెప్పండి - అని అడిగాడు. ఇంద్రుడి ఆంతర్యం దేవగురువుకి అర్థం అయ్యింది. చిన్నగా నవ్వి అలాగేనంటూ ప్రారంభించాడు.

శచీవల్లభా! అత్యంత దుర్లభులైన దివ్యవరాలు పొందిన విష్ణుదత్తుడు సత్వగుణ సంపన్నుడిగానే జీవితాన్ని గడిపాడు. పెద్దగా పొంగిపోలేదు. విర్రవీగలేదు. గర్వించలేదు. శాంతుడూ, దాంతుడూ, సదాచారుడూ, సుశీలుడూ, దయాళుడు గానే జీవించాడు. ఇతరుల గుణాలను మెచ్చుకుంటూ అందరికీ మిత్రుడై, కవియై, సర్వజన ప్రియుడై ఎవరికీ ఏద్రోహమూ చేయనివాడై-మునుపటిలాగానే తన బ్రతుకేదో తాను బ్రతుకుతూ జీవితం గడుపుతున్నాడు. తన ప్రభావాన్ని దివ్యశక్తుల్నీ ఎవరికీ ప్రదర్శించలేదు ప్రచారం చేసుకోలేదు. మట్టిగప్పిన మాణిక్యంలాగానే వుండిపోయాడు.

అయితేనేమి దాగుతుందా? మంచీ దాగదు, చెడూ దాగదు. అతడి ప్రభావం ఆ నోటా ఈ నోటా పడి నెమ్మదినెమ్మదిగా లోకానికి తెలిసిపోయింది. గ్రామాలు, పట్టణాలు చివరికి రాష్ట్రం అంతా వ్యాపించి మొత్తం భూగోళం అంతా తెలిసిపోయింది. విష్ణుమూర్తి మహిమలాగా విష్ణుదత్తుడి కీర్తి దశదిశలా వ్యాపించింది. ఇంతా ఎందుకు చెప్తున్నానంటే అసలు సంగతి వస్తుంది విను.

గోదావరీతీరంలో కుశావర్తం అనే వూరువుంది. అది ఒక బ్రాహ్మణ అగ్రహారం. అక్కడి వారంతా వేద వేదాంగవేత్తలూ సకల శాస్త్రపారంగతులూనూ. వారి మధ్యలో పాపం ఒక నష్టజాతకుడు వున్నాడు. అతడి పేరే పీడాతురుడు. పుట్టడమే వాతగుల్మరోగంతో ఎనిమిదో ఏట క్షయరోగం ఆ పైన మూడేళ్ళకి జలోదరం మరో ఏడాదికి జీర్ణజ్వరం వీటికి తోడు ఆరు నెలలకి అతిసారం నాలుగునెలలకి భగంధరం ఇలా నానారోగాలు అతడ్ని పట్టి పీడిస్తున్నాయి. చివరికి త్రిదోషం సంక్రమించి ఇవ్వాళో, రేపో అన్నట్లువుంది అతని పరిస్థితి. ఇంతాచేసి అతనికి ఇరవై ఏళ్లు అతనికొక

భార్య. పాపం ఆ పిల్లవయస్సు పదహారు సంవత్సరాలు. పేరు సుమేధ. పేద యింటి పిల్ల. అభం శుభం తెలియని పిల్ల. ఏడవడం తప్ప ఏమీ తెలీదు. ఆరోగ్గిష్టి వాడికి సకలోపచారాలు చేస్తుంది. విసుక్కోకుండా కసుక్కోకుండా శ్రద్ధగా సేవలు చేస్తోంది. ఎవరు ఏమందుచెబితే అదల్లాకొని తెచ్చి వేస్తూ వుండేది. ప్రతీ వైద్యుడికీ చూపిస్తోంది. డబ్బుకు ముందు వెనుకా చూడడం లేదు. అత్తమామలు హారీయంటూ ఇచ్చి పోయిన ఆస్తి అంతా ఈ వైద్యాలకే హరించుకుపోయింది. దిక్కు తోచని పరిస్థితి. రోజు గడవని స్థితి. వూరివాళ్ళు చెయ్యగలగినంత కాలం సహాయం చేసారు. ఇక వీడి రోగాలు తగ్గేవికావు. వీళ్ళ సంసారం బాగుపడేది లేదు. అని వదిలేసారు. సరిగ్గా ఈ దశలోనే విష్ణుదత్తుడి అద్భుత మహిమ గురించి వింది ఆలేత ఇల్లాలు. కన్న తండ్రిని తోడుతీసుకొని విష్ణు దత్తుని ఇంటికెళ్ళి వలవలా ఏడుస్తూ తన దుస్థితి అంతా చెప్పుకొని పతిభిక్ష పెట్టమని ప్రార్థించింది. విష్ణుదత్తుడు ఓదార్పు మాటలతో ధైర్యం చెప్పాడు. తన నిత్యాగ్ని హోత్రాన్ని శిష్యునికి అప్పగించి వారి వెంట కాలినడకన కుశావర్తానికి చేరుకొని పీడాతురుణ్ణి చూసాడు. ప్రాణాలు ఉగ్గబట్టి మూసిన కన్ను తెరవకుండా పడివున్నాడు. వెంటనే విష్ణుదత్తుడు ఆవూరి వాళ్ళందర్నీ సమావేశపరిచి మీ బంధువు ఈ పీడాతురుని పరిస్థితి ఇలావుంది. ఇప్పుడు ఏమి చెయ్యాలో దయజేసి ఆలోచించండి. అందరూ ఏమైనా చెప్పవలసింది ఉంటే నాకు తెలియజెయ్యండి అని సవినయంగా విజ్ఞప్తి చేసాడు.

విప్రోత్తమా! అన్నింటికీ నీవే ప్రమాణం. నీవు ఏది చెబితే అది. ఏది చేస్తే అది. మేమంతా ఇంతకాలమూ మా శక్తి మేరకు ఏవేవో యత్నాలు చేసాం. ఏదీ ఫలించలేదు. ఇప్పుడు నువ్వు ఏది ఆజ్ఞాపిస్తే అది చేస్తాం అని బ్రాహ్మణులంతా ఏక కంఠంతో పలికారు.

విప్రులారా ! మీరు భారమంతా నా మీద పెడుతున్నారు. నా మనసులోని మాట చెబుతున్నాను వినండి. దత్తస్వామి దయవల్ల నేను ఏదయినా చెయ్యగలను. కానీ చేసిన పని లోకానుగుణంగా వుండాలి. లోక విరుద్ధంగా చెయ్యడం సజ్జనపద్ధతి కాదు.

అందుచేత ఈరోగిని హఠాత్తుగా కాకుండా క్రమక్రమంగా ఆరోగ్యవంతుడ్ని చేస్తాను-అని ఒక్క నిమిషం ఆలోచించి మళ్ళీ ఇలా అన్నాడు. మీకు తెలియనిది కాదు. రోగాలు దుష్కర్మల ఫలాలుగా వస్తాయి. వాటిని గుర్తించి ప్రాయచ్ఛిత్తం చేసుకోవడమే సరి అయిన మందు. అసలు సిసలైన వైద్యం. అందుచేత ఇతడి కర్మవిపాకం గురించి ఆలోచించాలి. ప్రాయశ్చిత్తాలను ఇతడి భార్య ఆచరించవలసి వుంటుంది. బ్రహ్మ హత్యాపాతకం చేస్తే క్షయరోగం వస్తుందంటారు. దీనికి ప్రాయశ్చిత్తంగా పన్నెండు సంవత్సరాలవ్రతముంది. వాత గుల్మానికి ఆరేళ్ళ వ్రతం. హరి ద్రోహానికి ఫలంగా జలోదరం సంక్రమిస్తుంది. ఇది చాలా కఠినమైన రోగం దీనికీ పన్నెండేళ్ళ వ్రతమే ప్రాయశ్చిత్తం. ఇవి మూడూ ఇతన్ని పట్టి పీడిస్తున్న ప్రధానమైన రోగాలు. భగంధరం దీనికి మూడేళ్ళ వ్రతం ప్రాయశ్చిత్తం. ఈ వ్రతాలన్నింటినీ ఒకేసారి ప్రారంభించవచ్చు. సగంలోకి వచ్చేసరికి రోగాలు సగంతగ్గుతాయి. పూర్తిగా వ్రతాలు సమాప్తి అయ్యేసరికి రోగాలు నయమవుతాయి.

విష్ణుతత్తుడు చెప్పిన దానికి అందరూ అంగీకరించారు. సుమేధకు సహకరిస్తామని మాట ఇచ్చారు. ఆ ఇల్లాలు వెంటనే వ్రతాచరణ మొదలు పెట్టింది. ఆ రోజే గుణం కనబడింది. మూడేళ్ళు అయ్యేసరికి పూర్తిగా భగందరం తగ్గిపోయింది. ఆరేళ్ళ అయ్యేసరికి వాతగుల్మం అంతరించిపోయింది. పన్నెండు ఏళ్లకి క్షయ-జలోదరాలు పూర్తిగా

ఉపశమించాయి. పీడాతురుడు కోలుకున్నాడు. ముఖంలోకి తేజస్సు కనిపించింది. విష్ణుదత్తుడు అప్పుడప్పుడు ఏవో రసగుళికలు ఇస్తూ వుండేవాడు. వాటితో జీర్ణజ్వరమూ అతిసారమూ ఉపశమించాయి. అంతా కుదుటబడిందని వార్త అందగానే విష్ణుదత్తుడు బయలుదేరి వచ్చాడు. పీడాతురుడి హృదయం మీద తన చెయ్యి ఆన్చి ఆనాడు దత్తస్వామి తనకు ఉపదేశించిన మహామంత్రం జపించాడు. పీడాతురుడు సంపూర్ణ ఆయురారోగ్యాలతో లేచి కూర్చున్నాడు. వారింట ధన ధాన్య సమృద్ధి ఏర్పడింది. దంపతుల మనస్సులో హరి భక్తి కుదురుకొంది. వారి బలవంతం మీద విష్ణుదత్తుడు వారింట్లో మూడు రోజులు వున్నాడు. సాటి విప్రులతో గోష్ఠి కార్యక్రమాలతో హాయిగా గడిపాడు. ఆ దంపతులు ఇతడ్ని కన్న తండ్రిలా చూసుకున్నారు. ఇతడూ వారిపట్ల అలాంటి ప్రేమనే చూపించాడు. మూడురోజులూ మూడు క్షణాల్లా గడిచిపోయాయి. ఆ మర్నాటి ఉదయం నూతన వస్త్రాలతో పూలదండలతో విష్ణుదత్తుడ్ని పూజించి ఆ దంపతులు ఆశీస్సులందుకొని ప్రేమగా ఆర్ద్రంగా వీడ్కోలు పలికారు.

విష్ణుదత్తుడు సంతృప్తిగా ఇల్లు చేరుకున్నాడు. మళ్ళీ ఎప్పటి లాగానే తన దైనందిన జీవితాన్ని గడుపుతున్నాడు. ఇలాంటి మంచి పనులు ఇతడు ఇంకా చాలా చేసాడు. దత్తుడి అనుగ్రహం వల్ల ఇతడిలో అభిమానంగానీ అహంకారంగానీ ఏనాడూ ప్రవేశింపలేదు. మంత్రశక్తితో అద్భుతాలు చెయ్యగలిగినా అతడు అలా చెయ్యలేదు. తక్కిన శాస్త్రాల పట్ల విశ్వాసాన్ని పోగొట్టలేదు. లోకంలో స్థిరపడిన పద్ధతికి విరుద్ధంగా ప్రవర్తింపలేదు. శాస్త్రప్రకారం ప్రాయశ్చిత్తాలు చేసుకుంటే దుష్కర్మల ఫలితాలు అంతరిస్తాయనీ సత్కర్మాచరణమే అన్నింటికి ఉత్తమోత్తమమనీ లోకులు గుర్తించేట్లు చేసాడే తప్ప తన మహిమను చాటుకునే ప్రయత్నం ఏమాత్రమూ చేయలేదు.

దేవేంద్రా నేను రచించి శిష్యులకు బోధిస్తున్న ఈ ఆయుర్వేద మంత్రతంత్ర శాస్త్రాలు సంగీత నృత్యాదికళలూ -ఇవన్నీ పరంపరగా దైవభక్తిని ప్రోగు చేసేవేనని అవిద్యను నశింపజేసేవేననీ ఇప్పటికైనా అంగీకరిస్తావా? ఇవి భోగ పరాలుకావు. మోహకారకాలు కావు. ఇవి అర్థ సంపాదన పరాలు కావు. శత్రువులను చంపడానికో, అభిచారక్రియలు (చేతబడులు) చెయ్యడానికో వశీకరణాది క్షుద్రవిద్యలు సంపాదించడానికో నేను ఈ శాస్త్రాలు లోకానికి అందించడం లేదు. వీటి పరమ ప్రయోజనం అదికాదు.

విషయలోలురైన జనుల్నిమంచి మాటలతో మళ్ళించి తత్వనిష్ఠుల్ని చెయ్యడం ఒక్కటే శాస్త్రాల యొక్క చివర ఫలం. ఇలా క్రమంలో శుద్ధి పొందాక తత్వమసిలాంటి మహావాక్యాలను వారికి భోదిస్తే హృదయాల్లోకి ఎక్కుతాయి. వేదాంత భావన వారిలో స్థిరపడుతుంది. పీడాతురునికి ముందు రోగాలు నయంజేసి అటుపైన మంత్రోపదేశం చేసాడు విష్ణు దత్తయోగి. అందుకని అతడు కృతకృత్యుడు కాగలిగాడు. రోగాలు తగ్గనంత సేపూ ఎవరికీ ఏ వేదాంతమూ తలకెక్కదు. అందుచేత మూఢలోకానికి సద్గురువు అవసరం ఎంతైనావుంది. అతను క్రమక్రమంగా వారికి అంతశ్శుద్ధిని కలిగించి మహా వాక్యాలను ఉపదేశించి స్వస్వరూప పరిజ్ఞానంతో ఆనందోపలబ్ధిని ప్రసాదిస్తాడు. ఈ మార్గంలో క్షణంలో కృతకృత్యుడు కాగలుగుతాడు. ఇక్కడ మరో ఉదాహరణ చెబుతాను విను.

అనగ అనగా ఒక విప్రకాంత బిడ్డడికి జ్వరం వస్తే గృహవైద్యం చేస్తుంది. కషాయం పాత్రలో పోసి ఇచ్చి తాగ మంటుంది. బతిమాలుతుంది. బెదిరిస్తుంది. భయపెడుతుంది. ఆ బిడ్డడు త్రాగడం లేదు. ససేమిరా త్రాగనని అంటున్నాడు. కటికి చేదు కషాయాన్ని ఎలా త్రాగుతాడు? అది మందు అనీ త్రాగితే జ్వరం తగ్గుతుందనీ వాడికేమి

తెలుసు? చెబితే మాత్రం గ్రహించగల బుద్ధి వికాసం అతనికి లేదు. త్రాగను అంటే త్రాగను అంటున్నాడు. ఆ తల్లికి ఒక ఆలోచన వచ్చింది. లోపలికి వెళ్ళి ఇంత పటికబెల్లం పట్టుకొచ్చింది. కషాయం త్రాగు పటికబెల్లం పెడతానని అంది. ఆ బిడ్డడు వెంటనే త్రాగేశాడు. తల్లి ఆ తెచ్చిన పటిక బెల్లంలోనే పిసరంత పెట్టి పంపించింది. మళ్ళీ వచ్చి అడిగితే ఇంకొంచెం పెట్టింది. ఇలా కొంచెం కొంచెం పెట్టి ఆ బిడ్డడు ఆట పాటల్లో పడిపోయే సరికి పటిక బెల్లాన్ని మొత్తం దాచేసింది.

సురేశ్వరా ఈ శాస్త్రాలు ఈకళలూ కలకండ ముక్కల్లాంటివి తత్వోపదేశమనే కషాయాన్ని త్రాగడానికి అవి ఉపకరిస్తాయి. కైవల్యమే అసలుసిసలైన ఆరోగ్యం అదే చివరఫలం.

## కుండిలుడు - విశాలాక్షి గాధ

ఇంద్రా ఇంక ఆరవ ఉదాహరణ కూడా ఆలకించు. సహ్యాద్రి పర్వతానికి ఉత్తర దిక్కున ఒక గ్రామం ఉంది. ఆ వూళ్ళో కుండిలుడు అనే బ్రాహ్మణుడు వున్నాడు. అతని భార్య విశాలాక్షి. అప్సరసలను తలపించే సౌందర్యం. రూపానికి తగిన గుణాలు. సౌశీల్యానికి, అణుకువకు పెట్టింది పేరుగా కాపురానికి వచ్చిన దగ్గర నుండీ ఇరుగుపొరుగు వారితో అవును అనిపించుకుంటోంది. వివాహం అయ్యి ఐదేళ్ళు గడిచినా వారికి సంతానం లేదు. ఎన్నో నోములూ వ్రతాలు చేస్తున్నారు కానీ ఇంకా భగవంతుడు వారిని అనుగ్రహించలేదు. భార్యాభర్తలు ఇద్దరూ సుఖంగా అన్యోన్యంగా కాలం గడుపుతున్నారు. ఇలా వుండగా ఒకనాడు కుండిలుడు పొరుగూరు వెళ్ళవలసివచ్చింది. తప్పనిసరిగా వెళ్ళక తప్పలేదు. వెళ్ళడానికి అక్కడ వుండి పని చూసుకొని తిరిగి రావడానికి నెల్లాళ్ళు పడుతుందని అందాకా భార్యకు ఇంట్లో కావలసిన సరుకులు సిద్ధంచేసి ఇరుగుపొరుగు వారికి కాస్త జాగ్రత్తగా చూస్తుండమని చెప్పి విశాలాక్షికి ధైర్యం చెప్పి తానుదారిబత్తెం మూటగట్టుకొని ఉదయాన్నే చల్ల బాటువేళ బయలుదేరాడు.

ఆ ప్రాంతంలో ఝుంటిగుడు అనే మగ పిశాచం తిరుగుతుంది అనే ప్రతీతివుంది. వాడు పూర్వ జన్మలో బహు దుష్టుడు, దుర్భలుడు, దుర్జనుడు, కామాతురుడై అర్థాంతరంగా చచ్చాడు. పిశాచమయ్యాడు. ఎంతటి మంత్ర గాళ్ళకీ వీడు లొంగడం లేదు. అందగత్తె ఒంటరిగా కనబడితే చాలు మోసంచేసి గాని, బలాత్కారం చేసిగాని అనుభవిస్తున్నాడు. వాడు తనకున్న మాయాశక్తితో ఏ రూపం కావలిస్తే ఆ రూపం ధరిస్తున్నాడు. అందుచేత వీడు చేసే మోసాలు అంతా అయ్యాక గాని బయట పడటం లేదు. ఎందరెందరో గృహిణులు వీడు చేసిన మోసానికి లోపలే కుమిలిపోతున్నారు. కొందరి సంసారాలు అయితే కూలిపోయాయి కూడా. వీడు చాలా కాలంగా విశాలాక్షి మీద కన్నేసి వుంచాడు. ఒంటరిగా ఎప్పుడు దొరుకుతుందా అని కాపలావేసి కూర్చున్నాడు. అవకాశం వచ్చింది. చంకలు కొట్టుకొన్నాడు. అచ్చం ముమ్మూర్తులారూపం మార్చుకొని కుండిలుడిలా తయారయ్యి సాయంకాలం అయ్యేసరికి ఇంటికి వెళ్ళి తలుపుతట్టాడు. విశాలాక్షి తలుపుతీసి ఆశ్చర్యపోయింది. కాళ్ళు కడుక్కోటానికి నీళ్ళు అందించి నెలపడుతుంది అన్నారు ప్రొద్దున్నే కదా వెళ్ళారు సాయం కాలానికే తిరిగి వచ్చారు ఇదేమిటి? అంది. తాను ఎవరిని కలుసుకోడానికి బయలుదేరాడో అతడే దారిలో ఎదురయ్యాడని ఇప్పుడు కాదు నీ పని అవ్వాలంటే ఒక నెల తరువాత రమ్మన్నాడని అందుచేత అప్పుడు బయలు దేరి వెడతానని ఇప్పుడువెనక్కి వచ్చేసాను అనీ ఏదో కథ అల్లి చెప్పాడు మాయా కుండిలుడు. పాపం విశాలాక్షి నమ్మేసింది. అదృష్టం బాగుండి ఆయనెవరో దారిలో కలిసారు కనుక సరిపోయింది లేకపోతే రానూపోనూ

శ్రమ మిగిలేది పోనీలెండి. మంచిపనే జరిగింది. స్నానానికి లేవండి రెండు మెతుకులు తిని విశ్రాంతి తీసుకుందురుగాని ప్రొద్దుట నుండి నడిచినడిచి అలిసిపోయినట్లున్నారు అంటూ వంటింట్లోకి దారితీసింది.

ఆ రాత్రి మాయా కుండిలుడు విశాలాక్షిని తనివితీరా అనుభవించాడు. ఆవిడతట్టుకోలేక పోయింది వీడి బలం, భోగసామర్థ్యం. అతికామం ఇంకా వివిధ లక్షణాలు వికారాలు విశాలాక్షికి అనుమానం కలిగించాయి. తన భర్తకాదు అని మనసుకి తెలుస్తోంది. కానీ రూపం చూస్తే ముమ్మూర్తులా అదే. ఎవరికి చెబితే ఎవరునమ్ముతారు. తనలో తనే కుమిలిపోతూవుంది. వాడు మాత్రం రాత్రనక పగలనక కామంతో విజృంభిస్తున్నాడు. ఏ పని మీదా బయటకు కూడా వెళ్ళడం లేదు. విశాలాక్షిని వెళ్ళనివ్వడం లేదు. విశాలాక్షి అన్ని విధాలా నలిగిపోతూవుంది. రోజురోజుకీ ఆమె శరీరం కృంగి కృశించిపోతూవుంది. నెల అయ్యేసరికి ఎండు కట్టెలా తయారయ్యింది.

అదే రోజు సాయంకాలానికి కుండిలుడు తిరిగి వచ్చాడు. చిక్కి,శల్యమై గుమ్మంలో నిలబడ్డ విశాలాక్షిని గుర్తుపట్టలేకపోయాడు. విశాలాక్షి మాత్రం భర్తను గుర్తు పట్టింది. ఆమెకు ఒక్కపెట్టున దుఃఖం పొంగుకొచ్చింది. గుమ్మంలోనే కుప్ప కూలింది. కుండిలుడు త్వరత్వరగా సమీపించాడు అయ్యో అయ్యో అంటూ ఆవిడ్ని లేపడానికి ప్రయత్నం చేస్తున్నాడు. అతనికి ఏమి చెయ్యాలో పాలు పోవడం లేదు. అర్ఘ్యపాద్యాదులతో ఎదురువస్తుంది, స్వాగతం పలుకుతుంది అనుకున్న భార్య ఒక్క నెలలో ఇంతగా  కృశించి చిక్కి శల్యమై నన్ను చూస్తూనే కుప్ప కూలిపోవడమేమిటి? కాసిన్ని మంచి నీళ్ళు తెచ్చిచల్లుదాం తేరుకుంటుంది. అని లోపలికి వెళ్ళబోయాడు. ఇంతలో ఇంటిలో నుండి మాయా కుండిలుడు బయటకు వచ్చాడు. నువ్వెవరంటే నువ్వెవరు? నువ్వు మాయగాడివి అంటే నువ్వు మాయగాడివి నువ్వు మోసగాడివి అంటే నువ్వు మోసగాడివి అనుకున్నారు. ఇద్దరూ పరస్పరం వాగ్వివాదంతో అరుచుకుంటున్నారు. ఇరుగుపొరుగు జనం పోగయ్యారు. ఎవరునిజమైన కుండిలుడో గుర్తుపట్టలేకపోయారు. ఇంతలో విశాలాక్షికి స్పృహవచ్చింది. తలపట్టుకొని కూర్చుని ఏడుస్తుందే తప్ప తనూ గుర్తుపట్టలేకపోయింది. ఇద్దరూ ఒకే చోట ఉండే సరికి ఎవరు సత్యకుండిలుడో ఎవరు మాయా కుండిలుడో గుర్తు పట్టలేకపోయింది. తన సోదరులు తల్లితండ్రులూ ఇంకా బంధు వర్గమూ అందరినీ చుట్టు ప్రక్కల గ్రామాల నుండి రప్పించింది. అందరూ వచ్చిరి. ఏ ఒక్కరూ ఎవరు సత్యమైన కుండిలుడో పోల్చ లేకపోయారు. తేల్చలేకపోయారు.

ఇంతలో గుంపునుండి ఎవరో అన్నారు. ఇలాంటి ధర్మ సంకటాల్లో విష్ణుదత్తుణ్ణి శరణు వేడడమే తక్షణ కర్తవ్యం అనీ. ఆయనగారైతే క్షణంలో తేలుస్తారు ఈ జటిల సమస్యని అని - అందరూ అవునంటే అవును అనుకున్నారు. సత్యకుండిలుడు, మాయా కుండిలుడు కూడా ఒప్పు కున్నారు. పదండి అంటే పదండి అని అందరూ త్వరత్వరగా నడుచుకుంటూ విష్ణుదత్తుడి ఇంటికి చేరుకున్నారు. నమస్కరించారు. సమస్య ఏమిటో ఆయనకు వివరించారు. విశాలాక్షి మాత్రం భోరుభోరున విలపిస్తూ విష్ణుదత్తుని పాదాల మీద పడింది. విష్ణుదత్తుడు ఓదార్చి ఆమెకు ధైర్యం చెప్పాడు. ఇద్దరు కుండిలుల వైపుకి చూసాడు నిశితంగా. ఎవరు మాయగాడో తెలిసిపోయింది. అయితే దాన్ని జనం నమ్మేటట్లు ఆధారాలుతో నిరూపించాలి. నిర్ధారించాలి. మహిమచూపించి నిరూపిస్తే పిశాచ మాయకూ దీనికి జనం దృష్టిలో తేడా వుండదు. కాబట్టి మానుషమైన ఉపాయంతోనే ఈ చిక్కు సమస్యను విడదీయాలి. ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

మిత్రులారా వీళ్ళిద్దరూ శీలం, రూపం, వయస్సు, స్వరం, వర్ణం, ఆవృతి, నామం, గోత్రం, చేష్టలు, అన్నింటిలోనూ ఒక్కటిగా వున్నారు. వీరిలో ఎవరు సత్య కుండిలుడో మన ముందువున్న సమస్య. మీరందరూ అంగీకరిస్తే వీళ్ళిద్దరకూ కొన్ని పరీక్షలు పెడతాను. మీరంతా సాక్షులుగా ఉండండి. ఎవరు ఏమిటో ఇప్పుడే తేలుద్దాం - అన్నాడు. అందరూ అంగీకరించారు. వెంటనే ఇద్దరిఫాలభాగాల మీద గుర్తింపుకొరకు ఒకరినొసట "కా" అని ఇంకొకరి నొసట "గా" అని ముద్రలు వేయించాడు. ముందుగా "కా" వ్యక్తిని దగ్గరకు పిలిచి "గా" వ్యక్తిని దూరంగా పంపి మీ ఇంట్లోవున్న వస్త్రములు - ధనములు - ధాన్యములు - ఆభరణములు - వస్తువులు - అలాగే విశాలాక్షి వంటిపై నున్న పుట్టుమచ్చలూ, రోగాలు, రొష్టులూ, అలవాట్లూ అన్నీ జాబితాలాగా చెప్పమన్నాడు. వాడు చెబుతూవుంటే ఒక వ్యక్తి చేత రాయించి సాక్షులవద్ద భద్రంగా వుంచాడు. అలాగే "గా" వ్యక్తిని కూడా పిలిపించి అతడితోనూ అలాగే చెప్పించి జాబితా రాయించి భద్రపరిచాడు. ఆ తర్వాత విశాలాక్షిని పిలచి ఆమెతోనూ ఇంట్లో వున్న సామాగ్రి తన పుట్టుమచ్చలూ మగడి పుట్టుమచ్చలూ వగైరా అన్నీ రాయించి సాక్షులకు అందించాడు. మూడు జాబితాలను తాను క్షుణ్ణంగా పరిశీలించాడు. ఇక ఒక నిశ్చయానికి వచ్చాడు. కానీ ఏమీ చెప్పలేదు.

చిరునవ్వులు చిందిస్తూ ఇద్దరినీ ఒకే సారి దగ్గరకు పిలచి పంచక్రోశవిశాలమైన దివ్యక్షేత్రం ఇది. దీనికి ప్రదక్షిణ చేసి రావాలి. దారిలో ఎన్ని దేవాలయాలు వున్నాయో వాటిలో ఏ దేవతా మూర్తులు వున్నాయో ఆయా మూర్తుల లక్షణాలు ఏమిటో చెప్పాలి ఎవరు ముందు వచ్చి చెబితే వారు గెలిచినట్లు - అని ప్రకటించాడు. ఇద్దరూ వెంటనే బయలు దేరారు. "గా" వ్యక్తి మాత్రం అర్ధగంటలోనే తిరిగి వచ్చి అన్ని వివరాలు గడగడా చెప్పాడు. "కా" వ్యక్తి మాత్రం ఎప్పుడో మధ్యాహ్నానికి అలసిసొలసి తిరిగి వచ్చాడు. మెల్లగా అన్నీ చెప్పాడు. విష్ణుదత్తుడు ఇద్దరినీ సమానశ్రద్ధతో విన్నాడు. వారు చెప్పింది ఒక వ్యక్తితో అన్నీ రాయించారు.

ఇంకొక పరీక్ష పెట్టాడు విష్ణుదత్తుడు. ఈ సహ్యాద్రి పర్వతం మీద ప్రసిద్ధులైన సిద్ధ యోగులు కొందరు వున్నారు. వారిని దర్శించి నమస్కరించి వారి గోత్రనామాలు కనుక్కొని రండి ముందు వచ్చి చెప్పిన వాడు జయించినట్లు అన్నాడు. ఇద్దరూ పరుగు పరుగున బయలు దేరారు. క్షణకాలంలోనే తిరిగి వచ్చాడు "గా" వ్యక్తి సిద్ధయోగుల గోత్రనామాలన్నీ వరుసలో ఏకరువు పెట్టాడు. అది కూడా జాబితా రాయించి భద్రపరిచాడు. ప్రొద్దు గుంకింది. చీకట్లు కమ్ముకున్నాయి. తొలి జాము గడిచిపోయింది. అప్పటికి తిరిగి వచ్చాడు "కా" వ్యక్తి రొప్పుతూ రోజుతూ- పాపం పడ్తూ లేస్తూ వచ్చాడు. వస్తూనే విష్ణుదత్తుని పాదాల మీద బడ్డాడు - మహానుభావా నిజం చెబుతున్నాను కొండ అంతా తిరిగి తిరిగి వచ్చాను. ఎంతో పరీక్షగా చూసాను. నా కంటికి ఏ సిద్ధయోగీ కనిపించలేదు. ఇంక నమస్కరించడం ఏమిటి? గోత్రనామాలు అడగడం ఏమిటి? కాళ్ళీడ్చుకొంటూ ఎలాగో మీ దగ్గరకు చేరుకున్నాను. ఇంక భయంలేదు. కాసిన్ని మంచి నీళ్ళు ఇప్పించండి - అన్నాడు. అతడికి అవసరమైన ఉపచారములు చేయించి విష్ణుదత్తుడు ఈ సారి గంభీరంగా కూర్చున్నాడు. ఒక్క నిముషం కళ్ళు మూసుకొని తెరిచాడు.

ఇదే చివరి పరీక్ష నీ శక్తికీ యుక్తికీ ఇందులో నెగ్గడమే నెగ్గడం - అంటూ సన్న మూతివున్న సీసాలాంటి గాజు పాత్రను దాని మూతతీసి అందరి సమక్షంలో మధ్యలో వుంచాడు. ఇందులోకి తటాలున ప్రవేశించి చరాలున బయటకు రావాలి. ఇదే చివరి పరీక్ష ప్రయత్నించండి అన్నాడు. విష్ణుదత్తుని మాట ముగిసేలోగానే "గా" వ్యక్తి సూక్ష్మరూపం ధరించి గాజు సీసాలోకి ప్రవేశించాడు. విష్ణుదత్తుడు అప్పుడు మెరుపు వేగంతో బిరడాతో సీసా బిగించాడు. పిశాచం

ఇంక బయటకు రాకుండా మంత్రం వేసాడు. సాక్షులూ, ప్రేక్షకులూ అందరూ హర్ష ధ్వానాలు చేసారు. ఇన్నేళ్ళుగా పట్టిపీడిస్తున్న పిశాచం పీడ విరగడ అయ్యిందని అందరూ హాయిగా వూపిరి పీల్చుకున్నారు. ఆనందంతో కేరింతలు కొట్టారు. సత్య కుండిలుడూ విశాలాక్షీ పరస్పరం గాఢంగా కౌగలించుకున్నారు. విష్ణుదత్తుడికి సాష్టాంగ నమస్కారములు చేసి ఆశీస్సులు తీసికొన్నారు.

అక్కడున్న వారిలో ఒక వ్యక్తిలేచి మహానుభావా నువ్వు దివ్యశక్తి సంపన్నుడవని మాకు తెలుసు. కేవలం అలా చూసి సత్యాసత్యాలనుగ్రహించగలవు. మరి నాలుగు పరీక్షలు పెట్టా వేమిటి? దయచేసి నా సందేహం తీర్చు అని అభ్యర్ధించాడు.

అప్పుడు విష్ణుదత్తుడు ఇలా చెప్పాడు. మాన్యులారా. నేను సత్యమైన వ్యక్తిని గుర్తించడం కాదు. మీరు కూడా గుర్తించేటట్లు చేయాలి. విశాలాక్షి గుర్తించాలి. విశ్వసించాలి. ఇవి జరగాలి అంటే పరీక్షలు తప్పదు. అందుకే నేను మూడు పరీక్షలు పెట్టాను. ఇంట్లో వస్తువులు చెప్పమంటే యజమాని కైనా తడబాటువుంటుంది. ఉన్న వాటిలో కొన్నింటిని మరచిపోవచ్చు- కానీ లేని వాటిని మాత్రం చెప్పలేడు. దొంగ వ్యక్తి అయితే ఊహించి చెబుతాడు కనుక ఉన్నవీ లేనివీ చెప్తాడు. ఇక ఇల్లాలు చెప్పే జాబితాలో దాన్ని పోలిస్తే అసలురంగు తెలుస్తుంది. ఈ పరీక్షలో మనం ఖచ్చితం అయిన నిర్ధారణ చెయ్యకపోయినా యజమాని ఆచూకీ తెలుసుకోవచ్చు.

ఇక రెండవ పరీక్షలో క్షేత్రాన్ని అర్ధగంటలో అలుపూ సొలుపూ లేకుండా తిరిగివచ్చిన వ్యక్తి దేవత అయినా దయ్యం అయినా అవ్వాలి తప్ప మానవుడు కాడు. కాబట్టి దీనితో దొంగ ఎవరో నిశ్చయం అయ్యింది. ఇంకా ఎవరికైనా ఏమైనా సంశయాలువుంటే వాటిని తొలగించడానికి మూడో పరీక్ష ఎందుకంటే ఇది సంసారాలకు సంబంధించిన విషయం కనుక అన్ని విధాలా నిర్ధారించుకున్నాకే ఒక నిర్ణయానికి రావాలి. లేకపోతే భార్యాభర్తల్ని విడదీసిన పాపము, అక్రమ సంబంధాన్ని అంగీకరించిన పాపము చుట్టుకుంటాయి. అందువలన మూడో పరీక్ష కూడా పెట్టి సంశయం తీర్చుకున్నాం. సిద్ధయోగులు వారంతట వారు అనుగ్రహిస్తే తప్ప ఎవరికీ కనిపించరు. అలాంటిది - అందరిని చూసి వచ్చానని గోత్రనామాలు గబగబా చెప్పినవాడు. అలవాటుపడిన అసత్యవాది అన్నమాట. మాయలూ మోసాలు చెయ్యగల ఘటికుడన్నమాట. పిశాచం ఎవడో ఇప్పుడు నిశ్చయంగా తెలిసింది కదా! దీన్ని బహిరంగంగా చెప్తే వాడు పారిపోవచ్చు లేదా తిరగబడవచ్చు లేదా ఇంకేదైనా చేయవచ్చు. నేనే గెలుస్తున్నాను అనే భ్రమలో వాడు వున్నాడు కనుక అదే వూపులో వాడిని బంధించాలి. నిజానికి బంధనమే నాలుగో పరీక్ష మనం పెట్టినవి మూడు పరీక్షలే.

ఒక అజ్ఞానికి కొద్ది కొద్దిగా శాస్త్ర విషయాలు నేర్పుతూ క్రమక్రమంగా అజ్ఞానం తొలగించి, వికాసం కలిగించి, అవిద్యను సమూలంగా పోగొట్టి - వేదాంత విషయాన్ని అతడిలో ప్రకాశింపజేసినట్లుగా మొత్తం ఈ ప్రక్రియ అంతా నడిపించాను. ఇది నీతిజ్ఞులు చెప్పిన మార్గం దీన్ని అనుసరించి మీ అనుమానాలు తొలగించి తుది నిర్ణయం మీకే తెలిసేటట్లు చేసాను అన్నాడు.

అందరూ సంబరపడ్డారు. విష్ణుదత్తుడుకి యథోచితంగా నమస్కరించి ధన్యవాదాలు చెప్పి సెలవు తీసికొన్నారు. అమరేంద్రా విష్ణు దత్తుడు చేసిన మరొక నిర్ణయం చెబుతాను. ఇది ఏడవ ఉదాహరణ. శ్రద్ధగా ఆలకించు. నీ సందేహాలు పూర్తిగా తొలగిపోతాయి- అంటూ బృహస్పతి ఇంకా ఇలా చెప్తున్నాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

# ఆత్మ జ్ఞానం

ప్రతిష్ఠానపురంలో ఒక బ్రాహ్మణుడు వున్నాడు. అతడు జ్ఞానవిజ్ఞానపారంగతుడు. ఆయనకు లేక లేక ఒక మగ బిడ్డ జన్మించాడు. ఆ బిడ్డడు పుట్టినప్పటి నుండీ ఏ చైతన్యమూ లేకుండా ఒక జడ పదార్థంలాగా వుంటున్నాడు. శారీరక ఎదుగుదలవుంది కానీ మానసిక చైతన్యం కనిపించడం లేదు. వీధిలోకి రాడు. ఎవరితోనూ కలవడు. ఆటపాటలు లేవు. పెడితే తింటాడు. పెట్టకపోతే పస్తుంటాడు. ఇది తినవచ్చు ఇది తినకూడదు. ఇంత తినవచ్చు ఇంత తినకూడదు అనే విచక్షణా జ్ఞానం లేదు. మలమూత్రాలకు తేడా లేదు. నిలబడివుంటే నిలబడ్డచోట కూర్చుంటే కూర్చున్న చోటే పడుకుంటె పడుకున్న చోటే అన్నీను. ఏదో పిశాచం పట్టిన వాడిలా ఎప్పుడూ ఏకాంతాన్నే కోరుకుంటూ ఎవరితో కలవాలన్నా, పలకాలన్నా, భయపడుతూ, చదువు సంధ్యలూ లేకుండా ఇంటిలోనే పడివున్న కొడుకును చూసి ఆదంపతులు ఎంతో కుమిలిపోతూవుండేవారు. దానధర్మాలు, తీర్థయాత్రలు, నోములూ, జపాలూ, వ్రతాలు, గ్రహశాంతులూ అన్ని అయ్యాయి. అన్నిరకాల వైద్యాలు అయ్యాయి. సొమ్ము కరిగిపోయింది కాని కుర్రవానిలో మాత్రం మార్పులేదు. విష్ణుదత్తుడి మహిమ గురించి విని ఆదంపతులు బిడ్డను తీసుకొచ్చారు. చూపించి పరిస్థితి వివరించారు. మహానుభావా మాకు ఒక్కగానొక్క కొడుకు దయచేసి వీడ్ని మామూలు మనిషిని చెయ్యి - అని పాదాల మీద పడి ప్రార్థించారు.

విష్ణుదత్తుడు ఆ బిడ్డడి వైపు నిశితంగా చూసాడు. విషయం అర్థమయ్యింది. అతడిని తన దగ్గర వుంచుకొని తల్లిదండ్రుల్ని భోజనం చెయ్యమని చెప్పి లోపలకు పంపించాడు. వాళ్ళు అలావెళ్ళగానే ఆ బిడ్డడుతో విష్ణుదత్తుడు ఇలా సంభాషించాడు.

బ్రహ్మన్ తమరెవరు? ఎందుకు ఇక్కడికి వచ్చారు? పని ఏమిటి? ఏమి చేస్తున్నారు? హాయిగా మీ ఇంటికి మీరు వెళ్ళండి. సుఖాలు అనుభవించండి. సుఖంగా భుజించండి. ఇప్పుడు నన్ను ఏమిచెయ్యమంటారో చెప్పండి. ఈ జడ్డి తనాన్ని వదిలెయ్యండి. అని విష్ణుదత్త యోగి అనేసరికి ఆ శిశుయోగి పెదవి విప్పి ఇలా పలికాడు.

యోగిన్ ఏమిచెయ్యను? ఎక్కడికి వెళ్ళను? ఏది స్వీకరించను? ఏది పరిత్యజించను? కల్పాంతంలో నీటితో నిండిపోయినట్లు ఈ విశ్వం ఆత్మ పదార్థంలో నిండిపోయింది అంతా నేనే. నేను సదానందమయుడ్ని. సోహమ్. నాకింక భోక్తవ్య మేమిటి? పరిత్యాజ్యమేమిటి? అన్నమూ నేనే మంత్రమూ నేనే మరొకటి నేనే అన్నీ నేనే . అంతా నేనే.

శిశుయోగి మాటలకు విష్ణుదత్తుడు చాలా సంబరపడ్డాడు. మృదువుగా కౌగిలించుకున్నాడు. నాయనా నిజమే. అంతా నువ్వే అన్నీ నువ్వే. విశ్వమంతా ఆత్మ పదార్థమే. అలాంటప్పుడు కర్మను ఆచరించకపోవడం ఎంతటిదో ఆచరించడం అంతటిదే కదా! ఆచరించినందువల్ల నీకు ఏ దోషం చుట్టుకుంటుందో చెప్పు నిష్కామకర్మాచరణంతో జీవన్ముక్తుడవై సుఖంగా జీవించు. కర్మాచరణం నువ్వు చెయ్యి ఎదుటి వారికి నేర్పు. ఆదర్శప్రాయంగా నిలబడు. లోకంకోసం కొన్ని పనులు మనం చెయ్యాలి. ఇందువల్ల కర్మానుబంధం చుట్టుకోదా అని నువ్వు అడగవచ్చు. చుట్టుకోదు. ఎందుకంటే - ఏ బంధమైనా దేహాభి మానంవల్ల పుడుతుంది. దాన్ని వదలడమే కదా ముక్తి అంటే. **నేను నాది అనేవి బంధ కారణాలు. నేను కాను - నాది కాదు అనేవి ముక్తి కారకాలు.**

శిశు యోగీశ్వరా! స్వస్వరూపం తెలుసుకో ఇక్కడ నీకు కర్మాను బంధం లేదు. మాన - అవమానాలవల్ల కలిగే గుణదోషాలు కూడా అభిమానం వల్లనే. కనుక దేహాభిమానం వదిలేస్తే గుణమూ లేదు దోషమూలేదు. బంధమూ లేదు. ఈ అభిమానాన్ని వదలలేక కర్తృత్వాన్ని తన మీదనే వేసుకునే అహంకారికి విషయ వాసనలు సుఖ దుఃఖాదిక్రియలు తప్పవు. నిరభిమానికి ఇవి ఏవీ అంటవు. అందుచేత ఆ అహంకారాన్ని ఆదేహాభిమానాన్ని ఒక్కదాన్ని విడిచిపెట్ట గలిగి కర్మ మార్గంలో ప్రయాణం చేసినా - ఒకవేళ అతడు మూఢుడే అయినా కర్మపాశబద్ధుడుకాదంటే ఇక నీబోటి పండితుడి సంగతి చెప్పాలా?

**బంధమోక్షాలు రెండింటికీ మనస్సే కారణం. అది విషయాసంగి అయితే బంధహేతువు. అదే నిర్విషయమైతే ముక్తి హేతువు.** పరపురుషుడ్ని మరిగిన వనిత ఇంటి పనుల్లో తలవుంచి ఉన్నప్పుడు కూడా అంతరంగంలో అలనాటి సంగమ రసానుభూతిని నెమరువేస్తూ జీవిస్తుందో అలాగే ధీరుడైన జ్ఞాని బహిర్ వ్యవహారాలను నిర్వహిస్తూ కూడా అంతరంగంలో శుద్ధ పరతత్వాను భూతిని పొందుతూ వుంటాడు.

బాలయోగీ! మోక్షమనేది ఎక్కడో ఆకాశం మీదనో పాతాళంలోనో భూగోళం మీదనో లేదు. మన లోనే వుంది. అహంకార రూపమైన విమోహం నశించడమే మోక్షం అంటే. ఇదేమంత కష్టంకాదు. పువ్వులు కోయడం కన్నా కన్నులు మూసుకోవడం కన్నా అహంకార పరిత్యాగం తేలిక అయిన పని. ఇందులో ఏ కొంచెం కష్టం కూడా లేదు. ఎందుకంటే ఇది మనస్సు పని కనుక. ఈ మనస్సుకు వున్న చాంచల్యం అన్నింటికీ మూలం. ఇదే ప్రపంచాకారంగా (పెద్దదిగా) అనిపిస్తుంది. విషయసుఖాల వెంట పరుగులు తీస్తుంది. వాటిని తెగ మెచ్చుకుంటుంది. అవసరమైన ద్రవ్యాదులను యాచిస్తుంది. అనిశ్చయంతో భ్రాంతిగా వుంటుంది. తానే మూఢంగా తయారవుతుంది. తాను కల్పించుకున్న ప్రపంచంలో తానే మునిగిపోతుంది. అపరత్వాన్ని పొందుతుంది. ఇవన్నీ దానికి స్వభావమైన చంచలశక్తి వల్ల సంభవిస్తున్న చాంచల్యాలు. కాబట్టి బుద్ధిమంతుడా, ఈ మనస్సు తత్వాన్ని గుర్తిస్తే అహంకార పరిత్యాగం ఏ మంతకష్టం కాదు. అందచేత నీవు కూడా ఈ జడత్వాన్ని విడిచిపెట్టు నిరహంకారంగా, నిర్మమంగా కర్మాచరణం చెయ్యి నువ్వు నాకు ఇష్టుడవయ్యావు. తల్లితండ్రుల్ని సంతోషపరచాలి అనే సంగతి ఆలోచించు. కొంతకాలం వాళ్ళకి ప్రీతికరంగా జీవించు. వాళ్ళు వెళ్ళిపోయాక నీ యిష్టం. అప్పుడు యధేచ్ఛగా సంచరించవచ్చు. అప్పుడు నిన్నెవరూ నిర్బంధింపరు.

విష్ణుదత్తుని ఉపదేశాన్ని శిశుయోగి అంగీకరించాడు. ఆ క్షణం నుండే నిత్యనై మిత్తిక కర్మలు ఆచరించడం మొదలు పెట్టాడు. స్నానసంధ్యలు ముగించివచ్చాడు. పతివ్రతా శిరోమణి సుశీలమ్మ వడ్డించిన రుచికరమైన ఆహారాన్ని మెచ్చుకుంటూ మితంగా ఆరగించాడు. దానితో అతడిలో దాగిన భయాలు అన్నీ అంతరించాయి. నిస్సంగంగా వుండవచ్చనీ వుండగలననీ ధైర్యం తెచ్చుకున్నాడు. భోజనం ముగించివచ్చిన తల్లితండ్రులు తమ బిడ్డలో వచ్చినమార్పుని చూసి బ్రహ్మానందపడ్డారు. సుశీలావిష్ణుదత్తులకు కృతజ్ఞతగా సాగిలపడి మ్రొక్కారు.

ఏం మంత్రం వేశావో ఏం వైద్యం చేసావో కృపానిధీ క్షణంలో మా వాడికి కొత్త జీవితం ప్రసాదించావు. నీ మేలు జన్మ జన్మలకీ మరచిపోమంటూ బిడ్డను తీసికొని ఆదంపతులు సంతోషంగా వెళ్ళిపోయారు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ఆ శిశుయోగి తల్లిదండ్రులు వున్నంత కాలం వారికి ప్రీతికరంగా మెలిగి ఆ పైన బంధ విముక్తుడై వూరు, ఇల్లూ, వాకిలీ అన్నింటినీ విడచి ఆత్మరతుడై ఈ భూగోళం మీదకి ఎక్కడికో వెళ్లిపోయాడు.

ఇంద్రా విన్నావుగదా కథ. ఈ శిశుయోగి జ్ఞాన సుధా సముద్రుడే కాని రవ్వంత సంగభయం ఉంది. విష్ణుదత్తుడు రవ్వంత ప్రభోధం చేసేసరికి ఆ భయాన్ని వదలిపెట్టాడు.

ఇతడిలాగే లోకులు అందరూ లోపలున్న ప్రజ్ఞాఘనుడైన పరమాత్మను నిత్యమూ అనుభవిస్తూ వున్నా మోహావృతులవుతున్నారు. నేనే కర్తను, నేనే దాతను, నేనే వికర్తను, సుఖదుఃఖాలకు నేనే భోక్తను అని భావిస్తూ మూఢులై భ్రాంతులై లోపలున్న పరమాత్మను తెలుసుకో లేక పోతున్నారు. ప్రత్యక్షంగా పరమాత్మానుభూతి పొందుతూ కూడా లోపలికి దృష్టి నిలపలేక నెనెవణ్ని? ఎక్కడ ఎలా నాకు ఆత్మ జ్ఞానం లభిస్తుంది? అని అంగలారుస్తూ వృధాగా వెలుపలకు పరుగులు తీస్తున్నారు. పిల్లాడిని చంకలో పెట్టుకొని వూరంతా గాలించి ఏడుపు లంకించుకుంటున్న తల్లిలాగా ఆత్మతత్వం కోసం విలపిస్తోంది ఈ లోకం అంతా.

దేవతా విభూ! ఇంద్రా! ఇలా శాస్త్రాలన్నీ తేలికగా సుఖంగా బోధలు చేస్తూ క్రమంగా మోహాన్ని తొలగించడంలో ఉపయోగపడుతున్నాయి. ఇందులో నేను చేసిన అపూర్వ సృష్టిగాని కల్పనకానీ అణుమాత్రం కూడా లేదు. నువ్వు నీ సొంత బుద్ధితో ఆలోచించి ఇది నిజమో కాదో, మంచి అవునో కాదో తేల్చి చెప్పు.

బృహస్పతి ఇలా ఏడు ఉదాహరణలు చెప్పాడని కార్త వీర్యార్జునునికి దత్తాత్రేయుడు వివరించాడు. అంతా విన్న కార్త వీర్యుడుకి చివరి అంశం సందేహం మిగిలిపోయింది. ఏడు కథలూ విన్నాక దేవేంద్రుడు ఏమన్నాడు? విభిన్న మార్గాలలో నడిచే శాస్త్రాల ఏకత్వం అంగీకరించాడా లేదా? ఇవే సందేహాలు దత్తస్వామి ముందు వుంచాడు. బృహస్పతికి ఇంద్రుడు చెప్పిన సమాధానాన్ని యధాతధంగా దత్తదేవుడు ఇలా వినిపించాడు.

కార్తవీర్యార్జునా బృహస్పతి ప్రశ్నకు ఇంద్రుడు ఏమన్నాడంటే -ముందుగా అభిమానం విడిచిపెట్టి సాష్టాంగ నమస్కారం చేసాడు. ఆపై ఇలా పలికాడు. గురూత్తమా శరణుశరణు. నా అజ్ఞానాన్ని క్షమించండి. తెలియక చులకనగా మాట్లాడాను. సంగీత, నృత్య,వైద్య, తంత్రాది, సకల శాస్త్రాలు ప్రధానంగానో లేదా పరంపరగానో మూల అవిద్యా నివారకాలనీ పరమాత్మ తత్వప్రకాశకాలనీ మోహకారకాలు కాదనీ స్పష్టంగా తెలిసింది. మీరు చెప్పిన ఏడు కథలూ ఈ విషయాన్ని రూఢి చేస్తున్నాయి. మీరు చెప్పిన పుణ్యప్రదమైన ఈ ఇతిహాసాల్ని సమాహిత చిత్తంతో అవగాహన చేసుకున్నవారు అవిద్య కారణంగా జన్మించే మోహాన్ని విదిల్చుకొని కర్మ బంధం నుండి విముక్తులు కాగలుగుతారు - అని గురువైన బృహస్పతికి మరోసారి సాష్టాంగ నమస్కారం చేసి శచీ వల్లభుడు (ఇంద్రుడు) సెలవు తీసికొన్నాడు.

దత్తస్వామి ఇంత వరకూ చెప్పి-కార్త వీర్యార్జునా నీ సందేహాలన్నీ తొలగిపోయాయి గదా! శాస్త్రాలకు గల వైరుధ్యము అనేది పైపై చూపులకు కనిపించే అభాసమే తప్ప ఆత్మ దృష్టిలో అన్ని శాస్త్రాలు పరతత్వ ప్రతిపాదకములే. అందుచేత వృధా వాదోపవాదాలతో అహంకరించి కాలయాపన చెయ్యడం కన్నా ఏదో ఒక శాస్త్రాన్ని - ఒక దారినీ - పట్టుకుని దాన్నే నమ్ముకుని ముందుకు సాగితే అవిద్య అంతరిస్తుంది. తత్వజ్ఞానం కలుగుతుంది. గ్రహించావా? - అన్నారు.

దేవదేవా - జగన్నాథా-సర్వ సందేహభేదకా-నా సందేహాలన్నీ తొలగిపోయాయి. శాస్త్ర ప్రతిపాదిత విషయాలలో వైరుద్ధ్యం అనేది ఇపుడు అసలు ఎక్కడా కన్పించడంలేదు. వైరుద్ధ్యంవుందని కూడా అనిపించడం లేదు. అవి క్షుద్ర శాస్త్రాలైనా సరే శుద్ధ శాస్త్రాలైనా సరే అన్నీ ఒకే అర్థాన్ని ఒకే పరమార్థాన్ని ఒకే పరమాత్మతత్వాన్ని భోదిస్తున్నాయి.

దత్తయోగీంద్రా నీ ప్రభావం వల్ల - ఇపుడు నా మనస్సు ఆత్మ బోధనలో వెంటనే సులువుగా ప్రవేశించాలని తహతహలాడుతోంది. నీ సహాయం అడుగుతున్నాను. బ్రహ్మనిష్టన్నీ - అఖిలాతీతుడ్ని-లౌకిక వ్యవహారముల నుండి విముక్తుడ్నీ - అయి ఈ శరీరం వున్నంతకాలం సుఖంగా కాలంగడిపే విధానం ఏమిటో దాన్ని నాకు బోధించి శాసించి నేర్పు- అని కార్తవీర్యార్జునుడు మరో మారు దత్తయోగి పాదాలపై బడ్డాడు.

ఇంత వరకు చెప్పిన వేదధర్ముడు కొంత సమయం ఆగాడు. అపుడు దీపకుడు గురుదేవా-వేదధర్మ స్వరూపా - సార్థక నామధేయా-నీ దయవల్ల అతి పురాతనమైన ఇతి హాసాన్ని హృదయానందదాయకమైన దత్త స్వామి మహత్మ్యాన్ని వినగలిగాను. తత్వనిశ్చయమైన ఈ ఇతిహాసం చాలా విచిత్రంగా వుంది. ఆకర్షణీయంగా కూడ వుంది. దీన్ని వింటే సాధారణమానవుడు సైతం అతి కష్టమైన పరతత్వాన్ని మెల్లమెల్లగా తెలుసుకోగలుగుతాడు. తప్పులుగా, మహాపాపాలుగా, దోషాలుగా కొందరిలో చెప్పబడుతున్న వాత్సాయన కామ సూత్రాదిశాస్త్రాలు కూడా చివరకు బ్రహ్మతత్వంలోనే లయమవుతున్నాయి-అని ఇప్పటికి తెలుసుకోగలిగాను.

కార్తవీర్యార్జునునికి దత్తయోగీంద్రుడు చేసిన తత్వబోధను కూడా దయచేసి సవిస్తరంగా తెలియజెయ్యండి. ఆలకించి ధన్యుణ్ని అవుతాను - అని దీపకుడు సవినయంగా ప్రార్థించాడు. వేదధర్ముడు సరేనని ప్రారంభించాడు.

## దత్తస్వామి కార్తవీర్యార్జునుకి చేసిన బోధ

సాష్టాంగ నమస్కారంచేసి తనకు చేరువలో నిలబడ్డ కార్తవీర్యార్జునుణ్ని తనకు దగ్గరగా కూర్చోపెట్టుకొని దత్తస్వామి చిరునవ్వులు చిందిస్తూ అతనివైపు ఒకసారి చూసి ఇలా అన్నాడు. వత్సా కార్తవీర్యా! ఇంతకు ముందు నువ్వు ధర్మార్థకామాల స్వరూపాల గురించి అడిగావు వాటిని నీకు అనుగ్రహించాను. ఇప్పుడు తురీయమైన పురాషార్థ మోక్షం గురించి అడుగుతున్నావు. భక్త పరాధీనుణ్ని కనుక అదీ అనుగ్రహిస్తున్నాను. ఆకలిగా వున్నప్పుడే అన్నము, దాహముగా వున్నప్పుడే నీళ్ళూ, రోగం వచ్చినప్పుడు మందు, బంధనంలో వున్నప్పుడే విమోచనం, నిద్ర వస్తున్నప్పుడే శయనము, ఇలా ఏది అవసరమైనప్పుడు ఏది కోరినపుడు దానిని ఇవ్వాలి. అవసరం లేనప్పుడు ఇవ్వడం గాని ఒకటి ఇవ్వవలసిన సమయంలో ఇంకొకటి ఇవ్వడంగానీ కోరనిది ఇవ్వడం గానీ జరిగితే వ్యర్థమవుతాయి.

యోగసిద్ధి రకరకాలుగా వుంటుంది. పరిచిత్తజ్ఞత - మనోజవం - ఆకాశగమనం - ఇలా చాలా రకాల సిద్ధులు వున్నాయి. కానీ ఇవన్నీ నశ్వరాలు. శాశ్వత సిద్ధులు కావు. సత్యమూ, నిత్యమూ అవిక్రియమూ అయిన సిద్ధిని నీకు అనుగ్రహిస్తున్నాను. అనుభవంలోకి తెస్తున్నాను. అక్షయమూ, అవ్యయమూ అయిన ఉత్తమోత్తమ తత్వాన్ని నా నిజ స్వరూపాన్ని నీకు బోధిస్తున్నాను. దీనితో నీవు ముక్తిని పొందుతావు. నాయనా నిజానికి బద్ధుడు, ముక్తుడూ అనే పదాలు నిరర్థకాలు. రెండు ఎక్కడున్నాయి. ఉన్నదల్లా ఒక్కటే వస్తువు. దాన్ని చెబుతాను తెలుసుకో. ఆ ఏకైక వస్తువు నామరూపదేశకాల వివర్జితం. నిర్విశేషం. అసామాన్యం. అనిర్వాచ్యం. అకారణం. అలక్ష్యం. లక్షణాతీతం. అచింత్యం.

అనికేతనం. దీనికి నామ రూపాది కల్పనచేసి ఒక అజ్ఞానంతో (భ్రమతో) శాస్త్రం తయారు చేసి ఆయావ్యక్తుల ఆత్మ లబ్ధికోసం ఆయా వ్యక్తులు బోధిస్తుంటారు. ఇందంతా కేవలం భ్రమ, మోహం, అజ్ఞానమే తప్ప అసలు వస్తువు (బ్రహ్మతత్వం)కి నామ రూపాలు లేవు. కానీ వాటిని కల్పించకపోతే ఉపదేశించడం సాధ్యం కాదు. ఉపదేశం లేకపోతే జ్ఞాన సిద్ధిలేదు. అజ్ఞానమే అవిద్య. అదే భ్రమ. అదే మోహం. దీనికే రూపంలేదు. అనాది అని దీన్ని బుధులు పలకడం బాల బుద్ధి విశుద్ధి కోసమే. నిజానికి **1.** జీవుడు **2.** బ్రహ్మ **3.** విశుద్ధ చిత్తు **4.** జీవేశభేదం **5.** అవిద్య **6.** అవిద్యా - చిత్సం యోగం అనేవి ఆరూ అనాదులు.

జగజ్జీవేశ్వర కల్పన అంతా అజ్ఞాన కల్పితమే. అవిద్యే అన్నది లేనప్పుడు ఇక జీవేశ్వర భేదం ఎక్కడుంది? బేధమే లేనప్పుడు ఇంక పరమాత్మకు దేనితో యోగం? అయితే నామ రూప కల్పన లేకుండా నిర్గుణ పరబ్రహ్మను తెలియజెప్పడం అసంభవం కనుక ఆ సౌకర్యం కోసం చేసిన కల్పన ఇదంతా. నిజానికి బ్రహ్మతత్వం అనేది సత్యం. ఈ తత్వానికే ఆత్మేశ్వరుడు, పరమాత్ముడూ వేద్యుడూ, విష్ణువు, సదాశివుడు, చతుర్ముఖుడు, శివుడూ, అగ్ని, ఇంద్రుడు, పరముడూ, స్వరాట్టు, విరాట్టు, అక్షరుడు, ప్రాణము, ఈశానుడు, సవిత విభువు, నారాయణుడు, హృషీకేశుడు, దేవుడు, పశుపతి, మహత్తు, మహాభూతం, మహాద్యక్షుడూ, సోముడూ, భగవంతుడు, మనువు, శంభుడు, శర్వుడు, కవి, దక్షుడు, ప్రజాపతి, ప్రభువు, హరి, దాత, విధాత, గురువు, గమ్యుడు, త్రిపాత్తు, యముడు, కాలం, ఆగమకర్త, ఈడ్యుడు, జీవనం, మృత్యువు, ఆమయం, యజ్ఞం, ఇజ్య, యజుస్సు, ధర్మం, నిధానం, బీజం, అవ్యయం - ఇలా ఎన్ని నామ రూపాలని చెప్పను? మహామతీ ఈ జగత్రయంలో కనబడేదీ, వినబడేదీ, ఆలోచింపబడేదీ, జన్మించేదీ, అంతా వస్తు మాత్రమేనని (పరబ్రహ్మమేనని) తెలుసుకో. అర్జునా, యోగనిష్టలో కూర్చుని ఎవరిని ధ్యానిస్తుంటావు నువ్వు సమస్తమూ నీవే కదా? అని నన్ను అడిగావు గుర్తున్నదా? ఇదిగో ఈ ఆత్మ స్వరూపాన్నే అహర్నిశలూ ధ్యానిస్తుంటాను. బాలబోధ కోసం భ్రమకు కూడా బుద్ధిమంతులు శాస్త్రాలలో నామాలు కల్పించారు. వాటిని చెబుతాను - ఆలకించు. మాయ - అవిద్య - పర - దేవి - మనస్సు - అనాది - భ్రమ - త్రివిత్తు - ప్రధానం- ప్రకృతి - బ్రహ్మయోని - అవ్యయం - విభ్రమం - శక్తి - కారణం - అజ్ఞానం - అధ్యాస - మోహం - ప్రస్వాపం - తపస్సు - ఇవికారణా విద్య నామధేయాలు. మోహం - మహామోహం - తామిశ్రం - అంధ తామిశ్రం - అనేవి అవిద్య తాలూకు పంచపర్వాలు. ఈ అవిద్యను తొలగించే ఉపాయం జ్ఞానమూ లేక విద్య అని బుధులు చెబుతున్నారే అవి కార్యాత్మక మోహానికి నామాలు. **మూలాజ్ఞానానికి రెండు శక్తులు చెబుతారు. విక్షేపము, ఆవరణము అని. అవిభాగమైన పరమానందంలో విభాగాన కల్పన చేసే శక్తికి విక్షేపము అని పేరు. లేని కర్తృత్వ భోక్తృత్వాదులను ఇది కల్పిస్తుంది. ఈశ్వరుణ్ని ఆవరించి తెలియకుండా చేసేది ఆవరణ శక్తి.**

**జీవేశ్వరులకు బేధం ఏమిటి అన్నావుగదా విను. ఒక్క ముక్కలో చెబుతాను. మాయను లోబరుచుకున్నవాడు ఈశ్వరుడు. మాయకు లోబడినవాడు జీవుడు.** వీరిలో స్వావిర్భూతచిదానందుడు- ఈశ్వరుడు. స్వావిర్భూత దుఃఖభాజనుడు జీవుడు. హ్లాదినియైన సంవిత్తులో (జ్ఞానం) కూడి ఈశ్వరుడు సచ్చిదానందుడిగా వుంటాడు. అవిద్యాసంవృతుడై జీవుడు దుఃఖభాజనుడవుతున్నాడు.

**పరబ్రహ్మమే మాయచేత జగత్తుగా, జీవుడుగా, ఈశ్వరుడుగా భాసిస్తున్నాడు. ఆ మాయను పోగొట్టడం కోసం వేదం సృష్టి ప్రళయకల్పన చేసింది. మూఢులు దాన్నే సత్యమని అనుకుంటున్నారు. వీరి జ్ఞానాన్ని, మూఢత్వాన్ని తొలగించే**

**విధానం ఏమిటో - విను - ఆత్మ పదార్థం ఒక్కటే - అదే నానారూపాలతో జగత్తుగా మోహితుడికి కనబడుతోంది. జ్ఞానికి అలా కనబడదు. నిద్రలో స్వప్నం వస్తుంది. అలాంటిదే ఈ జగద్దర్శనం కూడానూ.**

స్వప్నంలో కోరిన కోరికలు అన్నీ తీరతాయి. అలాగే నానావిషయగోచరం అయిన ఈ జగత్తు నిజానికి అసత్తు అయినా సత్తుగా భాసిస్తుంది. మరి దీనితత్వం తెలుసుకోవటం ఎలాగూ అంటావా, చెబుతున్నాను విను. **ఏ వస్తువు పట్ల ఎవడికి మోహం వల్ల అన్యధాజ్ఞానం కలుగుతుందో దాన్ని (మోహాన్ని) తొలగిస్తే తప్ప వాడికి తత్వం బోధపడదు.** అవునుగదా, శుక్తి రజతభ్రాంతి ఉంది. రజత వివేకం వల్ల భ్రాంతిని తొలగించుకుంటే శుక్తి శుక్తిగా మిగులుతుంది. ఇలాగే స్థాణుచోరభ్రాంతి, రజ్జుసర్పభ్రాంతి మొదలైనవి. చోరజ్ఞానం, సర్పజ్ఞానం వీటితో భ్రమలు తొలగి అసలు వస్తువులు కనిపిస్తాయి. ఇలా భ్రమలు తొలగటానికి వస్తువులు సిద్ధించటానికి సాధనం - యాగయోగాదికం. ఇంతకన్నా ఆక్షేపించవలసింది ఏమీ లేదు.

**ఈ జగత్తు ఇదివరకు పుట్టలేదు. ఇప్పుడు పుట్టడం లేదు. ఇక ముందు పుట్టబోదు. దీని ఉనికికి సంబంధించిన భాసమంతా మృషాభాసమే. ఇది మాయా మనోమయం (మనఃకల్పితం) ఇది అంతా భ్రమ అని తెలుసుకున్నవాడికి ఇంక ఏ సందేహం లేదు.** అలాగే ఈ జగద్భ్రాంతిని తొలగించుకుంటే ఇంక సందేహాలు వుండవు. ఈ జగత్తు సత్యమే అంటున్న వారు కొందరు ఉన్నారు. మరి దాని సంగతి ఏమిటి అన్నట్లయితే అదీ చెబుతాను. తెలుసుకో ఆ మాటను నువ్వు విశ్వసించేటట్లయితే చిత్తవిశుద్ధికి కర్మలు చేయి. (నిత్యకర్మలు) నిషిద్ధాలైన కామ్యకర్మలను, కుటిల కర్మలనూ వదిలేసెయ్యి. ఈ కర్మఫలాలు అన్నింటినీ ఈశ్వరార్పణం చెయ్యి. మనస్సును భక్తితో తత్ర్పణం చెయ్యి. ప్రేమతో ఈశ్వరుణ్ని భజించు. ఆత్మవిశుద్ధి కలుగుతుంది. విశుద్ధాత్మ ఈ జగత్తు భ్రాంతి జన్యమనీ, అనిత్యమనీ, నశ్వరమనీ, మృషాకల్పితం అనీ గ్రహిస్తుంది. అప్పుడు విరక్తవుతుంది. బ్రహ్మ భువనపర్యంతరం సమస్త సృష్టి నశ్వరమనీ అమంగళమనీ గ్రహించినవాడు. అతి నిర్మలుడవుతాడు. బ్రహ్మజ్ఞానానికి అధికారి అవుతాడు. దేవుడి పట్లా గురుదేవుడి పట్లా అత్యంత భక్తి కలిగిన మహాత్మునికే నేను చెబుతున్న ఈ మహా విషయాలన్నీ అవగతమవుతాయి. **మనస్సు నుండి ఈ దృశ్యప్రపంచాన్ని తొలగించటం ఒక్కటే నిర్వాణనిర్వతి. అదే ముక్తి రూప ఆనందం. దీనికంతటికీ గురు అనుగ్రహం ఉండాలి. అది ఉన్నప్పుడే సత్యాసత్య - ఆత్మానాత్మ విచారణ సాగుతుంది. విచారణ వల్ల పరతత్వం ప్రకాశమవుతుంది.** కార్తవీర్యనృపాలా, నువ్వు యాగయోగాది సత్కర్మలన్నీ మదర్పితంగా చేసావు. నేను సంతసించాను. అందుకని ఈ చర్య ఈ విచారణ ఇలా ఆరంభమై సాగింది. దీనితో నీ భ్రమ దృష్టి తొలగి మనస్సు నిర్మలమయ్యింది. గొప్ప వైరాగ్యం కలిగింది. ఇక ఇప్పుడు నీకు పరబ్రహ్మతత్వాన్ని ప్రత్యేకంగా ప్రభోదించటం కేవలం వృధాగా ఆయాసపడటం మాత్రమే అవుతుంది.

రాజా ఈ మొత్తం ప్రభోదానికి శాస్త్రవేత్తలు చెప్పిన ఉపక్రమోప సంహారాలు క్రోడీకరించి చెబుతాను విను. పరమాత్మ ఒక్కడే వస్తుమాత్రుడు. చిదాత్మకుడు. అతడే సత్యమూ నిత్యమూ అనాద్యవిద్య వల్ల అతడిలో జీవేశ్వర విభాగము భాసిస్తోంది. భ్రమ - మోహం - మాయ - ప్రధానం - ప్రకృతి - అజ్ఞానశక్తి - అవ్యక్తం - గుణసామ్యం అనే పిలువడే భ్రాంతి వల్ల జగదాభాస కలుగుతుంది. జగన్నిత్యత్వ భ్రాంతి ఏర్పడుతుంది. జీవేశ్వర విభాగానికి కూడా ఇదే కారణం. పరమాత్మ సదానంద లక్షణుడు (స్వరూపుడు) పురుషుడు అమృతానందుడు. కనుక ఈ జగద్దర్శనం.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

**బ్రహ్మతత్వం నుండి అవ్యక్తం - అవ్యక్తం నుండి మహత్తు - మహత్తు నుండి అహంకారం, అహంకారం నుండి భూతసూక్ష్మాలైన పంచతన్మాత్రలూ వాటి నుండి స్థూలపంచభూతాలూ ఆవిర్భవించాయి. ఆతర్వాత ఇంద్రియాలు, తదధిష్టాన దేవతలూ మనస్సూ జనించాయి. సృష్టి అంతా జరిగింది. రాజా! ఇది మనోమూలమూ భ్రాంతి కల్పితమూ కనుక. ఈ సృష్టికి ఈ జగదావిర్భావానికి ఇదే వరుస అనే నియమం లేదు. అందువలన కొందరు ఆకాశం నుండి సృష్టి జరిగింది అంటున్నారు.**

కొందరు అగ్ని నుండి జరిగింది అంటున్నారు. పాంచభౌతిక శరీరాలు. నరదేవాసుర జాతులూ పశుపక్ష్యాదులు తరులతా గుల్మాదులూ స్థూలసూక్ష్మ శరీరాలు ఇది అంతా ఉపక్రమపర్వం. ఇక ఉపసంహారక్రమం ఏమిటంటే -

**ఏది దేని నుండి పుట్టిందో అది అందులోనే లయిస్తుంది. ఇంద్రియాలూ, తదధి దేవతలూ మనస్సు ఇవన్నీ తమకు కారణమైన అహంకారంలో లయిస్తాయి. అహంకారం మహత్తులో - మహత్తు వ్యక్తప్రకృతిలో - వ్యక్తప్రకృతి నిష్కళంకమైన అవ్యక్తపరబ్రహ్మంలో లయిస్తున్నాయి.** ఈ లయాన్ని భ్రాంతులు సశేషమని సందేహిస్తున్నారు. సశేష కారణరూపమని సంభావిస్తారు. ఆత్మజ్ఞుడు మాత్రం నిస్స్వరూపమని గ్రహిస్తాడు. అన్నింటినీ తనలోనే ఆవిర్భవింపజేసుకుని పరబ్రహ్మం ఒక్కటే శాశ్వతంగా మిగిలి వెలుగుతుందని తెలుసుకుంటాడు. అంచేత నాయనా కార్తవీర్యా ఈ జగత్తులేదు. వట్టి మిథ్య. ఆత్మఒక్కటే సత్యం "జగన్మిథ్యా బ్రహ్మ సత్యమ్" మోహితుడికే జగత్తు తప్ప బోధితుడికి కేవలం ఆత్మఒక్కటే.

దయానిధీ. దత్తదేవా! నీ అనుగ్రహం వల్ల కృతార్థుణ్ని అయ్యాను. బ్రహ్మతత్వం విషయమై నాకు నిశ్చయజ్ఞానం కలిగింది. సందేహాలన్నీ అంతరించాయి. ఈ ఆత్మానందాన్ని హృదయంలో రూఢపర్చుకోవాలంటే చెదిరిపోకుండా స్థిరపరచుకోవాలంటే ఉపాయం ఏమిటి? మహా యోగీ! దీనవత్సలా! దయచేసి ఆ రహస్యం బోధించు - అని కార్తవీర్యార్జునుడు అభ్యర్థించాడు.

అర్జునా! నీకు చిత్తశుద్ధి కలిగింది. దృఢమైన వైరాగ్యం ఏర్పడింది. నాయందు నిశ్చలమైన భక్తీ కుదిరింది. అందువల్ల నేను చెప్పిన మహావాక్యాల అర్థాన్ని ఆసక్తిగా విన్నావు. అవగతం చేసుకున్నావు. దానితో తత్వజ్ఞానం కలిగింది. చితస్థమైన ప్రపంచాస్థ అన్ని విధాల విలయమైంది. ముముక్షువు అయ్యావు. ఏకైకమూ అద్వితీయమూ అయిన ఈ మహోన్నతా భూమికకు నువ్వు చేరుకున్నావు. కనుక రాజోత్తమా నీకిప్పుడు బ్రహ్మసాక్షాత్కారం కలిగిస్తాను. దానికి కావలసిన సాధన సంపత్తిని వివరిస్తాను దత్త చిత్తుడవై ఆలకించు.

**నిత్యా నిత్య వస్తు వివేకం - ఫలభోగ విరక్తి - శమదమాదిషట్క సంపత్తి - ముముక్షుత్వం అనే సాధన చతుష్టయాన్ని సమకూర్చుకొని సద్గురువును ఆశ్రయించాలి.** శ్రవణ - మనన - నిదిధ్యాసధారణాదుల్ని అవలంభించాలి. దయాళుడైన సద్గురువు తత్వమ్ అసి వంటి తత్వ నిశ్చాయకాలైన మహావాక్యాల్ని ఉపదేశిస్తాడు. వాటి అర్థాన్ని షడ్విధలింగాలతో మనస్సులో చర్చించుకుని అవధారణ చెయ్యాలి. దీన్నే శ్రవణం అంటారు. "శ్రవణమ్ తదితి ప్రోక్త మవధారణ లక్షణమ్". ఈ మహావాక్యాన్ని క్లుప్తంగా వివరిస్తాను విను.

తత్‌పదంతో పరబ్రహ్మనూ త్వమ్‌పదంతో పురుషుణ్నీ (జీవుణ్నీ) చెప్పి అసిపదంతో ఈ రెండింటి ఐక్యాన్ని బోధిస్తుంది ఈ మహావాక్యం. తత్ అనేది పరోక్షం. త్వమ్ అనేది సన్నిహితం. "త్వమ్"ను ఉద్దేశించే తత్పదాన్ని చెప్పింది వేదం. త్వమ్‌పదార్థమైన జీవుడు సంసారి. తత్పదార్థమైన పరబ్రహ్మం సంసార విరహితం. మరి ఇవి రెండూ ఏకమవ్వడం ఎలాగ? చెబుతున్నాను విను.

దేవదత్తుడు అనే వాణ్ని ఎప్పుడో ఎక్కడో చూసావు. కొన్ని సంవత్సరాలు గడిచాక ముసలివాడైన దేవదత్తుణ్ని మరోచోట ఎక్కడో మళ్ళీ చూసావు. ప్రదేశమూ అవస్థా యౌవనమూ, ముసలితనమూ వగైరాలన్నింటినీ విడిచిపెట్టి ఆ దేవదత్తుడు ఇతడే అని గుర్తిస్తున్నావా లేదా? అలాగే ఇక్కడ తత్ - త్వమ్ పదార్థాలను గుర్తించాలి.

త్వమ్ పదానికి సంసారి అనివాచ్యార్థం నిశ్చయమైంది. మాయావృతుడైన ఆ సంసారి కర్త-భోక్త - సుఖి - దుఃఖి అని చెప్పబడుతున్నాడు. నిజమాలోచిస్తే సచ్చిదానంద స్వరూపుడైన పరబ్రహ్మమే సంసారి ఇది వాచ్యార్థం- ఇంక తత్పదానికి వాచ్యార్థం సర్వజ్ఞుడైన శివుడు. అంటే మాయావృతమైన పరబ్రహ్మం సృష్ట్యాదికార్యాలు చేస్తూ ఈశ్వరుడయ్యాడు. కనుక ఒక అంశం చిద్రూప పరబ్రహ్మం. ఇది లక్ష్యార్థం. రెండవ అంశం సర్వజ్ఞ పరమేశ్వరుడు. ఇది వాచ్యార్థం. ఇప్పుడు రెండింటిలోనూ రెండవ అంశాలుగానున్న వాచ్యార్థాలను తొలగిస్తే రెండింటా మిగిలేది లక్ష్యార్థమైన ఒక్క పరబ్రహ్మమే.

ఇలా అల్పుడైన జీవుడూ, సర్వజ్ఞుడైన ఈశ్వరుడూ ఏకమవుతున్నారు. అంచేత తత్=అది, త్వమ్=నువ్వు, అసి=అయ్యున్నావు అనే మహావాక్యం కుదరుతోంది. కాబట్టి బ్రహ్మమే నువ్వు, నువ్వే బ్రహ్మము, ఇద్దరికీ భేదం లేదు. అంటే దుఃఖిత్వాన్ని పరిత్యజించి త్వమ్ పదార్థమే తత్పదార్థమవుతుంది. నువ్వే బ్రహ్మస్వరూపుడవు అవుతావు. ఈ తత్-త్వమ్ పదార్థాలు పరస్పరం విశేషణ విశేష్యభావం పొందుతున్నాయి.

దుఃఖిత్వాన్ని పరిత్యజించి నువ్వే బ్రహ్మరూపుడవు అనే వాక్యంపరోక్ష జ్ఞానబోధకం. బ్రహ్మమే నువ్వు అనే వాక్యం అపరోక్ష (ప్రత్యక్ష) జ్ఞానబోధకం. ఈ మహావాక్యానికి ఇలా ఒక అంశాన్ని విడిచిపెట్టి మరొక అంశాన్ని విడిచిపెట్టకుండా సమన్వయించటాన్ని జహద జహల్లక్షణ అంటారు. వేదంలో జ్ఞానకాండ అనుసరించిన పద్ధతి ఇది. తక్కిన ఉపాసనకాండ, కర్మకాండల తాత్పర్యం కూడా ఇదేనని తద్జ్ఞుల నిర్ణయం. ఇది స్థూలమంతులకు దురజ్ఞేయం. సూక్ష్మబుద్ధులకు సుజ్ఞేయం. స్మృతిశాస్త్ర పురాణాలన్నీ ఈ మహార్థాన్ని ఇలాగే చెప్పాయి. దీన్ని గ్రహింపలేని కొందరు మూఢులు పండితమ్మన్యులై వేదాన్ని ప్రవృత్తిపరం అంటున్నారు. ఇది అసమంజసం. వేదతాత్పర్య నిర్ణయానికి షడ్విధలింగాలు ఉన్నాయి. వాటిని చెబుతాను. తెలుసుకో.

శాస్త్రంలో ప్రకరణాన్ని ఏ విషయంలో ఆరంభిస్తారో దానితోనే ముగిస్తారు. ఇది ఒక లింగం. ఉపక్రమోప సంహారములంటారు. ఆగమాల్లో ఒకే విషయాన్ని పౌనఃపున్యంగా చెబుతుంటారు. దాన్ని అభ్యాసమంటారు. ఈ అంశాన్ని ఈ శాస్త్రంతోనే తెలుసుకోవాలి. ప్రమాణాంతరం లేదు అన్నట్లయితే అది అపూర్వత. అజ్ఞానాంధకారం తొలగిపోవడమనే ప్రయోజనమే ఫలం. ఇది నాల్గవలింగం. చెప్పిన దాన్ని దృఢపరచటం కోసం బహువిధాల ప్రశంసించటం అర్థవాదం. శాస్త్రార్థవినిశ్చయంలోని తర్కాన్ని ఉపపత్తి అంటారు. ఇలా తాత్పర్య నిర్ణయానికి ఆరు లింగాలు (ప్రమాణాలు) ఉన్నాయి.

**గురువు దగ్గర విన్నదాన్ని వివిధోపాయాలతో యుక్తులతో బాగా పరిచింతనం చెయ్యాలి. దీన్నే మననము అంటారు. శ్రుతానికి మననం లేకపోతే అది నిలవదు. జారిపోతుంది. మననము అనేది ఒక యోగాంగం. యోగసిద్ధిని కోరుకునే ముముక్షువులు ఈ యోగాంగాలను పాటించాలి.** ఇవి ఎనిమిది అని కొందరూ ఆరు అని కొందరూ పరిగణిస్తున్నారు.

సంప్రదాయ విశుద్ధి కోసం వాటిని కూడా విశదీకరిస్తున్నాను. గ్రహించు. (అష్టాంగ యోగ ఇత్యాహుః షడంగ ఇతి చాపరే)

యమం-నియమం-ఆసనం-ప్రాణాయామం-ప్రత్యాహారం-ధారణ-ధ్యానం-ఇవి సప్తాంగాలు. అష్టమాంగం సమాధినే ఫలము అంటారు. వీటిలో మొదటి యమనియమములు రెండూ యోగులకే కాదు ఏ మార్గంలోనైనా అందరికీ సర్వసాధారణంగా ఉండవలసినవే కనుక ఆసన ప్రాణాయామం నుంచి మొదలుపెట్టి యోగానికి షడంగాలే అంటున్నారు. మరికొందరు ఆసనమూ సర్వసాధరణమే కనుక ప్రాణాయామం నుంచీ పరిగణిస్తున్నారు. సమాధిని సవికల్పమనీ నిర్వికల్పమనీ విభజిస్తున్నారు. ఇలా వీరికి షడంగాలే అవుతున్నాయి. మొదటి రెండింటినీ వదలి సమాధి ద్వైవిధ్యాన్ని అంగీకరించి సప్తాంగములతోనే అష్టాంగయోగము అన్నవారూ ఉన్నారు.

వీటిలో యమములు పది. అహింస-సత్యం-ఆస్తేయం(అచౌర్యం)-బ్రహ్మచర్యం అపరిగ్రహం- ఆస్తిక్యం-మౌనం-అభయం-అసంగం-లజ్జ. నియమాలు కూడా పది. శౌచం-ఆచమనం-స్నానం-స్వాధ్యాయం-ఇజ్య-మదర్చనం-తపం-జపం-సంతోషం తీర్థసేవ-జానూరువుల మధ్య పాదతలాల్ని ప్రవేశపెట్టి ఋజుకాయుడై కూర్చుంటే స్వస్తికం అంటారు. ఇలాంటి ఆసనాలు అనేకం ఉన్నాయి. ఎవరికి ఏది సుఖంగా ఉంటుందో ఆ ఆసనం వేసి యోగసాధనకు కూర్చోవాలి. నిర్జనమూ, నిశ్శబ్దమూ, నిరుపద్రవమూ, సుఖప్రదమూ అయిన సమతల ప్రదేశములో దర్భాసనం పరిచి దాని మీద క్రిష్ణాజినం (జింకచర్మం) పరచి సమకాయ శిరోగ్రీవుడై పద్మాసనమో మరొకటో వేసి కూర్చుని యోగాభ్యాసం చెయ్యాలి.

స్థిరంగా నిశ్చలంగా పరమాత్మను ధ్యానించాలి. ముందుగా - మనస్సులో ఉండే మలినాలను తొలచి వేసేందుకు ప్రాణాయామం చెయ్యాలి. దీని కోసం ఎంతశ్రమపడినా పరవాలేదు. ప్రాణవాయువును నియంత్రించ గలిగితే మనస్సును జయించినట్లే. ప్రాణమూ మనస్సూ అనేవి జోడు గిత్తల్లాంటివి. బండిని వేగంగా లాగుతుంటాయి. వీటిలో ఒక గిత్త కొమ్ములకు పగ్గంవేసి అదుపుచేస్తే రెండవగిత్త కూడా తనంతతానే అదుపు అవుతుంది. అలాగే ప్రాణవాయువుకి పగ్గం వేస్తే మనస్సూలొంగి వస్తుంది. కొందరు సత్కర్మాచరణంతో ముందుగా మనశ్శుద్ధిని సాధించి నన్ను అర్చించి అటుపైన వశ్య ప్రాణులు అవుతున్నారు. ఇలా ఏదో క్రమానమనః ప్రాణాలను వశీకరించుకొని మిగతా ధారణాది యోగాంగాలను ఆచరించాలి. ముందుగా ప్రాణాయామం చేసేపద్ధతిని భోదిస్తానుగ్రహించు. ఇందులో మూడు దశలున్నాయి. ఎడమ ముక్కుతో వాయువును పూరించి పూపిరితిత్తులలో కుంభించి కుడి ముక్కుతో బయటికి విడిచి పెట్టాలి. (రేచకం) ఒక్కొక్క దానికీ పదహారు మాత్రల కాలం తీసికోవాలి.

(కుంభకానికి పదహారు మాత్రలు కావాలి. పూరకానికి అరవై నాలుగు మాత్రలకాలం, రేచకానికి ముప్పది రెండు మాత్రల కాలం - అన్నీ పదమంజరీ టీక) ఎడమ ముక్కుతో పూరించి కుడిముక్కుతో రేచకం చేసినట్లే కుడిముక్కుతో పూరించి ఎడమ ముక్కుతోనూ విడువవచ్చు. పూరించి లోపల కుంభించినట్లే వాయువును విడిచి పెట్టి బయట కుంభించవచ్చు. ఈ ప్రాణాయామంవల్ల పిండ (శరీర) శుద్ధి అవుతుంది. శరీరంలోని వాతపిత్తాది ప్రకోపాలు సమస్తమూ శాంతిస్తాయి. నాడీద్వారాలు అన్నీ నిర్మలినాలు అవుతాయి. క్రమాభ్యాసంలో యోగి నిరోగి అవుతాడు. ఈ ప్రాణాయామంలో సబీజమూ, నిర్బీజమూ అని రెండు విధాలున్నాయి. ప్రణవమంత్ర సహితమైతే సబీజం - ప్రణవమంత్ర రహితమైతే నిర్బీజం. వీటినే సగర్భమూ, నిర్గర్భమూ అని కూడా అంటారు.

ప్రాణవాయువు ఇలా వశమైన తరువాత విషయ సుఖాల నుంచి ఇంద్రియాలను మనస్సుతో ప్రయత్న పూర్వకంగా ఉపసంహరించాలి. దీన్నే ప్రత్యాహారం అంటారు.

ఇక ధారణ అంటే ఆత్మలో మనస్సుని నిలపడం. ఇది సగుణమనీ, నిర్గుణమనీ రెండు రకాలు. చెదిరిపోయే మనస్సును మాటిమాటికి ప్రయత్న పూర్వకంగా బంధించి తెచ్చి ఆత్మలో స్థిరపరచాలి. దీనికి అభ్యాసబలం చాలా కావాలి. అలా స్థిరీకరించడాన్నే ధ్యానం అంటారు. మరికొందరు ఏమన్నారంటే - పన్నెండు ప్రాణాయామాలు ఒక ప్రత్యాహారమనీ పన్నెండు ప్రత్యాహారాలు ఒక ధారణ అనీ, పన్నెండు ధారణలు ఒక ధ్యానమనీ, పన్నెండు ధ్యానాలు ఒక సవికల్ప సమాధి అనీ చెప్పారు.

ఈ అష్టయోగాంగాలతో మనస్సును స్థిరపరచుకొని అది మనన క్షమం అయ్యాక - పరమాత్మను గురించి వేద శాస్త్రాలు చెప్పిన మహావాక్యాల్ని ఏకార్థ సమన్వయంతో మననం చెయ్యాలి. **నిరంతర మననాన్నే పెద్దలు ధ్యానమన్నారు. సవికల్ప సమాధినే "నిధిధ్యాసము" అంటారు.** విజాతీయులైన కామక్రోధాదుల్ని నిరసించి "అహంబ్రహ్మాస్మి" అనే సజాతీయ భావనను నిరంతరంగా ప్రవాహ సదృశంగా సాగించవలసిన స్థితి నిధి ధ్యాసం. ఇదే సవికల్ప సమాధి. ఇది అల్పయోగులకు దుర్లభం. తత్వమసి అనే మహావాక్యార్థాన్ని షడ్విధలింగాల సహాయంతో సద్గురువు నిర్ధారించి శిష్యుడికి బోధించడం అయ్యాక దాన్ని శిష్యుడు ధారణ, చింతన, మననం, ధ్యానం వగైరాలతో వశీకరించుకున్నాక అప్పుడు, విజాతీయులను నిరసించి "అహంబ్రహ్మాస్మి" అనే సజాతీయ భావనను ప్రవాహీకరించుకునే స్థితి. ఇది అల్ప యోగులకు ఎంత దుర్లభమో ఆలోచించు. ఈ సవికల్ప సమాధిలో జ్ఞాతృజ్ఞేయ విభాగం వుంటుంది. అవి కూడా లయమైపోయిన అవిభాజ్య పరతత్వస్థితి - నిర్వికల్ప సమాధి.

సోఽహమ్ అనే అఖండార్థ దృఢ మనోవృత్తిలో సదా తన చైతన్యం వ్యాపించి వుంటుంది. అహంబ్రహ్మ-బ్రహ్మైవాహమ్ అనే వృత్తి తాలూకు ప్రవాహ దృఢత్వంలో చిత్తు ప్రతిబింబితమవుతుంది. సూర్యకాంతమణీ యోగంతో దూదిలో అగ్ని రగుల్కొన్నట్లుగా చిత్ప్రతిబింబం తళుక్కుమంటుంది. విచక్షుణులైన విద్వాంసులకే ఇది సుజ్ఞేయం. ఆ ప్రతిబింబంతో వ్యాప్తమైన ఈ మనోవృత్తి నిర్వికల్ప పరబ్రహ్మాన్ని చూపించి తానూ నశిస్తుంది.

అంటే ఈ వృత్తికి ప్రయోజనం తమోనాశకు తప్ప స్వప్రకాశ విషయీకరణంకాదు. తమోనాశంతో వృత్తి నాశమూ అవుతుంది. వృత్తి అనే ఉపాధి నాశనమవ్వడంతోనే చిత్ప్రతి బింబం చిత్తు అయిపోతుంది. అప్పుడు అది ఒక్కటే భాసిస్తుంది. కాంతిమంతమైన ఆ పరమానంద స్థితి వర్ణనాతీతం. అది మనో వాక్కులకు అందదు.

దీన్ని ఒక చిత్త వృత్తి అనీ మనస్సుతోనే దర్శించగలమనీ చెప్పడం దాని సంగతి అస్సలు తెలియని వారికి ఏదో కొంత తెలియచెప్పే ప్రయత్నమే తప్ప నిజానికి ఆ పరమానంద స్థితి మనస్సుకు అందుతుందా, వాక్కులకి అందుతుందా? స్వప్రకాశమూ నిత్యమూ అయిన ఆ పరంజ్యోతి వాఙ్మనస్సులకు ఆవలిది. అందనిది "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ-అని శ్రుతి కీర్తించింది దీనినే. అయితే అజ్ఞానంతో అజ్ఞానాన్ని పోగొట్టినట్లు ఈ చిత్త వృత్తి అనేది దారి చూపించడానికి పనికి వస్తుంది. బ్రహ్మతత్వాన్ని గూర్చిన అజ్ఞానాన్ని పోగొట్టడానికి మాత్రమే ఈ వృత్తి వ్యాపృత్వం అవసరమవుతుంది. సాధకుడు ఆదారిన పోగా పోగా బ్రహ్మసాక్షాత్కారం అవుతుంది. ఆదర్శనం

అయ్యేంత వరకూ ఈ వృత్తి వుండాలి. అటు తర్వాత ఉండ కూడదు. ఈ వృత్తిలో స్వభావ సిద్ధంగానే జ్ఞాతృజ్ఞేయ విభాగం ఉంటుంది. కాబట్టే దీన్ని సవికల్ప సమాధి అనడం. వృత్తి కూడా లయమైపోతే అదే నిర్వికల్ప సమాధి. ఇందులో పరతత్వం అవిభాజ్యంగా (జ్ఞాతృజ్ఞేయవిభాగరహితంగా) అనుభూతమవుతుంది.

కార్తవీర్యార్జునా ! నిర్వికల్ప సమాధి స్థితికి చేరుకున్న యోగికి కొన్ని విఘ్నాలు (ఆటంకాలు) వచ్చిపడుతూ వుంటాయి. అవే అణిమాది - అష్ట సిద్ధులు. యోగి వాటిని ఆశించాడో ఇంక భ్రష్టుడయ్యాడన్న మాటే. ఆ సిద్ధులు కూడా నశ్వరములు అని గుర్తించి వాటి జోలికి పోకుండా విరమించుకోవాలి.

మనస్సుకి విక్షేపం కలిగితే దాన్ని వెంటనే శమింపజేసుకోవాలి. మనస్సులయమై సుషుప్తిని పొంది దాన్ని ప్రబుద్ధం చెయ్యాలి (మేల్కొల్పాలి). ఇలా నిరంతర జాగరూకుడై యోగి తన మనస్సును ఏ వృత్తులూ లేని స్థితికి చేర్చాలి. ఇదే కషాయపక్వత అంటే. ఇదే అఖండాకారత అంటే. ఇదే సమత అంటే. అప్పుడు అతడు నివాత దీప కళికలా నిశ్చలంగా వెలుగుతూ ఉంటాడు. జ్ఞాతృజ్ఞేయ విభాగశూన్యుడై బ్రహ్మాకారస్థితిలో ఉంటాడు. అతడికి ఏ చలనమూ వుండదు. ఏ రసాస్వాదనమూ ఉండదు. ఏ సంగమూ ఉండదు. వృత్తి శూన్యుడూ బ్రహ్మీభావం పొందిన వాడూ అయిన ఇటువంటి యోగికి హృదయగ్రంధి (అహంకార గ్రంధి) బ్రద్ధలైపోతుంది. సర్వ సంశయాలు పటాపంచలైపోతాయి. కర్మలన్నీ అంతరిస్తాయి. జీవన్ముక్తుడు అవుతాడు.

కార్తవీర్య రాజా! బ్రహ్మను భవ పర్యంతం యోగావస్థను నీకు ఎరుకపరచాను. దీనితో నువ్వు కూడా బ్రహ్మ సాక్షాత్కారం పొంద గలుగుతావు. ఇది తథ్యం. అయితే నాయనా! ఈ యోగవిద్యను ఎవరికి పడితే వారికి బోధించకూడదు. అవినీతుడికీ అస్సలు బోధించరాదు. వినీతుడూ, శుద్ధ చిత్తుడూ అయిన శిష్యుడికే పరీక్షించి బోధించాలి.

యోగీశ్వరుడైన దత్తస్వామి ఇలా తత్వోపదేశం ముగించాడు. కార్తవీర్యార్జునుని కళ్ళల్లో ఆనందభాష్పములు వరదలు కట్టాయి. హృదయాంబుజం వికసించింది. తనువంతా పులకించిపోయింది. భక్తి ప్రపత్తులతో మరో మారు సాష్టాంగపడి నమస్కరించాడు. చాలా సేపటికి తెప్పరిల్లి మెల్లగా లేచాడు. అంజలి ఘటించి వినమ్రంగా నిలబడ్డాడు.

దత్తదేవా! మహానుభావా! అగ్ని కాంతులతో చీకట్లు తొలగినట్లుగా నీతత్వబోధతో నాలోని మోహాంధకారం తొలగిపోయింది. హృదయాంబుజాన్ని వికసింపజేస్తూ జ్ఞాన సహస్ర భానుడు ఉదయించాడు. హే అకుంఠ ధామన్! నీ పాద పద్మ సేవతప్ప ఈ చీకట్లను తొలగింపజేసేది ఈ సృష్టిలో మరొకటి లేదు. నీ పాదమూలం విశుద్ధి ప్రదం.

సర్వరోగ నివారకం. సర్వ మంగళ ప్రదం. సర్వయోగ సిద్ధిదాయకం పురుషార్థ సిద్ధి కోరేవాడుఎవడైనా సరే కృతజ్ఞుడై నీ పాదమూలాన్ని ఆశ్రయించాలి. మరి దేనిని ఆశ్రయించినా వ్యర్థమే. అందుకే హంసలూ, పరమహంసలూ వచ్చి ఆనంద మకరందాన్నీ ఎగజిమ్మే నీ పాద పద్మాలను యోగ విభవం కోసం శరణువేడుతున్నారు. నీ పాదాలను తదేక దీక్షతో అర్చించేవారికి చతుర్విధ పురుషార్థాలూ తమంత తాముగా కోరి సిద్ధిస్తున్నాయి. ప్రభూ! నీ పాద పద్మం కేవలం త్రిమూర్తి వేద్యం. అది సర్వాశ్రయం. సర్వలయకరం. స్వాత్మావభాసం. విశదప్రకాశం. నేను ఆపాద పద్మానికి నమస్కరిస్తున్నాను. అది చల్లనిది. శాంతకరమైనది. సుశేవ్యం. శుభప్రదం, శివప్రదం, తాపనాశకం, జన్మజరామయభయాలను తొలగిస్తుంది. ఆశ్రితులందరికీ సారవంతమైన ఆనందాన్నిస్తుంది. నీ పాదపద్మానికి అంజలి

ఇస్తున్నాను. తాడునుచూసి సర్పమని అనుకున్నట్లుగా ఈ సద సదాత్మకమైన విశ్వమంతా మాయవల్ల నీలో సత్యంగా కన్పిస్తుంది. స్వామిన్! ఈ భవాబ్ధిలో కొట్టు మిట్టాడుతున్న జీవులకు ఏకైక శరణ్యుడవూ, ఉద్ధారకుడవూ నువ్వే. జీవులకే కాదు యోగులకు, పరమహంసలకు సైతం గతివి నువ్వే. నువ్వు నిత్య శుద్ధ బుద్ధ ముక్తుడివి. సర్వేశుడవి స్వయం ప్రకాశకుడవు. సర్వ రక్షకుడవు. అటువంటి నిన్ను దేహ ఇంద్రియ-ప్రాణ విషయాలను పరిత్యజించి ప్రసన్నుడనై దేవా! ఇదే శరణు వేడుతున్నాను. అగ్ని అరణుల్లో అవ్యక్తరూపంగా వుంటుంది. మధిస్తే స్ఫులింగ రూపంతో స్పష్టపడుతుంది. హవిస్సుతో ప్రదీప్త రూపంపొందుతుంది. అలాగే నువ్వు మూలా ధార వివరంలో పరాఖ్యతో అవ్యక్త రూపుడవై ప్రభవిస్తావు. అటుపైన నాభి దగ్గర మణి పూరక చక్రంలోకి పశ్యంతిగా ప్రవేశిస్తావు. కంఠం దగ్గర విశుద్ధ చక్రంలో మధ్య మానామధేయంతో ప్రకాశిస్తావు. చివరకు ముఖం నుండి అక్షరాకృతితో వైఖరీ నామధేయంతో స్పష్టపడతావు. శబ్ద బ్రహ్మమా నీకివే నా నమస్కృతులు. దేవా! నువ్వే త్రివృత్తు, అబ్జయోనివి నువ్వే . ఈశుడవు నువ్వే, అవ్యక్తుడవూ నువ్వే అద్వితీయుడవు నువ్వే.

వయస్సుతో మహాత్ముడవు - ఆద్యుడవు. బీజాలు క్షేత్రంలో ప్రవేశించి ఆశ్లిష్ట శక్తులై బహు రూపాలతో ప్రకాశం పొందినట్లు ఈ సృష్టిలో సర్వత్రా తానై విరాజిల్లే నీకు వందనములు. పట తంతు న్యాయంగా ఈ విశ్వం నీలో ఓత ప్రోతమయ్యింది. మాయలో నువ్వే అనేక రూపాలుగా భాసిస్తున్నావు. కనుక ద్వితీయ భాసం లేదు. అద్వితీయుడవు. ఆత్మ స్వరూపుడవు. సచ్చిదానందుడవు. నీకిదే నమస్కరిస్తున్నాను.

మాయా విభాసమైన ఈ జగత్తు అనే వృక్షానికి పుణ్య పాపాలు విత్తనములు. వాసనలు వ్రేళ్ళు. సత్వరజస్తమో గుణాలు నాళాలు. దశేంద్రియాలు శాఖలు. పంచమహాభూతాలే స్కందాలు. వాత పిత్త శ్లేష్మాలు మూడూ వల్కలాలు. జీవుడూ, ఈశ్వరుడూ అనే పక్షి జంటకు ఇది గూడు. గృహస్థులు దీని దుఃఖ ఫలాన్నీ హంసలు, పరమ హంసలూ దీని సుఖఫలాల్నీ అనుభవిస్తున్నారు. ధీరులైన వారు వాడియైన విద్యా కుఠారంతో (కొడవలి) దీన్ని సమూలంగా ఖండించి నీలో ఐక్యం పొందుతున్నారు. అఖిల హేతూ! సర్వసారా! సురేశా! స్వజన సుఖదశీలా! దేవ వేద్యా! పురాణపురుషా! ఋషభా! ఆద్యా! విశ్వవంద్యా! ముకుందా! చిత్ప్రకాశా! పాప సముద్రం నుండి బయటపడ్డ నేను నీకిదే నమస్కరిస్తున్నాను. గురూ! గురుతరా! గురుగమ్యా! గుణాకారా! గురూత్తమా! దేవా! దేవ వంద్య పదాంబుజా! నీకిదే ప్రణమిల్లుతున్నాను.

కార్తవీర్యార్జునుడు కృతజ్ఞుడై చేసిన స్తుతికి సకల దేవతా పతాక భూమి అయిన శ్రీ దత్తాత్రేయ స్వామి వారి హృదయ-నేత్ర-వదనారవిందాలు నిండుగా వికసించాయి. ప్రేమ తొణికిసలాడే చూపులతో కటాక్షించి ఇలా పలికాడు.

రాజన్య సత్తమా ఇప్పటికి నీకు తత్వం అర్థం అయ్యింది గదా! పరోక్షజ్ఞానం లభించింది. అపరోక్షాను భూతి కూడా కావాలి. అది కూడా కలిగిస్తాను. ఇదిగో హృద్యమూ, నిరామయమూ గూఢమూ అయినగుహ. ఇందులోకి ప్రవేశించు. దృఢాసనం వేసుకొని నడుమూ, మెడ, శిరస్సు, సమానంగా వుండేలా (నిటారుగా) నిగిడించి కూర్చో. కూర్చుని నేను ఉపదేశించిన తత్వాన్ని సుస్థిరంగా చింతన చెయ్యి అక్కడ ఏ అవబోధ కలుగుతుందో ఏ సమాధి సిద్ధిస్తుందో దాన్ని చిరకాలం అనుభవించి కృతార్థుడవు అవుదువుగాని. అని పలికి అంబుజాక్షుడు అమృతానంద

దాయకమైన తన దక్షిణ హస్తాన్ని అతడి శిరస్సు మీద ఆనించాడు. అతడు శిరస్సువంచి నమస్కరిస్తూ గుహలోకి ప్రవేశించాడు. పద్మాసనం వేసుకొని యథావిధిగా కూర్చున్నాడు. దత్తస్వామి ఆజ్ఞాపించినట్లు చేసాడు. చాలా తక్కువ వ్యవధిలో భగవదనుగ్రహం వల్ల సమాధి స్థితిని పొందాడు. స్థాణువులా నిశ్చల శరీరుడు అయ్యాడు. పద మూడు నెలలు గడిచాయి. క్రమంగా నరభావనలోకి దిగివచ్చాడు. మెల్లగా లేచాడు. గుహ నుండి వెలుపలికి వచ్చాడు. స్వామి పాదాలకు ప్రణమిల్లాడు. స్వామి అతన్ని దయార్ద్రంగా లేవనెత్తి ప్రేమగా పొదివి పట్టుకున్నారు. ఇద్దరూ ఏకాంతంగా సమావేశమయ్యారు. స్వామివారు చిరునవ్వులు చిందిస్తూ ఇలా అడిగారు. నాయనా! అర్జునా! ఏదీ నీ అనుభవం చెప్పు గుర్తున్నదా? ఇంత కాలం నువ్వు సమాధిలో వున్నావు. అవ్యగ్రమైన బుద్ధినీ, పరమనైశ్చల్యాన్నీ ఎలా పొందగలిగావు?

దేవా! నిన్ను ధ్యానించడం మొదలు పెట్టాను. ఆ క్షణంలోనే నా ఇంద్రియాలూ మనస్సూ చిత్తులో లయమైపోయాయి. ఆ పరమానందంలో నిమగ్నమైన నాకు ఇక త్రిపుటి భాసించలేదు. ఆ నిరుపమానానందాన్ని క్షణంలో సగంసేపు అనుభవించాను అంతే. బలీయమైన నా ప్రారబ్ధం మళ్ళీ నన్ను లాక్కువచ్చి దేహ దశకు తెచ్చింది. దయానిధీ! నాకు ఆదివ్యానుభవాన్ని కలిగించింది నీ పాదపద్మమే తప్ప మరొకటి ఏదీ కాదు. దేవా! నీ దయవల్ల నిరాకులంగా పరమానంద సందోహం అందుకున్నాను. ఒక్క మాటలో చెప్పాలంటే భవాబ్ధిని దాటాను. తెలుసుకోవలసింది తెలుసుకున్నాను. పొంద వలసినది పొందాను. చెయ్యవలసింది చేసాను. నాకిక వీటిలో శేషమేదీ లేదు. నా మనస్సులో హాయిగా వుంది. మళ్ళీ ఆ చిత్యుభానుభవం కోసం పరుగులు తీస్తోంది. యోగ విద్యాపారంగతా! నాకిప్పుడు రాజ్యం వున్నా ఒకటే వూడినా ఒకటే. ఉన్నది అని సుఖం లేదు, లేదని దుఃఖం లేదు. ఇది గ్రాహ్యమనీ ఇది అగ్రాహ్యమనీ ఏమీ అనిపించడంలేదు. అన్నీ ఒకటిగా ఉన్నాయి. దేశం-కాలం-పదార్థం. అన్నింటా ఒకే ఒక్క చిదాత్మ కనిపిస్తోంది. నేనిప్పుడు పూర్ణానందుణ్ని. అంతటా పూర్ణానందమే నిండి ఉంది. చిదానందమయం కాని పదార్థం ఏదీ నాకు కనిపించడం లేదు. దశదిశలూ ఆనందమయాలుగా భాసిస్తున్నాయి. పరమాత్మా! అనుమతి ఇస్తే మళ్ళీ గుహలోకి ప్రవేశిస్తాను. నీ పదాబ్జాలను దర్శించడం నీ స్వరూపాన్ని తిలకించడం రెండూ సమానమే. అంచేత నువ్వు ఏది ఆదేశిస్తే అది చేస్తాను. నీ అనుజ్ఞకోసం నీ ఆదేశం కోసం నిలబడ్డాను.

ఇలా అడుగుతున్న కార్తవీర్యున్ని చూసి దత్తస్వామి ముసిముసి నవ్వులు నవ్వుతూ నాయనా కుమారా! స్నానం చెయ్యి. నిత్య విధులు ఆచరించు. ఆహారంతీసుకో. రేపు మళ్ళీ సమాధిలోకి ప్రవేశించుదువుగానీ - అన్నారు. అర్జునుడు అలాగే చేసి ఆ మర్నాడు దత్తస్వామి అనుమతితో గుహలో ప్రవేశించి సమాధి స్థితిని పొందాడు. ఆరునెలలకి మళ్ళీ దత్త గురుడి ఇచ్చ ప్రకారం ఇవతలకి వచ్చాడు. వచ్చి పాదాభివందనం చేసి నిలబడ్డాడు.

తనయా! స్నానంచేయి. నిత్య విధులు ఆచరించి ఆహారం తీసుకో రేపు మళ్ళీ గుహలోకి ప్రవేశించి సమాధిలో వుండు. సంవత్సరం తరువాత మళ్లీ ఇలాగే లేచి వద్దువుగానీ- అని గురుస్వామి ఆజ్ఞాపించారు. అర్జునుడు అలాగే చేసి సరిగా ఏడాదికి సమాధి నుండి లేచి స్వామి సన్నిధికి వచ్చి నమస్కరించి నిలబడ్డాడు. అప్పుడు భక్త వత్సలుడైన గురుస్వామి ప్రేమగా చేరబిలిచి ఎదురుగా దగ్గరగా కూర్చోబెట్టుకొని మృదువుగా ఇలా సంభాషించారు.

రాజా కృతార్థుడవయ్యావు నీవు. నాకు చాలా ఆనందంగా వుంది. అప్పట్లో నువ్వు అడిగిన అన్నీ ప్రశ్నలకు

సమాధానాలు చెప్పాను. ఒక్క దానికి మాత్రం అప్పుడు చెప్పలేదు. అది ఇప్పుడు చెబుతున్నాను. సదాచారం గురించి అడిగావు గుర్తుందా? అది చెబుతాను తెలుసుకో. నిజానికి ఇప్పుడు నీకు గానీ నాకు గానీ ఈ సదాచారం అవసరం లేదు. మనం దీనికి అతీతులం. **కానీ సనాతనాలైన వర్ణాశ్రమ ధర్మాలను విడిచిపెట్ట కూడదు. అందుకోసం లోకానుగ్రహం కోసం నేను నిత్యమూ వీటిని ఆచరిస్తూ వుంటాను. అయితే - భక్త జనబాధను తప్పించుకోవడానికి అప్పుడప్పుడూ సదాచారమునకు వ్యతిరేకిగా ప్రవర్తిస్తూ వుంటాను. మదవతీ, మధ్య, మాంసాలను సేవిస్తున్నట్లు, శ్మశానాదులలో సంచరిస్తూవున్నట్లు కనిపిస్తాను. కానీ నాయనా! నన్ను చూసి నువ్వు ఇవి నేర్చుకోకు. సదాచారానికి భిన్నంగా ఏనాడూ ప్రవర్తించకు. గృహస్థాశ్రమానికి నిర్ణీతాలైన ధర్మాలను స్థిరంగా ఆచరించు. ఇదిలోక శ్రేయస్సుకు చాలా అవసరం. ఎట్టి పరిస్థితులలోనూ అన్యథా ప్రవర్తింపకు - ఎందుకంటే - సమాజంలో ఉత్తముడు ఏది ఆచరిస్తే దాన్నే ఇతర జనమూ ఆచరిస్తుంది. ఉత్తముడు. దేన్ని ప్రమాణంగా స్వీకరిస్తే తక్కిన లోకమూ దాన్నే అనుసరిస్తుంది.**

కుమారా కార్తవీర్యా! యోగసిద్ధుడికి కర్మభయంలేదు. పూర్తిగా భయాతీతుడు. అందుచేత విధినిషేధాలు ఇతడికి సమానం. నిషిద్ధ కర్మలు అని ప్రక్కనపెట్టడు, విహితసత్కర్మలు అని చేపట్టడు. పసిబిడ్డలాగా ప్రవర్తిస్తూ వుంటాడు. ఇతడు ఆత్మరతుడు. ఆత్మ తృప్తుడు. ఇతడికి ఆచరించదగిన కర్మ అంటూ ఏదీ వుండదు. ఆచరించినందువల్ల లాభంగాని ఆచరించనందువల్ల నష్టంగానీ ఏదీ యోగికి ఉండవు. అసలు ఇతడికి ఈ సమస్తంలోనూ ఏ ప్రయోజనం లేదు. **ఈ లోకంలో ఇద్దరే ఇద్దరు - ఎల్లవేళలా పరమానందంలో మునిగి తేలుతుంటారు. ఒకడు యోగ యుక్తుడైన కర్మ భయాతీతుడు. ఇంకొకడు- బుద్ధి కూడా అందని స్థానాన్ని అంటే బ్రహ్మైక్యాన్ని పొందినవాడు.**

కార్తవీర్యా! ఇక ఇంటికి వెళ్ళు నీరాజ్యాన్ని నువ్వు పాలించు. రక్షించు. అది నీ ధర్మం యజ్ఞాలతో దేవతల్నీ శ్రాద్ధాలతో పితృదేవతల్నీ దాన ధర్మములతో బ్రాహ్మణులను సంతృప్తి పరచు. అప్పుడప్పుడూ దర్శనానికి వచ్చి నన్ను ఆనంద పెట్టు. అవ్యగ్ర చిత్తుడవై నన్ను నిరంతరం స్మరిస్తూవుండు. నేను బోధించిన జ్ఞానాన్ని, నేను కలిగించిన అనుభవాన్ని ఏనాడూ మరచి పోకూడదు సుమా! ఏకాగ్ర చిత్తంతో తత్వాన్ని ధ్యానించు. ఇంకా నేనేమి చెప్పానో అన్నింటినీ ఆచరించు వెళ్ళిరా.

దత్తస్వామి ఇలా ఆజ్ఞాపించేసరికి కార్తవీర్యార్జునుడు మరొక్క మారు సాగిలపడి మ్రొక్కి లేచి మనసంతా ఆనందంతో పులకరించిపోతూ వుండగా కళ్ళవెంబడి ఆనంద భాష్పములు చిమ్ముతూ ఉండగా అక్కడ వున్న ఋషి మండలికి ప్రదక్షిణంచేసి, నమస్కరించి అందరి ఆశీస్సులు అందుకొని సెలవు తీసికొని బయలుదేరాడు.

వెనక్కి వెనక్కి తిరిగిచూస్తూ వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళాడు. మాహిష్మతీనగరం చేరుకొని యథావిధిగా పరిపాలన సాగించాడు. గురూపదేశాన్ని అక్షరాలా పాటిస్తూ రాచకార్యములు నిర్వహిస్తున్నాడు.

సంవత్సరకాలం గిర్రున తిరిగిపోయింది. ఒకనాడు బయలు దేరి సహ్యాద్రి పర్వతానికి చేరుకుని స్వామి దగ్గరకు వచ్చి దత్తస్వామికి అక్కడ వున్న మునిజనులందరికీ నమస్కరించాడు. స్వామి ఆదరంగా దగ్గరకు పిలచి చేరువలో కూర్చోపెట్టుకున్నాడు. కుశల ప్రశ్నలు అయినాయి. నాయనా! ఏదో అడగాలని వచ్చినట్లున్నావు. సంశయం దేనికి? అడుగు అని ప్రోత్సహించేసరికి కార్తవీర్యుడు సవినయంగా తన సందేహాన్ని ఇలా బయటపెట్టాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

దత్త దేవా! మహానుభావా! నీ దయవల్ల వినవలసిందంతా వినేశాను. తెలుసుకో దగింది తెలుసుకున్నాను. కానీ కొన్ని సందేహాలు మళ్ళీ కలుగుతున్నాయి. లోకాన్ని చూస్తుంటే క్రొత్త క్రొత్త ప్రశ్నలు పుడుతున్నాయి. సత్కార్మాచరణవల్ల కలిగే పుణ్యమూ దుష్కర్మాచరణవల్ల కలిగే పాపమూ నీ ముఖతః విపులంగా తెలుసుకోవాలని నా కోరిక. అంతకన్నా ముందు మరొక సందేహం నాకు తీర్చాలి. మనిషి సుఖాభిలాషికదా! మరి కావాలని కష్టాలు ఎందుకు కొని తెచ్చుకుంటాడు? మాఘమాసం గడ్డుకాలం (శీతాకాలం) ఎముకలు కొరికే చలిలో తెల్లవారు జాముననే లేచి ఆ బాలవృద్ధులు నదీ కూపతటాకాల్లో చన్నీటి స్నానాలు చేస్తారెందుకని? ఇది ఏమైనా వ్రతమా? అయితే దాని ఫలమేమిటి? బహుశా నాలానే ఈ మునులందరూ కూడా వినాలని కుతూహల పడ్తునట్లుగా వుంది. దయ చేసి వినిపించు.

## మాఘమాస మాహాత్మ్యం

మాహిష్మతీపురాధీశా! మంచి ప్రశ్నవేశావు. వెనుకటికి బ్రహ్మదేవుడు నారదుడుకి చెప్పాడు. మాఘస్నాన ఫలం బహుదొడ్డది. ఆత్మ స్వరూపాన్ని విస్మరించిన సకామకర్ములకి అభీప్సిత సుఖసంతోషాలు ప్రసాదిస్తుంది. నిష్కామకర్ములకు అంతర్బహిశ్శుద్ధితో పాటు నెమ్మదిగా ఆత్మ ప్రకాశాన్ని అందిస్తుంది. అది అంతా చెబుతాను. అందరూ శ్రద్ధగా ఆలకించండి. దేశం-తీర్థం శ్రద్ధ-ఆచరణ-వీటిలో ఉండే తారతమ్యాలను బట్టి మాఘస్నాన ఫలంలోనూ హెచ్చు, తగ్గులు ఉంటాయి. మన భారతవర్షం విశేషించి కర్మభూమి. ఇక్కడ జన్మించి మాఘస్నానాలు చెయ్యని వాని బ్రతుకు వ్యర్థం.

మాఘ స్నానం చెయ్యనివాడు ఎన్ని సత్కర్మలు చేసినా (ఇతరములు) అవన్నీ నిష్ఫలమైపోతాయి. సూర్యుడులేని ఆకాశంలాగా, ఇంద్రుడు లేని స్వర్గంలాగా, వెల వెలాపోతాయి. ఈ వ్రతం కేశవుడికి అత్యంత ప్రీతిపాత్రం. మిగతా దానధర్మాలు జపతపాలు కలిగించే ఆనందంకన్నా శ్రీ హరికి ఇది కలిగించే ఆనందం ఎన్నో రెట్లు ఎక్కువ. సూర్యుడి తేజస్సుకు సాటి వచ్చేకాంతి మరొకటి లేనట్లే మాఘ స్నానానికి సాటి వచ్చే క్రతువుకానీ క్రియగానీ మరొకటి లేదు.

అందుచేత వాసుదేవుడికి ప్రీతికరంగా సర్వ పాపపావనోదకం స్వర్గలోక సంపాదకం - ఈ మాఘస్నాన వ్రతాన్ని ప్రతి మానవుడూ శ్రద్ధగా ఆచరించాలి. ఈ కలియుగంలో దీన్ని మించిన వ్రతంలేదు. మాఘ స్నానం చెయ్యకుండా మలినమైన దేహాన్ని కండలు పట్టించి సుందరంగా పెంచి పోషించి ఏమి ప్రయోజనం? ఎముకలు నిలిపి స్నాయువుతో కట్టి మాంసమూ, రక్తమూ నింపి, చర్మంతో కప్పిన ఈ దేహం మూత్ర పురీషాలతో కంపుకొడుతుంది. పొంచి వున్న ఆపదలాంటి ముసలితనంలో ఇది ఒక రోగ మందిరం. మలినమయం. సర్వదోష నిలయం. ఇది ఏ నిమిషాన చెయ్యని పిచ్చి పని ఉన్నదా? ఇతరుల్ని ఏడిపిస్తాం. పాపాలు చేస్తాం. ఆర్తి కలిగిస్తాం.

ద్రోహాలు చేస్తాం. ఒకటేమిటి దీనికోసమని అరిషడ్ వర్గానికే ఊడిగం చేస్తాం. ఇంత చేస్తే ఇది పరమ పిశునం. పరమ కృతఘ్నం, క్రూరం, క్షణికం. దగాచేసి చటుక్కున రాలిపోతుంది. ఒక్కరోజు పోషణమానితే కంపు కొడుతుంది. ఇది వాతపిత్తాదిదోషత్రయ విభూషితం. దీన్ని తృప్తి పరచడం ఎవడివల్లా కాదు. దీని కోరికలు తీర్చడం అసంభవం. దీని అహంకారం అంతా ఇంతానా? తాపత్రయ విమోహితం. నిజానికి ఇదొక చిల్లులగంప. దీని స్వభావం చాలా చిత్రంగా వుంటుంది. ధర్మాచరణం కన్నా అధర్మాచరణం అంటేనే స్వతహాగా ఇది ఇష్టపడుతుంది. దీనికున్న తృష్ణలు

(కోరికలు) అబ్బో అసంఖ్యాకం. అందుకే ఇది నరక ద్వారానికి ఎప్పుడూ చేరువలో ఉంటుంది. ప్రాణవాయువు బయటకు పోగానే పురుగులు పడుతుంది. లేదా కుక్కలకీ నక్కలకీ ప్రీతి పాత్రమవుతుంది. లేదా ఇంత మట్టిగానీ పిడికెడు బూడిదగాని అవుతుంది. ఇలాంటి నశ్వరమైన ఈ శరీరానికి కనీసం మాఘస్నానమైనా లేకపోతే అది ఇంకెంత వ్యర్థమో ఆలోచించు.

విష్ణు భక్తిలేని విప్రుడు. యోగి (భోక్తగా) లేని శ్రాద్ధం. బ్రాహ్మణుడు లేని రాచరికం సదాచారం లేని వంశం - ఇవి నిరర్ధకాలు. దంభంతో కూడిన ధర్మం, క్రోధంతో కూడిన తపస్సు, సంశయంతో కూడిన జ్ఞానం. ప్రమాదంతో కూడిన శ్రుతం- ఇవి కూడా వ్యర్థాలు. పతిభక్తి లేని ఇల్లాలు. స్త్రీ సాంగత్యం మరిగిన బ్రహ్మచారి, ప్రజ్వలించని అగ్నిలో వేసిన హోమం. సాక్షిలేని భుక్తి, పరపోషణలో వున్న కన్య, తనపొట్టకోసమే చేసుకున్న వంట, శూద్ర బిక్షతో యాగం, లోభి దగ్గరున్న ధనం అభ్యాసానికి దూరమైన విద్య, శత్రుత్వాలు పెంచుకొనే రాజు, పొట్ట కూటికోసం చేసే తీర్థయాత్రలు, వ్రతాలు, సత్య దూరమైన వాక్కు, సంధిగ్ధమైన మంత్రం, పై శూన్యమైన సంభాషణం, వ్యగ్ర చిత్తమైన జపం - ఇవన్నీ వృధా, వృధా. అశ్రోత్రియుడికి ఇచ్చిన దానం, నాస్తికమైన లోకాలు, శ్రద్ధలేని ఆముష్మిక కర్మలు - వ్యర్థం. అలాగే మాఘస్నానం లేని మానవజన్మ కూడా వ్యర్థం. సూర్యుడు మకరంలో ఉదయిస్తున్న వేళ మాఘస్నానం చెయ్యనివాడు, పాపాలు పోగొట్టుకోగలడా, స్వర్గం చేరుకోగలడా ? అసంభవం.

రాజా మాఘమాసంలో సూర్యోదయవేళ నదీ జలాలన్నీ పంచమహాపాతకులనూ, ఉపపాతకులనూ, చూసి-రండి, రండి. దయచేసి ఒక్కసారి మా నీటిలో మునగండి. మీ పాపాలు తొలగించుకోండి. మంచి తరుణం మించిన దొరకదు. అని గొంతెత్తి పిలుస్తాయి-తెలుసా. మాఘమాసం వచ్చిందంటే సకల పాపాలూ - వీడు మాఘస్నానం చేస్తాడేమో మనకు పోయే కాలం దాపురిస్తుందేమో అని గడ గడా వణికి పోతుంటాయి. మాఘస్నానం చేసినవారు- మబ్బుల చెర వదలిన చంద్రకిరణాల్లాగా నివురు రాల్చిన నిప్పుల్లాగా పాప విముక్తులై కళ కళ లాడతారు.

మనో వాక్కాయకర్మలతో చేసిన పాపాలన్నీ అవి చిన్న వైనా పెద్దవైనా, తెలిసి చేసినవైనా, తెలియక చేసినవైనా ఆర్ద్రాలైనా, శుష్కాలైనా మాఘస్నానంతో దగ్ధమైపోతాయి. అగ్నిలో పడిన సమిధల్లాగా హృతమైపోతాయి. రాజా ! పాపాత్ములు మాఘ మజ్జనం చేస్తే పాప విముక్తులై శుద్ధి పొందుతారు. పుణ్యాత్ములు చేస్తే సరాసరి స్వర్గం పొందుతారు. ఇందులో ఏ సందేహమూ లేదు. విష్ణు భక్తి విషయంలోలాగానే దీనికి అందరూ అధికారులే అర్హత. అనర్హత అన్న ప్రశ్నేలేదు. మాఘమాసం అందరికీ అన్నీ ఇస్తుంది. అందరి పాపాలు తొలగిస్తుంది. మాఘ స్నానమే మహామంత్రం. మాఘస్నానమే మహా తపస్సు. మాఘ స్నానమే అన్నింటికీ ప్రాయశ్చిత్తం. మాఘ స్నానమే సర్వోత్తమం. సంసారమహాకిల్బిషాలను ప్రక్షాళన చెయ్యగలిగిన ఆధ్యాత్మ జ్ఞాన కౌశల్యం శతానేక జన్మాంతర పుణ్యంవల్ల గానీ లభించదన్నారు. అలాగే మాఘస్నానం చెయ్యాలి అనే కోరిక జన్మాంతర సంస్కారం వల్లకానీ కలుగదు. పావనాలలోకెల్లా పరమ పావనం - మాఘస్నానం. సర్వ కామ్య ఫలప్రదం. ఒక్కసారి మాఘ మజ్జనం చేస్తే చాలు ఆ చంద్ర తారార్కంగా ఇహ - పరలోక భోగాలును అనుభవిస్తారు. ఈ మాఘ స్నాన ఫలాన్ని చెప్పే ఇతి హాసం ఉంది చెబుతాను ఆలకించు.

కార్తవీర్యా భృగువంశంలో ఒక బ్రాహ్మణాంగన ఉంది. ఋచీక అని పేరు. దురదృష్టవశాత్తూ బాల్యంలోనే వైధవ్యం సంప్రాప్తించింది. ఆ దుఃఖం తట్టుకోలేక ఘోరంగా తపస్సు చేసింది. వింధ్యాచలం చేరువలో ప్రవహిస్తున్న రేవానది

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ఒడ్డున అకరంటకం అనే క్షేత్రంలో తీవ్ర తపస్సు చేసింది. నారాయణ ధ్యాన పరాయణగా, సదాచారవతిగా, సంగ వివర్జితగా, జితేంద్రియగా, జితక్రోధగా, సత్యవాదినిగా, మిత భాషిణిగా, సుశీలగా, దానశీలగా, దేహశోషణశాలినిగా, నియమ నిష్ఠలతో తపస్సు సాగించింది. ఉంఛ వృత్తితో ధాన్యం గింజలు ఏరి తెచ్చుకొని వాటినివండి అగ్ని కార్యం తీర్చుకొని పితృ-దేవతా- అతిధులకు పెట్టి షష్టకాలంలో తాను భుజించేది. కృచ్ఛ-అతి కృచ్ఛ- పారాక - తప్తకృచ్ఛాది వ్రతాలను ఆచరిస్తూ తపస్సు సాగిస్తోంది. మాఘ మాసం వచ్చిందంటే చాలు నర్మదా నదిలోనూ రేవాకపిల నదీ సంగమ స్థలంలోనూ నిత్యమూ స్నానాలు చేసేది. వల్కలు ధరించి స్థిర చిత్తంతో దృఢ దీక్షతో నారాయణ మహా మంత్రం జపంచేసేది. కొంత కాలానికి ఈ తపో నియమాలతో కృంగి కృశించి ఋచీక తనువు రాలిపోయింది. మాఘస్నానాల పుణ్య ఫలంవల్ల విష్ణులోకంలో నాలుగు వేల యుగాలు నివసించింది. అప్పుడు బ్రహ్మ దేవుడు సుందోపసుందుల్ని నాశనం చేయడం కోసం ఈ ఋచీకను తన సత్యలోకంలో అవతరింప జేసాడు. మాఘ స్నాన పుణ్య శేషంవల్ల సౌందర్యరాశిగా దేవతా సమ్మోహినిగా అప్సరాంగనా శిరోమణిగా బ్రహ్మలోకంలో అవతరించింది. బ్రహ్మ సంబరపడి తన పన్నాగం నెరవేరుతుందని గ్రహించాడు. మృగశాబాక్షీ! దైత్యుల్ని నాశనం చెయ్యాలి. వెంటనే బయలుదేరు - అని ఆజ్ఞాపించాడు.

తిలోత్తమ వీణాపాణియై బ్రహ్మలోకం నుండి ఆకాశ మార్గాన బయలు దేరింది. దేవతా శత్రువులైన ఆ దైత్యులున్న ప్రాంతానికి చేరుకుంది. అది రేవానది అవతలి తీరం. సుందోప సుందులు అక్కడ విడిది చేసి యున్నారు. ఆ గుడారాలకు అల్లంత దూరాన రేవానదికి ఎగువన అశోకవనం ఉంది. అక్కడ తాను దిగింది. దిగుతూనే ఒక కంకేళీ తరుమూలం దగ్గర వీణను ఉంచి తాను నదీ స్నానానికి దూకింది. ఈతలు కొడుతూ ఆనందంగా ఉత్సాహంగా చాలాసేపు జలకాలు ఆడింది. ఆమె తనూ పరిమళాలు నీటిలో కరిగి దిగువకు ప్రవహించాయి.

దైత్య వీరుల ముక్కు పుటాలు ఆశ్చర్యంతో ఆనందంతో స్పందించాయి. స్కంధావారంలో (దైత్యసైన్యం) కలకలం బయలు దేరింది. ఆదివ్య పరిమళం ఎక్కడిదో ఎవరిదో తెలుసుకుందా మని దైత్య గూఢచారులు నాసికలు విప్పార్చుకొని తీరం వెంబడి ఎగువకు నడక సాగించారు. అశోకవనం చేరుకున్నారు. అప్పటికి తిలోత్తమ స్నానం ముగించి మంకెన పువ్వులాంటి నా జూకు చీరను కుచ్చిళ్ళుపోసి కట్టుకొని అదే రంగురవిక తొడుక్కుని నల్లని సిగలో తెల్లని మాలతో కుసుమాలు ధరించి కదులుతున్న కంకణాలూ వదరుతున్న నూపురాలుగునుస్తున్న మణి మేఖలా ధరించి గుండెల మీద ఎగిసిపడుతున్న ముత్యాల దండలతో చిరుగాలికి లాస్యం చేస్తున్న నీలి ముంగురుతో ఆ కంకేళీ వృక్షం మొదటి శిలా వితర్ధిక మీద ముద్దుగా, వయ్యారంగా కూర్చుని వీణను పలికిస్తోంది. దానితో తనూ స్వరం కలిపిపాడుతోంది.

చంద్రకళలాగా హృదయాన్ని పరవసింపజేస్తున్న తిలోత్తమనుదైత్యభటులు చూసారు. ఆశ్చర్యచకితులై ఆనంద పులకితులై చూసారు. క్షణంలో తేరుకొని పరుగు, పరుగున వెళ్ళి సుందోపసుందులకు విన్నవించారు. దేవతాంగనా? దానవాంగనా? నాగాంగనా? యక్షాంగనా? ఏమో తెలీదు. కానీ నారీ రత్నం. సర్వోత్తమ సర్వథా ఉత్తమ. మీరు రత్న భోక్తలు. సృష్టిలో ఉత్తమమైన ఏ వస్తువైనా మీకు స్వాధీనం కావలసిందే ఆమె నారీ రత్నం. ఇక్కడికి చేరువలోనే ఆశోక వనంలో ఒంటరిగా కూర్చొని ఉంది. జగన్మోహనంగా వీణ పలికిస్తోంది. తానూ పాడుతోంది. మన్మధుణ్ని సైతం మోహింపజేసే సౌందర్యం. ఇంతకన్నా మేము వర్ణించలేము. బయలు దేరండి. మీ కళ్ళతో మీరు చూడండి.

గూఢచారులు ఇలా చెప్పేసరికి సుందోపసుందులు బయలు దేరారు. సుందుడు తాగుతున్న మధువును విసిరేసి ఒక్క ఉదుటున నిలబడ్డాడు. అప్సరాంగనలతో కృత్రిమ సరోవరంలో జలకేళి సలుపుతున్న ఉప సుందుడు కూడామదగజంలాగా గట్టుకి వచ్చాడు. ఇద్దరూ వెడదాం అంటే వెడదాం అనుకున్నారు.

కాల దండాల్లాగా భయంకరమైన ఇనుప గదలను భుజాలకెత్తుకొని ఎడమ చేత్తో మీసాలు త్రిప్పుతూ భూమి దద్దరిల్లేలాగా అడుగులు వేస్తు రెండు మహాపర్వతాల్లాగా సుందోపసుందులు బయలు దేరారు. వీరిద్దరిని సంహరించడానికి వచ్చిన చండికలా కూర్చున్న తిలోత్తమ దగ్గరకు వచ్చారు. ఆమె సౌందర్యం ఆమె గాన మాధుర్యం వారిద్దరిలోనూ మన్మధాగ్నిని మరింత ప్రజ్వలింపజేసింది. సోదరా! పోటీకి రాకు. ఈ సుందరిని నేను స్వీకరిస్తాను అంటే నేనే స్వీకరిస్తాను అని ఇద్దరూ వివాదపడ్డారు. అది చిలికి చిలికి గాలివానగా మారింది. గదా యుద్ధంగా మారింది. కాల మహిమ. పరస్పరం చావబాదుకున్నారు. చివరికి సుందోప సుందులు ఇద్దరూ ప్రాణాలు వదిలారు. అయ్యో ! ఈ మహాతల్లి ఎవరో ? ఈవిడ కోసం మన ప్రభువులు ఒకరినొకరు చంపుకున్నారే- అని దైత్యసైన్యం విలపించింది. వజ్రాయుధం నిశ్శబ్దంగా పర్వత శిఖరాలను కూల్చినట్లు ఇద్దరినీ మడియించిన తిలోత్తమ దశదిశలకూ తన వీణా నాదంతో ఈ శుభవార్తను అందిస్తూ ఆకాశానికి ఎగిరిపోయింది. బ్రహ్మలోకం చేరుకుంది.

బ్రహ్మ సంతోషించి చంద్ర ముఖీ! నీకు సూర్యరథంలో స్థానం కల్పిస్తున్నాను. ఆకాశంలో సూర్యుడు ఉన్నంత కాలం నువ్వు సూర్యలోకంలో సమస్త భోగాలను అనుభవించు అని వరం ప్రసాదించాడు.

కార్తవీర్యా! ఆ బ్రాహ్మణి ఋచీక మాఘస్నాన పుణ్యంవల్ల అప్సరోవరాంగనయై తిలోత్తమగా దేవ కార్యం నిర్వహించి అటుపైన అతిదుర్లభమైన సూర్యలోకంలో ఇష్ట భోగాలు ఇప్పటికీ అనుభవిస్తూంది. అందుచేత అందరూ ప్రయత్న పూర్వకంగా శ్రద్ధగా మాఘస్నానాలు చెయ్యాలి. సకల పురుషార్థాలు సిద్ధిస్తాయి. సకల పాతకాలు నశిస్తాయి. నదీ తీరంలో చేసిన మాఘస్నానానికి నువ్వు చేసే కోటి యజ్ఞాలు కూడా సాటి రావు.

## హేమకుండలోపాఖ్యానం

కార్తవీర్యార్జునా! మాఘ స్నానమహిమ తెలిసింది గదా! నీకిప్పుడు అత్యంత పురాతనమైన మరొక వృత్తాంతం చెబుతాను. సదాచారాలను వాటిని ఆచరిస్తే కలిగే పుణ్యాలనూ ఆచరించనందువల్ల వచ్చిపడే అనర్థాలును అన్నీ ఇందులో ప్రస్తావనకు వస్తాయి. కృతయుగం నాటి మాట ఇది.

నైషదమహానగరంలో హేమకుండలుడు అనే వైశ్యుడు వుండేవాడు. కుబేరుడితో సాటి వచ్చే సంపన్నుడు. సత్కులీనుడు. విప్ర-అగ్ని దేవతా పూజలు తప్పక చేసే అలవాటు ఉన్నవాడు. కృషి-వాణిజ్యమూ అతడి ప్రధానవృత్తులు. గోవుల్నీ, గుర్రాల్ని, మహిషాల్ని, కొనడం బాగా పెంచడం ఎక్కువ సొమ్ముకి అమ్మడంతో బాగా ఆర్జించాడు. పాలు,పెరుగు, మజ్జిగ, గడ్డి, గాదం, కట్టెలు, కందమూల ఫలాలు, ఉప్పు, జాజికాయలు, పిప్పళ్ళు, రకరకాల ధాన్యాలు కూరగాయలూ, వంటనూనెలూ, వస్త్రాలూ, ధాతువులూ, బెల్లమూ, కలకండ వంటి చెరకు ఉత్పత్తులు-ఒకటేమిటి అన్నింటినీ క్రయవిక్రయాలు చేసేవాడు. లాభాలు బాగా గడించేవాడు. ఎనిమిదికోట్ల సువర్ణ టంకాలు నిలువజేసాడు. సంపన్నులలోకెల్లా సంపన్నుడయ్యాడు. అమ్మడం - కొనడం, లాభాలు గడించడం- ఈ వ్యాపకంలోనే అతడికి

తెలియకుండానే వయస్సు గడిచిపోయింది. చెవుల దగ్గర జుట్టు తెల్లబడింది. ఓహో వార్ధక్యం ముంచుకొస్తోంది అని గ్రహించాడు. ఒక్క నిముషం గాఢంగా ఆలోచించాడు. సంపాదించిన ధనంలో ఆరవవంతు తీసి చకచకా ధర్మ కార్యాలు చేసాడు. శివ-విష్ణుదేవాలయాలు కట్టించాడు. సముద్రం అంతటి చెరువు త్రవ్వించాడు. నూతులూ, దిగుడు బావులూ, సరోవరాలు, అనేకం ఏర్పాటు చేయించాడు. వట-అర్క-అశ్వత్థ-కంకేళీ-జంబూ-నీపాది వృక్షాలతోవనాలు, పుష్పతరులతానికుంజాలతో ఉద్యానవనాలు పెంపొందింపజేసాడు. ఉదయం నుండి సాయంకాలం వరకు నిత్యమూ నిరతాన్న దాన పథకం అమలు జరిపాడు. నగరం వెలుపల నాలుగు దిక్కులా అందంగా చలివేంద్రాలు ఏర్పాటుచేసాడు. పురాణాలు చెప్పిన శోడశమహాదానాలు చెయ్యమన్న వేళ చెయ్యమన్న చోట చెయ్యమన్న తీరుగా చేసాడు.

చివరకు యావజ్జీవ ప్రాయచ్ఛిత్తం కూడా యధావిధిగా జరిపించుకున్నాడు. యోగ్యులు సమర్ధులు అయిన తనకుమారులు శ్రీకుండల-వికుండలుల కిద్దరికీ ఇల్లూ వాకిలీ మిగిలిన సంపదా అప్పగించి తాను భార్యతో కలసి వాన ప్రస్తానికి వెళ్ళిపోయాడు. అక్కడ గోవింద నామస్మరణ జేస్తూ తపోనియమాలతో దేహాన్ని కృశింపజేసి ఒక శుభగడియలో అనాయాసంగా విష్ణు సాయుజ్యం పొందాడు.

కొడుకుల హయాం వచ్చింది. దానధర్మాలు బందు అయిపోయాయి. సహాయ సహకారాలు అంతరించి పోయాయి. అహంకారమూ అతిశయమూ ఇబ్బడి ముబ్బడిగా వచ్చి పడ్డాయి. పొగడ్తలతో లోబరుచుకొని అక్రమాలు, అన్యాయాలు చేయించేవాళ్ళు చుట్టూతా చేరారు. అన్నదమ్ములిద్దరూ దుర్వ్యసనాలలో పూర్తిగా చిక్కుకుని పోయారు. అమ్మచెప్పినా బంధువర్గం చెప్పినా హితం కోరి తండ్రి, స్నేహితులు, జ్ఞానవయోవృద్ధులూ చెప్పినా అన్నదమ్ముల చెవులకు ఏమంచీ ఎక్కలేదు. వీరిని దగ్గరకు చేరనివ్వలేదు. గానా బజానాలతో, మేజువాణీలతో, విటవిటీ గోష్టులతో తందాన గాళ్ళతో (స్తోత్ర పాఠకులు) రేయింబవళ్ళు, ఒక్కలాగా గడుపుతున్నారు. విలువైన వస్త్రాలు, ఖరీదైన ఆభరణాలు, సుగంధపరిమళ ద్రవ్యాలు, కస్తూరీ చందనాలు, మల్లికా కుసుమ మాలలు, ముత్యాల దండలు, గజ వాజీరథ క్రీడలు, సజీవ నిర్జీవ ద్యూతాలు, మధు పానాలు, మాంస భక్షణలు, వార స్త్రీ సంభోగాలు, పరదారాభి గమనాలు, వీటిన్నింటికోసం ధనాన్ని మంచి నీళ్ళలా ఖర్చుపెట్టారు. వంద ఇవ్వవలసిన చోట వెయ్యి విసిరారు. వార స్త్రీ - విట -శైలూష - మల్ల- చారణ - వంది బృందాలు బాగా బాగుపడ్డారు. అనవసర - అసత్కార్యవ్యయాలతో పిత్రార్జితమంతా ఊసర క్షేత్రంలో పోసిన విత్తనాలయ్యింది. సభ్య సమాజంకోసం ఖర్చుపెట్టలేదు. బ్రాహ్మణముఖతః ఖర్చుపెట్టలేదు. సర్వ పాప వినాశకుడైన శ్రీ మహావిష్ణువు సమార్చనకోసం ఖర్చు చేయలేదు. కానీ ధనమంతా ఖర్చయిపోయింది. వాళ్ళకే తెలియకుండా వ్రేళ్ళ సందుల నుండి జారిపోయింది. తమ తండ్రి దశాబ్దాలు శ్రమపడి కూడబెట్టిన సొమ్మును కొడుకులిద్దరూ రెండేళ్ళలో ఖర్చుపెట్టారు. అలవాట్లకు అవసరాలకు ధనం కావలసివచ్చింది. స్థిరాస్థులు కరిగిపోయాయి. ఆ తర్వాత ఆభరణాలకు, విలువైన సామాగ్రికి కాళ్ళు వచ్చాయి. ఇంతకాలమూ తమ చుట్టుతా చేరి భజన చేసిన బృందాలన్నీ మాయమయ్యాయి.

ఉద్యోగులూ, సేవకులూ అందరూ వదలి వెళ్ళారు. అన్నదమ్ములిద్దరూ మిగలారు. ఆ ఇంటిలో ఆకలికి ఇవేమీ తెలీవు కదా! స్థితిలో వచ్చిన హెచ్చు తగ్గులు దానికేమి తెలుస్తాయి. లోలోపల అది దహించివేస్తోంది. ఇరుగు పొరుగు

ఇళ్ళల్లో చిన్న చిన్న దొంగతనాలు మొదలు పెట్టారు. ఇది నలుగురికీ తెలిసి ఛీ ఛీ అన్నారు. లోకానికి భయపడి, రాజదండనలకు భయపడి అన్నదమ్ములు ఇద్దరూ ఊరు వదలి అడవికి పారిపోయారు. అక్కడ రకరకాల జంతువుల్ని వేటాడి పక్షుల్ని సంహరించి పళ్ళూ ఫలాలూ తిని కొన్ని సంవత్సరాలు హాయిగా జీవనయాత్ర సాగించారు. వేట - మాంసం ఈ వైశ్యకుమారులిద్దరూ భిల్లవీరుల్లా తయారయ్యారు. మనస్సులో కోమలత్వం పోయి క్రూరత్వం చోటు చేసుకుంది. చిట్టిపొట్టి జంతువుల్ని విడిచిపెట్టి సింహశార్దూలాలని వేటాడటం మొదలు పెట్టారు. ఇద్దరూ పోటీలు పెట్టుకొని క్రూర మృగాల్ని వేటాడుతున్నారు. ఆనందిస్తున్నారు.

ఒక రోజు శార్దూలాన్ని వెంట తరుముతూ శ్రీ కుండలుడు ఒక కొండగుహలోకి ప్రవేశించాడు. మరో క్రూర మృగాన్ని వెంటాడుతూ వికుండలుడు వేరొక గాఢారణ్యంలోకి ప్రవేశించాడు. అంతే - గుహ నుండి బయటకు రాలేదు అతను. గాఢారణ్యం నుండి బయటకు రాలేదు ఇతను. అన్నదమ్ములు ఇద్దరూ ఇంక కలుసుకున్నదిలేదు. జేష్టుడు శార్దూలానికి, కనిష్టుడు సర్పజాతికీ ఆహారమయి పోయారు. వింత ఏమిటంటే పాపిష్టులిద్దరూ ఒకే రాత్రి ఒకే సమయాన మృతి చెందారు.

యధావిధిగా యమదూతలు వచ్చారు. బంధించి ఇద్దర్నీ యముడి సన్నిధికి తీసుకుపోయారు. యమ ధర్మరాజు చిత్ర గుప్తుడ్ని అడిగి వీరి వివరాలు అడిగి తెలుసుకున్నాడు. జ్యేష్టుడ్ని రౌరవ నరకంలోకీ, కనిష్టుడ్ని స్వర్గంలో వదలి రమ్మని ఆజ్ఞాపించాడు. యమ దూతలు ముందు మొదటి పని చేసారు. మధుర సంభాషణలతో రెండో వాడ్ని స్వర్గానికి తీసికొని వెళ్తున్నారు.

నాయనా! పద పద నువ్వు చేసిన పుణ్యకార్యాలకి సరిపడా స్వర్గ సుఖాలు అనుభవించుదువుగాని స్వర్గంలో వదలివస్తాం- అని వాళ్ళు బుజ్జగిస్తుంటే వికుండలుడికి పెద్ద సందేహం వచ్చింది. నేను ఏం సత్కర్మలు చేసాను చెప్మా- అని బుర్ర తడుముకున్నాడు. ఏదీ తోచలేదు. అన్నగారితో సమానంగా అన్ని పాపాలు తనూ చేసాడు. అన్నగారితో సమానంగా దుర్మరణం పాలయ్యాడు. అన్నతో సమానంగా యమదర్శనం చేసాడు. అంచేత అన్న గారితో సమానంగా రౌరవ నరకం తనకూ దక్కాలి. మరి ఈ స్వర్గ ప్రాప్తి ఏమిటీ? ఎక్కడ ఏ పొరపాటు జరిగిందో ఎంతకీ అర్థం కాలేదు. ఎందుకొచ్చిన చింత దూతల్ని అడిగి తెలుసుకుంటే పోలే - అనిపించింది అడిగేశాడు.

వికుండలా! తల్లి-తండ్రి- కొడుకు - భార్య - కోడలు- అన్న- తమ్ముడు - అక్కచెల్లెలు - ఈ వరుసలు ఈ అనుబంధాలు పుట్టుకని బట్టి ఏర్పడతాయి. కర్మలు అనుభవించడానికి ఇవి భూమికలు - ఎక్కడెక్కడివో పక్షులు ఒక చెట్టు మీద వాలినట్లు ఒక ఇంటిలో వీరందరి కలయికానూ. వీరిలో ఎవరి కర్మ ఫలాన్ని వారే అనుభవిస్తారు తప్ప ఒకరిది ఇంకొకరు పులుముకుందామన్నా రాదు. బదలాయిద్దామంటే పోదు.

వైశ్య కుమారా! నిజం చెబుతున్నాను. ఎవడు చేసుకున్న కర్మఫలం - అది మంచిగానీ చెడు గానీ - వాడు అనుభవించవలసిందే. నీ అన్నగారు మహాపాతకాలు చేసాడు. అందుకని వాటి ఫలంగా రౌరవ నరకంలో పడ్డాడు. నువ్వు ఏదో పుణ్యం చేసావు కనుకనే స్వర్గ సుఖాలు అనుభవించడానికి వెడుతున్నావు.

యమదూతోత్తమా! నువ్వు చెప్పేది నిజమే, ఒప్పుకుంటాను. కానీ చిన్నప్పట్నించీ నేను పాపాలు తప్పఒక్కటంటే

ఒక్కటైనా పుణ్య కార్యం అయినా చేసి ఎరుగను. నా మనస్సు సత్కర్మలకు ఇష్టపడదు. ఈ జన్మలో నేను చేసిన వన్నీ పాపకార్యాలే. ఏ సుకృతం చేసానో ఎంతకీ తోచడం లేదు. నీకు గనుక తెలిస్తే చెప్పి పుణ్యం కట్టుకో.

వికుండలా! నువ్వు చేసిన సుకృతం నీకు తెలీదు. నాకు తెలుసు. చెబుతాను విను. ఒకనాడు నీవు క్రూర జంతువును వేటాడుతూ గాఢారణ్యంలోకి వెళ్ళావు. మళ్ళీ నీ అన్నగారిని కలుసుకోలేదు. గుర్తుందా? గాఢారణ్యంలో తిరుగుతూ యమునా నదికి దక్షిణం ఒడ్డున సుమిత్రుడు ఆశ్రమంలోకి వెళ్ళావు. అతడు హరిమిత్రుడి కొడుకు. వేద వేదాంగ పారంగతుడు. బ్రహ్మ జ్ఞాని. జితేంద్రియుడు. ఆ పుణ్య ప్రదమైన ఆశ్రమంలో ఆ మహానుభావుడితో నీవు సఖ్యం చేసావు. అని మాఘమాసం చివరి రోజులు. సత్సాంగత్య ప్రభావంతో నువ్వు ఆ రెండు నాళ్ళు మాఘ స్నానాలు చేసావు. యమునా నదిలో కాళిందీ పుణ్య జలాలలో పాప ప్రణాశని అనే సార్ధక నామ ధేయం గల రేవులో (తీర్థం) నువ్వు చేసిన మొదటి స్నానానికి సర్వపాప విముక్తి పొందావు. రెండవ మాఘ మజ్జనానికి ఫలంగా ఇదిగో స్వర్గానికి వెళ్తున్నావు. తన పాప ఫలాన్ని నరకంలో నీ అన్న అనుభవిస్తుంటే నీ పుణ్య ఫలాన్ని స్వర్గంలో నువ్వు పొందు. అక్కడ నీకు ఏ సుఖాలు దక్కుతాయో చెప్ప లేను గానీ నీ అన్న మాత్రం - కత్తికోతలు - రుచిచూస్తాడు. గదా ఘాతాలకు బలి అవుతాడు. బండ శిలల క్రింద నలుగుతాడు- కణ కణ లాడే నిప్పుల్లో పొర్లుతాడు.

యమ దూత చెబుతూంటే వికుండలుడి మనస్సు విల విల లాడింది. అయ్యో! అన్నయ్యా! నరక యాతనలు అనుభవిస్తావా అని మూగగా రోదించాడు. ఎవడి కర్మ వాడు అనుభవించవలసిందే. గుర్తుకి వచ్చింది. వెంటనే తేరుకుని వినయంగా మధురంగా ఇలా అడిగాడు.

దూతవరా! ఇప్పుడు మనం మిత్రులమయ్యాం. ఏడు అడుగులు కలిసి నడిస్తే చాలు సజ్జనులకు మైత్రి కుదిరినట్లే కదా! మనం కలిసి ఏడడుగులు ఏమిటి చాలా దూరం నడిచాం. అదీ మధురంగా మాట్లాడుకుంటూ నడిచాం. అందుచేత మనం మిత్రులు అయ్యాం. ఈ మైత్రిని పురస్కరించుకొని అడుగుతున్నాను. అన్నీ తెలిసిన వాడివి. దయచేసి నా సంశయం తీర్చు. మానవులు ఏ కర్మలు చేస్తే యమలోకాన్ని దర్శించకుండా తప్పించుకుంటారు? ఏ కర్మలు చేస్తే నిరయు(నరకము)లో పడతారు? ఇది కొంచెం తెలియజెప్పు?

## యమదూత కృత ధర్మ ప్రబోధం

వైశ్య కుమారా! చాలా మంచి ప్రశ్న వేశావు. పాప ప్రక్షాళన కావడంతో నీ మనస్సు విశుద్ధి పొందింది. అందుకని శ్రేయోదాయకాలైన ఆలోచనలు నీకు వస్తున్నాయి. నిజానికి యమ దూతను నేను. సేవా పరాయణుడ్ని. సంభాషణలకి దిగకూడదు. కానీ అడిగావు కనుక మైత్రిని పురస్కరించుకొని నాకు తెలిసినంత వరకు చెబుతాను. గ్రహించు. పర పీడన అనేది నరక హేతువు. ఆలోచనలతో గాని పనులతో కానీ మాటలతో కాని ఎట్టి పరిస్థితుల్లోనూ ఎవరినీ పీడించని వారు నరకాన్ని దర్శించవలసిన పనేలేదు.

ప్రాణి హింసా పరాయణుడు ఐతే అతడు వేద వేదాంగవేత్త అయినా మహాదాత అయినా తపస్వి అయినా యజ్ఞ యాగాదులు వందలు వేలు చేసినా స్వర్గాన్ని పొందలేడు. అహింసయే పరమ ధర్మం. అహింసయే పరమ తపస్సు. అహింసయే పరమ దానం అని మునీశ్వరులు ఎప్పుడూ చెబుతుంటారు.

నల్లులు, దోమలు, చీమలు, మొదలైన అల్పజీవుల్ని సైతం ఆత్మవత్ సర్వభూతాని అన్నట్లు రక్షించే దయాళుడు ఏనాడూ నరకం ముఖం చూడరు. సల సల మరుగుతున్న రక్తంతో యమలోకానికి అగడ్తలావున్న ప్రేత తరంగిణిని (వైతరణి) చూడ వలసిన దుర్గతి వారికి పట్టదు. అలాకాక - పొట్ట కూటికోసం జలచరాలనూ స్థల చరాలనూ హింసించే వాడు కాల సూత్ర నరకంలో పడతాడు. అక్కడ తమ మాంసాన్ని తామే భోజనం చేస్తూ కుళ్ళిన నెత్తురు త్రాగుతూవసాపంకంలో త్రెళ్ళుతూ ఇనుప ముట్టెల పురుగులతో హింసించబడుతూ కటిక చీకటిలో పరస్పరం చితకబాదుకుంటూ దారుణా రావాలు చేస్తూ ఒక మహా కల్పం పాటు నరక యాతనలు అనుభవించి అటుపైన భూలోకంలో స్థావరాలుగా కొన్ని యుగాలు జీవించి ఆ పైన క్రూర జంతు జన్మలు ఎత్తి చివరకు కుంటి గ్రుడ్డి కుష్టురోగి దరిద్రుడు అంగహీనుడుగా మానవజన్మ ఎత్తుతాడు. ప్రాణి పీడలకు శిక్ష ఇది. అందుచేత ఓ వైశ్య కుమారా! మనసా వాచా కర్మణా ఎవరికీ ఎన్నడూ ద్రోహం చెయ్యకూడదు. పీడ కలిగించకూడదు. ఇహ పరాలలో హితం కోరుకునే ధర్మజ్ఞుడు ఎవ్వడూ పరపీడనకు ఒడిగట్టడు. ప్రాణి హింస చెయ్యని వాడు నరకానికి భయపడవలసిన పని లేదు. సర్వ ధర్మాలకు పరాకాష్ట అహింస అనేది.

తిన్నగా ప్రవహించేవి వంకర టింకరగా ప్రవహించేవి - నదులన్నీ కట్ట కడపటికి సముద్రంలో లీనమైనట్లు సర్వ ధర్మాలు అహింసలో సంగమిస్తున్నాయి. తన చుట్టూతా వున్న ప్రాణికోటికి తానేమీ హాని చెయ్యకుండా అభయమిచ్చినవాడు సర్వతీర్థాలలోనూ స్నానం చేసినంతటి పుణ్యాన్ని సర్వయజ్ఞాలూ ఘనంగా చేసినంతటి ఫలాన్నీ పొందుతాడు.

శాస్త్ర విహితంగా తమ తమ వర్ణాశ్రమ ధర్మాలను పాటించని వారు యమలోకం చాయలకైనా పోవలసిన పని ఉండదు. బ్రహ్మచారి - గృహస్థుడు - వానప్రస్థుడు - యతి - వీరంతా స్వధర్మనిరతితో జీవికసాగిస్తే చాలు. చనువుగా వెళ్ళి స్వర్గలోకం వీపెక్కి కూర్చుంటారు. వీరు జితేంద్రియులు కూడా అయితే సరాసరి బ్రహ్మలోకమే చేరుకుంటారు. ఇష్టా పూర్తాలు నిర్వహించినవారు నిత్యమూ పంచయజ్ఞాలు చేసేవారు దయాన్వితులూ నిత్యాగ్ని హోత్రులూ వీరంతా స్వర్గప్రాప్తికి అర్హులు. రణ రంగంలో శత్రువులు చుట్టుముట్టినా ఎంతటి విపత్కర పరిస్థితి దాపురించినా దీనాలాపాలు పలకని మహాశూరులు సూర్యమండల మార్గం ద్వారా శ్రీ మన్నారాయణుణ్ని చేరుకుంటారు.

వికుండలా! అనాథ స్త్రీ బాల వృద్ధ రోగి సంరక్షకులూ విప్రపోషకులూ వికలాంగ సేవా పరులూ శరణన్న వారిని కాపాడటం కోసం ప్రాణాలు వదిలిన వారూ సరాసరి స్వర్గం చేరుకుంటారు. శాశ్వతంగా అక్కడే వుంటారు. ఊబిలో కూరుకుపోతున్న ఆవునూ, రోగ పీడితుడైన విప్రుణ్నీ ఉద్ధరించిన పుణ్యాత్ములు అశ్వమేధుల లోకం చేరుకుంటారు. గోవులకు గడ్డీ గాదం వేసి సకల శుశ్రూషలు చేస్తూ ఏనాడు వృషభం నడిబొడ్డున ఎక్కకుండా గో సేవా పరాయణులై కాలం గడిపినవారు ఆయువు తీరాక కచ్చితంగా గోలోక వాసులవుతారు. గోవులు దాహం తీర్చుకోడానికి వీలుగా గొయ్యితవ్వి నీళ్లు పెట్టిన పుణ్యాత్ముడు ఈలోకాన్ని కన్నెత్తి చూడకుండా స్వర్గానికి చేరుకుంటాడు.

వాపీకూప తటాకాలను నిర్మింపజేసిన దాతల పుణ్యానికి అంతు వుండదు. వాటిలో నీళ్ళను త్రాగి ఒక్కొక్క ప్రాణీ దప్పిక తీర్చుకుంటుంటే దాతల పుణ్యం రెట్టింపు అవుతూ వుంటుంది. కనక వారికి అక్షయ స్వర్గలోక నివాసమే.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ప్రాణి కోటికి జీవనం, ప్రాణులు త్రాగు నీటిలో వున్నాయి. అంచేత చలివేంద్రం ఏర్పాటు చేసి బాటసారులకూ పశుపక్ష్యాదులకూ నీరందించి దప్పికతీర్చే మహానుభావులు ఇహలోకం విడిచాక శాశ్వతంగా స్వర్గసీమలోనే నివసిస్తారు.

మిత్రమా! ఒక రావి చెట్టు, ఒక వేప చెట్టు, ఒక మర్రి చెట్టు, మూడేశి వెలగ చెట్లు - ఉసిరిక - మారేడు చెట్లు - అయిదు మామిడి చెట్లు - పది చింత చెట్లు - నాటిన వాళ్ళు దేవలోకంలో ఇంద్రభోగాలు శాశ్వతంగా అనుభవిస్తారే తప్ప నరకం ముఖం చూడవలసిన అవసరం వీరికి ఏనాడూ రాదు. ఒడిలో పుట్టి పెరిగి దారితప్పిన పదిమంది సంతానం కన్నా బయటి నేల మీద దారి ప్రక్కన నాటిపెంచిన అయిదుచెట్లు మిన్న - ఫరవాలేదు పత్ర పుష్ప ఫలాలతో ఇవి కూడా పితృతర్పణ చేస్తాయి. అహితాగ్నులై అగ్నిహోత్రులు చేసిన దాని కన్నా పుత్ర సంతానాన్ని పొందిన దానికన్నా దారి ప్రక్కన ఇంత నీడనిచ్చే చెట్టుని నాటినందువల్ల వచ్చే పుణ్యం అత్యధికం. ఇది చేస్తే చాలు అన్నీ యజ్ఞాలు చేసినట్లే. అన్నీ దానాలు చేసినట్లే. పువ్వులతో ఆకులతో కళకళ లాడుతూ పక్షులతో కిలకిల లాడే పచ్చని చెట్టు నరికే మూఢులు పోయేది ఘోరనరకానికే.

## తులసీమహాత్త్యం

వైశ్యకుమారా! ఏ చెట్టును నాటినా పుణ్యమే. తులసి చెట్టును నాటితే ఆ పుణ్యం వర్ణనాతీతం. తులసీ వనం పెంచిన వారు యముణ్ని లెక్కచెయ్యరు. అది సర్వపాపహరం. సర్వవాంఛాప్రదం. తులసీవనం కానీ తులసీ మొక్క గానీ ఏ ఇంట ఉంటే ఆ ఇల్లే ఒక పవిత్ర తీర్థం. మేము యమదూతలం ఆ ఇంటి ఛాయలకు పోవాలన్నా భయపడతాం. తులసి మొక్కను నాటినవారు దాని గింజలూ ఆకులూ ఎన్ని ఉన్నాయో అన్ని వేల సంవత్సరాలు దేవలోకంలో నివసిస్తారు. తులసీ పరిమళం సోకితే పితృదేవతలు సంతోషిస్తారు. గరుడ వాహనాధిరూఢులై విష్ణు లోకం చేరుకుంటారు. నర్మదా దర్శనం, గంగాస్నానం, తులసీదళ సంస్పర్శనం - ఇవి మూడూ పావనకరణ శక్తిలో ఒక కక్ష్యకు చెందినవి. తులసిని నాటినా, పెంచినా, నీరుంచినా, దర్శించినా, స్పృశించినా మానవులకు వాఙ్మనః కాయ సంచితాలైన సకల పాపాలు నశించిపోతాయి. శుక్లపక్షంలోగానీ, కృష్ణపక్షంలోగానీ తులసీ దళాన్ని పరమేశ్వరుడికి దానమిస్తే ఆ పుణ్య ఫలానికి మరింక ఏదీ సాటిరాదు. పిప్పల తరువులు నూరు నాటితే ఆమ్ర వనాలు వెయ్యిపెంచితే వచ్చే పుణ్య ఫలం ఒక్క తులసిని నాటిన పుణ్యాత్ముడు శతాయుతయుగాలు నాకలోకంలో సుఖ సంతోషాలు అనుభవిస్తాడు. తులసీ దళాలతో హరిహరార్చన చేసిన భక్తుడు మరింక గర్భావాస క్లేశం అనుభవించడు. అపునర్భవమైన ముక్తిని పొందుతాడు. పుష్కరాది సకల తీర్థాలు, గంగాది సమస్త పుణ్యనదులూ వాసు దేవాది సర్వదేవతలూ ఒక్క తులసీ దళంలో ఉండటం అపూర్వమైన విషయం (విశేషం).

తులసిని స్వయంగా నాటి నీరు పోషించి ఆ తులసీ దళాలతో శ్రీ హరిని అర్చించిన పుణ్యాత్ములు బ్రహ్మ లోకంలో నిత్య నివాసం పొందుతారు. అంతటిది తులసీ మహిమ. ఇక శివలింగార్చనా మహిమ వివరిస్తాను, తెలుసుకో.

## అతిథిపూజ - సదాచారాలు

దేవతల్ని బ్రాహ్మణుల్ని అతిథుల్నీ నిత్యమూ సంతోష పెట్టేవారు. బ్రహ్మలోక నివాసం పొందుతారు. మూర్ఖుడో, పండితుడో, శ్రోత్రియుడో, పతితుడో ఎవడైనా కానీ గాక - మధ్యాహ్న వేళ ఇంటికి వచ్చిన అతిథి సాక్షాత్తూ బ్రహ్మదేవుడితో సమానం.

కాలిబాటను నడిచి నడిచి అలసిపోయి ఆకొన్న విప్రుడికి గానీ మరొకడికి గానీ అన్న పానీయాలు అందించిన వ్యక్తి అమరలోకంలో చిర నివాసం పొందడం ఖాయం. బాటసారులై వచ్చి ఎవరెవరో అపరిచితులు ఎవరి ఇంట ఆకలిదప్పులు తీర్చుకొని తృప్తిగా వెడతారో ఆ గృహస్తు తనకు బ్రహ్మలోక నివాసాన్ని ఖాయం చేసుకున్నట్లు. మధ్యాహ్నం కానీ సాయంకాలంగానీ భోజనవేళ ఇంటికి వచ్చిన అతిథికి చిన్న బుచ్చుకొని తిరిగి వెళ్ళవలసిన దుఃస్థితి కలిగించని గృహమేధికి మా యమలోకం వైపు రావలసిన పనే ఉండదు. లేదు - లేదు - అనే పలుకు విని రిక్త హస్తాలతో తిరిగివెడుతున్న అతిథి ఆ ఇంటి నుండి జన్మ జన్మార్జితాలైన పుణ్యాలను తీసుకుపోతున్నాడని గ్రహించు.

అతిథి పూజా ప్రభావంవల్ల బ్రహ్మలోకాన్ని అందుకున్న రాజులూ ముని రాజులూ ఎంతోమంది ఉన్నారు. సారాంశంగా చెప్పాలంటే అతిథికి సాటి వచ్చే బంధువులేడు. అతిథికి సాటి వచ్చే ధనం లేదు. అతిథికి సాటి వచ్చే ధర్మం లేదు. అతిథికి సాటివచ్చే హితుడు లేడు. జన్మకి ఒక శివరాత్రి అన్నట్లు జీవితం ముగిసే లోగా ఏదో ఒక పూట ఎవడో ఒక అతిథికి ప్రమాదవశాత్తూనైనా సరే ఇంత భోజనం పెట్టిన గృహస్థు యమలోకానికి బురిడీ కొట్టినట్లే.

పది మందికి అన్నంపెట్టిన వాడు ధగ ధగలాడే దివ్య విమానాల్లో అమృతం ఆరగిస్తాడు. పుణ్య ఫలానికి సరిపడా స్వర్గభోగాలు అనుభవించి అటుపైన స్వర్గ చ్యుతుడై ఉత్తర కురు భూముల్లో భారత వర్షంలో సత్కులంలో జన్మిస్తాడు. వంశ కర్త అవుతాడు. వైశ్య కుమారా భూతకోటికి ప్రాణాలు అన్నంలో ఉన్నాయి. అంచేత అన్నదాత అంటే ప్రాణ దాత అన్నమాటే.

ఒకప్పుడు స్వర్గచ్యుతుడవుతున్న కేసరి ధ్వజుణ్ని చూసి జాలిగొన్న వైవస్వత మహారాజు - కేసరిధ్వజా ! కర్మ భూమికి వెడుతున్న నువ్వు మళ్ళీ స్వర్గానికి రావాలనుకుంటున్నట్లయితే అన్న దానం చెయ్యి - అన్న దానం చెయ్యి- అన్న దానం చెయ్యి - అని ముమ్మారు హెచ్చరించాడు. మిత్రమా! ఇదంతా నేను మా యమధర్మరాజు గారు చెప్పగా విని తెలుసుకొన్నాను. అన్న దానానికి సాటి వచ్చే దానం ఈ భూగోళం మీద ఇప్పటికి లేదు. ఇక ముందు ఉండబోదు. గ్రీష్మం (వేసవి)లో పానీయం దానం చేసినవాడు, హేమంతంలో ఇంధన దానం చేసినవాడూ, ఏ ఋతువులోనైనా అన్న దానం చేసినవాడూ ఏనాడూ నరకయాతనలు పడవలసిన అగత్యం ఏర్పడదు.

వికుండలా! నరకాన్ని తప్పించుకునే ఉపాయం మరొకటి ఉంది. ఇది చాలా గోప్యం అయినా, నీకు గాబట్టి చెబుతున్నాను. శ్రద్ధగా విను. తెలిసో తెలియకో చిన్నవో పెద్దవో పాపాలు అందరూ చేస్తూనే ఉంటారు. అందుచేత ఆరేసి నెలలకి ఒక్కసారి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అప్పుడు మనిషి నిష్కల్మషుడు అవుతాడు. నరకం వైపు తొంగి చూడవలసిన పనే ఉండదు. లేదంటే నరకవాసం తప్పదు. వాఙ్మనఃకాయకర్మలతో చేసిన ప్రతీపాపానికీ ప్రాయశ్చిత్తం ఉంది. అది చేసేసుకుంటే జన్మాంతరంలో దేవ గంధర్వ లోకాలను అందుకోవచ్చు.

వేదాలకు కన్న తల్లి గాయత్రి. ఆ మహామంత్రాన్ని నిత్యమూ జపించే వారికి, మరింక ఏదైనా తారక మంత్రం జపించే వారికి (ఉపాసించే వారికి) ఏనాడూ ఏ పాపము అంటదు. వేద అధ్యయన అధ్యాపన తత్పరులూ నిత్యాగ్ని హోత్రులూ అక్షయ పుణ్యలోకాలను పొందుతారు. ఎల్లప్పుడూ ఏవేవో తీర్థయాత్రలు, వ్రతాలు చేసేవాళ్ళు జితేంద్రియులు కాగలిన వాళ్ళు యమలోకానికి ఎగనామం పెట్టినట్లే. ధర్మశీలుడు, పరాన్న - పరపాకాలను పూర్తిగా పరిత్యజించాలి. పరాన్నం తినడం అంటే పర దుష్కృత్యాన్ని భుజించడమే. ఎవరి నుండి ఏది తీసుకున్నా పర్వాలేదు కానీ భోజనం మాత్రం తీసుకో కూడదు. దారుణం అయిన నరకం ఒకటి ఉంది. అనేస్పృహ ఉన్నవాడెవడూ పరాన్నపాకాలకు ఆశించడు.

రోజూ స్నానం చేసేవాడు మాలోకానికి రాడు. నిత్య స్నానంతో సకల జంతువులూ పాప పంకిలాల నుండి తేలికగా విముక్తమవుతాయి. ప్రాతః స్నానం బాహ్యాభ్యంతర మాలిన్యాలను ప్రక్షాళన చేస్తుంది. నిష్పాపులకు నరకంతో పనిలేదు. స్నానం చెయ్యకుండా భోజనం చేస్తే అది మలభక్షణంతో సమానం. స్నానం చెయ్యని అశుచికి పితృదేవతలు విముఖులవుతారు. స్నానహీనుడైన నరుడే పాపాత్ముడు. అతడే అశుచి. పుష్కలంగా నరకం అనుభవించి అటుపైన అపరిశుభ్ర అనాగరిక జాతుల్లో పునర్జన్మ పొందుతాడు. పర్వదినాన నదీ స్నానం చేసిన సుకృతి ఏనాడూ దుర్గతిని పొందడు. కుత్సిత జన్మలు ఎత్తడు.

యధావిధిగా తిలపాత్రను దానంచేస్తే ఆదాతకు దుస్వప్నదుష్ట ఫలాలు కానీ దుష్ట చింతనలు కానీ అంటవు. యమభయం ఉండదు. లోకంలో ప్రసిద్ధంగా షోడశమహాదానాలు ఉన్నాయి. 1) తులా పురుషదానం 2) హిరణ్యా గర్భదానం 3) బ్రహ్మాండ దానం 4) కల్పవృక్షదానం 5) గోసహస్రదానం 6) కామధేనుదానం 7) హిరణ్యాశ్వదానం 8) హిరణ్యాశ్వరధ దానం 9) హేమగజదానం 10) పంచలాంగల దానం 11) ధరాదానం 12) విశ్వచక్ర దానం 13) కల్పలతాదానం 14) సప్తసాగర దానం 15) రసధేను దానం 16) మహాభూత ఘటదానం. వీటిలో ఏ ఒక్కదానం చేసినా రౌరవ నరకం నుండి తప్పించుకోవచ్చు. మంచిరోజుల్లో గానీ సంక్రమణ సమయాల్లోగానీ వ్యతీపాత వేళల్లో గానీ స్నాన జపహోమాలు చేసిన వారికి సుగతులే కానీ దుర్గతులు ఉండవు. దాతలు ఇటు మానరకం వైపు రావడం అసంభవం. అలాగే - వారి పునర్జన్మలు సంపన్నుల భవనాల్లో తప్ప, ధన హీనుల కొంపల్లో పడరు.

సత్యవాదులూ, మితభాషులు, అక్రోధనలూ, క్షమాశీలురూ నీతిశాలురూ, అసూయా రహితులూ, దాక్షిణ్య సంపన్నులు, భూత దయాపరులూ, పరదోషగోపనులూ, పరగుణ ప్రశంసకులూ, పరుల సొమ్ము గడ్డిపరకైనా ఆశించనివారూ యమలోకానికి రారంటే రారు. ఇతరుల మీద ఉత్తినే లేనిపోని నిందలు మోపే వాడికన్నా మహాపాపిష్టి మరొకడు ఉండడు. వీడు మహా ప్రళయం వచ్చి సృష్టి అంతమయ్యేంత వరకూ అసి పత్ర - రౌరవాది ఘోర నరకాలలో యమయాతనలు అనుభవిస్తునే ఉంటాడు.

వాక్పారుష్యం ఉన్న వాడు నిస్సందేహంగా నిరయానికి (నరకానికి) పోతాడు. అటుపైన దుర్గతులు (కుత్సిత జన్మలు) పొందుతాడు. వణిక్ శ్రేష్టా! పాపాలు అన్నింటిలోకి కృతఘ్నత అనేది మహాదారుణ మైన పాపం. ఎన్ని తీర్థయాత్రలు చేయనీ ఎంతలేసి ఒప్పులు చెయ్యనీ కృతఘ్నుడికి నిష్కృతిలేదు. చిరకాలం నరకంలో ఘోరయాతనలు అనుభవించవలసిందే.

జితేంద్రియుడై జితాహారుడై పవిత్ర నదీ తీర్థాలలో పుణ్యస్నానాలు చేసిన పావనశీలుడికి మాలోకం వైపు రావలసిన పని ఏముంటుంది చెప్పు. మిత్రమా! తీర్థాలలో మునకలు వెయ్యకపోతే మానే, అక్కడకు వెళ్ళి పాతకాలు మాత్రం చేయరాదు. తీర్థోపజీవనం మహాపాతకం. గ్రుంకులాడటానికి వచ్చిన వాళ్ళ మీద తాను బ్రతకడం. ఇది పనికి రాదు. తీర్థాలలో దానాలు పట్టరాదు. ధర్మాన్ని అమ్ముకోరాదు. తీర్థంలో చేసినపాపమైనా ప్రతి గ్రహమైనా దుర్జరమే. అంటే - ఏ ప్రాయశ్చిత్తంతోనూ తొలగించుకోడానికి శక్యంకానిది. అందుచేత తీర్థాలలో మరీ జాగరూకుడై వుండాలి మానవుడు. పుణ్యం మాట దేవుడెరుగు ముందు పాపం మూటగట్టుకొని తెచ్చుకోకుండా ఉంటే చాలు. అదే పదివేలు. కానీ నేస్తమా! గంగాస్నానం ఉన్నదే అది చాలా గొప్పది. గంగా తీరాలలో ఏ తీర్థంలో మునిగినా - ఒక్కమునకంటే - ఒక్క మునక చాలు - జన్మజన్మార్జితాలైన సకల పాపాలు ప్రక్షాళన అయిపోతాయి. మనుషులు పూర్తిగా పరిపూతులైపోతారు. అంతే కాదు మిగిలిన జీవితంలో ఎన్ని పాపాలు చేసినా వారికి ఏదోషమూ అంటదు. వారు నరకం ఛాయలకైనా రావలసిన అవసరం ఉండదు.

ఏ వ్రతంకానీ ఏ దానం కానీ ఏ తపస్సుకానీ ఏ పవిత్ర కార్యాలు కానీ గంగా బిందువుల అభిషేకంతో సమానంకావని పెద్దలు ఎందరో చెప్పగా విన్నాను. గంగానదిని మిగతా తీర్థాలతో సమానంగా భావించే వాడు దారుణ రౌరవ నరకానికి పోతాడు గంగామృత జలమంటే - ధర్మద్రవం - గంగా జలం. సమస్త నదీనద వాపీ కూప తటాకాదులకు ఇది బీజప్రాయం. సాక్షాత్తూ వైకుంఠడి పాద పద్మాల నుండి స్రవించి ముల్లోకాలకు ప్రవహిస్తుంది. ఎంత పవిత్రమైనది కాకపోతే సర్వజ్ఞుడైన మహేశ్వరుడు నెత్తిన పెట్టుకుంటాడు చెప్పు. గంగా జలం నిస్సందేహంగా నిర్గుణ పరబ్రహ్మం. పరా ప్రకృతి. దీనికి సాటి వచ్చేది. ఈ బ్రహ్మాండంలో మరొకటి ఏది వుంటుంది? ఎలా వుంటుంది? ఎక్కడ వుంటుంది ? అసంభవం. ఈ పవిత్రనదికి యోజనాల దూరంలో నివసిస్తున్నప్పటికీ నరుడు గంగా గంగా అనుకుంటే చాలు ఏ తీర్థంలో మునిగినా మునగకపోయినా గంగా స్నాన ఫలం పొందుతాడు. నరకహేతులై ఏ ప్రాయశ్చిత్తానికీ లొంగని ఎంతటి మహాపాతకమైనా గంగాజలంతో దగ్ధమైపోతుంది. కనుక జీవితంలో ఒక్కసారైనా ప్రయత్నించి గంగాస్నానం చెయ్యాలి.

బ్రాహ్మణులకి కొన్నింటినే దానం పట్టే యోగ్యత ఉంటుంది. దీన్ని ప్రతి గ్రహ సమర్థత అంటారు. ఇది ఉన్నప్పటికీ అప్రతి గ్రహమే నియమంగా జీవితం గడిపిన సద్విప్రుడు తనువుచాలించిన తరువాత తారా రూపం ధరించి ఆకాశ వేదికను అలంకరిస్తాడు. ఊబిలో కూరుకుపోతున్న గోవును కాపాడిన వాడూ ఆ ప్రయత్నంలో మరణించిన వాడూ ఇలాగే గగనాంగనాన తారకలై వెలుగొందుతారు.

స్నేహితుడా ! ప్రాణాయామ పరాయణులు యమలోకాన్ని ఉప్పున ఊదేస్తారు. వారు ఎన్ని పాపాలు చేసినా ప్రాణాయామంతో ప్రక్షాళితులవుతారు. నిత్యమూ పదహారు ప్రాణాయామాలు చేస్తే భ్రూణ హత్యామహీపాతకాల నుండి సైతం విముక్తి పొందుతారు. రకరకాల తపస్సులు వ్రతాలూ, నోములూ, నియమాలూ, నిష్టలూ, గో సహస్ర దానాలూ, అన్నీ కలిపి ఒక ప్రాణాయామానికి సరిపోతాయి. ఆహారపానీయాలను పూర్తిగా త్యజించి నెలకొక్క మారు మాత్రమే ధర్భాగ్రం మీదుగా ఒక్క నీటి బొట్టును మాత్రమే పుచ్చుకొని గొంతు తడుపుకుంటూ సంవత్సర కాలం చేసిన కఠోర తపస్సు అంతా ఒక్క ప్రాణాయామానికి సాటి వస్తుందో రాదో! మిత్రమా! ఎంతటి మహాపాతకం అన్నా చెప్పు, క్షుద్రోప పాతకమన్నా కానీ క్షణంలో ప్రాణాయామానికి భస్మమై పోవలసిందే.

కనుదోయికి అన్యకాంతలు అడ్డంవస్తే మాతృభావన చేసి మరలి పోయే పుణ్యాత్ములూ, పరకాంతలను మానసికంగానైనా వాంఛించని నిగ్రహ సంపన్నులూ ఇహ పరలోకాలలో దేవలతలతో సమానం. వీరి వల్లనే భూమి ఇలా నిలబడుతోందంటే అతిశయోక్తి కాదు. అంచేత బుద్ధిమంతులు పరదారాభిలాషను వదులు కోవాలి. లేదంటే అనేక వేల సంవత్సరాలు నరక కూపాలలో మ్రగ్గిపోవలసి వస్తుంది. పరకాంతలపట్లనే కాదు ఏ పరద్రవ్యం పట్లా లోభం పనికి రాదు. అలోభులకు అమరలోకం ఎప్పుడూ ఆహ్వానం పలుకుతూ వుంటుంది. క్రోధం వహించవలసినంతటి కారణం ఉన్నప్పటికీ ఎవడు క్రోధానికి ఓడిపోడో అతడు స్వర్గాన్ని గెలుచుకున్నాడన్న మాటే. స్వర్గం ఎప్పుడూ అక్రోధనులదే.

వృద్ధులైన తల్లి తండ్రుల్ని దేవతలుగా ఆరాధించే వారూ. తండ్రి కన్నా గురువును అర్చించే వారు సత్యలోకంలో బ్రహ్మదేవుడికి అతిథులు అవుతారు.

దుస్సాంగత్యాలకు దూరంగావుండి శీల సంరక్షణ చేసుకున్న స్త్రీలు స్వర్గలోక నివాసం పొందుతారు. శీలవతులను చూస్తే మేమూ మా ప్రభువూ శిరసు వంచుతాం.

అభ్యాసరతులూ శాస్త్రాభ్యాస నిరతులూ పురాణ ప్రవక్తలూ ధర్మ ప్రభోధకులూ వేదాంత చర్చ నిషణ్ణులూ హతకిల్బిషులై మోహాతీతమైన బ్రహ్మలోక నివాసం పొందుతారు. వేదశాస్త్రాలలోని సారాంశాలను జ్ఞాన యజ్ఞరూపంగా అడిగిన వారికి అడగని వారికీ ఉదారంగా పంచిపెట్టే జ్ఞానదాతలు భవబంధనివారకులు కనుక వారిని పైలోకాలలో దేవతలు కూడా అర్చిస్తారు.

## శివపూజా మహిమ

రేవానదీతీరంలో వెలసిన స్వయంభూ శివలింగాన్ని రోజుకి ఒక సారిగానీ రెండుసార్లు గానీ మూడు పూటలాకానీ అర్చించాలి. స్ఫటిక లింగాలూ, రత్నలింగాలూ, స్వయంభూ పార్థివలింగాలూ ఇంకా అనేకం ఉన్నాయి. వీటిలో దేనినైనా అర్చించవచ్చు. ఇవి ఏవీ చేరువలో లేని వారు ఏదైనా ఒక తీర్థం లోనో, కొండ మీదనో, వనంలోనో, ప్రతిష్ఠితమై చేరువలో వున్న ఏదో ఒక శివలింగాన్ని నమశ్శివాయమంత్రం జపిస్తూ అర్చించాలి. ఇలా అర్చించిన వారికిహ పరాలలో ఏనాడూ యమలోకం అనే పలుకే వినపడదు. శివపూజా ప్రభావం ఎంతటిదంటే శివుడిపట్ల త్రికరణ శుద్ధిగా అనురక్తులైన శివభక్తులు పద్నాలుగు ఇంద్రకల్పాల పర్యంతం శివలోకంలో నివసిస్తూ శివుడితో వినోదిస్తూ వుంటారు. ప్రసంగవశాన కానీ, మోసగించడానికి గానీ కపటబుద్ధితో గానీ దంభాచారంగాకానీ లోభగుణంచే గానీ ఎలాగైనా సరే మహాదేవుణ్ని తెలిసో తెలియకో అర్చించినవారు రవిపుత్రుడైన యముణ్ని చూడరుగాక చూడరు. సర్వపాప ప్రణాశకం సర్వైశ్వర్యప్రదం ఈ శివార్చన. దీన్ని మించిన పుణ్య ప్రదమైనది మరొకటి ఈ జగత్రయంలో లేదు. ఇక్కడ ఒక రహస్యం వుంది. షట్కాల శివలింగార్చన చేస్తున్న శివభక్తులం కదా అని ఎవరైనా జనార్ధనుడ్ని ద్వేషిస్తే అదీ శివద్వేషంతో సమానం అవుతుంది. విష్ణుభక్తులు శివుణ్ని ద్వేషిస్తే అది విష్ణు ద్రోహం అవుతుంది. ఉభయులకీ నరకం తప్పదు.

ద్రవ్యం - అన్నం - తోయం - ఒకటేమిటి శివస్వం (శివుడి సొమ్ము) దేనిని అపహరించి తీసుకుపోకూడదు. శివనిర్మాల్యం దాటరాదు. శ్రద్ధగా తీసికెళ్ళి ఏదైనా కూపంలో విడిచిపెట్టాలి. లోభంవల్లగానీ, మోహం వల్లగానీ శివస్వాన్ని (శివసొమ్మును) ఈగ కాలంతైనా సొంతానికి వాడుకున్నాడంటే వాడు కల్పాంతం వరకు నరకంలో కుతకుతా ఉడికిపోతాడు.

ఆవిరి గడ్డితోగానీ, ఆకుతో గానీ, వాననీరు దిగకుండా శివాలయం నిర్మిస్తే ఆ పుణ్యాత్ములు శివ సన్నిధిలో చిరంతనంగా ఆనందానుభూతి పొందుతుంటారు. త్రిమూర్తులలో ఎవరికి ఆలయం కట్టినా మఠం కట్టినా వారు ఆ స్వామిలోకంలో స్వామి సన్నిధిలో స్థిర నివాసం పొందుతారు.

ధర్మ సత్రాలూ, సాధుమఠాలూ, గోశాలలు, బాటసారులకు సుఖంగా దారి ప్రక్కన విశ్రాంతి మందిరాలూ, యతి సదనాలూ, దీనకుటీరాలూ, వేదాధ్యయన మందిరములూ, విప్రులకు గృహాలూ నిర్మించిన దాతలు ఇంద్రలోకంలో శాశ్వత నివాసం పొంది ఇంద్ర భోగాలు అనుభవిస్తారు. వీటిని జీర్ణోద్ధరణ చేస్తే ఈ పుణ్యఫలం రెట్టింపు అవుతుంది. అంతేగానీ - శిధిలమైన వాటిని పూర్తిగా పాడుపెట్టి కొత్తవి నిర్మించిన పుణ్యానికిపోతే పాపం ఎదురై నరకం దక్కుతుంది.

దేవాలయములు, విప్రగృహాలూ, యతిమఠాలూ మొదలైన వాటికి ధనలోభంతో ఆధిపత్యం చేపట్టినవాడు సర్వపాప భాజనుడు అవుతాడు. మఠాలకు సంభందించిన పత్రం, పుష్పం, ఫలం, తోయం, ద్రవ్యం అన్నం - వీటిని ఎవడైనా కాజేస్తే నరక నివాసం తప్పదు. కాబట్టి ఎవడినైనా సపుత్ర మిత్ర పశు బాంధవంగా నరకంలోకి నెట్టివెయ్యాలను కుంటే అతడికి దేవాలయ గోశాలా విప్రగృహ మఠాధిపత్యం అప్పగిస్తే సరి. మఠాధిపత్యం తన చేతిలో ఉంది గదా అని మఠాన్నాన్ని తానూ ఒక పూట భుజిస్తే ఆదోషం చంద్రాయణ వ్రతంతో గానిపోదు. ఇలా ఏదో రకంగా చిన్నదో పెద్దదో పాపం చుట్టుకోక తప్పని పదవులు కనక వీటిలో ఉన్న వారిని స్పృశిస్తే సచేల స్నానం చెయ్యాలి. త్రిమూర్తుల అర్చనలకోసం పుష్ప వాటికలు నిర్మించినవారు దేవ లోకంలో నిత్య నివాసం పొందుతారు.

## వైష్ణవ మహిమ

వికుండలా! మరొక అద్భుత రహస్యం నీకు చెబుతాను. ఇది యమధర్మరాజు సమ్మతమూ సర్వలోక అభయ ప్రదమూనూ. శ్రద్ధగా ఆలకించు. విష్ణు భక్తి పరాయణులైన పరమవైష్ణవులు మాలోకాన్ని గానీ మా ప్రభువును గానీ చూడరంటే చూడరు. ఇది ముమ్మాటికీ సత్యం. మా ప్రభువు మాకు ఎప్పుడూ హెచ్చరిక చేస్తుంటాడు - వైష్ణవుల జోలికి వెళ్ళవద్దనీ, వారు మన ముఖం చూడరనీను. బుద్ధి పూర్వకంగా కాకపోయినా ఏదో ప్రసంగవశాత్తూ నైనా కేశవుణ్ని స్మరించిన వాడు సకలాఘ విముక్తుడై విష్ణులోకం చేరుకుంటాడు. అంచేత విష్ణు భక్తుడు ఒక వేళ దురాచారుడైనా పాప కార్యాలు చేసినా మనం అతడి జోలికి పోకూడదు. అని మా ప్రభువు కట్టడి చేసాడు. అంతేకాదు - వైష్ణవులు భుజించిన ఇళ్ళఛాయలకూ వైష్ణవులతో సత్సాంగత్యం నెరిపిన వారి జోలికీ వెళ్ళవద్దు అన్నాడు. ఆ ఉభయులూ గత కిల్బిషులు అవుతారట. అంచేత వైష్ణవుడుగానీ వైష్ణవుణ్ని పూజించిన వారు కానీ వైష్ణవులతో సత్సాంగత్యం నెరిపిన వారు కానీ యధాలపంగా హరినామ స్మరణ చేసిన వారుగానీ మా రాజధానికి రారు. వారికి ఆ అవసరం లేదు. ఎంతటి పాపిష్టికైనా విష్ణు భక్తిని మించిన నరక నివారణోపాయం మరొకటి లేదని తెలుసుకో. నరకాంబుధిని హాయిగా దాటించే నావ - హరినామ సంకీర్తన. ఆ మనిషి వర్ణ బాహ్యుడైనప్పటికీ విష్ణుభక్తుడైతే చాలు. ముల్లోకాలనూ పావనం చేస్తాడు. నరకంలో మ్రగ్గిపోతున్న తల్లి తండ్రుల్ని కొడుకు చేసే కేశవార్చన ఉద్ధరించి వైకుంఠానికి తీసికొని వెడుతుంది. వైష్ణవులకు సేవలు చేసే వారూ వైష్ణవభుక్త శేషాన్ని ప్రసాదంగా స్వీకరించే వారూ హరిధామం చేరుకుంటారు. అంచేత వైష్ణవాన్నాన్ని అభ్యర్ధించి ఆరగించాలి. లేదంటే కనీసం వారి ఇంట, వారిచేతుల మీదుగా కాసిన్ని మంచినీళ్ళయినా పుచ్చుకోవాలి. గోవింద నామాన్ని జపిస్తూ ఎవరు ఎక్కడ అసువులు బాసినా వారి జోలికి మేముగానీ మా ప్రభువుగానీ వెళ్ళంగాక వెళ్ళం.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

అంగన్యాస కరన్యాసాలతో ఋషిచ్ఛందోద్దైవతంగా దీక్షా విధి పూర్వకంగా యంత్ర సహితంగా ద్వాదశాక్షర లేదా అష్టాక్షరీ మహామంత్రాన్ని నిత్యమూ జపించే విష్ణుభక్తుల్ని అల్లంత దూరం నుంచి ఒకసారి దర్శిస్తే చాలు బ్రహ్మ హత్యాపాతకుడు సైతం పరిశుద్ధుడు అయిపోతాడు.

ఓం నమో భగవతే వాసు దేవాయ అనేది ద్వాదశాక్షర మంత్రం.

ఓం నమో నారాయణాయ అనేది అష్టాక్షర మహా మంత్రము. శంఖ చక్రాంకితులైన వైష్ణవులు విష్ణురూపులై బ్రహ్మ యుగాంతకాలం వైకుంఠంలో నివసిస్తారు. హృదయంలోగానీ సూర్యబింబంలో గానీ జలరాశిలో గానీ ప్రతిమలో గాని స్థండిలం మీద గానీ (నేల) వనమాలి రూపాన్ని భావించి లేదా రూపించి ధ్యానించేవారు విష్ణుపదం చేరుకుంటారు.

## సాలగ్రామ మహిమ

వజ్ర కోట వినిర్మితమైన సాలగ్రామ శిలాచక్రంలో ముముక్షువులు వాసుదేవుణ్ని అర్చిస్తారు. సాలగ్రామశిల విష్ణువుకి అధిష్ఠానం. ఇది సర్వ పాప ప్రణాశకం. సర్వ పుణ్య ప్రదం. అందరికీ ముక్తిదాయకం. ప్రతి రోజూ సాలగ్రామ శిలా చక్రంలో శ్రీ హరిని పూజించినవారు వెయ్యి రాజసూయాలు చేసిన ఫలం పొందుతారు. అక్షరమూ అచ్యుతమూ అయిన బ్రహ్మ నిర్వాణమని వేదాంతులు చెప్పేది, సాలగ్రామ శిలార్చనంతో పుణ్యాత్ములు పొందుతారు. కాష్టంలోని వహ్ని మథనంతో బయట పడినట్లు సాలగ్రామార్చనతో మనిషిలోని పుణ్యం ఆవిష్కృతమవుతుంది. ఘోరమైన దుష్కృత్యాలు చెయ్యడం వల్ల ఏ సత్కార్మాచరణకూ అధికారంలేని మహాపాపాత్ములైనా ఒక్క సారి సాలగ్రామ సమార్చన చేస్తే వారింక మా యమాలయం వైపు రారు. సాలగ్రామ శిలాచక్రంలో నివాసమంటే శ్రీ మహావిష్ణువుకి చాలా ప్రీతికరం. లక్ష్మీదేవితో క్రీడించడంకన్నా వైకుంఠంలో విహరించడం కన్నా ఇష్టమైన విషయం.

సాలగ్రామ శిలాచక్రంలో శ్రీ మన్నారాయణుణ్ని ఒక్కసారి అర్చిస్తే అతడు అహో రాత్రాలు హోమాలు చేసిన పుణ్యాన్ని చతుస్సాగర సమేతంగా భూగోళాన్ని అంతటిని దానం చేసిన ఫలాన్ని పొందుతాడు. వికుండలా! సాలగ్రామ శిలలు పన్నెండువున్నాయి. వీటిని ఒక్కసారి అర్చిస్తే వచ్చే పుణ్యం ఎంతటిదో వివరిస్తాను. విను. స్వర్ణ కమలాలతో కోటి ద్వాదశ లింగాలను పన్నెండు కల్పాల పర్యంతం అర్చిస్తే ఏ ఫలం వస్తుందో అది ఒక్క రోజున ద్వాదశ సాలగ్రామాలను అర్చిస్తే లభిస్తుంది. ఈ ఫలం పొందిన పుణ్యశీలి విష్ణులోకంలో పన్నెండు కల్పాల పర్యంతం నివసించి అటుపైని భూగోళం మీద చక్రవర్తిగా అవతరిస్తాడు. అరిషడ్ వర్గాలకు దాసుడైన నరాధముడు సైతం సాలగ్రామ శిలార్చన చేస్తే వైకుంఠ నివాసం పొందుతాడు. సదాచార సంపన్నుడై సాలగ్రామ శిలా చక్రంలో గోవిందుణ్ని అర్చించిన సజ్జనుడు మహాప్రళయం వరకూ వైకుంఠం నుండి చ్యుతిని పొందడు. తీర్థయాత్రలు చెయ్యపోయినా దాన ధర్మాలు చెయ్యకపోయినా యజ్ఞాలు యాగాలు చెయ్యకపోయినా సాలగ్రామ శిలార్చన చేస్తే చాలు ముక్తి లభించడం తథ్యం. సకల పాపాలకు ఇది విరుగుడు. నరక నివాసం గర్భవాస క్లేశం (పునర్జన్మ) క్రిమి కీటక, పశు పక్షి నీచ జన్మలు వగైరా తీవ్ర శిక్షల్ని త్రోసిరాజు అనగల్గినది ఈ సాలగ్రామ శిలార్చన. దీక్షా స్వీకారంతో మంత్ర పూర్వకంగా ఈ శిలా చక్రంలో చక్రిని అర్చించి బలి ప్రధానం చేసినవాడు విష్ణులోకంలో శాశ్వత నివాసం పొందుతాడు. ఇది

ముమ్మాటికీ నిజం. సాలగ్రామ శిలాజలంతో కేశవుడికి అభిషేకం జేసి ఆ పావనోదకాన్ని శిరస్సున జల్లుకొన్న భక్తుడు సకల పుణ్య తీర్థాలలోనూ స్నానం చేసిన, పవిత్రతనూ సర్వ యజ్ఞాలు చేసిన పుణ్యఫలాన్ని క్షణంలో నిస్సందేహంగా పొందుతాడు. ఎందుకంటే ముక్తిదాయికాలైన గంగా గోదావరీ రేవాది నదులు సకల పుణ్య తీర్థ సమేతాలై వచ్చి సాలగ్రామ శిలోదకంలో సన్నిధి చేస్తాయి.

అంగన్యాస కరన్యాసాలతో షోడశోపచారాలతో గీత వాదిత్రస్తోత్ర నృత్యాలతో సాలగ్రామ శిలాచక్రంలోని శ్రీమన్నారాయణుడికి నిత్యము పూజలు చేసే పుణ్యశాలి ఈ కలియుగంలో సైతం ధర్మపరాయణుడై వివిధ భోగభాగ్యాలను అనుభవించి అటుపైన సహస్రకోటి కల్పాలు వైకుంఠంలో శ్రీ హరి సన్నిధిలో ఆనందంగా గడుపుతాడు. కోటి లింగాలను అర్చించి నందువల్ల వచ్చే పుణ్య ఫలం ఎంతటిదో ఒక్క సాలగ్రామ శిలను అర్చించడంచేత వచ్చే పుణ్యఫలం అంతటిది. సంఖ్యాది శాస్త్రాలు అవి చెప్పే నియమనిష్టలూ ఏమీ లేక పోయినా ఫర్వాలేదు. యధాలాపంగానైనా సాలగ్రామ శిలను ఒక్కసారి అర్చిస్తే చాలు అతడు ముక్తిని పొందుతాడు. శ్రీ మన్నారాయణుడు సాలగ్రామ శిలారూపియై నివశించే చోట సకల దేవతలు, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష జాతులూ, చతుర్ధశభువనాలు సన్నిధి చెయ్యడం తథ్యం. సాలగ్రామ శిలాసాన్నిధ్యంలో శ్రాద్ధ కర్మలు నిర్వహిస్తే, పితృదేవతలు పరిపూర్ణంగా సంతృప్తి చెందుతారు. సాలగ్రామ శిలాజలాన్ని ఒక్కసారి పుచ్చుకుంటే చాలు పంచగవ్యాన్ని వెయ్యిసార్లు ప్రాశించిన ఫలం దక్కుతుంది. కోటి సహస్ర తీర్థాలలో కోటి సహస్ర పర్యాయాలు మునిగిన పుణ్యం దక్కుతుంది. సాలగ్రామ శిలాతోయంలో చక్రాంకిత శిలాజలాన్ని సమ్మిశ్రితం చేసి శిరస్సున, దేహాన్న జల్లుకున్నా ముమ్మారు లోపలికి పుచ్చుకున్నా ఇక అతడి శరీరం చక్రాంకితమైనట్లే. ఏ మాత్రం సందేహం లేదు. అయితే పుణ్యాత్ములకు తప్ప ఈ శంఖ చక్ర ముద్రలు ఇతరులకి కనిపించవు. ఇవి పరమగుప్తాలు.

అందుచేత ఓ వైశ్య శిఖామణీ! మా ప్రభువు మమ్మల్ని వైష్ణవుల ఇళ్ళవైపు వెళ్ళవద్దని కట్టడిచేసాడు. విష్ణుపాదోదకాన్ని సేవించిన వారు కనుక విష్ణు భక్తులంటే మాకు చచ్చేంత భయం.

మిత్రమా! వాపీ కూప తటాకాదుల్లో మూడు రోజులు స్నానం చేసినందువల్ల కలిగే పుణ్యఫలాన్ని - సముద్రుణ్ణి చేరని ప్రవాహాలు ఒక్క స్నానంతో అందిస్తాయి. ఈ ప్రవాహాలలో పదిహేను రోజులపాటు స్నానాలు చేసినందువల్ల వచ్చే పుణ్య ఫలాన్నీ - సముద్రుణ్ణి చేరే నదీనదాలు ఒక్క స్నానంతో అందిస్తాయి. ఈ నదీ నదాల్లో నెల నాళ్ళు మునిగిన పుణ్యఫలాన్ని సముద్రుడు ఒక్క మునకతో అందిస్తాడు. ఆరు నెలలు సముద్రస్నానం చేసినందువల్ల దక్కే పుణ్యాన్ని గోదావరి ఒక్క స్నానంతో ఇస్తుంది. గోదావరిలో సంవత్సరం పాటు స్నానాలు చేసిన పుణ్యాన్ని గంగమ్మ ఒకే ఒక్క మునకతో ఇస్తుంది. పుష్కరం పాటు గంగా స్నానం చేసినందువల్ల లభించే పుణ్యఫలాన్ని విష్ణుపాదోదకమైన ఈ సాలగ్రామ శిలాజలం శిరస్సేచనంతో అందిస్తుంది. కనుక ఇది ఎంతో పుణ్యం చేసుకున్న వారికి తప్ప దొరకదు. సాలగ్రామ శిల ఉన్న ప్రదేశం - మూడు ఆమడల విస్తీర్ణం వరకూ పవిత్ర తీర్థంకిందనే లెక్క. ఆ ప్రాంతంలో చేసిన దానాలూ, హోమాలు కోటి రెట్లు అధికంగా వేగంగా ఫలితాన్ని అందిస్తాయి. సాలగ్రామ శిలాజలాన్ని ఒక్క బిందువైనా సేవించగల్గితే ఆ మనిషికి ఇంకెప్పుడూ మాతృస్తన్యంగ్రోలవలసిన పరిస్థితి రాదు. పునర్జన్మ లేనిముక్తి పొందుతాడు.

యోగ్యుడైన బ్రాహ్మణుడికి సాలగ్రామం దానంచేస్తే నదీ సముద్రకాననాద్రి సహితంగా సమస్త భూగోళాన్ని దానం చేసినట్లే. అంతటి పుణ్యం దక్కుతుంది. ఈ సాలగ్రామ శిలకు మూల్యం కట్టడం కానీ క్రయవిక్రయాలు జరపడం కానీ అలాంటి వాటిని ఆమోదించడం గానీ అసలైనదా నకిలీదా అని పరీక్షించడంగానీ - ఇవ్వి మహాపాపాలు. శాశ్వత నరక హేతువులు. అందుచేత ఇలాంటి పనుల్ని ఎప్పుడూ ఎన్నడూ ఎవ్వడూ చెయ్యకూడదు.

పాప భీతి ఉన్నవారు వాసుదేవుణ్ని స్మరించడం మంచిది. అది సర్వపాపహరం. ఘోరారణ్యాల్లో కఠోర నియమాలతో సంవత్సరాల పాటు తపస్సులు చెయ్యడం కన్నా త్రికరణ శుద్ధిగా గోవింద నామస్మరణ చెయ్యడం చాలా తేలిక. పుణ్య ఫలాన్ని ఇవ్వడంలో ఇవి రెండూ సమానమే కనుక ఈ మాట చెబుతున్నాను. అదనంగా ఇంకొక విశేషం ఏమిటంటే - ఎన్ని పాపాలు అన్నా చెయ్యి, ఒక్కసారి ఏకాగ్రచిత్తంతో హరి నామం స్మరించు, నువ్వు మా నరకానికి వస్తే ఒట్టు. సర్వ తీర్థ స్నాన ఫలం సర్వదేవాలయ సందర్శన ఫలం - సమస్తమూ విష్ణు నామ సంకీర్తనతో తంగేటి జున్ను అవుతుంది. వారికి యమదర్శన మహాభాగ్యం గానీ నరక నివాస మహా సౌఖ్యంగానీ ఏ మాత్రమూ దక్కవు. నాయనా? వికుండలా! నేను వైష్ణవుణ్ని. పరమభాగవతోత్తముణ్ని అని ఎవరైనా అహంకరించి శివనింద చేస్తే వారికి విష్ణులోకం దక్కదు సరికదా సరాసరి ఈ నరకానికి వచ్చి మా పాల పడతారు. రాకరాక ఒక వైష్ణవుడు వచ్చాడని మా వాళ్ళు కుమ్ముకుంటారు.

## ఏకాదశి మహిమ

వికుండలా ! మా ప్రభువు యమధర్మరాజుల వారు చెప్పిన మరొక విశేషం నీ చెవిన వేస్తాను. గ్రహించు. ఏకాదశి అంటే పద్మనాభుడికి చాలా ఇష్టమైన రోజు. ఆనాడు తెలిసో తెలియకో కావాలని కానీ తప్పనిసరియై కానీ, ఉపవాసం ఉన్న మానవుడు మా యమలోకం దరిదాపులకు ఏనాడూ రాడట. ఇంతటి పావనమైన రోజు ముల్లోకాల్లో మరొకటి లేదని ఘంటా పథంగా చెప్పారు. ఈ పద్మనాభైకాదశి నాడు ఉపవాసం చెయ్యనంత వరకే జీవుడు ఈ పాపిష్టి శరీరంలో బందీగా వుండడం. ఉపవాసం చేస్తే చాలు ముక్తి లభించినట్లే. మిత్రమా! దీన్నే హరివాసరం అంటారు. వెయ్యి అశ్వమేధాలు, నూరు రాజసూయాలు ఒక్క ఏకాదశి ఉపవాసంలో పదహారోవంతుకైనా సాటి రావంటే అతిశయోక్తికాదు. ఏకాదశేయింద్రియాలతో చేసిన పాపాలన్నీ ఏకాదశ్యుపవాసంతో హరించుకుపోతాయి. అంచేత ఈ ఉపవాస వ్రతంతో సాటి వచ్చేది మరొకటి లేదంటే లేదు. కావాలని చెయ్యకపోయినా, ఏ వ్యాజంతో చేసినా ఇది పుణ్యప్రదమే. ఇది స్వర్గదాయిని, మోక్ష కారిణి. శరీరారోగ్యప్రదాయిని. సుకళత్రదాయిని. జీవత్పుత్ర ప్రదాయిని. ఈ హరివాసరానికి గంగా, గయా, కాశీ పుష్కర కురుక్షేత్రాది పుణ్యతీర్థాలు ఏవీ సాటి రావు. ఆయాచోట్ల చేసే పుణ్య కార్యాలకన్నా అధికపుణ్య ప్రదం ఈ హరివాసరోపవాస వ్రతం. పగలంతా ఉపవశించి రాత్రి జాగరణం చేస్తే చాలు అనాయాసంగా వైకుంఠం దక్కుతుంది ఈ వ్రతంలో. అంతే కాదు ఇది చేసిన వ్యక్తి - తల్లి వైపున పది తరాలునూ తండ్రి వైపున పది తరాలనూ తన వాళ్ళు పది మందినీ ఉద్ధరించిన వాడవుతాడు. తరింపజేసిన వాడవుతాడు.

అలా ఉద్ధరించపబడ్డ వారంతా గరుడ కేతనులై వనమాలికా భూషితులై పీతాంబర ధారులై వైకుంఠం చేరుకుంటారు.

బాల్య, యౌవన, కౌమారాల్లో వార్ధక్యదశల్లో ఎప్పుడైనా ఒక్క ఏకాదశ్యుపవాసం ఉంటే చాలు ఇటూ అటూ పాపాలన్నీ

హుష్కాకి అయిపోతాయి. ఉపవాసం ఉండటంతో పాటు హరి వాసరాన పుణ్యతీర్థ స్నానం చేసి హేమ -భూ-గో-వస్త్ర-తిలాది దశదానాలలో ఏ ఒక్కటి చేసినా - ఇక చెప్పేది ఏముంది స్వర్గలోక సుఖాలు ఇహలోకంలోనే అనుభవిస్తాడు. అంటే ఆశ్చర్యంలేదు. ఆయువు ముగిశాక వైకుంఠ పట్టణవాసం ముమ్మాటికీ తథ్యం. ఇవి చెయ్యని వారు - అంటే ఉపవాసం ఉండలేకపోయినా పర్వదినాన కనీసం తీర్థస్నానమూ ఏదో ఒక దానమూ కాశింతధ్యానమూ చెయ్యనివారు కచ్చితంగా ఇహపరాలకు చెడతారు. దుఃఖభాగులవుతారు.

## ధర్మ మహిమ

మిత్రమా ! నరక నివారకమైన ధర్మం గురించి సంక్షిప్తంగా చెబుతాను పనిలో పనిగా వినేసేయ్. త్రికరణ శుద్ధిగా జీవించడం - అంటే మనోవాక్కాయకర్మతో ఏ ప్రాణికీ ద్రోహం చెయ్యకపోవడం, ఇంద్రియ నిగ్రహం, దాతృత్వం, హరిసేవాపరాయణత్వం వర్ణాశ్రమ ధర్మాలను తు.చ. తప్పకుండా పాటించడం - ఇవి కచ్చితంగా నరకాన్ని తప్పిస్తాయి. ఇంకొక్క సంగతి - చేసిన తపస్సుగానీ, చేసిన దానాన్ని గానీ, చేసిన ఉపకారాన్ని గానీ పదిమందికి చాటింపు వేసుకోకూడదు. వాటి మహిమ అంతటితో తగ్గిపోతుంది. కనుక స్వర్గార్థి ఈ పని చెయ్యడు. శక్తివంచన లేకుండా యవలు - వస్త్రాలు - ఛత్రాలు - కందమూల ఫలాలు - అన్న పానీయాలు మొదలైన వాటిని పది మందికీ పంచిపెడితే కలిగే హితం అంతా ఇంతా కాదు. ఎంతటి దరిద్రుడైనా కనీసం జలదానం చెయ్యగలడు కదా! అలా ఏదో ఒకటి దానం చేస్తూ ఆయుర్దాయంలో ప్రతిరోజునూ గొడ్డుబోకుండా చూసుకోవాలి. వైశ్యపుత్రా! ఒకరికి పెట్టనిది తనకు మిగలదు - ఈ రహస్యం అందరూ గ్రహించాలి. ఇది ఇహపరాలకు వర్తించే సూత్రం దీన్ని పాటించే దాతలు మాలోకం వైపుకి రారు. ఇహంలో దీర్ఘాయుష్మంతులై ధనాఢ్యులై సకల భోగాలు అనుభవించి సత్కీర్తి సంపన్నులై అటుపైన స్వర్గ లోకంలో ఇంద్రభోగాలు ఆస్వాదిస్తారు. ఎన్ని జన్మలైనా వీరికి ఇలాగే సాగుతాయి. నరకం గుమ్మంతొక్క వలసిన అవసరం వీరికి ఏర్పడదు. మిత్రమా! వెయ్యి మాటలెందుకు. ధర్మం సుగతికీ అధర్మం దుర్గతికీ దారి తీస్తాయి. అంచేత బాల్యం నుండే ధర్మాచరణను అలవరచుకోవాలి. ఇదీ సారాంశం.

ఇంతకీ వికుండలా! నువ్వు తెలియక చేసినా మాఘస్నాన ఫలం నిన్ను ఉద్ధరిస్తోంది. నరక యాతనల నుండి తప్పించి స్వర్గ సుఖాలకు పంపుతోంది. అంతటి మహిమగలది మాఘస్నానం. సరే ప్రసక్తాను ప్రసక్తంగా చాలా విషయాలు ముచ్చటించుకున్నాం. శ్రేయోదాయకమైన మరింకేదయినా విషయాన్ని శ్రుతి స్మృతి పురాణేతిహాసాల నుంచి తెలుసుకోదలుచుకుంటే బిడియ పడకుండా అడుగు. నాకు తెలిసింది చెబుతాను. మనం ఆప్తమిత్రులం అయ్యాం కదా! - అని ముగించాడు యమదూత. వికుండలుడు కృతజ్ఞతా భావంతో నమస్కరించాడు.

మహానుభావా! పేరుకు నువ్వు యమ దూతవేకానీ ఎంత సౌమ్యుడివి. ఎంతదయామయుడివి. నీ ప్రసంగంతో నా హృదయం ప్రసన్నమయ్యింది. నీ వంటి ఉత్తమ సజ్జనులతో సాంగత్యం గంగానది లాగా వెంటనే సర్వ పాపాలను పోగొడుతుంది. ఉపకారం చెయ్యడం, ప్రియం చెప్పడం అనేవి సజ్జనులకి సహజగుణాలు. అమృత కిరణుడైన చందమామను ఒకరు చల్లబరచాలా!

దేవదూతా! నాదొక విన్నపం కారుణ్య మూర్తివి నువ్వే ఆలించి దారి చూపించాలి. మా అన్నగారిని నరకం నుండి తప్పించడమెలాగ? నా పుణ్యం నుండి అవసరమైనంతా ధారపోస్తాను. నాకు ఎంత పుణ్యం ఉంది? నా పూర్వ జన్మలు ఏమిటి? వాటిలో ఏ జన్మలోనైనా ఏ పుణ్యకార్యమైనా చేసానా? ఎంత పుణ్యం ధారపొయ్యగలను? ఇవి కాస్త తెలియజెప్పి పుణ్యం కట్టుకో. నీ మేలు మరిచిపోలేను - అంటూ దీనంగా చేతులు పట్టుకున్నాడు.

## వికుండల పూర్వ జన్మ

దేవదూత క్షణకాలం ధ్యాన మగ్నుడు అయ్యాడు. మైత్రీ బంధం అతడికి ఒక నిర్బంధం అయ్యింది. జ్ఞాన దృష్టిని సారించాడు. విషయమంతా అవగతమయ్యింది. మెల్లగా కన్నులు తెరిచాడు. వైశ్యకులోద్భవా ! నీ పూర్వజన్మం నీ సంచిత పుణ్యం అంతా సహేతుకంగా చెబుతాను విను.

పూర్వకాలంలో అత్యంత మనోహరమైన మధువనం ఒకటి ఉండేది. ఆ వనంలో శాకలి అనే మహర్షి తపస్సు చేసుకుంటూ వుండేవాడు. అధ్యయన - అధ్యాపనలతో శిష్యవత్సలుడై కాలం గడిపేవాడు. తేజస్సులో బ్రహ్మ సమానుడు. అతడి ధర్మపత్ని రేవతీదేవి. ఈ దంపతులకు నవ గ్రహాలలాగా తొమ్మండుగురు పుత్ర సంతానం కలిగారు. వారిలో ధ్రువుడు - క్షమి - మధుడు - తారుడు - జ్యోతిష్మంతుడు అనే అయిదుగురూ పరమ వైష్టికులు. కర్మిష్ఠులు. నిత్యాగ్నిహోత్రులు. గృహస్థాశ్రమాలు స్వీకరించి హాయిగా వున్నారు. తక్కిన నలుగురూ విరక్తి మార్గం ఎంచుకున్నారు. నిర్మోహుడు - జితమాయుడు - ధ్యానకాష్టుడు - గుణాతిగుడు - అని పేర్లకు తగ్గట్లు వీళ్ళు గృహస్థాశ్రమాన్ని స్వీకరించకుండా సరాసరి సన్యాసాశ్రమం స్వీకరించారు. సర్వకర్మ నిస్పృహులై నిస్సంగులై నిష్పరిగ్రహులై శిఖా యజ్ఞోపవీతరహితులై అరణ్యాలలో తపస్సులు చేసుకుంటున్నారు. వీరి దృష్టిలో బంగారం ముద్దకూ, మట్టి గడ్డకూ తేడా లేదు. ఆకో అలమో మొలలకు అచ్ఛాదనగా ధరించడం, పండో ఫలమో దొరికింది తినడం - ఇదీ వీరి జీవయాత్ర. రేయింబవళ్ళు బ్రహ్మజ్ఞాన పరాయణులై కాలం గడుపుతున్నారు. జితేంద్రియులు - జితాహారులు. వాత శీత సహిష్ణువులు. ఈ చరాచర జగత్తులో అణువు అణువునా విష్ణుమూర్తిని దర్శిస్తూ మౌనంగా భూగోళమంతటా సంచరించడమే వారి జీవన విధానం. అణువంతైనా కర్మాచరణం చెయ్యని యోగులు. దృఢ జ్ఞాన సంపన్నులు. సద్విచార విశారదులు.

వీళ్ళు నలుగురూ ఒక రోజున నీయింటికి వచ్చారు. అప్పుడు నీవు మత్స్యదేశంలో విప్రుడుగా భార్యాపుత్రాదులతో ధర్మబద్ధంగా గృహస్థ జీవితం గడుపుతున్నావు. నీకు అది ఎనిమిదవ జన్మ. వైశ్య దేవం ముగించుకొని అతిథులకోసం ఎదురుచూస్తూ నువ్వు వాకిలిలోకి వచ్చే సరికి ఈ నలుగురు నిరీహులూ నీకు కనిపించారు. ఆదరంగా స్వాగతంపలికి అర్ఘ్యపాద్యాదులతో అతిథి మర్యాదలు చేసి సముచితాసనాల మీద కూర్చోబెట్టావు. సాష్టాంగ నమస్కారాలు చేసి అంజలి బద్ధుడవై వినమిత శిరస్కుడవై నిలబడ్డావు.

మహానుభావులారా ! ఇప్పటికి నా జన్మ సఫలం అయ్యింది. జీవితం సఫలం అయ్యింది. విష్ణుమూర్తి ప్రసన్నమయ్యాడు. నాలుగు రూపాల్లో ప్రత్యక్షమయ్యాడు. ఇప్పుడు పవిత్రుణ్ని అయ్యాను. ధన్యోస్మి. నా గృహం ధన్యమయ్యింది. నా ఇల్లాలు ధన్యమయ్యింది. తల్లితండ్రులు ధన్యులయ్యారు. నా చదువూ, నా ధనమూ, నా గోవులూ

సమస్తమూ ధన్యమయ్యాయి. తాపత్రయాలను హరించే మీ పాదాలకు శిరస్సు చేర్చి నమస్కరించగలిగాను. విష్ణు సందర్శనతో సాటి వచ్చే మీ దర్శన మహాభాగ్యం లభించింది. ఎంత అదృష్టం, ఎంత అదృష్టం - అంటూ నలుగురికీ స్వయంగా శ్రద్ధగా కాళ్ళు కడిగి ఆ నీళ్ళు భక్తితో శిరస్సున జల్లుకున్నావు. అటుపైని వారికి పాద పూజలు చేసావు. షోడశోపచారాలు చేసావు. రుచిగా శుచిగా శాక పాకాలతో విందు భోజనం పెట్టావు. ఆయతులు నలుగురూ పరంజ్యోతియైన పరబ్రహ్మను ధ్యానిస్తూ ఆ రోజుకి నీ యింటిలోనే విశ్రాంతి తీసుకున్నారు.

వణి క్పుత్రకా ! యతి పాదోదకం పురాకృత పాప సంఘాలను పారద్రోలుతుంది. అది అక్షయోదకం. సప్త జన్మలనూ పాపరహితాలుగా ప్రక్షాళన చేస్తుంది. ఇక ఆ పరమ హంసలకు ఆతిథ్యమిచ్చిన పుణ్య ఫలం ఎంతటిదంటే - వెయ్యి సంవత్సరాలకైనా నేను వివరించలేను.

ఈ చరాచర జగత్తులో ప్రాణులు శ్రేష్టమైనవి. ఆ ప్రాణుల్లో మతి జీవులు శ్రేష్టమైనవి. మతి మంతులలో నరులు శ్రేష్టులు. వారిలో బ్రాహ్మణులూ వారిలో విద్వాంసులూ విద్వాంసుల్లో ధర్మనిర్ణయం చెయ్యగలిగిన కృత బుద్ధులూ వారిలో మళ్లీ స్వయంగా ధర్మాచరణచేసే కర్తలూ, ఆ కర్తల్లోనూ బ్రహ్మవేత్తలూ ఉత్తమోత్తములు. బ్రహ్మ వేత్తల కన్నా ఉత్తములూ శ్రేష్టులూ భూతకాలంలో లేరు. భవిష్యత్తులో ఉండరు. అంచేతనే బ్రహ్మవేత్తలు జగత్త్రయపూజ్యులు. వారి సాంగత్యం సర్వపాప వినాశకం. సకల పుణ్య ప్రదాయకం.

అటువంటి యతి పుంగవులు అంతటి బ్రహ్మనాదులు నీ యింట సత్కారాలు పొందారు. ఆతిథ్యం స్వీకరించారు. విశ్రాంతి తీసుకున్నారు. వికుండలా! ఎనిమిదవ జన్మలో ఇలా నువ్వు ఆర్జించుకున్న పుణ్యం కొండంత ఉంది. అది నీ అగ్రజుడికి ధారపొయ్యి. నరకం నుండి విముక్తి పొందుతాడు.

వికుండలుడు సంబర పడుతూ యమదూతకు ధన్యవాదాలు పలికి సాష్టాంగ నమస్కారం చేసి తన పూర్వ పుణ్య ఫలాన్ని శ్రీ కుండలునికి ధారపోశాడు. వెంటనే శ్రీ కుండలుడు అసి పత్ర మహానరకం నుండి విముక్తుడయ్యాడు. యమదూత సత్కృతుడై వీడ్కోలు తీసుకున్నాడు. దేవతలు ఆ ఇద్దరు సోదరుల మీదా పారిజాత పుష్పవృష్టి కురిపించారు. దివ్య విమానంలో నాకలోకానికి తీసుకు వెళ్ళారు.

మాఘస్నాన మహిమను చెప్పడానికి దత్తాత్రేయుడు కార్తవీర్యార్జునుడికి వినిపించి, ఈ కథను చదివిన వారు, విన్న వారు వెయ్యి గోవుల్ని సద్విప్రులకు దానం చేసిన ఫలం పొందుతారని ఫలశ్రుతి ప్రకటించాడు.

శ్రీ దత్తగురూత్తమా! మాఘ స్నానానికి ఇంతటి అద్భుత శక్తి ఎలా వచ్చింది? ఒక్కసారి స్నానం చేస్తే గత జన్మల పాపాలు తొలగిపోవడం మరోసారి స్నానం చేస్తే స్వర్గలోకం స్వాధీనమవ్వడం ఆశ్చర్యకరంగా వుంది. వణిక్కుమారుడు ఘోరపాపాలు చేసినా మాఘస్నానంతో విముక్తుడై స్వర్గానికి చేరుకోవడం మరీ వింతగా వుంది. దీని రహస్యం ఏమిటో బోధించమని తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాను. స్వామి ! దయచేసి అనుగ్రహించు.

# మాఘ స్నాన విధి

కార్తవీర్యార్జునా! సలిలానికి సహజంగానే మలపంకిలాలను ప్రక్షాళన చేసే శక్తి వుంది. అది స్వయంగా నిర్మలం. స్నానం చేస్తుంటే ప్రాణానికి హాయిగా వుంటుంది. క్లుప్తంగా చెప్పాలంటే నీరనేది ద్రావకం - దాహకం - ధారకం - పోషకం. తనలో మునిగిన వస్తువుల్ని క్రమక్రమంగా కిలుము వదిలిస్తుంది. పొరలు పొరలుగా తనలో కలుపుకుంటుంది. కనుక ద్రావకం - పాపాలను దహిస్తుంది కనుక దాహకం. జీవకోటికి ప్రాణాలు నిలుపుతుంది కనుక ధారకం - పోషిస్తుంది కనుక పోషకం వేదాలు సైతం యోపామాయతనం వేద -మొదలైన మంత్రాలతో నీటిని నారాయణ రూపంగా కొనియాడుతున్నాయి. అంతే కాదు గ్రహాలలో సూర్యగ్రహం - నక్షత్రాలలో చంద్ర బింబం - మాసాలలో మాఘమాసం ఉత్తమోత్తమాలు. ఈ మాఘ మాసాన నిర్మల ప్రాతఃవేళ సూర్యుడు మకరంలో వున్న శుభ గడియల్లో గోష్పాదమంతటి (ఆవు డెక్క) నీటి పడియలో స్నానం చేసినా చాలు ఎంతటి పాపిష్టి నైనా అది స్వర్గానికి చేరుస్తుంది.

మాఘ మాసం నెలనాళ్ళు తెల్లవారు జామున నదీ స్నానం చెయ్యడం అనేది ఒక వ్రతం. ఒక యోగం. దీనికి అశక్తులైన వారు కనీసం మూడు నాళ్ళయినా మాఘ స్నానాలు చెయ్యాలి. యధాశక్తిగా ఏదో ఒక వస్తువు దానం చెయ్యాలి. అలా చేసిన వ్యక్తి మరింక ఏ జన్మలోనూ దారిద్ర్యం అనుభవింపడు. పైగా ధనవంతుడుగా దీర్ఘాయుష్కుడుగా ఇహపరసుఖాలు పొందుతాడు. అయిదు రోజులు గానీ ఏడు రోజులుకానీ చేస్తే అతడి పుణ్య ఫలం చంద్ర కళల్లాగా వృద్ధి చెందుతుంది.

మకర రాశిలోకి సూర్యుడు ప్రవేశించినది మొదలు కొని ప్రతీ రోజూ స్నాన దానాది సత్కార్యాలకు యోగ్యమైనదే. అయితే మాఘ స్నానాలు పెరట్లో చేసే కంటే వెలుపలి నదీ ప్రవాహాలలోనో సరోవరాలలోనో చెయ్యడం శ్రేయస్కరం.

మాఘ స్నానం ఒక వ్రతమన్నారు గదా! దాని నియమాలు తెలుసుకో. తెలుసుకొని పాటిస్తే అధిక పుణ్యఫలం దక్కుతుంది. నెల నాళ్ళూ నేల మీదనే పరుండాలి. స్థండిల శయనమే తప్ప హంస తూలికా తల్పాలు పనికి రావు.

తిలవి మిశ్రితమైన ఆజ్యంతో హోమాలు చేయాలి. సనాతనుడైన వాసుదేవుణ్ని ముప్పొద్దులా అర్చించాలి. మాధవార్పణంగా అఖండ దీపారాధన చెయ్యాలి. వ్రతం ముగిసేదాకా దీపం మలగరాదు. కంబళ్ళు - ధోవతులు - పాదరక్షలు - పసుపు కుంకుమలు - నెయ్యి - నూనె - కార్పసకౌశేయాలు (చొక్కా గుడ్డలు) - దూది - నూలు దుప్పట్లు ఇలాంటి వే ఇంకా ఉపయోగపడే వస్తువుల్ని శక్తి సామర్థ్యాలు దాచుకోకుండా దానం చెయ్యాలి. గురివింద గింజంతయినా బంగారం బ్రాహ్మణుడికి దానం చెయ్యగల్గితే అది సముద్రంలాగా అక్షయమై ఎప్పుడూ తరంగిత మవుతూ వుంటుంది. వ్రత స్వీకారం చేసిన విప్రుడు పరాగ్నిని సేవించకూడదు. దానాలు పట్టరాదు. శీతబాధా నివారకమైన ఇంధనాన్ని ఈ నెలలో దానం చేస్తే మరీ మంచిది.

మాఘ స్నానవ్రతం ముగిసిన వెంటనే ధన లోభం లేకుండా అన్న సంతర్పణ చెయ్యాలి. బ్రాహ్మణులకు భోజనాలు పెట్టాలి. దక్షిణతాంబూలాలు అందించాలి. ఏకాదశినాడు మాఘోద్యాపనం అచ్యుతార్పణంగా శ్రద్ధగా విధివిదానంగా చెయ్యాలి. బంగారం లేదా వెండి శ్రీ హరి ప్రతిమలను ద్విజోత్తములకు వినయ విధేయతలతో అర్చించి బహుకరించాలి. బ్రాహ్మణ దంపతులను లక్ష్మీనారాయణ స్వరూపులుగా భావించి యధోచితంగా పూజించి భోజన సంతృప్తుల్ని గావించాలి.

**మకరస్థే రవౌమాఘే గోవిందాచ్యుతమాధవ ।**
**స్నానేనానేన దేవేశ యథోక్త ఫలదోభవ ॥**

ఈ శ్లోకాన్ని మనస్సులో జపిస్తూ మౌనంగా స్నానం చెయ్యాలి. సారాంశం ఏమంటే దిక్కులు చూస్తూ మనస్సు చెదరగొట్టుకోకుండా కేశవనామాలు జపిస్తూ స్నానం చెయ్యాలి. దేవేశా! ఈ స్నానంతో నాకు రావలసిన పుణ్యాన్ని దక్కించు - అని ప్రార్థిస్తూ స్నానం చెయ్యాలి. చేశాక కూడ కేశవ నామాలే జపిస్తూ ఇంటికి చేరుకోవాలి. యదావిధిగా అర్చనలూ పూజలూ దానాలూ జపాలూ సాగించాలి.

వేడి నీళ్ళతో ఆరేళ్ళపాటు మాఘస్నానాలు చేసిన పుణ్యఫలం ఒక్కసారి మకర వేళ పెరటి బావిచన్నీళ్ళతో స్నానించినందువల్ల లభిస్తుంది. పన్నెండేళ్ళు పెరటి బావి స్నానాల ఫలితం ఊరివెలుపలి వాపీ కూపతటాకాల్లో ఒక్కసారి స్నానించినందునే దక్కుతుంది. తటాకస్నానంతో ద్విగుణంగా, పిల్లకాలువ స్నానంతో చతుర్గుణంగా, దేవఖాత స్నానంతో (కోవెలకోనేరు) దశగుణంగా మహానదీ స్నానంతో శత గుణంగా, నదీ సంగమ స్నానంతో చతుశ్శత గుణంగా గంగా స్నానంతో సహస్ర గుణంగా పుణ్యఫలం లభిస్తుంది. గంగానదిలో మకర మాఘస్నానం చేస్తే ఆ పుణ్యాత్ములు చతుర్యుగ సహస్రాంతాలకూ దేవలోకం నుంచి పతనం చెందరు. ఇదే స్నానాన్ని గంగా యమునా సంగమ స్థలంలో చేస్తే ఇంతకు రెట్టింపు పుణ్యఫలం లభిస్తుంది. ప్రతిరోజూ వెయ్యి సువర్ణ నిష్కాలను, లేదా వెయ్యి గిత్తలను, లేదా అయుత కపిల గోవులను దానం చేస్తే - వచ్చేపుణ్య ఫలం, గంగా యమునా సంగమంలో చేసిన ఒకే ఒక్క మాఘస్నానంతో కైవశమవుతుంది.

## ప్రయాగ మహిమ

కార్తవీర్యా ! గంగా యమునా సంగమస్థలాన్ని ప్రయాగ అంటారు. ఇది మహా పాప సమూహాలకు దహన వాటికగా, పాపరూప పశువులకు విశసన స్థలిగా (గబేళా) బ్రహ్మ దేవుడు ఈ ప్రయాగను సృష్టించాడు. ఇది తెలుపూ (గంగ) నలుపూ (యమున) జలాల కూడలి. దీని గర్భంలో సరస్వతీ నది కూడా వుంది. అయితే అది అదృశ్యరూప. ఇలా ఇది త్రివేణీ సంగమం. బ్రహ్మలోకానికి ఇది మార్గం. ఈ సంగమస్థలంలో మకర రవివేళ మాఘ స్నానం చేసిన భాగ్యశాలికి మరెప్పుడూ ఏ గర్భకోశంలోనూ మునుగవలసిన అవసరం ఏర్పడదు. అపునర్భవమైన ముక్తిని పొందుతాడు. దేవతలకు సైతం దురాసదమైన వైష్ణవ మాయ కూడా మాఘంలో ఇక్కడ దగ్ధమవుతుంది. అంతటి శక్తీ అంతటి పవిత్రతా ఉన్న తీర్థ మిదొక్కటే. రకరకాల పుణ్యకార్యాలకు ఫలాలుగా దక్కిన ఆయా తేజోమయ లోకాలలో విహరించి భోగాలను అనుభవించిన పుణ్యజీవులు ఈ సంగమ తీర్థంలో మాఘస్నానం చేసి శ్రీ మన్నారాయణుడిలో లీన మవుతారు.

మకర రవివేళ ఈ సితాసిత జల సంధిలో స్నానం చేసినందువల్ల వచ్చే పుణ్యాన్ని గానీ, ఆ పుణ్యానికి తగిన స్థానాన్నిగానీ చిత్ర గుప్తుడైనా లెక్కకట్టి చెప్పలేడు. నూరేళ్ళ నిరాహార వ్రతానికీ, మూడు వందల ఏళ్ళ యోగాభ్యాసానికి కురుక్షేత్రంలో సూర్యగ్రహణ సమయాన నూరు బారువుల బంగారం దానంచేసిన దానికీ వెయ్యి రాజసూయ యాగాలు నిర్వహించిన దానికీ లభించే పుణ్యఫలం ఇక్కడ ఈ త్రివేణిలో మూడు మాఘస్నానాలు చేస్తే చాలు వచ్చి ఒడిలో పడుతుంది. మరొక రహస్యం విను ఈ భూగోళం మీద వున్న సకల తీర్థాలూ, సమస్త పుణ్య క్షేత్రాలూ ఈ త్రివేణిలో

మాఘ స్నానానికి వేంచేస్తాయి. అప్పటి దాకా తమలో మునిగిన పాపాత్ముల కిల్బిషాలతో నల్లబడ్డ ఈ తీర్థాలు త్రివేణీ మాఘ స్నానంతో కిల్బిషాలను పూర్తిగా వదిలించుకొని తెల్లబడతాయి.

జీవుడి ఆవిర్భావం నుండీ జన్మ జన్మాంతరాల్లో మనోవాక్కాయ కర్మలతో కూడబెట్టుకున్న మహాపాపరాశి అంతా ఇక్కడ మాఘ స్నానంతో పిడికెడు బూడిదయై నీళ్ళల్లో కరిగిపోతుంది. ఇక్కడ మూడు మాఘ స్నానాలు చేస్తే చాలు ఎంతటి నరాధముడైనా కుబుసంలా పాపాలను వదిలేసి పవిత్రుడై అమరధామం చేరుకుంటాడు. కురుక్షేత్రంలో ఎక్కడ గంగా స్నానంచేసినా ఇదే ఫలితం. ఇంతకన్నా వింధ్యాగంగా సంగమంలో నైతే పదిరెట్లూ, ఉత్తర వాహినిగా గంగ ప్రవహిస్తున్న కాశీలోనైతే వంద రెట్లూ, గంగా యమునా సంగమంలోనైతే అంతకన్నా నూరురెట్లూ. పశ్చిమ వాహినిగా గంగ ప్రవహిస్తున్నచోటనైతే వెయ్యిరెట్లూ అధికంగా స్నాన పుణ్యఫలం లభిస్తుంది.

అర్జునా! పశ్చిమ వాహినిగా ప్రవహిస్తున్న గంగానదిని దర్శిస్తే చాలు బ్రహ్మహత్యా మహాపాతకం కూడా తొలగిపోతుంది. పశ్చిమంగా ప్రవహించే గంగానది కాళిందిలో సంగమించినచోట మాఘ స్నానం చేస్తే కల్పకల్పాంతర సంప్రాప్తాలైన నిఖిల దోషాలూ అస్తమిస్తాయి. అందుకనే ఈ త్రివేణీ సంగమాన్ని "అమృతము" అని కల్పకల్పాంతరాల నుండీ కీర్తిస్తున్నారు మహర్షులు.

ఇక్కడ మాఘ స్నానముహుర్తం దేవతలకు సైతం కష్టసాధ్యం. అణిమాది గుణసిద్ధులైన యోగీశ్వరాలు బ్రహ్మజ్ఞానులూ, సతీసమేతులై - హరి హర విరంచి పురందరులూ ఆదిత్యులూ మరుత్తులూ గంధర్వులూ, లోకపాలకులూ, యక్షులూ, గుహ్యకులూ, కిన్నెరులూ, నాగులూ అలాగే ఘృతాచీ మేనకా, రంభా, ఊర్వశీ, తిలోత్తమా, ప్రభృతి అప్సరోబృందమూ, పితృదేవతా గణమూ అందరూ ఈ త్రివేణీ సంగమంలో మాఘస్నానం చేయడానికి వస్తారు. కృత యుగంలోనైతే స్వస్వరూపాల తోనూ కలియుగంలోనైతే ప్రచ్ఛన్న రూపాలతోనూ వచ్చి స్నానాలు చేసి వెడతారు. ఈ ప్రయాగలో ముమ్మారు మాఘస్నానం చేసిన వారు వెయ్యి అశ్వమేధాలకన్నా అధికపుణ్య ఫలం పొందుతారు. వెనకటికి కాంచన మాలిని ఇలాగే త్రివేణిలో మూడు నాళ్ళు మాఘ స్నానాలు చేసి సంపాదించుకున్న పుణ్యాన్ని ఒక రాక్షసుడికి ధారపోసింది. దానితో ఆ పాపాత్ముడు కలికల్మష విముక్తుడయ్యాడు.

దత్తాత్రేయుడినోట ప్రసంగవశాత్తూ ఈ మాట వచ్చింది. అంతే కార్తవీర్యార్జునుడు పట్టుకున్నాడు. స్వామీ! స్వామీ ! ఎవరీకాంచన మాలిని? ఎవడా రాక్షసుడు? వీరిద్దరూ ఎలా కలుసుకున్నారు? ఆవిడ తన పుణ్యాన్ని ఎందుకు ధారపోసింది? తెలుసుకోవాలని కుతూహలంగా వుంది. అత్రి సంతతి భాస్కరా! అది పుణ్య ప్రదమైనదని నువ్వు భావిస్తే దయచేసి నా కుతూహలం దీర్చు.

అర్జునా! అసలే నేను శిష్య పరాధీనుణ్ని నువ్వానన్ను గెలుచుకున్న వాడివి. నువ్వు అడగడమూ నేను కాదనడమూనా. తప్పకుండా చెబుతాను. ఇదీ పుణ్య ప్రదమైన కథ. అత్యంత పురాతనమైన ఇతి హాసం. దీన్ని చెప్పడమో వినడమో కాదు. తలుచుకుంటే చాలు అశ్వమేధ ఫలం లభిస్తుంది. శ్రద్ధగా విను.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

# కాంచన మాలినీ వృత్తాంతం

అనగా అనగా ఒక అప్సరస. అత్యద్భుత రూప సంపన్న పేరు కాంచన మాలిని. ప్రయాగలో మాఘ స్నానం చేసి కైలాసానికి వెళుతోంది. ఆకాశ మార్గాన వెడుతున్న కాంచన మాలిని ఒక పర్వత నికుంజం నుంచి ఒకానొక వృద్ధ రాక్షసుడు చూసాడు. అపూర్వ తేజస్సుతో ధగ ధగ లాడుతోంది. పేరుకు తగ్గట్లే మేలిమి బంగారు కాంతులు విరజిమ్ముతోంది. సుదీర్ఘలోచన. చంద్రానన. సుకేశి. పీనోన్నతపయోధర. తను మధ్య. నతానాభి. సుశ్రోణి. అందాల రాశిని చూసి ఆశ్చర్యచకితుడై ఆ రాక్షసుడు ఆరాధనా భావంతో మృదువుగా పలకరించాడు.

ఎవ్వతివే నీవు? భీతి హరిణేక్షణా! ఎక్కడి నుండి నీ రాక? తడిసిన నీ చీర, నీళ్ళోడుతున్న జుట్టుతో ఎక్కడ నుండి వస్తున్నావు? ఎక్కడకు వెడుతున్నావు? కమలాక్షీ! నీకు ఈ ఆకాశ గమనం ఎలా వచ్చింది ? నీ దేహం నీ రూపం అపూర్వమైన తేజస్సుతో సౌందర్యంతో ధగ ధగ లాడుతున్నాయి. మనోహరంగా వున్నాయి. ఏం పుణ్యం చేసుకున్నావ్? నీకొంగు కొంగు నుండి జారిపడిన నీటిబొట్టు ఒకటి నా శిరస్సును అలంకరించింది. ఆ క్షణం నుండీ నాక్రూర మనస్సు ఏదో తెలియని శాంతిని అనుభవిస్తోంది? విశాలాక్షీ! ఇది నీ చీర మహిమా? లేదా నీరమహిమా? దయజేసి వివరించు? ఇంతటి సౌందర్యం ఉన్నదంటే సౌశీల్యమూ ఉండే వుంటుంది.

ఓయీ రాక్షసా! నేనొక అప్సరసను. కామ రూపిణిని. నన్ను కాంచన మాలిని అంటారు. ప్రయాగ నుండి వస్తున్నాను. అందుకే నాదుస్తులు నీళ్ళోడుతున్నాయి. సితాసితజల సంగమంలో స్నానం చేసాను. ఎక్కడికి వెడుతున్నానో చెప్పలేదు కదూ! కైలాస పర్వత శిఖరానికి వెడుతున్నాను. అక్కడ దేవదానవ పూజితుడైన గౌరీ పతి కొలువుతీరి వుంటాడు గదా. పార్వతీ దేవిని సేవించుకోడానికి అక్కడికి వెడుతున్నాను. నీ క్రూర మనస్సు ఏదో తెలియని శాంతిని అనుభవిస్తోంది అన్నావు కదా అది నా చీర మహిమ కాదు ముమ్మాటికీ నీరమహిమే. త్రివేణీ సంగమంలోని నీటి బిందువు అది. దానికి అటువంటి మహిమ ఉంటుంది సహజం. నాకథ అంతా వింటే నీకే అవగతమవుతుంది. ఎవ్వతివే నీవు అన్నావు కనుక ఈ తేజస్సు ఏమిటి అన్నావు కనుక అంతా చెప్పాలి. వింటావా మరి?

వృద్ధ రాక్షసుడు గౌరవభావంతో కళ్ళప్పగించి చూస్తూ మౌనంగా తల ఊపాడు. కాంచన మాలిని ఆకాశం నుండి దిగి వచ్చింది. ఇద్దరూ ఒక చెట్టు నీడన చెరొక రాతి బండల మీద కూర్చున్నారు. కథనం ఇలా కొనసాగింది.

మా తండ్రి పేరు సుమేధుడు. గంధర్వనాయకుడు. నేను వారి పుత్రికను. కన్యకను. ఇంత తేజస్వంతమైన దివ్య రూపంతో ఎలా జన్మించానో అదీ చెబుతాను ఆలకించు. పూర్వ జన్మలో నేనొక వేశ్యను. కళింగ రాజు చేరికలో ఉండే దాన్ని. నా రూపం లావణ్యం కళింగ రాజధానిలో ఒక విధంగా మగ వారికీ మరొక విధంగా ఇల్లాండ్రకూ నిద్ర లేకుండా చేసింది. సర్వ యువతీ శిరోమణిగా సౌందర్య మదగర్వంతో విర్రవీగుతూ సకల రాజ భోగాలూ అనుభవించాను. రాజధాని మాత్రమే కాదు మొత్తం కళింగ సామ్రాజ్యమంతా నా యౌవన రూప సంపదకు సమ్మోహితమయ్యింది అంటే అతిశయోక్తి కాదు. కాంచన రత్నా భరణాలో, మనోహర వస్త్రాలో, అనూహ్య పరిమళ ద్రవ్యాలో, ఏవో ఒకటి కళింగాధిపతి రోజూ నాకు కానుకలుగా పెట్టేవాడు. ఇవే ఏమిటి, అతడి అధికారం అతడి కోశాగారం అన్నీ నా అధీనంలో ఉండేవి.

వింటున్నావు గదా! రాజు గారి కన్ను కప్పి నా నివాసమందిరంలో కొందరు యువకులు ఎప్పుడూ ఉండేవారు. కామ మోహితులై నాకు సేవలు చేసేవారు. కాళ్ళు పట్టేవారు. నేను అందరినీ వంచించాను. మాయచేసి అందరి ధనమూ లాగేశాను. వాళ్ళళ్ళో కొందరు పరస్పరం అసూయలతో హత్యలు చేసుకున్నారు. నిర్ధనులై కొందరు ఆత్మ హత్యలు చేసుకున్నారు. కళింగ నగరంలో నా జీవితం ఇలా సాగింది ఆడింది ఆటగా పాడింది పాటగా.

శ్రోతా! ఎందుకో గానీ యౌవనం ఎప్పుడూ వేగంగా పయనిస్తుంది. వార్ధక్యలక్షణాలు నన్ను దురాక్రమణ చేసాయి. నా హృదయం భరింపరాని దుఃఖంతో మూలిగింది ఏమి లాభం? కాలానికి కళ్ళెం వెయ్యగలనా? పోయిన వయస్సును తీసుకురాగలనా? ఎంత సంపద ఉండి ఏమి ప్రయోజనం. ఎంత ప్రభావం ఉండి ఏమి ఫలం? నాలో ఒక ఆవేదన బయలు దేరింది. ఎండమావుల వెంట పరుగులు తీసాను. అదే ఎరుకగలిగింది. శాశ్వతానందంకోసం ఇకనైనా ప్రయత్నించాలనే సంకల్పం దృఢంగా ఏర్పడింది. ఒక దానమా? ఒక ధర్మమా? జపమా, తపమా? ఏమి చేసానింత కాలమూ? గుడికి పోలేదు. గోపురానికి పోలేదు. పుణ్య దినం లేదు. పర్వదినం లేదు. అంతా నాటకం. ధనార్జన, ధనార్జన శివుడినెత్తిన ఒక్క చెంబెడు నీరు కుమ్మరించిన పాపాన పోలేదు. శ్రీరంగేశుడి ముంగిట ముగ్గు కర్ర తీర్చిన పాపాన పోలేదు. దేవీనవరాత్రులలో రోజుకొక అలంకారంతో కనువిందు చేస్తుంది అమ్మ. చెలి కత్తెలు చెబుతూ వున్నా వినిపించుకోలేదు. వీళ్ళ పిచ్చిగానీ నన్ను మించిన సౌందర్యమా అని భీష్మించాను. ఎంత పిచ్చి దానిని. ఎంత దురహంకారిణిని. ఏనాడూ విప్రులకు విద్వాంసులకూ చెయ్యి విదిలించింది లేదు.

ఏ ప్రాణికి నేను చేసిన ఉపకారం అంటూ లేదు. ఎందుకొచ్చిన బ్రతుకు ఇది? నా కన్నా చెట్టూ పుట్టానయం. నోరు లేని జీవాలు నయం. పొరపాటునన్నైనా పిసరంత పుణ్యకార్యం చేసి ఎరుగను. మహాపాపాలు మాత్రం ఎరిగి ఎరిగి చాలా చేసాను. ఈ బాధతో ఈ ఆవేదనతో నా మనస్సు నన్ను దహించి వేస్తోంది. ఎన్నో రోజులు పగలూ రేయీ ఏకాంతంగా విలపించాను. నిద్రాహారాలకు దూరమై చిక్కి శల్యమయ్యాను. ఈ దశలో ఒక రోజున ఓపిక కూడ దీసుకొని రాజపురోహితుడి ఇంటికి వెళ్ళాను. కాళ్ళ మీద బడి వలవలా విలపించాను. శీల సంపన్నుడైన ఆవేద విద్వాంసుడు ఎంతగానో నన్ను ఊరడించాడు. చాలా సేపటికి తేరుకున్నాను.

బ్రహ్మన్! నా పాపాలకు నిష్కృతి లేదు. చెప్పండి నేను సద్గతులు పొందే మార్గం ఉపదేశించండి. స్వయం కృతాపరాధాలతో నేను దహించుకు పోతున్నాను. ఏకాకినై విలపిస్తున్నాను. పాప పంకిలంలో మెడలోతు దిగబడిన నన్ను దయచేసి జుట్టు పట్టుకొని పైకిలాగండి. కారుణ్యవర్షం కురిపించండి. పాపపంకిలం వదిలించండి. అయిన వారికి అందరూ ఉపకారాలు చేస్తారు. నా బోటి విపన్నులకు సహాయం చేసిన వారే నిజమైన సాధు సజ్జనులు. క్షీర సముద్రం హంసలకేనా? కొంగలకు ఉపకరించదా? ఇదేమి అన్యాయం? స్వామీ దారి చూపండి.

కాంచన మాలినీ! నీ జీవితం అంతా నేనెరుగుదును. నీ నిషిద్ధాచరణలు నేనెరుగుదును. ఇప్పటికైనా నీలో పశ్చాత్తాపం కలిగింది. సంతోషం. నువ్వు వెంటనే బయలు దేరు. ప్రజాపతిక్షేత్రం అయిన ప్రయాగ చేరుకో. అక్కడ త్రివేణీ సంగమంలో స్నానం చెయ్యి. అది ఒక్కటే సమస్త పాపాలనూ ప్రక్షాళన చెయ్యగలిగిన తీర్థం. ఇంతకన్నా మరొక దారి కన్పించడం లేదు. సకల పాపాలకు తీర్థ స్నానమే ప్రాయశ్చిత్తంగా మునులు చెప్పారు. కానీ ఆ తీర్థంలో ఉండి

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

అమంగళాలను అశుభవాంఛలనూ మనస్సులోకి ఏ మాత్రం రానివ్వ కూడదు. ఇది గుర్తుంచుకో. వెళ్ళిరా. ప్రయాగస్నానంతో పాపశుద్ధి పొంది నువ్వు స్వర్గానికి వెడతావని నాకు అనిపిస్తుంది. దాని శక్తి అటువంటిది. ఆ తీర్థంలో తప్ప ఇతర ప్రాంతాలలో చేసిన ఎంతటి మహాపాతకమైనా మునిగిన తత్‌క్షణమే వదిలిపోతుంది.

పురాణ కాలంలో దేవేంద్రుడు ఒక తప్పిదం చేసి ఈ త్రివేణీ సంగమంలోనే మునిగి కిల్బిష విముక్తి పొందాడు. మనస్సు కుదుటపడుతుంది. నీకు ఆ కథ చెబుతాను శ్రద్ధగా విను.

## ఇంద్రుడికి శాప విమోచనం

గౌతమ మహర్షి ఇల్లాలు అహల్య. అపూర్వ సౌందర్య రాసి. దేవేంద్రుడు చూసి కామ మోహితుడయ్యాడు. మహర్షి ఆశ్రమంలో లేని వేళ తాను గౌతమ రూపంలో వచ్చి కోరిక తీర్చమని అభ్యర్థించాడు దేవరాజు. అహల్య కుతూహలంతో అంగీకరించింది. అప్పుడే ఆశ్రమానికి చేరుకున్న గౌతమ మహర్షికి ఇద్దరూ దొరికి పోయారు. కామంతో కళ్ళు మూసుకుపోయి ధర్మ హాని చేసినందుకు మహర్షి కోపోద్రిక్తుడై ఇంద్రుడ్ని శపించాడు. దానితో ఇంద్రుడు కురూపి అయ్యాడు. సహస్ర భగచిహ్నితుడయ్యాడు. తలదించుకొని దేవరాజు నిష్క్రమించాడు. అతిలజ్జాకరమైన ఆ కురూపం భరించలేక ఎవరి కంట బడటమూ ఇష్టంలేక తనను తాను నిందించుకుంటూ అసహ్యించుకుంటూ మేరు పర్వతం చేరుకున్నాడు. ఇంద్రలోకాన్ని ఇంద్ర పదవినీ విడిచి పెట్టేశాడు ఆ పర్వత శిఖరం మీద ఒక విశాల సరోవరం. ఆ సరస్సులో ఒక పద్మం. ఆ పద్మ గర్భంలో దాక్కుని బలవంతంగా రోజులు నెట్టుతున్నాడు. చేసిన పాపానికి పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నాడు. ఈ కామం ఎంత నింద్యమైనది. వెంటనే నరకంలోకి తోసేస్తుంది. ఆయుష్షు కీర్తి యశస్సు ధర్మం ధైర్యం - అన్నింటినీ ధ్వంసం చేస్తుంది. దురాచారుడైన మన్మథుణ్ని ఏమి చేసినా పాపం లేదు. సకల సంపదలకు అతడే మూలం. మానవులకు అత్యంత బలీయుడైన అంతశ్శత్రువు. అణచడానికి వీలు లేకుండా శరీరంలోనే తిష్ట వేసుకొని కూర్చున్న గూఢ దుర్మదుడు. నిత్యమూ అసంతుష్టుడు. నిత్యమూ అరుంతుదుడు. (మర్మ భేదకుడు. ఆయువులను పట్టి పీడించేవాడు)

పద్మ గర్భంలో దాక్కుని ఇలా ఇంద్రుడు కుమిలిపోతూంటే అక్కడ దేవలోకం - పాలకుడు లేక బెగ్గడిల్లింది. దేవతలందరూ శచీదేవిని ముందు నిలుపుకొని దేవ గురువు బృహస్పతి దగ్గరికి వెళ్ళారు. సాష్టాంగ పడ్డారు. గురూత్తమా! దేవపతి జాడ తెలియరాలేదు. ఎక్కడికి వెళ్ళాడో? ఎక్కడ ఉన్నాడో? ఎక్కడని వెదకాలి? ఏమీ తోచక సలహాకోసం మీ సన్నిధికి వచ్చాం. ఇంద్రుడు లేని నాకలోకం కొడుకులేని వంశంలా క్షీణోన్ముఖం అవుతోంది. దీన్ని అరికట్టాలి. ఆలస్యం చెయ్యకండి. వెంటనే ఆలోచించి ఉపాయం చెప్పండి కర్తవ్యం ఉపదేశించండి - అని ముక్త కంఠంతో దేవతలంతా ప్రార్థించారు. శచీదేవి బిక్కమొగం వేసుకొని దీనంగా చూస్తూ నిలబడింది.

దేవతలారా! శిష్యులారా! కంగారు పడకండి. ఇంద్రుడు ఎక్కడ ఉన్నాడో నాకు తెలుసు. స్వయం కృతాపరాధానికి రజోగుణ ప్రేరితమైన ఒక పాప కృత్యానికి ఫలం అనుభవిస్తున్నాడు. నీతిమాలిన పనులు చేస్తే పరిణామాలు భయంకరంగా ఉంటాయి. రాజ్యమదోన్మత్తుడై కార్యాకార్య వివేకం కోల్పోయాడు. ఇహపరాలను నాశనం చేసే నింద్యమూ గర్హితమూ

కుత్సితమూ అవాచ్యమూ అయిన అకృత్యం చేశాడు. దైవోపహత చేతస్కులై బాలిశులు ఇలా అపరాదాలుచేస్తారు. ఇహపరాలలో జన్మను నిష్ఫలం చేసుకుంటారు. చాలామంది ఇంతే. నడవండి ఇంద్రుడి దగ్గరకు వెడదాం.

బృహస్పతి బయలుదేరాడు. అతడి వెంట అందరూ కదిలారు. మేరుశిఖరం చేరుకున్నారు. స్వర్ణకమలాల కనువిందు చేసింది. ఏ స్వర్ణకమల కోటరంలో ఉన్నాడో మహానుభావుడు. బృహస్పతి ఎలుగెత్తి పిలిచాడు. వెంటనే ఇంద్రుడు బయటకు వచ్చాడు. వస్తూనే గురువుగారి పాదాలపై పడ్డాడు. కాపాడండి, నా పాపానికి నిష్కృతి చెప్పండి. బుద్ధి తక్కువై అహంకరించి పాడుపని చేశాడు. ఫలితం అనుభవిస్తున్నాను. కరుణించి తరుణోపాయం ఉపదేశించండి గురుదేవా? అని మొరపెట్టుకున్నాడు.

చేసిన నేరానికి శిక్ష అనుభవించావు కనుక, తరుణోపాయం చెబుతున్నాను. పద, నేనూ వస్తాను. ప్రయాగ వెడదాం. అక్కడ త్రివేణీ సంగమంలో మునుగుదువుగాని వెంటనే పాప విముక్తి పొందుతావు.

బృహస్పతి వెంట బయలుదేరి ప్రయాగ చేరుకున్నారందరూ. గంగాయమునా సితాసిత జలౌఘంలో స్నానం చేశాడు దేవేంద్రుడు. పాప విముక్తి పొందాడు. బృహస్పతి సంతుష్టుడయ్యాడు. ఇంద్రా! పాప విముక్తుడవు అయ్యావు కాబట్టి నీకొక వరం ఇస్తున్నాను. ఈ క్షణం నుంచీ నీ శరీరం మీద ఈ సహస్ర భగచిహ్నాలు ఈక్షణాలుగా మారిపోతాయి. సహస్రాక్షుడవుతావు. బృహస్పతి ఈ మాట అనడమేమిటి దేవేంద్రుడి శరీరం మీద ఆ మార్పు వచ్చేసింది. పద్మాల్లాంటి సహస్ర లోచనాలు సాక్షాత్కరించాయి. సహస్ర కమలాల మానససరోవరంలాగా భాసించాడు.

బృందారకులు జయజయ ధ్వానాలు చేశారు. మునీశ్వరులు మంగళాశీస్సు లందించారు. గంధర్వులు స్తోత్రపాఠాలు వినిపించారు. అప్సరసలు ఆనంద లాస్యాలు ప్రదర్శించారు. అందరూ తిరిగి అమరావతికి చేరుకున్నారు.

అంతటి మహిమ కలది ప్రయాగ సంగమం. కనుక ఓ కాంచన మాలినీ ! నువ్వు వెంటనే బయలు దేరి వెళ్ళు. త్రివేణీ సంగమంలో స్నానం చెయ్యి. పాప విముక్తి పొందుతావు. సద్గతులు కల్గుతాయి. అని రాజపురోహితుడు ఉపదేశించాడు. వెంటనే వారి పాదాలకు నమస్కరించాను. ఇంటినీ బంధువర్గాన్నీ దాసదాసీ జనాన్ని ఆస్తిపాస్తుల్నీ తృణప్రాయంగా పరిత్యజించాను. విషయ వాంఛలను విషగ్రాసంలాగా వదిలేశాను. నశ్వరమైన ఈ శరీరం కోసమా ఇంత కాలమూ ఇన్ని పాపాలు చేశాను! ఈ దుస్సాంగత్యాలవల్ల దక్కే ఫలితమేమిటి? దారుణ నరక నివాసం - ఇలా ఉడికిపోతున్న హృదయంతో త్వరత్వరగా ప్రయాగ చేరుకున్నాను. నా అదృష్టం బాగుండి అది మాఘ మాసారంభం. పాడ్యమినాడు త్రివేణీ సంగమంలో సితాసిత జలంలో స్నానం చేశాను. కౌణపవ్యాఘ్రా! (రాక్షసోత్తమా) ఆ స్నానమహిమ ఏమని చెప్పను. మూడు రోజుల స్నానాలతో నా పాపాలన్నీ తొలగిపోయాయి. తక్కిన ఇరవై ఏడు రోజుల స్నానాలతో లభించిన పుణ్య విశేషంవల్ల నాకు ఈ దేవత్వం దక్కింది. కైలాసంలో పార్వతీదేవికి ఇష్ట సఖినై పరిచర్యలు చేస్తూ ఆనందిస్తున్నాను. అప్పటి నుంచీ ప్రతి మాఘమాసంలోనూ నిత్యమూ లేదా కనీసం మూడు పర్యాయాలైన వచ్చి త్రివేణిలో స్నానంచేసి వెడుతుంటాను. ఆశ్చర్యచకితుడవై అడిగిన ప్రశ్నలకు అన్నింటికీ సవివరంగా సమాధానం చెప్పాను. నీ ముఖ కవళికలు చూస్తుంటే సంప్రీతి చెందావని తెలుస్తోంది. మరి నీ కథ చెప్పి నాకు కూడా ఇలాంటి సంప్రీతి కలిగించవచ్చుగా, నీ కసలు ఈ భయంకర రాక్షసరూపం ఎలా వచ్చింది? ఏ దుష్కర్మకు ఫలమిది? ఈ మీసాలూ దీర్ఘదంష్ట్రలూ మాంస భోజనం గిరిగహ్వర నివాసం - ఏమిటిదంతా?

కళ్యాణీ, కాంచన మాలినీ! సజ్జనులకు కొన్ని లక్షణాలున్నాయి. ఇతరులకు ఇష్టమైనదాన్ని ఇస్తారు. తమకు ఇష్టమైన దాన్ని అడిగి తీసుకుంటారు. ఎంతటి రహస్యాలనైనా ప్రీతితో చెబుతారు. అలాగే అడిగి తెలుసుకుంటారు. ఈ లక్షణాలు నీలో ఉన్నాయి కనుక నువ్వు సజ్జన శ్రేణికి చెందుతావు.

ఇంతకాలానికి, నన్ను గౌరవించే ఒక ప్రాణివి దొరికావు. నేను అడిగానని నీ కథ అంతా చెప్పావు. నన్ను పట్టించుకుని నా దుర్గతికి కారణం అడిగావు. చెబుతాను. ఈ క్రూరజన్మకు కారణమైన నా దుష్కృత్యాలూ స్వయంకృతాలూ అన్నీ చెబుతాను. దాపరికం లేకుండా చెబుతాను. నీలాంటి సజ్జనులకి వినిపిస్తే దుఃఖభారం తగ్గుతుంది. కాసింత హాయి దక్కింది. అదృష్టం బాగుంటే నిష్కృతీ లభించవచ్చు. చెబుతున్నాను విను.

## వృద్ధ రాక్షసుడి పూర్వజన్మ

పూర్వ జన్మలో నేను కాశీ నివాసిని. ఉత్తమ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాను. ఋగ్వేదపారం ముట్టాను. కానీ రేవులో కాకినై నానాదానాలు పట్టాను. రాజుల నుంచి పుల్కసులదాకా ఎవడు ఏ పాపిష్టివాడు ఏ భయంకరదానం ఇచ్చినా విధినిషేధాలు లేకుండా చెయ్యిజాపాను. వారి పాపాలన్నీ మీద వేసుకున్నాను. అప్రతిగ్రహంగా జీవించవలసిన వేదవేత్తను ఇలా దానాలు పట్టేవాడిగా మారిపోయాను. పరహితం కోసం దానాలు పట్టినా ప్రాయశ్చిత్తాలు చేసుకున్నానా? లేదు. పోనీ అంటే నేనెవరికైనా ఏదానమైనా ఇచ్చానా? లేదు. అర్థ లోభంతో నేను చెయ్యని దుష్కృత్యం లేదంటే నమ్ము. ఇతర ప్రదేశాలలో చేసిన దోషాలు కాశీలో గంగా స్నానంతో తొలగిపోతాయి. కానీ అవి-ముక్త క్షేత్రమైన కాశీలో చేసిన పాపాలు మేరు పర్వతాల్లా పేరుకుపోతాయే తప్ప ఏ పుణ్యకార్యానికీ కరగవు. అసలు నేను ఏ పుణ్యకార్యమైన చేస్తే గదా! రోజులూ వారాలూ నెలలూ సంవత్సరాలూ గడిచిపోయాయి. ముసలితనం వచ్చిపడింది. శరీరమన్నాక నేడో రేపో రాలిపోవలిసిందేగా. మరణించాను. అయితే అవి ముక్తక్షేత్ర మహిమవల్ల నేను నరకానికి పోలేదు. కాశీకి యమదూతలు రారు. ఎంతటి మహాఘోరపాపిష్టి అయినా కాశీలో మరణిస్తే నరకానికి పోడు, గర్భవాస క్లేశంలేని ముక్తిని పొందుతాడు. కానీ నేను చేసిన పాపాలన్నీ అవి ముక్తంలోనే కనక అవి నన్ను ముక్తిని పొందనివ్వలేదు. వజ్రలేపాలై తగిలి నిలిచాయే తప్ప విడిచిపెట్టలేదు. ఆ కారణంగా నీచ జన్మలు ఎన్నో ఎత్తాను. అయితే కాశీ క్షేత్ర మహిమవల్ల గర్భవాస క్లేశంలేని అయోనిజ జన్మలే లభించాయి. ఇది కాశీలో మరణించిన నావంటి పాపిష్టులకు శ్రీ భైరవానుజ్ఞ (పదమంజరీ వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః) హిమాలయాల్లో గ్రద్దగా రెండు జన్మలు, వ్యాఘ్రంగా మూడు జన్మలు, సరీసృపంగా గుడ్లగూబగా మలభక్షక క్రిమిగా పందిగా ఒక్కొక్క జన్మ అయ్యి ఇదిప్పుడు ఈ రాక్షసరూపం పదవజన్మ. ఈ జన్మ ఎత్తి ఇప్పటికి డబ్బై అయిదువేల సంవత్సరాలయ్యింది. అయినా అతీగతీ లేదు. నాకు నిష్కృతి లభిస్తుందనిగానీ ఈ దుఃఖసాగరం నుండి విముక్తి పొందుతానని గానీ ఆశ కూడా లేదు. భద్రే! ఈ ముప్పాతిక వేల సంవత్సరాలలో ఏ పాపమూ ఎరగని ఎన్ని ప్రాణుల్ని భక్షించానో. మూడు యోజనాల మేర జంతు వేదైనా కనిపిస్తే ఒట్టు. పూర్తిగా నిర్జంతుకమైపోయింది. ఈ మహా పాపాలన్నీ అనుక్షణమూ నా హృదయాన్ని దహించివేస్తుంటే మనశ్శాంతి కరువై అలమటిస్తున్న నాకు నీ దర్శనం అమృత సేచనంగా లభించింది. కొసకొంగు నుంచి జారిపడిన నీటి బిందువు హృదయశల్యాన్ని తొలగించింది. **తీర్థయాత్రలూ, తీర్థస్నానాలూ ఎప్పటికో ఫలిస్తాయట. సజ్జన సాంగత్యం మాత్రం తక్షణమే ఫలిస్తుందట.** అందుకే మహాత్ములు ఈ సత్సంగతిని బహుధా కొనియాడుతుంటారు.

తల్లిగా ! నా దుఃఖాలా దుష్కృతాలూ అన్నీ నీ ముందు వెళ్ళబోసుకున్నాను. ఎదుటి వారి కష్టాలను కనీసం ఓపికగా వినిపించుకునే సజ్జనులు మరీ అరుదైపోతున్న రోజులివి. నువ్వు విన్నావు. అంతే చాలు. ఇక నేను చెప్పవలసింది ఏమీలేదు. ఈ దుఃఖసముద్రానికి ఆవలి తీరం ఎక్కడో జన్మపరంపరలకు ముగింపు ఎప్పుడో - తెలిస్తే పుణ్యం కట్టుకో, సజ్జనుల సంపద ఏదైనా అది పరులకోసమే అన్నారు. అందరికీ అనుభవించే హక్కు సమానమే అన్నారు. క్షీర సముద్రంలోని పాలు హంసలన్నింటికీ సమానంగా ఉపజీవనాలు కావడం లేదూ. అలాగేనటమరి.

వృద్ధరాక్షసుడి ఆవేదన కాంచన మాలినిని కరుణారసార్ద్రను చేసింది. ఒకప్పటి తన ఆవేదన తన పశ్చాత్తాపం గుర్తుకు వచ్చాయి. పుణ్యదానం చెయ్యాలనిపించింది. రాక్షసోత్తమా! ఇప్పుడే నీకు నిష్కృతి కలిగిస్తాను. దుఃఖించకు. నీ ముక్తికి గట్టిగా ప్రయత్నం చేస్తాను. ఏటేటా మాఘస్నానాలు చేశాను. ఎన్నో ఏళ్ళ తరబడి చేస్తున్నాను. అదీ శ్రద్ధగా చేస్తున్నాను. త్రివేణీ సంగమంలో చేస్తున్నాను. కనుక ఎంతో కొంత పుణ్యం రాశిపడి ఉంటుంది సందేహం లేదు - అది నీకు కొంత ధారపోస్తాను. ఆర్తుడికి చేసిన దానమే దానమని వేదవిదులు ప్రశంసిస్తున్నారు. సముద్రంలో కురిసిన మేఘుడు ఏ ఫలం మూటగట్టుకుంటున్నట్టు?

మిత్రమా! త్రివేణీ సంగమంలో చేసిన ఒక మాఘ స్నాన వ్రత ఫలం నీకు సమర్పిస్తున్నాను. దీనితో నీకు దేవతాకారమూ స్వర్గతీ లభిస్తాయి. ఆ పుణ్యఫలం ఎంతటి మహిమాన్వితమో నేనింతకు ముందు అనుభవించాను కనక సద్య స్సర్వపాప వినాశకంగా అమరత్వ ప్రదాయకంగా దాన్ని నీకు దానం చేస్తున్నాను. అని చెప్పి కాంచన మాలిని నీళ్ళోడుతున్న తన చీర చెంగును చేతిలోకి పిండుకుని ఆ వృద్ధరాక్షసుడి దోసిట్లోకి - ఇదమేకం మాఘజం పుణ్యం తుభ్యమహం సంప్రదదేనమమ - అని ధారపోసింది. ఆ ధార దోసిట్లో పడటమేమిటి రాక్షసుడు దేవతాకారం ధరించడమేమిటి ఒక్కసారిగా జరిగిపోయాయి. అతడి దివ్యతేజస్సు దశదిశలనూ ధగద్ధగాయమానం చేస్తోంది. అంతలోకి దేవతా విమానం వచ్చి అతడి చెంత నిలిచింది. హర్షోత్ఫుల్లలోచనుడై అధిరోహించాడు.

కళ్యాణీ! నిష్కృతియే లేదనుకున్న నాకు ఇంతటి మహోపకారం చేశావు. సదసత్కర్మలకు అనువైన ఫలం అందించే దేవదేవుడు నీకు సమస్త సన్మంగళాలనూ ప్రసాదించుగాక! కారుణ్యమయీ! మరికాస్త అనుగ్రహించి నాకు - సర్వనీతిమయమైన మార్గం ఉపదేశించు. నువ్వు నాకు గురుస్థానీయవు. నీ మాట నాకు శిరోధార్యం. జీవితంలో నేనింక ఏ పాపమూ చెయ్యకుండా తగిన ఉపదేశం ఇయ్యి. అది విన్నాక నిన్ను స్తుతించి ధన్యుణ్ని అవుతాను. అటుపైని సురలోకం చేరుకుంటాను. ఆకాశమార్గాన విమానంలో తన చెంత నిలబడి అభ్యర్థించాడు ఆ నూతన త్రిదశుడు.

కాంచన మాలికి పట్టరానంత ఆనందం కలిగింది. తన ఉపకారం వల్ల ఒక రాక్షసుడు దేవతగా మారడమే ఒక ఆనందమైతే, అలా మారినవాడూ విమానమెక్కి తుర్రుమనక తన ఉపదేశం అర్థించడం ఇంకా ఆనందాన్ని కలిగించింది. ప్రేమగా ధర్మోపదేశం చేసింది.

మిత్రమా! ఏనాడూ ధర్మం తప్పకు. ప్రాణి హింసకు పాల్పడకు. సాధు పురుషులను సేవించు. కామక్రోధాధుల్ని పరిత్యజించు. ఇతరుల దోషాలనో, గుణాలనో కీర్తిస్తూ కాలయాపన చెయ్యక నిత్యమూ సదాశివుణ్ణి ధ్యానించు. అంతర్బహిరింద్రియాలన్నింటినీ (స్వర్ణభాన్ని) జయించు. అస్థిమాంస రుధిరాలతోనూ మలమూత్రాలతోనూ నిండిన ఈ శరీరం చివరికి క్రిమికీటకాలకు ఆహారమవుతుంది. పురుగులు పడుతుంది. దీని మీదా దీనితో ముడిపడిన

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

భార్యాపుత్రుల మీదా మమకారం విడిచిపెట్టు. ఈ జగత్తు క్షణభంగురమని తెలుసుకో. ఒక వైరాగ్యభావం అలవరచుకో. యోగాభ్యాసం వైపు దృష్టి నిలుపు. నీ మీద ప్రేమతో నీ మాట కాదనలేక ఏదో నాకు తెలిసిన ధర్మోపదేశం చేశాను. మనస్సులో పెట్టుకో. ప్రధానంగా శీల సంపన్నుడవై మెలుగు. జ్యోతిర్మయదేహుడవై వెలుగు. ఇక బయలు దేరు. సుఖంగా నాకలోకం చేరుకో.

అమ్మా! కాంచనమాలినీ! అద్భుతమైన ధర్మోపదేశం చేశావు. నాకే కాదు అన్ని లోకాలవారికీ ఆచరణీయమైన నీతి మార్గం ఉపదేశించావు. ధన్యుణ్ణి. కృతజ్ఞుణ్ణి. పావనీ! నువ్వు కూడా ఇలాగే ఎప్పుడూ సుఖసంతోషాలతో జీవించు. ఎప్పుడూ నవ్వుతూ ఆడుతూ పాడుతూ ఆనందంగా గడుపు. సాధ్వీ! నీకు సర్వదా శుభమగుగాక! కైలాసంలో శివ సన్నిధిలో ఆచంద్రతారకంగా నివశించు. పార్వతీదేవికి నీ మీద ప్రేమ ఇలాగే అఖండితంగా వర్ధిల్లుగాక. తల్లీ! ధర్మనిష్ఠా తపోనిష్ఠలతో నీ జీవితం చరితార్థమగుగాక. శరీర వ్యామోహం మరింకెన్నడూ నీకు కలుగకుండు గాక. ఇలాగే ఎల్లవేళలా ఆ పన్నుల ఆర్తిని హరింతువుగాక - సెలవు తల్లీ ! సెలవు - అంటూ శిరస్సున అంజలి ఘటించి విమానంతో సహా ముమ్మారు ప్రదక్షిణం చేసి నాకలోకానికి దూసుకు వెళ్ళిపోయాడు.

అటువైపే చూస్తూ నిలిచిన కాంచన మాలినిమీద హఠత్తుగా పుష్పవృష్టి కురిసింది. కిలకిల రావాలతో దేవకన్యలు చుట్టుముట్టారు. ఒక్కొక్కరూ మృదువుగా కౌగలించుకున్నారు. నేస్తురాలా! చిత్రంగా ఈ రాక్షసుడికి ముక్తి ప్రసాదించావు. అతడికన్నా మేము సంతోషిస్తున్నాం. ఈ దుష్టుడికి భయపడి ఇన్నేళ్ళుగా మేమెవ్వరమూ ఈ గిరికానన కందరాలకు రావడం మానుకున్నాం. నీ పుణ్యమా అని ఈ రోజునుంచీ హాయిగా విహరిస్తాం. అంటూ బుగ్గమీద చిటికెలు వేసి తూనిగల్లా తుర్రుమన్నారు. కాంచన మాలిని తనలో తాను హాయిగా నవ్వుకుంది. దివ్యవిమానం దూసుకు పోవడం నుంచి పూర్తిగా తేరుకుంది. సొంతపుణ్యం నుంచి కొంతదానం చేసి ఒకడికి సద్గతి కల్పించి మహోపకారం చేశాననే సంతృప్తితో గొప్ప ధర్మకార్యం చేసి కృత కృత్యురాలనయ్యాననే ధన్యతా భావనతో ముఖం వికసించగా ఆనంద భాష్పాలు కన్నుల్లో కమ్ముకోగా ఒక్క నిమిషం మురిసిపోయి కైలాసం వైపు తన ప్రయాణం సాగించింది.

కార్తవీర్యార్జునా! ఈ కాంచన మాలినీ వృత్తాంతం చదివినవారూ విన్నవారూ సాంసారిక సకలబంధ నివృత్తి పొందుతారు. ధర్మ పరాయణులవుతారు. శ్రద్ధగా విన్నావుగదా, మాఘస్నాన మహాత్యం ఎంతటిదో, క్లేశ నివారణ జరగాలన్నా స్వర్గం లభించాలన్నా మోక్షమే కావాలన్నా సకాములకూ నిష్కాములకూ సర్వ శ్రేయస్కరం మాఘస్నాన మహావ్రతం, అర్జునా! నువ్వు నా మిత్రుడివి. స్నేహితుడివి. భృత్యుడివి. భక్తుడివి. నువ్వంటే నాకెంతో ఇష్టం. అంచేత నువ్వు ఏది అడిగినా కాదనను. అడుగు. ఇంకా ఏది వినాలని అనుకుంటున్నావో ఏమి తెలుసుకోవాలి అనుకుంటున్నావో, అడుగు చెబుతాను అని దత్తదేవుడు ఒక్క నిమిషం విరమించాడు.

గురుదేవా! సాక్షాత్తు శ్రీ నికేతనుడవైన నువ్వు ప్రసన్నుడవై యుండగా నాకింక అలభ్యమేముంటుంది? ఈ లోకంలో అత్యంత శ్రేయస్కరమైనవన్నీ నాకు దయతో ప్రసాదించావు. దృశ్యమానమైన ఈ మిధ్యా ప్రపంచంలో వస్తురూపంగా నీ నుంచి నేను అభ్యర్థించవలసింది ఏదీ లేదు. భవభాగ్యనిధివి, భగవంతుడవు నువ్వు ఇలా ఎప్పుడూ నా పట్ల ప్రసన్నుడుగా ఉంటే చాలు. నాకు ఇంకేమి అవసరము లేదు. నీ అనుగ్రహం కన్నా నేను కోరవలసింది ఏదీ

లేదు. నీ ఉపదేశాలతో నన్ను కృతార్ధుణ్ని చేశావు. నన్నిప్పుడు ఏమి చెయ్యమంటావు? నీ పాదసేవ చేస్తూ ఇక్కడనే ఇలా ఉండిపోనా? లేక ఇంటికి పోనా ? ఏమి ఆజ్ఞ ?

కార్తవీర్యార్జునుడి ఆర్ద్ర వాక్కుల్లోని హృదయాన్ని అందుకున్నాడు దత్తస్వామి. అర్జునా ! నువ్వు రాజువి. రాజ్యపాలన చెయ్యడం నీ కర్తవ్యం. కనక వెంటనే బయలుదేరు. మహిష్మతీపురం చేరుకో. పరిపాలన సాగించు. అని అనుమతించాడు. కార్తవీర్యుడు స్వామికి సాష్టాంగ నమస్కారం చేసి ముని మండలికి అంజలి ఘటించి ఆశీస్సులందుకుని బయలుదేరాడు. దత్తనామస్మరణ చేస్తూ మహిష్మతీపురం చేరుకున్నాడు.

నాయనా! దీపకా! కార్యవీర్యార్జునుడికి దత్తాత్రేయుడు చెప్పిన ధర్మోపదేశాలూ యోగ సారమూ మాఘమహాత్మ్యమూ అన్నీ నీకూ తెలియపరిచాను. ఒకప్పుడు ఇదే మాఘమహిమను వశిష్ఠుడు తన శిష్యుడైన దిలీపుడికి చెప్పాడు. ఇంకా నువ్వు ఏమి వినాలనుకుంటున్నావో అడుగు చెబుతాను. నువ్వు నాకు సేవలు చేసి సంతృప్తి పరిచావు కనుక మహారోగ నివారణకు తోడ్పడ్డావు గనక ఆ ప్రేమను పురస్కరించుకుని మరొక రహస్యం నీకు చెబుతున్నాను విను. ఒకప్పుడు పార్వతీదేవికి ప్రేమగా శివుడు ఉపదేశించిన పధ్నాలుగు దత్తనామాలు నీకు ఉపదేశిస్తాను. వీటిని జపిస్తే సహస్ర నామజప ఫలం దక్కుతుంది అని శివుడి ఆజ్ఞ. పార్వతి వీటిని జపించి అంతటి పుణ్యఫలం పొందింది.

**వరదః కార్తవీర్యాదిరాజ రాజ్య ప్రదోఽ నఘః**
**విశ్వశ్లాఘ్యోఽమితాచారో దత్తాత్రేయో మునీశ్వరః**
**పరాశక్తి పదాశ్లిష్టో యోగానంద స్సదోన్మదః**
**సమస్త వైరి తేజోహృత్పరమామృత సాగరః ॥**
**అనసూయాగర్భ రత్నం భోగమోక్షసుఖ ప్రదః ।**
**నామాన్యేతాని దేవస్య చతుర్దశ జగద్గురోః ॥**
**హరేర్దత్తాభిధానస్య జప్త వ్యాని దినేదినే ।**
**సహస్ర నామ జాప్యస్య యదిచ్ఛసి ఫలమ్ శుభమ్ ॥**

1. వరదుడు 2. కార్యవీర్యాది రాజులకు రాజ్య ప్రదుడు 3. అనఘుడు 4. విశ్వశ్లాఘ్యుడు 5. అమితాచారుడు 6. దత్తా త్రేయుడు 7. మునీశ్వరుడు 8. పరాశక్తి పదాశ్లిష్టుడు 9. యోగానందుడు 10. సదోన్మదుడు 11. సమస్త వైరితేజో హరుడు 12. పరమామృత సాగరుడు 13. అనసూయా గర్భరత్నం 14. భోగ మోక్ష సుఖప్రదుడు. జగద్గురువైన దత్తాత్రేయుడి పధ్నాల్గు నామాలివి. సహస్రనామ జప ఫలం కావాలనుకుంటే వీటిని రోజూ జపించాలి. వత్సా! శుభ ప్రదాలైన ఈ చతుర్దశ నామాలను నువ్వు కూడా త్రిసంధ్యల్లోనూ జపించు. ఇంకేమి వినాలి అనుకుంటున్నావో సందేహించక అడుగు అని వేదధర్ముడు ఒక్క నిమిషం విశ్రాంతి తీసుకున్నాడు. బ్రహ్మదేవుడు కలిపురుషుడికి చెప్పిన ఈ వృత్తాంతాన్ని నేను మీకు చెబుతున్నాను. శ్రద్ధగా వింటున్నారు గదా అని సూతుడు శౌనకాది మహర్షులను హెచ్చరించాడు.



# శ్రీదత్త పురాణము

## చతుర్ధ భాగము

సూతమహర్షీ ! జగదీశుడైన దత్తాత్రేయుడి చరితం వినిపించి మమ్మల్ని కృతార్థుల్ని చేశావు. ఆవేళ సాక్షాత్కరించిన స్వామి మాకు సమర్థుడైన వక్తగా సర్వజ్ఞుడవైన నిన్ను అందించి ఎంతో మేలు చేసాడు. ఎంత విన్నా ఇంకా వినాలనిపించే తీరులో నువ్వు చెబుతూవుంటే మా మనస్సులు ఇక దేనినీ స్మరించడంలేదు. ఎంత విన్నా తృప్తి తీరడం లేదు. ఆకొన్నవాడికి అన్నమూ దప్పిక గొన్నవాడికి పానీయమూ అందిస్తే అధిక ఫలదాయకమని పెద్దలమాట. అందుచేత హరి లీలామృతాన్ని మాకు ఇంకా పంచిపెట్టు. ఈ దాహం తీరేది కాదు. గురుశిష్యుల సంభాషణ ఏ తీరున సాగింది? దీపకుడు ఏమి అడిగాడు? వేదధర్ముడు ఏమి చెప్పాడు? సవిస్తరంగా తెలియజెప్పు.

శౌనకాదిమునుల అభ్యర్ధనను విన్న సూతుడు సంబరపడి అలాగే చెబుతాను ఆలకించండి - అంటూ కొనసాగించాడు. దత్తాత్రేయులవారి వద్ద సెలవు తీసికొని మాహిష్మతీపురం చేరుకున్న కార్తవీర్యార్జునుడు మృషాకల్పితమని ఎరిగి రాజ్యాన్ని ఎంతకాలం పరిపాలించాడు? ఎలా పాలించాడు? యజ్ఞయాగాదులు చేశాడా? అసలు అతడి సామ్రాజ్య విస్తీర్ణం అప్పటి భూగోళంలో ఏపాటి? జైత్రయాత్రలు ఏమైనా చేశాడా? ఎవరెవరితో తలపడ్డాడు? ఎవరెవరిని జయించాడు? చివరకు అతడి కథ ఎలా ముగిసింది? ఇవన్నీ సందేహాలే గురుదేవా! తమరే తీర్చాలి. అని దీపకుడు వేద ధర్ముణ్ని పాదాభివందనం చేసి మరీ అభ్యర్థించాడు. దానికి ఆ మహర్షి సంతోషించి వెనకటికి మైత్రేయుడు ఇలాగే అడిగితే పరాశర మహర్షి ఆ కథ అంతా వివరించాడు. అదే యధాతధంగా నీకిప్పుడు చెబుతాను, ఆలకించు - అని వేదధర్ముడు అందుకున్నాడు.

## కార్తవీర్య అవతార సమాప్తి

హైహయాన్వయుడైన కార్తవీర్యార్జునుడు సకల ద్వీపాలతోనూ కూడిన యావద్భూగోళాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించాడు. అమోఘంగా పదివేల యజ్ఞాలు భూరిదక్షిణలతో చేసాడు. కార్తవీర్యుడుకి సాటి వచ్చే భూపతి భూతకాలంలో లేడు. భవిష్యత్కాలంలో ఉండడు- అని ఇప్పటికీ అతడిని భూగోళం అంతా కీర్తిస్తోంది. యజ్ఞాల్లోగానీ, దానాల్లో కానీ, తపస్సులో కానీ, వినయంలో కానీ, జ్ఞానంలో కానీ, అతడికి అతడే సాటి- అని ప్రజలంతా కీర్తించారు. అలా ఎనభై అయిదువేల సంవత్సరాలు పాటు తిరుగులేని బలపరాక్రమాలతో మాహిష్మతి రాజధానిగా మొత్తం భూగోళాన్ని పరిపాలించాడు. ఒకనాడు ఆనందాతిశయంతో నర్మదా నదిలో జలక్రీడలు ఆడుతున్న వేళ ఈ హైహయునిచెంతకు దిగ్విజయకాంక్షతో దశకంఠుడు (రావణాసురుడు) వచ్చాడు. దేవ, దైత్య, గంధర్వులను గడగడలాడించిన ఆ రావణున్ని ఒక బలిపశువులా బంధించి కారాగారంలో పడేశాడు. ఇంతటి కార్తవీర్యార్జునుడూ ఎనభై అయిదు వేల సంత్సరముల తరువాత శ్రీమన్నారాయణాంశ సంభవుడైన పరశురాముని చేతిలో అవతార సమాప్తి పొందాడు.

అదేమిటి గురూత్తమా! శ్రీమన్నారాయణుడు తన భక్తుల్ని తానే వధించుకున్నాడా? లీలావతారాలు చాలా ధరించాడు శ్రీహరి. కానీ ఏ అవతారంలోనూ భక్త ద్రోహం చెయ్యలేదే. సర్వజ్ఞుడూ సర్వసాక్షీ ఇలా ఎందుకు చేసాడు? తత్వజ్ఞాన సంపన్నుడైన కార్తవీర్యుడు అంతటి అపరాధం ఏమి చేశాడు? ఎలా చేశాడు? దత్త దేవుని అనుగ్రహానికి

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

పాత్రుడైవుండీ స్వయంగా యోగి అయ్యుండీ దేవదేవణ్ని గుర్తించలేకపోయి అపరాధం చేశాడా? రాజమాత్రుడుగా ఉన్నాడు కాబట్టి ఒకవేళ గుర్తించలేకపోయాడే అనుకుందాం. గుర్తించగలిగిన శ్రీమన్నారాయణుడు తనకు అత్యంత భక్తుడూ మహాయోగీశ్వరుడూ అయిన పార్థివుణ్ని ఎలా సంహరించగలిగాడు? ఎందుకు సంహరించాడు? దయచేసి ఈ సంశయాలు నీవు దీర్చకపోతే నా మనస్సు కుదుటబడదు. గురుసత్తమా! అనుగ్రహించు.

నాయనా! దీపకా! ఆందోళన చెందకు **ఈ సృష్టిలో ప్రతీ జీవికీ జీవితంలో తప్పనిసరిగా జరగాల్సినవి కొన్ని ఉంటాయి. అవి జరిగే తీరతాయి. వాటిని ఆపడం. వాటికి ప్రతీకారం చెయ్యడం ఎవరి తరమూకాదు. అదే సాధ్యమైతే నల-రామ-యుధిష్ఠిరులు అన్ని కష్టాలుపడే వారా? అంత దుఃఖం అనుభవించే వారా?**

అంతే కాదు, పురాణాలలో ఋషులు ఏనాడో చెప్పారు - **బ్రహ్మాదులు కూడా ఈ జరగవలసిన దానికి వశవర్తులే తప్ప, స్వతంత్రులు కారని దీనినే "విధి" అంటారు. అది అనుల్లంఘ్యం. వైకుంఠానికి ద్వారపాలకులై యుండీ జయవిజయులు సనక సనందనాదుల శాపాన్ని తప్పించుకోలేక పోయారు. తత్వజ్ఞులూ జ్ఞాననిధులూ - ఎవరైనా గానీ విధిని అతిక్రమించలేరు. ఇలా విధికి లోబడినంత మాత్రాన ఆయా మహానుభావుల తత్వవిజ్ఞానానికి వచ్చిన లోటు ఏమీ లేదు. దాని ఫలం అది ఇస్తుంది. కేవలం శరీరమే కర్మాచరణ చేసి కిల్బిషాలు పొందుతూ వుంటుంది. ఫలం అనుభవిస్తూ వుంటుంది.**

మరొక విషయం గమనించు సకల సృష్టికీ జనార్ధనుడు కర్తా హర్తా కూడాను. అంచేత దేహాది ఉపాధులను ఉపసంహరించడం అతడి అవశ్య కర్తవ్యం. పైగా పుట్టినది ఏదైనా గిట్టక తప్పదు. శరీరం నశించినంత మాత్రాన లోపల ఉన్న ఆత్మకు జరిగే నష్టం ఏమీ లేదుగదా! ఆ చిదాత్మ శాశ్వతమే. తత్వజ్ఞులైన పెద్దలు స్వీయ ప్రయత్నంతో వినాశం కొని తెచ్చుకోరు. అటువంటి పనులు కావాలని చెయ్యరు. కర్మ ప్రేరితులై చేస్తుంటారు. ఇది చాలా బలీయమైనది. **పరమేశ్వరుడు సైతం స్వభావతః ఇచ్ఛానుసారం ఏ పనీ చెయ్యడు. ఆయా జీవుల కర్మలను అనుసరించియే సృష్టి జరుపుతాడు. అంచేత విధి అనూ-కర్మ అనూ అది అనుల్లంఘ్యం. అవశ్యంభావి. దాన్ని తప్పించుకోవడం ఎవరి తరమూకాదు.** దత్తభక్తుడూ తత్త్వజ్ఞుడు అయిన కార్తవీర్యార్జునుడి అవతారం ముగియడానికి శ్రీమన్నారాయణుడే ముగింపజెయ్యడానికి కారణ భూతమైన కర్మ ఏమిటో వివరించనా. విను.

అలనాడు దత్తాత్రేయుణ్ని సేవలతో మెప్పించి చాలా వరాలు పొందాడు. అందులో ముఖ్యమైనది తన మరణం గురించి. సంగ్రామ రంగంలో నాతో సమానుడిచేతిలో గానీ, నాకంటే అధికుడు చేతిలో గానీ, నేను మరణించాలి. అంతేగానీ రోగాలూ, రొష్టులతోనో, అల్పుడి చేతిలోనో మరణించకూడదు-అని వరం అడిగాడు. స్వామి తథాస్తు అన్నారు. ఈ మాట జరగాలికదా. అందుకు అవసరమైన కర్మాచరణను అతడితో ఈ బలీయమైన విధి చేయించింది. అది చెబుతాను. విను.

ఒకనాడు కార్త వీర్యార్జునుడు రధారూఢుడై చతురంగ బలాలతో భూగోళం అంతా విహరించి తిరిగి వస్తూ ఋచీక పుత్రుడైన జమదగ్ని ఆశ్రమాన్ని సందర్శించాడు. చతురంగ బలాలను ఆశ్రమానికి దూరంగా నిలిపి తానూ మరో ఇద్దరు మిత్రులూ కలిసి పాదచారులై ఋషి దర్శనంకోరి ఆశ్రమంలో ప్రవేశించారు. జమదగ్ని ఋషికి భక్తితో

నమస్కరించి బద్ధాంజలితో స్తుతించి ఆయన ఆజ్ఞ ప్రకారం ఎట్ట ఎదుట శిలా వితర్థిక మీద వినయంగా కూర్చున్నాడు. ఉభయకుశలోపరి అయ్యాక ఆ మహర్షి కార్తవీర్యార్జునుణ్ని సర్వ సైన్య సమేతంగా ఆతిధ్యానికి పిలిచాడు. తన ఆశ్రమంలో ఉన్న హోమధేనువు సురభి మహిమతో అందరికీ అపూర్వమైన విందు విలాసాలూ దివ్యభోగాలూ అందించాడు. ఆదివ్య భోగాలను చూసి ఆనందించవలసిన కార్తవీర్యుని మనస్సు విధి ప్రేరణతో ఈర్ష్యా కలుషితమయ్యింది. యావదఖండ పృధ్వీపతియై యుండి తాను ఏర్పాటు చేయలేని రీతిలో ఒక సాధారణ ఋషి విందు అందించడం తనకు పరాభవమని అనిపించింది. ఆ విందు విలాసాలూ భోగభాగ్యాలూ వాటికి అవేసాటి. స్వర్గ లోకంలో కూడా కన్నవి కావు విన్నవి కావు. వీటిని తనకు అందించాడంటే ఇదితప్పక నన్ను అవమానించడమే. కించపరచడమే. ఈ పరాభవానికి మూల కారణం ఈ ఋషి దగ్గరున్నహోమధేనువు. దీన్ని ఇప్పుడే యాచించి సొంతం చేసుకుంటాను. దానంగా ఇవ్వనంటే స్వాధీనం చేసుకుంటాను. దీనికీ ఒప్పుకోకపోతే ఉండనే ఉన్నది. బలప్రయోగం - శాంతి పరాయణుడైన ఈ ఋషి నన్నేమి ఎదిరించగలడు? - ఇలా ఒక నిశ్చయానికి వచ్చి ముందు వినయంగా ఋషిని అభ్యర్థించాడు. ఫలించలేదు. ధనం కోరినంతా ఇస్తా నన్నాడు. ఋషి అంగీకరించలేదు. అయితే బలాత్కారంగా తీసుకుపోతానన్నాడు. నీ వల్ల అయితే అలాగే తీసికెళ్ళు అని ఋషి శాంతంగా పలికి ఎప్పటిలాగే ప్రశాంతంగా కూర్చున్నాడు. హైహయుడు దూడతో సహా హోమధేనువును తాళ్ళతో బంధించి బలాత్కారంగా తన రాజధానికి లాక్కుపోయాడు.

సమిధలూ, దర్భలూ, ఏరుకు రావడానికి అడవిలోకి వెళ్ళిన పరశురాముడు ఈ సంఘటన జరిగిన కాసేపటికి ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. తండ్రికి నమస్కరించి కూర్చున్నాడు. సోదరులు చుట్టుముట్టి జరిగిన సంగతంతా చెప్పారు. వింటూనే పరశురాముడు క్రోధారుణ విఘూర్ణితనేత్రుడై ఉవ్వెత్తున లేచాడు. లేస్తూనే పర్ణశాలలో ప్రవేశించి గండ్ర గొడ్డలి విల్లంబులతో ఇవతలకి వచ్చాడు. వస్తూనే భూమి కంపించేట్టు ఆమడకు అంగవేస్తూ బయలు దేరాడు.

అధర్మం చేసి భూమికి భారంగా మారిన హైహయుణ్ని సంహరించడానికి మాహిష్మతీనగరం చేరుకున్నాడు. చతురంగ బలాలతో కార్తవీర్యుడు సరిగ్గా పుర ప్రవేశం చెయ్యబోతూ వుండగా వెళ్ళి వెనుక నుండి అటకాయించాడు.

ఓరీ క్షత్రియా ! నన్ను పరశురాముడంటారు. జగద్విఖ్యాతుణ్ని. ఏదీ నీ ముఖం చూపించు, అని మేఘ గంభీర స్వరంతో గర్జించాడు. ఆశ్చర్యచకితుడై అర్జునుడు పరశురాముణ్ని చూసాడు. చూస్తూనే త్రిభువనేశ్వరుడని గుర్తించాడు. భూభారం తగ్గించడానికి అవతరించిన శ్రీమన్నారాయణుడని గమనించాడు. అయినా క్షత్రియ ధర్మం ప్రకారం తన సైన్యాన్ని యుద్ధానికి పురికొల్పాడు. రాజాజ్ఞను శిరసావహించి ఆ క్షత్రియవీరులంతా రకరకాల భీకర ఆయుధాలతో పరశురాముడి మీదకు లంఘించారు. సూర్యుడు తన కిరణాలతో చీకట్లను నాశనం చేసినట్లు, రెప్పపాటు కాలంలో ఒంటి చేతితో పరశురాముడు ఆ చతురంగ బలాలను మట్టు బెట్టాడు. సైన్య నాశనానికి బాధ కలిగినా తన పరాక్రమమూ ఇంతటిదే కదా అని మురిసిపోయాడు కార్తవీర్యుడు. చేస్తే ఇటువంటి వాడితోనే యుద్ధం చెయ్యాలి. ఇన్ని వేల సంవత్సరాలకి ఒక్కడు దొరికాడు. ఇంద్రాదులు సైతం ఇతణ్ని ఎదిరించి నిలబడలేరు. ఇతడి తోనే ద్వంద్వ యుద్ధం చెయ్యాలి. బలవీర్య పౌరుష పరాక్రమాలను సార్థకం చేసుకోవాలి. నాకితడు సమానుడో అధికుడో తేల్చుకోవాలి. దత్తస్వామి ఇచ్చిన వరం ఉండనే ఉందికదా కనుక ఈ బ్రాహ్మణుడితో కలబడతాను - అని ఒక నిశ్చయానికి వచ్చాడు. ప్రళయ కాల సూర్యుడిలా సహస్ర బాహువులూ ధరించి ఘోర రూపుడై సహస్రాయుధాలను సంధించి

పరుశురాముని మీదకు విసిరాడు. మండిపడుతున్న గోళాళ్ళాంటి శ(స్త్రాస్త్ర సమూహాలను ఆ తపస్వి విభుడైన పరశురాముని మీదకు కురిపిస్తూ అతి భీషణంగా గర్జించాడు. ఆ ధ్వనికి విమోహితులై మానవులు ఎక్కడి వారక్కడే నేల రాలిపోయారు.

విక్రమిస్తున్న అర్జునునితో మృదువుగా ప్రారంభించి అతడి పరాక్రమాన్ని చూసి సంబరపడుతూ క్రమక్రమంగా విజృంభించాడు సాక్షాత్ శ్రీ మన్నారాయణుడైన పరశురాముడు. మహా వాయువు ఆకాశంలో మేఘ శకలాలను చెల్లా చెదురు చేసినట్లు అర్జునుడి బాణాలన్నింటినీ తన బాణాలతో మార్గ మధ్యంలోనే ఎగర గొట్టాడు. కార్తవీర్యుని ధనుస్సును కూడా విరుగ గొట్టాడు. కార్తవీర్యుడు కొత్త ధనుస్సును తీసికొన్నప్పుడల్లా ఇలాగే విరగ్గొట్టాడు. మొత్తం వంద ధనస్సులు అయ్యాయి. శర పంజరంలో బద్ధుడై సింహంలాగా గర్జించాడు కార్తవీర్యార్జునుడు. అయిదు వందల ధనుస్సుల్ని ఒకేసారి ధరించి ఆ సహస్ర బాహువు అయిదువందల బాణాలనూ ఎక్కుపెట్టి ఒక్కసారిగా రాముని మీదకు వేగంగా విడిచిపెట్టాడు. ప్రళయ కాల మేఘాలు తమ ఘోరవృష్టితో కాలాగ్నిని చల్లార్చినట్లు రాముడు ఆ బాణాలన్నింటినీ క్షణంలో వృధా చేసాడు.

కార్చిచ్చుల్లా ప్రజ్వరిల్లి మెరుపు వేగంతో శరవర్షంకురిపించి అర్జునుడి రధాన్ని తుత్తునియలు చేసాడు. నిరధుడై సహస్ర బాహువులతో రెక్కల పర్వతంలా నిలబడ్డ అతడి మీదకు లంఘించి గండ్ర గొడ్డలితో చెక్కేసాడు. మహా వృక్షం కొమ్మల్ని చెరిగినట్లు రెక్కలను నరికేశాడు. ఖండన వేగానికి అవి ఆకాశంలో ఎగిరి గిరికీలు కొడుతూ కల్ప వృక్షశాఖల్లా వచ్చి నేల మీదపడ్డాయి. దత్తాత్రేయుడి అనుగ్రహం వల్లా, మహాశివుడి దయవల్లా, అతడికి వెయ్యి రెక్కలూ మళ్ళీ వెంటనే మొలుచుకువచ్చాయి. కొత్త చేతులతో శక్తి ఆయుధం ధరించి పరశురాముడి ధనుర్బాణాలనూ గండ్రగొడ్డలనీ ఎగరగొట్టాడు. ఇలా ఒక వంద ధనస్సులూ ఒక వంద పరశువులూ అయ్యాయి. రామునిలో రోషం భగ్గుమంది. ఆగ్నేయాస్త్రం ప్రయోగించి ఒక్కసారిగా వెయ్యి చేతులూ మొదలంటా మాడ్చేసి మరింక మొలవకుండా చేసాడు. రెక్కలు తెగిన పక్షిలా నిరాయుధుడై నిలబడ్డాడు అర్జునుడు. ఆ నిమిషంలో అంతరాత్మ మేల్కొంది. యోగాభ్యాస దక్షుడు, కనుక వెంటనే ధ్యాన సమాధిలోకి ప్రవేశించి పరతత్వాన్ని స్మరించాడు. బాహ్య స్మృతిని కోల్పోయి స్థాణువులా నిలబడ్డ కార్తవీర్యార్జునుడి శిరస్సును ఒకే ఒక్క గొడ్డలి వేటు నేలకు రాల్చింది. పండిన తాటి పండు తనంత తాను నేలకు రాలినట్లు అది అల్లంత దూరాన దభీమని పడింది.

ఆ వెంటనే మొదలు నరికిన చెట్టులా కార్తవీర్యార్జునుడి కళేబరమూ నేలకు ఒరిగి పోయింది. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. యోగ విద్యాపారంగతుడు కనుక అతడు ఇది వరకే జీవన్ముక్తుడు. ఇప్పుడు శరీరం రాలి పడిపోవడంతో విదేహముక్తుడయ్యాడు. కైవల్యం పొందాడు. శరీరంలోని పంచ భూతాలూ ప్రకృతిలోని పంచభూతాలలో కలిసిపోయాయి.

పరశురాముని కోపం శాంతించింది. సంతోషంగా హోమధేనువుని తోలుకొని ఆశ్రమానికి చేరుకున్నాడు. జరిగినదంతా తండ్రికి నివేదించి తపస్సుకి వెళ్ళిపోయాడు.

దీపకా! అటుపైన కార్తవీర్యుడి పుత్ర సంతానం మరొక స్వయం కృతాపరాధం కారణంగా పరశురాముని చేతిలోనే హతులయ్యారు. హతశేషులు అతడి అనుగ్రహంతో రాజ్య పాలన చేసారు. పరశురాముడు ఈ భూగోళాన్ని క్షత్రియ శూన్యం చేస్తానని ప్రతిజ్ఞచేసి అలా నెరవేర్చుకున్నాడు.

గురూత్తమా! కార్తవీర్యుని అవతార సమాప్తిని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించి చెప్పారు. అతడి సంతానం కూడా పరశురాముని చేతిలో హతులయ్యారంటే మరి వాళ్లు ఏతప్పు చెయ్యడంవల్ల అలా జరిగింది? క్షత్రియ సంహారానికి రాముడు ఎందుకు ప్రతిజ్ఞ చేసాడు? ఇది తెలుసుకోవాలని ఉంది. దయచేసి అనుగ్రహించండి - అని దీపకుడు అడగడమేమిటి వేదధర్ముడు కథా కథనం ఇలా ఆరంభించాడు.

## పరశురామ ప్రతిజ్ఞ

కృతవీర్యుడి కుమారుడు కదా ఈ కార్తవీర్యుడు. ఇతడు లొట్ట చేతులతో పుట్టి తల్లితండ్రులకి తీవ్రమనస్తాపం కలిగించాడు. ఆ పైన దత్తస్వామిని అర్చించి ఆరాధించి సంప్రీతుణ్ని చేసి వెయ్యి బాహువులతో పాటు అనేక అమోఘ వరాలు పొందాడు. తనకు సమానుడో తన కన్నా అధికుడో అయిన ద్విజుడి చేతిలో మరణం ఆ వరాలలో ఒకటి. అందుకని పరశురాముని చేతిలో అలా నిహతుడయ్యాడు. దానికి హోమ ధేను హరణమనే మిష ఒకటి స్వయం కృతాపరాధమై సహకరించింది. విధి బలీయమనీ, ఏ అవతారమైనా ఉపసంహరింపబడవలసిందేననీ చెప్పుకున్నాం కదా!

అయితే కార్తవీర్యార్జునుని కుమారులు పరశురాముని మీద కక్షగట్టి అనువైన సమయం కోసం ఎదురుచూస్తూ వేచి ఉన్నారు. ఎదిరించే ధైర్యంలేక, శక్తి లేక దొంగచాటుగా ప్రతీకారం తీర్చుకోడానికి, పొంచి ఉన్నారు. తమ తండ్రిని సంహరించాడు కనుక అతడి తండ్రిని చంపాలని వారికసి. కొంత కాలానికి అనువైన సమయం దొరికింది. పరశురాముడు అడవికి వెళ్ళాడు. అతడి సోదరులు ఆట పాటల్లో తేలుతూ అల్లంత దూరాన ఎక్కడో ఉన్నారు. జమదగ్ని పర్ణశాలలో తపస్సు చేసుకుంటున్నాడు. ఋషి పత్ని రేణుకా మాత ఇంటి పనుల్లో మునిగివుంది. ఇంత కన్నా మంచి సమయం దొరకదని రాకుమారులు సాయుధులై జమదగ్ని పర్ణశాలలో ప్రవేశించారు. జమదగ్ని శిరస్సు ఖండించారు. వద్దు వద్దంటూ రేణుకాదేవి అడ్డుపడినా విలపించినా, ప్రాధేయపడినా వారు వినిపించుకోలేదు. రాక్షసంగా శిరస్సు ఖండించి మెరుపువేగంతో వెళ్ళిపోయారు.

అడవిలో కంద మూలాలు సేకరిస్తున్న పరశురాముడికి అపశకునాలు కనిపించాయి. మనస్సు కీడును శంకించింది. త్వరత్వరగా పర్ణశాలకు వచ్చాడు. జరిగిన ఘోరం కళ్ళారాచూసాడు. తండ్రిని తలుచుకొని దుఃఖపడ్డాడు. ఇటువంటి మరణం సంక్రమించినందుకు బాధ పడ్డాడు. కన్నతల్లిని చూస్తే కడుపు తరుక్కుపోయింది. చిట్టి పొట్టి తమ్ముళ్ళు భయభ్రాంతులై వొణికి పోతూ బిక్కుబిక్కుమని తన వైపే చూస్తున్నారు. అందరిని ఒక్కసారిగా పట్టుకొని బావురుమన్నాడు పరశురాముడు. అమ్మా! నా కారణంగానే ఈ దారుణం జరిగింది. నేనే - నేనే బాధ్యుణ్ణి అనుకుంటూ తలబాదుకుంటూ తల్లి పాదాల మీద పడ్డాడు. కుమిలిపోతున్న తల్లితో సమానంగా రోదించాడు. రెండు క్షణాల్లో తెప్పరిల్లాడు. చివాలున లేచి నిలబడ్డాడు. ఎర్రబారిన కళ్ళల్లో నీళ్ళు నిండుకొని విప్పారి ఒక్కక్షణంలో ప్రళయ కాలరుద్రుడిగా మారిపోయాడు. అశక్తుడిలా నేను విలపించడం ఏమిటి? కర్తవ్యాన్ని విస్మరించడం ఏమిటి - అని తనకు తాను ప్రబోధించుకున్నాడు.

ధనుర్బాణాలూ గండ్రగొడ్డలీ ధరించాడు. సోదరులూ ఆశ్రమవాసులు వారిస్తున్నా లెక్క చెయ్య లేదు. ఎవరి మాటా వినిపించుకోలేదు. రాజధాని వైపు సుడి గాలిలా దూసుకు వెళ్ళాడు. కార్తవీర్యార్జునుని కొడుకులందర్నీ ఊచకోత కోసేసాడు. అంతే వేగంగా ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. వస్తూనే ఆశ్రమవాసులందరూ వినేట్లుగా జలదభీషణంగా భీకర ప్రతిజ్ఞ చేసాడు. ఈ భూమిని క్షత్రియ శూన్యం చేస్తాను. ఒక్కసారికాదు ఇరవై ఒక్క మార్లు చేస్తాను. ఇందులో

అసత్యం గానీ అధర్మం గానీ లేదు - అని ఒక్క పెట్టున దిక్కులు పిక్కటిల్లేలాగా భూగోళంలోని క్షత్రియులందరికీ టముకు వేసినట్లుగా ధనుష్టంకారం చేసాడు.

నాయనా! నీ ప్రతిజ్ఞలూ ప్రతీకారాలు తరువాత. ముందు నీ తండ్రికి భక్తితో అంత్యక్రియలు జరిపించు. మాకు జరగవలసిన సంస్కారాల సంగతి చూడు. నన్నొక వైపూ మీ తండ్రి శరీరం మరొక వైపూ కావిడికి ఎత్తుకుని బయలుదేరు - ఆగు - ఆగు - అనే మాట వినిపించిన చోట దింపు. సర్వ శాస్త్ర విశారదుడైన ఆచార్యుడు చెప్పినట్లు మాకిద్దరకూ ఉచిత సంస్కారములు జరిపించు.

రేణుకాదేవి ఆజ్ఞతో ఆ వీరావేశం నుంచి స్పృహలోకి వచ్చాడు. పరశురాముడు. తల్లి చెప్పినట్లే ఇద్దరినీ కావిడకు ఎత్తుకొని తమ కాన్యకుబ్జాశ్రమం నుంచి బయలుదేరాడు. అతడితో పాటు ఆశ్రమవాసులైన మహర్షులూ బయలుదేరారు. వడివడిగా నడుచుకుంటూ తీర్థాలూ, తాపసాశ్రమాలూ, వనాలూ, అరణ్యాలూ, పర్వతాలూ, నదులూ అన్నీ దాటుకుంటూ ప్రయాణం సాగిస్తున్నారు. సహ్యపర్వతం చేరుకున్నారు. ఆమలకీతరుమండితమై దత్తాత్రేయుల వారి ఆశ్రమం కనిపించింది. అదే సమయానికి అశరీరవాణి వినిపించింది.

"ఓయీ పరశురామా! దత్తాత్రేయునితో కలిసి మంత్ర పూర్వకంగా విధి విధానంగా మీ తండ్రికి అంతిమ సంస్కారాలు శ్రద్ధగా నిర్వహించు" - ఇది వినడంతోనే పరశురాముడు నాలుగువైపులకూ తేరిపార చూశాడు. కందమూల ఫల సమృద్ధితో పచ్చగా ప్రశాంతంగా ఉన్న ఆశ్రమంలో తామున్నట్టు గుర్తించాడు. కావిడి దింపుకున్నాడు. దృష్టి ముందుకు సారించాడు. గుబురుగా ఉన్న చెట్ల మాటున ఎవరో ఉన్నట్టనిపించి అటు నాలుగు అడుగులు వేశాడు. ఒక దిగంబర మహర్షి పానపాత్రను చేతబట్టి కనిపించాడు. రాముడు సభక్తికంగా నమస్కరించాడు. కన్న తండ్రి అంత్యక్రియలు దగ్గరుండి జరిపించమని ప్రార్థించాడు. ఏమిటి? నేను జరిపించాలి? నాకు విధివిధానములు, ధర్మాధర్మములు తెలియవు. ఏదో నాకు తోచిన దారిలో నేను పోతున్నాను. నాలాగే నీకు తోచిన దారిలో నువ్వు వెళ్ళు అన్నాడు దత్తస్వామి.

స్వామిన్! నీకు ధర్మాధర్మాలు తెలియవంటే నేనెలా నమ్ముతాను. సకల దేవతలకూ సకల మునులకూ నువ్వు పరమ గురువువి. జగత్ప్రసిద్ధుడివి. యోగీశ్వరుడివి నువ్వే సంశయం లేదు.

దిగంబరస్వామి మళ్ళీ నవ్వాడు. ఈసారి పెద్దగా నవ్వాడు. నేను దిగంబరుణ్ని. మదిరా మదవతీలోలుణ్ని. ఇదిగో కనిపించడంలేదూ. మదిరాస్వాదం తప్ప మరింక ఏవిధీ నాకు తెలీదు. నేను అస్పృశ్యుణ్ని. పలకరించదగినవాడ్ని కూడా కాదు. దురాచారుణ్ని. వంశంలో చెడబుట్టిన వాణ్ని. బ్రహ్మన్! అంతిమ సంస్కారం యథావిధిగా జరపడమెలాగో నాకు తెలీదు - అంటూనే దిగంబరస్వామి దత్తుడిగా మారిపోయి వరాసనం నుంచి వచ్చి కావిడి దగ్గరకు చేరుకున్నాడు. రేణుకాదేవిని చూశాడు. వెంటనే నమస్కరించాడు. అంజలి బంధంతో అలాగే నిలబడి స్తుతించాడు.

తల్లీ! నాకు వందనీయవు నువ్వే. సకల దేవతాధీశ్వరివి. నువ్వు పార్వతివి. యోగీశ్వరులకు హృదయాల్లో యోగ శ్రమతో మాత్రమే దర్శనమిస్తావు. వారికైనా నీ దర్శనం చాలా కష్టసాధ్యం. సంసారార్ణవంలోమునిగి తేలుతున్న ఈ జీవులందరికీ నువ్వే నౌకవు. తరింపజేసే తెప్పవు. నువ్వు ఏక వీరవు. ఈ చరాచర జగత్తులో నువ్వు ఏకైకవు. అద్వితీయవు. కానీ సమస్త రూపాలలోనూ నీ అంశమే ఉండి అనేక రూపవై భాసిస్తుంటావు. నీకిదే నమస్కారం - అని స్తుతించి,

జమదగ్ని పాదాలకు నమస్కరించి పరశురాముని వైపు చూశాడు. రామా! శుభప్రదాలైన సర్వతీర్థ క్షేత్రాలలో స్నానం చేసిరా. నేను చెప్పినట్టు సంస్కారం చేద్దువు గాని - అని ఆజ్ఞాపించాడు. రాముడు వెంటనే ధనస్సు సంధించి దివ్యబాణం ఎక్కుపెట్టి సహ్యాద్రిని గురిచూసి వదిలాడు. ఆ బాణ రంధ్రంనుంచి భుక్తిముక్తి ప్రదాలైన సకల పుణ్య నదీ తీర్థాలూ క్రమంగా ఆవిర్భవించాయి.

ఇలా తన దివ్యబాణ శక్తితో రప్పించుకొన్న పవిత్రనదీ తీర్థజలాలలో పరశురాముడు స్నానం చేసి తండ్రి కళేబరానికి ప్రదక్షిణ నమస్కారాలు ఆచరించి. అగ్నిని ఉజ్వలంగా ప్రజ్వలింపజేసి దహన సంస్కారం జరిపాడు - జగన్మాతయైన రేణుక సర్వాభరణ భూషితయై నిలిచి దత్తాత్రేయా! పతివెంట నేను కూడా స్వస్థానానికి వెడదామనుకుంటున్నాను అని చెప్పి, నాయనా, భార్గవరామా! గురుదేవ, ద్విజులను రక్షించు - నీ ప్రతిజ్ఞ నెరవేర్చుకో అని ఆజ్ఞాపించి, ఆ జగదంబిక తన పతిదేవుడి చితిలో సాంజలిబంధంగా ప్రవేశించింది. మరుక్షణాన భార్యా భర్తలిద్దరూ దేదీప్యమాన దివ్యరూపులై ఆనందమూర్తులై వినువీధిలో నిలిచారు. దత్తాత్రేయ, పరుశురాములిద్దరూ ఆదంపతుల్ని చూసి సంబరపడుతూ శిరసువంచి నమస్కరించారు. భక్తిశ్రద్ధలతో పూజలు చేసి వీడ్కోలు పలికారు.

అటుపైని బ్రాహ్మణులను అర్చించి మహదాశీర్వచనం తీసుకున్నాక పరశురాముడు స్వయంగా దత్తాత్రేయుణ్ని పాదాభివందన పురస్సరంగా పూజించాడు. దత్తదేవుడి అనుమతి పొంది అమలకీ వనం నుంచి బయలుదేరాడు. తన ప్రతిజ్ఞను తీర్చుకోడానికి భూమండలం మీద విరుచుకుపడ్డాడు. పాడి తప్పిన క్షత్రియులందర్నీ ముయ్యేడుమార్లు గాలించి రాపాడి రాపాడి ప్రతిన నెరవేర్చుకున్నాడు. భూమిని క్షత్రియరహితం చేసేశాడు. గతమత్సరుడై అదే జలం తీసుకొని దత్తాశ్రమానికి వెళ్ళాడు. అక్కడ తన ఆయుధాలను ప్రక్షాళించి ఆయుధాధి దేవతలను అర్చించాడు. దత్తాత్రేయుడికి నమస్కరించాడు. అంతలో తల్లితండ్రులు దివ్యదర్శనం అనుగ్రహించారు. సకల క్షత్రియాంతకా! నీ సాహసానికీ శౌర్య పరాక్రమాలకూ సంతృప్తి చెందాను. ఇక ప్రతీకారాగ్నిని శాంతింపజేసుకో. హింసా ప్రవృత్తివల్ల మూటగట్టుకున్న మహాపాపం తొలగించుకోవడంకోసం మహాయజ్ఞాలు చెయ్యి. వాటితో శుద్ధి పొందుతావు- అని తండ్రి జమదగ్ని ఆజ్ఞాపించాడు. నాయనా! బ్రహ్మచారిని గదా ధర్మపత్ని తోడు లేకుండా యజ్ఞాలు ఎలా చేస్తానని సంశయించకు. దత్తాత్రేయుణ్ని గురువుగా అభ్యర్థించు. కాశ్యపుణ్ని ప్రధాన ఋత్విక్కుగా వరించు. బంగారపు ప్రతిమను భార్యగా చెంత ఉంచుకో. యజ్ఞాలు చెయ్యి - అని తల్లి రేణుక ఉపాయం చెప్పింది.

ఇలా ఆజ్ఞాపించిన తల్లిదండ్రులిద్దరికీ సభక్తికంగా నమస్కరించి వీడ్కోలు పలికాడు. సహ్యాద్రి ఆమలకవనంలోని ఏక వీరాశ్రమ పదంలో ఇది జరిగింది. ఫలపుష్పభరితాలైన తరులతా గుల్మాలతో పక్షుల కిలకిల రావాలతో నానామృగ గణాకీర్ణమై దివ్యనదీ పరీవాహక ప్రాంతమై అన్నిటికీ మించి దత్తాత్రేయ సంరక్షితమైన ఆ ప్రదేశం తపస్సులకే కాదు యజ్ఞయాగాదులకూ అనువైన స్థలం. ఆ ఆశ్రమంలో ఒక రమ్యమైన పర్ణశాల ఉంది. పరశురాముడు అందులోకి ప్రవేశించాడు. అది దత్తాత్రేయుడి పర్ణశాల. సురసిద్ధ సాధ్య మునీశ్వర సేవితుడై దత్తదేవుడు కొలువుతీరి ఉన్నాడు. పరశురాముడు వినయవిధేయతలతో సాష్టాంగ నమస్కారం చేశాడు. భక్తితో మౌనంగా స్తుతించాడు. అప్పుడు దత్తాత్రేయుడు ఆనందతుందిలుడై పరశురాముణ్ని ఆప్యాయంగా దగ్గరకు పిలిచి తన ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు. మృదువుగా సంభాషించాడు.

నాయనా, భార్గవరామా! నువ్వు చాలా కష్టసాధ్యమైన ఘనకార్యాలు చేశావు. కార్తవీర్యార్జునుడంతటి వాణ్ని అనాయాసంగా బాహు పరాక్రమంతో మట్టుబెట్టావు. దైత్య రాక్షస వీరులెందర్నో సంహరించావు. క్రూర కర్ములూ అధార్మికులూ అయిన దుర్జయ క్షత్రియ మహావీరులందరినీ ముయ్యేడు మార్లు ఏరి ఏరి మట్టి కరిపించావు. ఇంతలేసి ఘనకార్యాలు సాధించావంటే శిశూ! నువ్వు సాధారణ శూరుడవో బ్రాహ్మణుడవో కావని నా అభిప్రాయం. ఈ లోకంలో ఈ రూపంలో సంచరిస్తున్న స్వయం శ్రీమహావిష్ణుడవని నా నమ్మకం.

స్వామిన్! దత్తదేవా! అరిందమా! నేను విష్ణువును కాను, మహాశూరుణ్ని కాను. ఇది నిజం. గురుదేవ-ద్విజులకు నేను శిష్యుణ్ని. వటువుని. సందేహం ఏమీ లేదు. దేవ - ఋషి- పితృ తృప్తి కోసం ఏదో చెయ్యాలను కుంటున్నాను. దానికి నీ సహాయం కోరుతున్నాను. దయచేసి గురుస్థానం అంగీకరించు - అంటూ ఒడిదిగి పరశురాముడు దత్తాత్రేయుడికి నమస్కరిస్తూ ప్రదక్షిణం చేశాడు. దత్తదేవుడు చిరునవ్వుతో అంగీకరించాడు.

ఆ రమ్యమైన సహ్యాచలమే యాగ భూమి అయ్యింది. ఋషులంతా ఆహుతులై విచ్చేశారు. ద్వారతోరణ పతాకాలంకారాలతో యాగ మంటపం సిద్ధమయ్యింది. వేదికలూ యజ్ఞ కుండాలూ శాస్త్రీయంగా రూపొందాయి. కాశ్యపుడు ప్రధాన ఋత్విక్కుగా ఒక శుభదివసాన శుభముహుర్తాన భార్గవరాముడు యజమాన దీక్షను స్వీకరించాడు. బ్రహ్మవేత్తలైన ఋత్విక్కులు. ఋజుభక్తి తాత్పర్యాలతో సమర్చితులై యజ్ఞాంగాలను అన్నింటినీ నిర్దుష్టంగా సంపూర్ణంగా నిర్వహించారు. దివ్యాభరణ వస్త్రాదులను బహుమతులుగా పొందారు. యజ్ఞశాలకు వచ్చిన ప్రతి విప్రుడికీ సువర్ణోపస్కరాలు దక్షిణలుగా అందాయి. అన్నపానాలు సమృద్ధి చెప్పనవసరమే లేదు. అన్ని జాతుల వారికీ కావాలన్నదల్లా పుష్కలంగా అందింది. ఇలా రామయజ్ఞం సుసంపన్నం, సుసంపూర్ణం అయ్యింది. దేవ మానవ యక్ష కిన్నెర నాగరాక్షస చారణ సిద్ధ సాధక జాతులవారందరూ పితృదేవతలూ ధన -ఘన సన్మానాలతో సంతృప్తులయ్యారు. సోమంతో ఇంద్రుడూ, భూరి దక్షిణలతో భూసురులూ, అన్న పాన వస్త్రాదులతో దీనులూ పరితుష్టి చెందారు. ప్రధాన ఋత్విక్కుగా అన్నీ నడిపించిన కాశ్యపుడికి చాతర్హోత్ర విధానంగా సంపూర్ణ క్షితిమండలాన్నే దక్షిణగా సమర్పించాడు భార్గవరాముడు. ఇరవై యొక్క మార్లు క్షత్రియ సంహారం చేసి భుజబలంతో తాను గెలుచుక్కు భూగోళమిది. కశ్యపుడికి దక్షిణ అయ్యింది.

ఆచార్యకత్వం నెరపిన దత్తస్వామిని రత్నాభరణాలతో దివ్య వస్త్రాలతో సత్కరించి అర్చించాడు. రాముడిచ్చిన వాటిని అన్నింటినీ దత్తదేవుడు అక్కడున్న మునులకూ, బ్రాహ్మణులకూ నమస్కరించి మరీ సమర్పించాడు. కాశ్యపుడు భార్గవరాముని అనుమతి తీసుకొని తన క్షితిమండలాన్ని విప్రులందరికీ పంచిపెట్టాడు. దీనికి పరశురాముడు చాలా సంబరపడ్డాడు. కాశ్యపా! నీ వంటి జ్ఞానులు చెయ్యవలసిన పనిని చేశావు. ముండిత శిరస్కుడై, దిగంబరుడై మన మధ్య నడయాడుతున్న ఈ యోగివర్యుడు దత్తాత్రేయుడు స్వయంగా సాక్షాత్తు శ్రీ మన్నారాయణుడు. సందేహం లేదు. ఇంత సుదుష్కరమైన ఈ మహాయజ్ఞం ఇంత తేలికగా ఒక లీలగా పరిసమాప్తమయ్యింది అంటే కేవలం ఇది వీరి అనుగ్రహమే, శ్రీ దేవీ కరుణా కటాక్షమే - అని తన భక్తి భావాన్ని ప్రకటించి కాశ్యపునికీ దత్త దేవునికీ మరొకసారి నమస్కరించి రేణుకామాతను మనస్సులోనే ధ్యానించి సురసిద్ధ మునీంద్ర దేవ బ్రాహ్మణులందరికీ ఇంకొక పర్యాయం కృతజ్ఞతగా శిరసువంచి అభివాదం చేస్తూ అందరి దగ్గరా సెలవు తీసుకొని భార్గవరాముడు మహేంద్ర పర్వత శిఖరాగ్రాన తపస్సుకి వెళ్ళిపోయాడు.

గురూత్తమా! కార్త వీర్యార్జుని అవతార సమాప్తితో పాటు పరశురాముని వృత్తాంతం కూడా నాకు తెలియజెప్పి ఎనలేని ఆనందం సమకూర్చారు. అయితే ఇక్కడ నాదొక సందేహం. ఈ రేణుకాదేవి ఎవరు? సాక్షాత్తు శ్రీ మన్నారాయణుడైన దత్తాత్రేయుడే నమస్కరించి స్తుతించాడంటే ఆ తల్లి అవతారగాధ వినవలసిందే. అనుగ్రహించండి. రేణు అనే మహారాజు ఒకరు ఉండే వాడనీ, ఆయనగారి కూతురు రేణుక అనీ, నేనెప్పుడో ఎక్కడో విన్నాను. అటువంటి రేణుకను దేవదేవుడు నమస్కరించడమేమిటి చెప్మా? అని నా సందేహం. అలాగే కాన్యకుబ్జంలో ఉండే పరశురాముడికి సహ్యాద్రిలో అమలకీ గ్రామం ఎందుకు ఆశ్రమమయ్యింది? అవి ఇప్పటికి నా చిరు సందేహాలు. దయచేసి వీటిని తీర్చండి.

దీపకుడి అభ్యర్థనతో వేద ధర్ముడు వీటికి సమాధానాలు వివరించాడు. నాయనా, దీపకా! ఇదే విషయాన్ని పూర్వకాలంలో శ్రీశైల శిఖరం మీద మహర్షులడిగితే కుమారస్వామి వారికి వివరించాడు. అదంతా నీకు చెబుతాను - అంటూ ప్రారంభించాడు.

## రేణుకా వృత్తాంతం

కృతయుగారంభంలో సృష్టి కర్త అయిన పితామహుడు అనేకోపాయాలతో ఈ జగత్ సృష్టి చేసాడు. దేవ - దైత్య - మనుష్య - పశు - పక్షి - వృక్షాది జాతుల్ని వర్ణాశ్రమ ధర్మాలను సమస్తమూ వేద నిర్దిష్టమైన మార్గంలో సృజించాడు. ముల్లోకాలు హాయిగా ఉన్నాయి. అందరూ జ్ఞాన విజ్ఞాన పారంగులై తపోనిష్ఠులై కామ క్రోధ రాగ ద్వేష రహితులై శాంతి సౌఖ్యాలతో ప్రసన్నంగా కాలం గడుపుతున్నారు. బ్రహ్మదేవుడు గమనించాడు. ఇలాగైతే ఇక సృష్టి వృద్ధి చెందినట్టే - అనుకున్నాడు. ఆలోచించాడు. తమోగుణం, మోహం, మహామోహం, తామిస్రం, అంధతామిస్రం - అనే పంచ పర్వాలతో అవిద్యను సృష్టించి ప్రాణికోటిని సమ్మోహపరచడానికి లోకం మీదికి వదిలిపెట్టాడు. అతడు సృష్టించిన అవిద్య ముందుగా అతడినే ఆవరించింది. దాని మహిమతో వేదాలు మరిచిపోయాడు. ఎంత గింజుకున్నా ఒక్క మంత్రమూ గుర్తురావడం లేదు. కళ వళపడ్డాడు. భయపడ్డాడు. వెంటనే బయలుదేరి హంసవాహనం అధిరోహించి సహ్యపర్వతం చేరుకున్నాడు. ఒక ప్రశాంత రమణీయ స్థలంలో అమలకీ వనంలో (ఉసిరిక) కూర్చుని నిష్ఠాగరిష్ఠుడై రేణుకామాతను ధ్యానించాడు. ఆ తల్లి కరుణామయి. క్షణకాలంలో దర్శనమనుగ్రహించింది. చతుర్ముఖుడు ప్రణమిల్లి నిలిచి బహువిధాల స్తుతించాడు. మెల్లగా తన అవస్థను విన్నవించాడు.

జననీ! త్రిలోక వందితా! గాయత్రీ ! వేదమాతా! కటాక్షించు. వేదాలను మరచిపోయాను ఏ ఒక్క మంత్రమూ గుర్తుకు రావడం లేదు. నువ్వు పరమేశ్వరివి. జగద్గురుత్వం నీది. సర్వదేవతా మయివి. నీ అక్షరరూపాన్ని నా బుద్ధిలో తిరిగి ప్రకాశింపజెయ్యి.

చతురాననా! వెళ్ళి దత్తాత్రేయుణ్ణి అభ్యర్థించు. అతడు వర్ణమాత్రా సహితంగా సకల విద్యలూ నేర్చినవాడు. అని రేణుకా దేవి బ్రహ్మకు చెప్పి, వెంటనే దత్తాత్రేయుణ్ణి పిలిచింది. జ్ఞానవేత్తృ పురస్కృతా! సర్వదేవ నమస్కృతా! ఈ బ్రహ్మ దేవుడు ఏదో అంటున్నాడు, కొంచెం కనుక్కో నాయనా - అని చెప్పింది. అప్పుడు దత్త దేవుడు బ్రహ్మను సమీపించాడు. చతుర్ముఖా ! సర్వజ్ఞానవేత్తా! ఏమిటి అడుగుతున్నావో చెప్పు. నాకు తెలిసింది తప్పక చెబుతాను.

మునిశ్రేష్ఠా ! వేదాలను, వేదాంగాలనూ, ఉపనిషత్తులను సమస్తమూ మరచిపోయాను. దయజేసి వర్ణమాత్రాస్వరాత్మాంకంగా వాటిని నాకు బోధించు.

విరించీ! కకారాది సకల వర్ణాలలోనూ ఏకైకమై పరిఢవిల్లే అనంత నాదాత్మకత ఒక్కటే. అది ఎవరిలో ప్రకాశిస్తుందో ఆ దేవిని "సవర్ణ" అంటారు. ఆ సవర్ణ - ఈరేణుకాదేవియే తప్ప మరొకరెవ్వరూ కాదు. సవర్ణ - వేదమాత - సావిత్రి-బ్రహ్మరూపిణి - అన్నీ ఆ జగద్ధాత్రి రేణుకాదేవియే. రెండవ శక్తి లేదు. ఏకమాత్ర - ఏక వీర - ఓంకారైక స్వర - అన్నీ ఆమెయే. అష్టపర్యాయక వాచక అని కూడా ఆమెను అంటారు. (హ్లాదిని - విమల - ఉత్కర్షిణి - జ్ఞానయోగ - ఇత్య - ఈశాన - ప్రహ్వీ - అనుగ్రహ - అని అష్టపర్యాయ వాచకాలు) ఒక్కటే అయినా అనేక రూపాలు ధరిస్తుంది. కనుక ఏక వీర అన్నారు. ఆమెయే వేదమాత. గాయత్రి బ్రహ్మ రూపిణి.

మునిశ్రేష్ఠా ! సాధు, వేదమాత అన్నా, గాయత్రి అన్నా, బ్రహ్మ రూపిణి అన్నా ఒక్కరేనని చాలా చక్కని విషయం స్పష్టపరిచావు.

దత్తాత్రేయ చతుర్ముఖులు ఇలా సంభాషించుకుంటూ ఉండగానే దత్తదేవుడి అంకపీఠ నివాసినియైన శ్రీదేవి ముఖం నుంచి చతుర్వేదాలు వెలువడి రేణుకాదేవి శరీరంలో ప్రవేశించాయి. దీనితో సంతృప్తి చెందిన చతుర్ముఖుడు రేణుకాదేవియే వేద మాత అని గుర్తించి భక్తి ప్రపత్తులతో నమస్కరించాడు. తల్లీ! ఛందస్స్వరూపిణివి నీవు. ఓం కార స్వరూపిణివి నీవు. అనంత రూపిణివి నీవు. తెలిసిగానీ, తెలియక గానీ నిన్ను నిందించే వాళ్ళు సకల పుణ్య ఫలాలనూ కోల్పోతారు. అని స్తుతించి మరొక్కసారి నమస్కరించి దత్తాత్రేయుడికీ ప్రణమిల్లి పురాతన వేద స్మృతిని తిరిగిపొంది సత్యలోకానికి వెళ్ళిపోయాడు.

ఆ జగదంబికయే రేణుమహారాజు చేసిన తపస్సుకు సంతుష్టయై వారింట కన్యగా జన్మించి శివస్వరూపుడైన జమదగ్నిని పరిణయమాడింది. సేవలు చేసినది. ఆ దంపతులు కొంతకాలానికి లౌకిక దేహాలను విడిచిపెట్టి శివశివాని రూపాలతో కైలాసం తిరిగి చేరుకున్నారు. దీపకా! ఈ కథ నీకింతకు ముందే చెప్పాను కదా! అంచేత నీ మరో ప్రశ్నకి సమాధానం చెబుతున్నాను. తిలకించు - అని వేద ధర్ముడు కొనసాగించాడు.

## కృష్ణామలకం కథ

ఒకానొక సందర్భంలో ఏక వీరా దేవి ఆజ్ఞ మేరకు చతుర్ముఖుడు విష్ణు సందర్శన కాంక్షతో క్షీర సముద్రానికి బయలు దేరాడు. కానీ అక్కడ విష్ణుమూర్తి కనిపించలేదు. ఎంత వెదికినా ఎంతసేపున్నా శేష సాయి దర్శనమే కాలేదు. ఏమిటి ఈ వింత చెప్మా- అని భయ సందేహ పరాభవాది భావాలతో ఉక్కిరి బిక్కిరి అవుతుండగా అక్కడ ఒక అమలకీ తరువు (ఉసిరిక) కనిపించింది. అది విద్యుత్కాంతులు విరజిమ్ముతున్న కృష్ణా మలకీ తరువు. దాన్ని తీసుకొని తిరిగి వచ్చాడు విరించి. ఆ - తరు రూపంలో స్వయంగా విష్ణుమూర్తి వచ్చినట్లే అనిపించి రేణుకాదేవి పరశురామునితో - నాయనా! మరొక్కసారి ఈ కృష్ణా మలకీ రూప విష్ణుమూర్తిలోకి ప్రవేశించు. శివ స్వరూపుడైన నీ తండ్రిని స్తుతించు. ఈ కృష్ణామలకం త్రిభువనేశ్వరుడు. సాక్షాద్విష్ణువు. నీ తండ్రి సదాశివుడు. కనుక తరువు అవుతుంది.

నువ్వూ దత్తాత్రేయుడు కలిసి ఈ కృష్ణామలకీ తరువుని ఇక్కడ సహ్యాద్రి మీద ఉన్న ఈ శుభ ప్రదమైన దత్తాశ్రమంలోనూ దండకలోనూ స్థాపించండి. నాకూ సంతోషం కలిగించండి. నువ్వు కూడా దీని నీడలో విశ్రాంతి తీసుకో. ఈ తరువును దర్శించిన వారుగానీ స్పృశించిన వారు కానీ సద్గతులు పొందుతారు - అంది. అప్పుడు పరశురాముడు ఆ తరువులో ప్రవేశించి తన ఉనికితో దానికి త్రి దేవత్వాన్ని కలిగించాడు. అటుపైని బ్రహ్మ దేవుడు రేణుకా దేవివద్ద శలవు తీసుకొని తన సత్య లోకం చేరుకున్నాడు. రేణుక అంతర్ధానం చెందింది. దత్తాత్రేయుడు ఆ తల్లికి నమస్కరించి ఆ తరువు క్రింద ధ్యాన నిష్ఠకు ఉపక్రమించాడు. తలపెట్టిన యజ్ఞం పూర్తి అయ్యే వరకూ భార్గవరాముడు సైతం ఆ తరువు చెంతనే విశ్రాంతి తీసుకున్నాడు.

## పింగళనాగ వృత్తాంతం

ప్రణీతానది ఒడ్డున కృష్ణా మలకీ తరుచ్ఛాయలో ధ్యానం చేసుకుంటున్న దత్తాత్రేయుడి దగ్గరకు ఒకనాడు పింగళనాగుడు అనే ముని దర్శనార్థం వచ్చాడు. సభక్తిగా నమస్కరించి దత్త దేవుడి అనుమతితో చేరువలో కూర్చున్నాడు.

స్వామీ! నాకు తెలీక అడుగుతున్నాను. నా అజ్ఞానాన్ని క్షమించి నా సందేహం తొలగించండి. నాకు తెలిసీ నాలుగు ఆశ్రమాలే ఉన్నాయి. వాటికి వాటి నియమ నిబంధనలున్నాయి. వీటిలో తమరు ఏ ఆశ్రమానికి చెందిన వారుగా కనిపించడం లేదు. మీరిద్దరూ దిగంబరులై ఉంటారు. మదిరా మాంసాలను పుచ్చుకుంటూ కనిపిస్తారు. దిగంబరీ! ఈ అందగత్తెను ఎప్పుడూ అంకపీఠం దింపవు. ఏమిటి స్వామీ! ఇదంతా. దీన్ని ఏ ఆశ్రమం అంటారు? ఈ ఆశ్రమదీక్షను మీకు ఇచ్చిన ఆ గురు మహానుభావుడెవరు? ఎంతో కాలంగా మిమ్మల్ని అడగాలని. ఇప్పటికి కుదిరింది. కాసింత విశ్రాంతిగా ఏకాంతంగా దొరికారు. అందుకని అడిగేశాను. నొప్పిస్తే క్షమించండి చెప్పకూడనిది అయితే చెప్పవద్దు. తెలుసుకోవాలని మాత్రం చాలా కుతూహలంగా ఉంది.

మునిశ్రేష్ఠా! అడగవలసిందే అడిగావు. ఇందులో నన్ను నొప్పించింది ఏమీ లేదు. నువ్వన్నట్లు ఇంత వరకూ లోకంలో ఉన్నవి నాలుగే ఆశ్రమాలు. కానీ నాది - ఆపైది, అయిదో ఆశ్రమం. ఈ చరాచర జగత్తునంతటినీ ఆత్మాభిన్నమనీ అవికల్పంగా చూడగలిగినవాడు, కామక్రోధాదులనైన అరిషడ్ వర్గాన్ని జయించి సర్వ భూతకోటిపట్లా సమచిత్తంతో వైరాగ్యంతో ఉండగలిగినవాడు మాత్రమే ఈ అయిదవ ఆశ్రమానికి అర్హుడు. నేను చెప్పిన ఈ తత్త్వం నువ్వన్న నాలుగు ఆశ్రమాలలోనూ ఎక్కడైనా వున్నట్లా, లేనట్లా? బహుశ నీకు తెలీదు. చెప్పలేవు. కేవలం బ్రహ్మవాదులు మాత్రమే గుర్తించగలరు.

మహానుభావా! నువ్వే విశ్వేశ్వరుడవు. నువ్వే పురుషోత్తముడవు. అనసూయ - అత్రిదంపతులకు జన్మించిన నువ్వే కమలాపతివి. అజ్ఞానంతో నేను చేసిన ఈ అధిక ప్రసంగాన్ని క్షమించు. నన్ను రక్షించు. నీ ఉదరంలో ప్రవేశించి సురక్షితంగా ఉండాలని నా ఆకాంక్ష. హే శ్రీ రామా! నారాయణా! వాసుదేవా! గోవిందా! వైకుంఠా! ముకుందా! కృష్ణా! శ్రీ కేశవా! అనంతా! నృశింహా! విష్ణూ! సంసార సర్ప ద్రష్టుణ్ని. నన్ను కాపాడు - అని పింగళనాగుడు సాగిలపడి మ్రొక్కాడు. పింగళనాగుడి ప్రార్థనను మన్నించి దత్తాత్రేయుడు శివరూపంతో అతడిని గర్భాన ధరించాడు.

# ఆమలకీ వృత్తాంతం
# (ఉసిరిక)

శివరూపధారియై కృష్ణా మలకం క్రింద కూర్చున్న దత్తాత్రేయుణ్ని గానీ, త్రిమూర్తి స్వరూపమైన ఆ కృష్ణా మలకిని గానీ దర్శించినవారు సద్గతులుపొందుతారు అనడంలో సందేహం లేదు. నరనారీజనం ప్రణీతానదిలోని పద్మ తీర్థాన స్నానం చేసి దానధర్మాలు నిర్వహించి ఒడ్డున ఉన్న ఈ కృష్ణా మలకిని దర్శించి స్పర్శించి ప్రదక్షిణం చేస్తే ఏకకాలంలో హరిహర విరించిలకు ప్రదక్షిణం చేసిన పుణ్యఫలం పొంది, మహాయోగులకు సైతం అందని పరమపదం చేరుకుంటారు. కృత యుగారంభంలో క్షీరసాగర మధనం జరుగుతున్నప్పుడు ఫలపుష్ప భరితమై పీయూషామలక వృక్షం ఆవిర్భవించింది. దాన్ని అప్పుడు దేవతలు విష్ణుమూర్తికి బహూకరించారు. సముద్రుడేమో కౌస్తు భాదిరత్నాలనూ దివ్యాభరణాలనూ లక్ష్మీదేవినీ స్వయంగా సమర్పించి విష్ణుమూర్తిని సత్కరించాడు. పుణ్యప్రదమైన క్షీరాబ్ధి మందిరంలో ఈ పీయూషామలకిని స్థాపించి లక్ష్మీదేవిని ఆనందపరచాడు శ్రీ మహావిష్ణువు. అనసూయాత్రి మునులకు తాను పుత్రుడుగా అవతరించినవేళ తనతోపాటు ఈపీయూషా మలకిలో అర్ధాంశం తెచ్చుకున్నాడు. అటుపైని దాన్ని తన సహ్యాద్రి ఆశ్రమంలో నాటు కున్నాడు. అదే కృష్ణామలకీ నామంతో ప్రసిద్ధమయ్యింది. దానిక్రిందనే దత్తస్వామి తీవ్రంగా తపస్సు చేసాడు. ఈ తరువు మూడు రూపాలతో నామాలతో త్రిభువనాల్లోనూ విఖ్యాతి పొందింది. ఒకటే తరువు ఊర్ధ్వ భువనాన క్షీరాబ్ధి మందిరంలో ఒకరూపంతో, పీయూషామలక నామంతో సహ్యాద్రి శిఖరం మీద, మరొక్కరూపంతో, కృష్ణామలక నామంతో పాతాళలోకంలో వేరొక రూపంతో, నామంతో విరాజిల్లుతోంది. దత్తాత్రేయాశ్రమంలోని తృతీయాంశ విరాజితానికే సిద్ధామలకమని కూడా పేరు. ఇందువల్లనే సిద్ధామలక గ్రామం ఏర్పడి అటుపైని మాతాపురం అయ్యింది. దీన్ని దర్శించిన నరనారీ జనం పరమపదం చేరుకుంటారు.

## చాంఘ్రిక గాధ

పూర్వం కృతయుగంలో పురందర అనే పట్టణంలో చాంఘ్రికుడు అనే విప్రుడు ఉండేవాడు. అతడి భార్యపేరు భామ. అన్యోన్యదాంపత్యం ఇద్దరిదీ. చాంఘ్రికునికి ఇంద్ర పదవినధిష్టించాలని కోరిక. తపస్సు చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. అనువైన ప్రదేశం ఎక్కడా అని ఆ దంపతులు అన్వేషణకు బయలుదేరి భూగోళం అంతా సంచరించి, పర్వతాలూ, అరణ్యాలూ, నదీతీరాలు, సరోవరాలు గాలించారు. ఎక్కడా వారికి అనువైన ప్రదేశమే కనిపించలేదు. దిగులుగా కూర్చున్నారు.

అప్పుడు అతడి పితృదేవతలు దుర్ధర్షులు అదృశ్యరూపాలలో ఆకాశాన నిలబడి - నాయనా వృధాగా కాలయాపన చేసుకుంటున్నావు. మూఢుడవై తీర్థాలు తిరుగుతున్నావు. వెంటనే బయలుదేరి మాతృతీర్థం చేరుకో, అక్కడ పితృణముక్తిపొందు. ఆ తీర్థంలో రేణుకా సమక్షంలో భక్తిశ్రద్ధలతో పితృదేవతలకు పిండప్రదానం చేస్తే అదికర్తకూ, పితృ దేవతలకు సద్గతులు కలిగిస్తుంది. అంచేత మిగతా తీర్థాలన్నీ నిరర్థకాలు. వాటి సంగతి మర్చిపో వెంటనే మాతృతీర్థం చేరుకో - అని సలహా ఇచ్చారు. అందుమీదట చాంఘ్రికుడు వెంటనే బయలుదేరాడు. సహ్యాద్రిమీద దత్తాత్రేయాశ్రమం చేరుకుని యేరుతటాకంలో స్నానం చేసి మాతృతీర్థంలో పితృదేవతలకు తర్పణాలు విడిచిపెట్టి వెంతనే గట్టుమీద

ఉన్న కృష్ణామలకం క్రింద పిండప్రదాన శ్రాద్ధ విధులు నిర్వహించాడు. ఆ క్షణంలోనే అతని పితృదేవతలు ముక్తులై అక్షయ పుణ్యలోకాలకు వెళ్ళిపోయారు.

# పద్మ తీర్థ మహిమ

దీపకా ! పనిలో పనిగా ప్రణీతానదిలోని పద్మ తీర్థ ప్రభావం కూడా చెబుతాను ఆలకించు - అని వేదధర్ముడు తన ప్రవచనాన్ని ఇలాకొనసాగించాడు.

పూర్వకాలంలో ఉషా సూర్యదంపతులకు ఒక ఆడపిల్ల పుట్టింది. భానుమతి అని పేరుపెట్టుకున్నారు. సర్వశుభలక్షణలక్షిత. రోజుకొక ఏడాదిగా త్వరత్వరగా ఎదిగింది. అందానికి చురుకుదనానికి చలాకీ ఆటపాటలకు పెట్టింది పేరయ్యింది. పరిపూర్ణ కన్యకామణి అయ్యింది. ఆ విశ్వమోహినిని చూసి భాస్కరుడే దురదృష్టవశాత్తూ మోహితుడయ్యాడు. కోరికతీర్చమంటూ వెంటపడ్డాడు. అజ్ఞానావృతుడైన తండ్రి నుండి తప్పించుకొని ఆ భానుమతి పాపభీతయై మృగీరూపం ధరించి ఘోరారణ్యంలోకి పారిపోయింది. మోహాంధుడైన సూర్యుడు ఆ రూప ద్రవిణ సంపన్నను వెదుక్కుంటూ ముల్లోకాలూ సంచరించాడు. ఎట్టకేలకు అరణ్యంలో మృగీరూపంలో దాక్కున్న భానుమతిని పట్టుకున్నాడు. బలాత్కారం చెయ్యబోయేలోగా ఇంద్రాది దేవతలూ కశ్యపాది ఋషులూ ప్రత్యక్షమై వారించారు. కానీ కన్న కూతుర్ని కామించిన పాప చింతనకూ బలాత్కార ప్రయత్నానికి శిక్షగా కుష్టురోగం సంక్రమించింది. అది దిన దిన ప్రవర్ధమానమై సూర్యుణ్నిదారుణంగా పీడించసాగింది. అవయవాలు తిమ్మిరిలెక్కి వికలేంద్రియుడయ్యాడు. తండ్రి పరిస్థితి చూసి భానుమతి దిగులుపడింది. మృగీరూపం విడిచిపెట్టింది. తండ్రికి నమస్కరించి ఆశీస్సులు తీసికొని బ్రహ్మాదిదేవతలను సందర్శించి తండ్రి కుష్టురోగం నయమయ్యేదారి చెప్పమని అభ్యర్థించింది. స్మరణతో సందర్శనతో అందరికీ ఆరోగ్యం పంచిపెట్టే భాస్కరుడు మండల మధ్యభాగంలో విష్ణుమూర్తిని సకలదేవతలను ధరించే సూర్యభగవానుడు, సురసిద్ధ ఋషిగణపూజితుడు మళ్ళీ సర్వాయవసంపూర్ణుడై అందర్నీ ఆరోగ్యవంతుల్ని చేసేదెప్పుడూ ? దీనికేదైనా ప్రాయశ్చిత్తం చెప్పండి అని బతిమాలుకుంది.

అమ్మాయీ ! మీ నాన్నకు కుష్టు రోగం ఎందుకు వచ్చిందో తెలుసుగదా ! నిన్ను కామించిన మహా పాపానికి అది ఫలం. బ్రహ్మహత్యకన్నా గురుభార్యాభిగమనం కన్నా ఘోరమైన పాతకమిది. దీన్ని తొలగించగల శక్తి కేవలం ఒక్క పద్మ తీర్థానికి మాత్రమే వుంది. అమలకీవనంలో దత్తాత్రేయ ఆశ్రమం ఉంది. దాని చెంత ప్రవహిస్తున్నదియే ప్రణీతానది. ఆశ్రమ తీర్థమే పద్మ తీర్థం. మీ తండ్రిని అక్కడకు వెళ్ళమను. అందులో స్నానం చేసి ఏకవీరా దేవిని అర్చించమను. ఆవిడ సకలదేవతాధీశ్వరి, జగన్మాత, భక్తితో ఆరాధిస్తే కరుణిస్తుంది. భుక్తిముక్తి ఫలాలు ప్రసాదిస్తుంది. వెంటనే బయలుదేరమను. రోగం మరీముదిరి కదలలేని దశవస్తే కష్టం.

దేవతలు చెప్పిన ఉపాయాన్ని భానుమతి, తండ్రికి వినిపించింది. అతడు వెంటనే బయలుదేరి పడుతూ లేస్తూ పాకుతూ డేకుతూ దత్తాశ్రమం చేరుకున్నాడు. నిత్యం పద్మతీర్థంలో స్నానం చేస్తూ దత్తదేవుడ్ని ధ్యానిస్తూ చిరకాలం తపస్సు చేశాడు. రేణుకాదేవిని బహు విధాలుగా మంత్రాలతో శ్లోకాలతో స్తుతించాడు. ఆ తల్లి కరుణించింది. తేజోరాశీ! నీ స్తుతులకు ప్రసన్నురాలినయ్యాను. నీ శరీరం ఆరోగ్యంతో రెట్టింపు అవుతుంది. నువ్వే అందరికీ వరాలు ఇచ్చేవాడివి. నీకు ఇవ్వేళ వరమిస్తున్నాను. ఇక ఆలసింపకు - స్వస్థానం చేరుకో. ఈ పద్మతీర్థంలో స్నానం చేసి పితృదేవతలకు

తర్పణాలు విడిచిపెట్టినవారంతా త్రివిధ ఋణాల నుండీ విముక్తులై దివ్యగతులు పొందుతారు. ఆయురారోగ్య భోగభాగ్యాలతో ఇహలోకంలో సుఖించి పరలోకంలో ఇంద్రభోగాలు అనుభవిస్తారు. అని రేణుకాదేవి అంతర్ధానం చెందింది. భాస్కరుడు ఆ క్షణంలోనే కుష్టురోగం నుండి విముక్తుడయ్యాడు. తన సూర్యలోకం చేరుకున్నాడు.

దీపకా ! తెలిసిందికదా ! పద్మ తీర్థ మహిమ ఎంతటిదో. నువ్వు ఇంకా ఏమి వినాలనుకుంటున్నావో, అడుగు చెబుతానంటూ వేదధర్ముడు కమండలూదకంతో కాసింత గొంతు తడుపుకొన్నాడు.

గురుదేవా ! సర్వధర్మజ్ఞా ! సర్వసందేహ భేదకా ! ఈ దత్త దేవుడి చరిత్ర నువ్వు చెబుతూంటే నేను వింటూంటే ఎంతకీ తనివితీరడంలేదు. కన్నమ్మకే వాపు, తిన్నమ్మకే తీపు - అన్నట్లు ఇంకాఇంకా వినాలనిపిస్తోంది. నిజమే రసజ్ఞుడెవడు సంతృప్తి చెందకుండా వుంటాడు. ఆధ్యాత్మిక దుఃఖాలన్నింటినీ నశింపజేసే కథలివ్వి. అలనాడెప్పుడో దేవతలు సేవించారని చెబుతున్న అమృతం - ఈ దత్త కథామృతం ముందు అతితుచ్ఛం. దీనికి సాటిరానేరాదు.

దయజేసి అదే అమృతగోళాన్ని మరింతగా అందించు. రేణుకాదేవి స్వరూపం గురించి ప్రసక్తి వశాత్తూ చెప్పావు కానీ క్లుప్తంగా చెప్పావు. దాన్ని ఇంకా విస్తారంగా వినాలని నా తహతహ కరుణానిధీ ! అనుగ్రహించు. ఈ జగత్తుకి ధేనువు, ఖని, ధాత్రి అయిన ఆ మహాదేవి తత్వాన్ని నీ కన్నా బాగా ఎరిగినవారు కానీ ఎరుక పరచగలవారు కానీ మరొకరు ఉన్నారని నేననుకోను.

నాయనా దీపకా ! నీ జిజ్ఞాస నన్ను ఆనందపరుస్తోంది. రేణుకాదేవి మహాత్మ్యాన్ని సమగ్రంగా వివరిస్తాను తెలుసుకో. ఇది వింటే చాలు సకలప్రాణులకు సర్వశ్రేయస్సులు కలుగుతాయి. సుర - సిద్ధ - ఋషిమండలితో పరివేష్టితుడై అమలకీవృక్ష ఛాయలో కూర్చుండి ఒకనాడు దత్తాత్రేయుడు పరశురాముణ్ని ఇలా అడిగాడు. రామా ! నువ్వు సర్వజ్ఞుడవు. త్రిలోకాధిపతివి. రేణుకా సుతుడవు. పైగా నీ మీదప్రేమతో గణాధిపతి నీకు ఆత్మతత్వ స్వరూపం కూడా బోధించాడు. కాబట్టి నీ తల్లి రేణుకాదేవి స్వరూపాన్ని మహాత్మ్యాన్ని నువ్వు పూర్తిగా గుర్తించి ఉంటావు. దయజేసి ఆ జగన్మాత మూల తత్వాన్ని మాకు తెలియపరుచు.

దత్తాత్రేయా ! రేణుకాదేవికి తనయుడన్న మాటేకానీ ఆ తల్లిమూలతత్వం ఏమిటో నాకు ఏ మాత్రమూ తెలీదు. ఏకవీరాదేవి స్థూల సూక్ష్మాత్మక తత్వాలన్నీ తెలిసినవాడవు నువ్వే. కనుక నువ్వే మాకు చెప్పు - అన్నాడు పరశురాముడు.

రామా ! నీకు తెలియదంటే నేనెందుకు నమ్ముతాను. నాతో చెప్పించాలని నీ ప్రయత్నం పోనీలే అలాగే చెబుతాను విను. ముల్లోకాలను తన గర్భకోశంలో సంరక్షించే జగదేకమాత -రేణుకాదేవియే - ఆమె దివ్యరూపం స్థూలసూక్ష్మ భేదాలతో రెండు విధాలుగా వుంటుంది. అద్భుతావహమైన అంశం ఇది. అరణ్యాలు, నదులు, సముద్రాలు, పర్వతములు, ప్రాణికోటి ఈ భూగోళం - ఇదంతా తల్లికి స్థూలరూపం, స్వర్గాలు, సర్వతీర్థాలు, దేవతలు, మహర్షులు, సప్తపాతాళ లోకాలు, శేష కూర్మాదులు - ఈ దృశ్యమాన జగత్రయమంతా ఆ తల్లి స్థూలరూపమే. పరబ్రహ్మమే ఆమె సూక్ష్మరూపం - అని దత్తాత్రేయుడు చెబుతూంటే విని పరశురాముడు ధ్యాన నిమగ్నుడయ్యాడు. అక్కడే అలాగే అమలకీ తరువు చెంత ఏకవీరాదేవిని ఉపాసిస్తూ ఉండిపోయాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

దీపకా ! ఒకప్పుడు కైలాసదర్శనానికి వెళ్ళిన మహర్షులు కుమారస్వామిని ఇదే వృత్తాంతం అడిగారు. ఆ షణ్ముఖుడు చెప్పిన రేణుకా మహత్మ్యం నీకు తెలియపరుస్తాను, శ్రద్ధగా విను.

## రేణుకాదేవి - మహిమ

మహర్షులారా ! రేణుకాదేవి అంటే త్రి జగన్మాత. అందుకనే ఆ తల్లి నివసించిన స్థలాన్ని మాతృతీర్థం లేదా మాత్రాలయం అంటారు. ఒకప్పుడు దత్తాత్రేయుడు తాను ఆచార్యుడై నిలచి ఆ పవిత్ర స్థలంలో పరశురాముని చేత ఒక మహాయజ్ఞం చేయించాడు. అది రేణుకా యజ్ఞం. దానికి ప్రజాపతియే ప్రధాన ఋత్విక్కుగా బ్రహ్మస్థానం అలంకరించాడు. తక్కిన మహర్షులందరూ వేదమంత్రాలు పఠిస్తూ మిగిలిన భూమికలు నిర్వహించారు. ఆ యజ్ఞంలో నారదాది దేవర్షులు సిద్ధచారణ గంధర్వాధి దేవజాతులవారూ శుభప్రదమైన రేణుకా చరిత్రను భక్తిప్రపత్తులతో గానం చేశారు. దేవతలు దుందుభులు మ్రోగించారు. అప్సరసలు నృత్యాలు చేశారు. యజ్ఞపరి సమాప్తిలో - క్షీర సముద్రం నుంచి పాలు, దధ్యుదధి నుండి పెరుగు, ఘృతాబ్ధి నుండి నెయ్యి ఇలా సప్తసముద్రాల నుండీ సప్తద్రవాలను తెచ్చి కృష్ణామలకి నుండి మధుశర్కరలు గ్రహించి గంగాది పుణ్యనదుల నుండి పవిత్రోదకాలు తెచ్చి - వీటన్నింటితో దత్తాత్రేయుడు స్వయంగా ఏకవీరాదేవికి అభిషేకం చేశాడు. సాష్టాంగపడి లేచి చతుర్వేద మంత్రాలతో స్తుతించాడు. పద్మాసనం వేసికూర్చుని మెల్లగా ధ్యానంలోకి జారుకున్నాడు. దేవతలు అందరూ చూస్తూనే వున్నారు. దత్తాత్రేయుడు హఠాత్తుగా అంతర్ధానం చెందాడు. అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. రేణుకాదేవిని ధ్యానిస్తూ మనకళ్ళ ఎదుటే కళ్ళు మూసుకొని కూర్చున్న దత్తాత్రేయుడు ఏమయ్యాడంటే ఏమయ్యాడు ? ఎటువెళ్ళాడంటే ఎటువెళ్ళాడు ? అందరూ ఒకరినొకరు ప్రశ్నించుకున్నారే తప్ప ఎవరికీ సమాధానం దొరకలేదు.

దత్త దేవుడికి రేణుకా ధ్యానంతప్ప మరొకటి లేదు. ఆయన గారి శయనాసనయాన కథాదులన్నీ రేణుకామయమే. ఎరుగుదుంగదా ! కాబట్టి రేణుకాదేవిలో లీనమయ్యుంటాడు అని దేవతలు భావించారు. ఋషులు మరొకలా అనుకున్నారు. రేణుకా హృదయమూ మనకు తెలీదు. దత్త హృదయమూ మనమెరుగం. ఇద్దరూ దివ్యతేజోమయులే. దేవి తన దివ్య తేజస్సుతో దత్త దేవుణ్ని ఆచ్ఛాదించిందేమో, లేదా దత్తస్వామి వేడుకగా పాతాళానికెళ్ళాడేమో. స్వామివి అన్నీ చిత్ర విచిత్ర లీలలు గదా ! అనుకున్నారు. ఇక్కడే అదృశ్యరూపంతో గూఢంగా వుండి వుంటాడు. మన స్వామివి ఇలాంటి కూతూహలాలు ఉన్నవే కదా ! అనుకున్నారు సిద్ధులు. కాసేపట్లో కూసేపట్లో ప్రత్యక్షమవుతాడు చూడండి.

ఆ నగ్న సుందరితో మధువును సేవిస్తూ ప్రత్యక్షమవుతాడని విధ్యాధరులు అభిప్రాయపడ్డారు. ఈ అజ్ఞానమనే వలను మన అందరిమీదకు వదలి తమాషాగా ఇక్కడే తనను తానే ఆజ్ఞాపించుకుని మనల్ని గమనిస్తు ఉండి ఉంటాడు అని నిశ్చయించుకున్నారు చారణులు.

వీరందరి సంభాషణలు విని సంబరపడ్డ దత్తాత్రేయుడు కొంచెంసేపటికి స్వయంగా ప్రత్యక్షమయ్యాడు. సురగంధర్వ సిద్ధ సాధ్యదేవర్షి గణమంతా స్వామిని దర్శించి హమ్మయ్య అని గుండెలనిండుగా గాలి పీల్చుకున్నారు. స్వామికి ప్రణమిల్లి కౌగలించుకొని తమతమ లోపలి అలజడిని తీర్చుకున్నారు. ఇలా తేరుకున్నాక అందరూ కలిసి ఏకగ్రీవంగా

స్వామిని ప్రశ్నించారు. దత్తవిభూ ! నువ్వుఎక్కడికి వెళ్ళి వచ్చావు ? దేవతలకీ, మంత్రద్రష్టలకీ, ఋషులకీ కనిపించని చోటుకి వెళ్ళివచ్చావు. దివ్యదృష్టులకు సైతం అందని ఆ చోటు ఏది ? ఎక్కడ ? ఇలాంటి తపస్సు కానీ, ధ్యానం కానీ, తత్వంకానీ మరెక్కడా ఏనాడూ కన్నదికాదు, విన్నది కాదు. మొదలూ, తుదీ నువ్వే కనుక నువ్వే తెలియజెప్పాలి.

దేవతలారా ! మహర్షులారా ! పరశురాముని యజ్ఞ విధిలో మునిగివుండగా సంధ్యావందన కాలంగడిచిపోతున్న సంగతి గుర్తించాను. కాలాతీతంకాకుండా సంధ్యావందనం చేసి వద్దామని వెళ్ళాను. సంధ్యాదేవికి వందనం చెయ్యడం కన్నా మహాయజ్ఞం లేదని మీకు తెలుసుకదా !

స్వామీ ! మాకు తెలిసిన సంధ్యావందనం వేరు. దానికి ఇలా అదృశ్యమై ఎక్కడికో పోనవసరం లేదు. నీవు నమస్కరించిన సంధ్యాదేవి ఎవరు ? నివాస స్థలం ఏమిటి ? వెళ్ళివచ్చినవాడివి నీకు తెలియదా ? ఆ సంధ్యావందనానికి కాలమేమిటి ? కర్త ఎవరు ? తీర్థ మెక్కడ ? ఇవన్నీ మాకు కటాక్షించు.

ఆర్యులారా ! యోగీశ్వరుల హృదయాలలో సర్వదా నివసించే యోగిని రేణుకాదేవియే సంధ్యాదేవి. ఆమెకే నేను వందనం ఆచరించి వచ్చాను. ధ్యాన నిర్మలమూ, అమృతానంద పూర్ణమూ అయిన మనస్సులో సర్వతీర్థమయి రేణుకాదేవికి వందనమాచరించి వచ్చాను. యోగమార్గ రతులు, నిరంతరం ఆ మహామాయనే ధ్యానిస్తుంటారు. రేణుకయే సంధ్యాదేవి సందేహం లేదు. ఆవిడయే ఏకవీర, మీకూ, నాకూ, అందరికీ వందనీయ ఆ జగన్మాతయే. ఆమెకే వందనం ఆచరించివచ్చాను.

దత్తగురూత్తమా ! సంధ్యావందన కాలమూ, అదేదో దాటిపోవడం అన్నారు. ఆ వివరాలు కూడా కరుణించి చెప్పండి.

మాన్యులారా ! ఆసన - ప్రాశన - శయన - యానాది - సమయాలలో ఎప్పుడైనా ఎక్కడైనా గానీ అందరికీ సర్వదా, సర్వథా వందనీయురాలు ఈ సంధ్యాదేవి. దీనికి ప్రత్యేకంగా ఒక సమయం అంటూ వుండదు. సర్వకాల సర్వావస్థల్లోనూ వందనీయ - మహానుభావులు ఇలావందనం ఆచరిస్తూనే వుంటారు.

స్వామీ ! వింతగా వుంది. మహానుభావులు నిరంతరం ఆమెనే ధ్యానిస్తూనే వుంటారని అంటున్నావు అదెలా సాధ్యం ? ప్రాణులన్నాక కర్మఫలానుభవం ఉంటుంది గదా ! దారుణకర్మలకి బాధలను అనుభవిస్తారు గదా ! ఎంతటి మహానుభావులైతే మాత్రం ఆ సమయాల్లో కూడా సంధ్యావందన విధి సాగించగలరా ?

మునీశ్వరులారా ! బ్రహ్మరూపిణి, సంధ్యారూపిణి రేణుకాదేవిని మూడు కాలాల్లోనూ సందర్శించి వందన మాచరించగలిగినవారే మహానుభావులు. లౌకికమైన ఆటుపోట్లూ కర్మానుభవక్లేశాలూ దీనికి అడ్డంకి కాకూడదు. అలాసాగించే సంధ్యావందనం వల్లనే వీరూ వందితులు కాగలుగుతారు. మూడుకాలాలు అంటే చైత్రం - ఆషాడం - కార్తీకం - ఈ మూడు కాలాల్లోనూ ఏ ఒక్కనెలలో రేణుకాదేవిని ఉపాసించినా ఇహపరాల్లో భుక్తి ముక్తులకు లోటు వుండదు. మూడు కాలాల్లో ఉపాసిస్తే ఇక చెప్పేదేమిటి ఇహంలో ఇంద్రభోగాలు అనుభవించి పరమపదం చేరుకుంటారు. అటువంటి సర్వకాలాను వర్తిని - పరబ్రహ్మ స్వరూపిణి - సంధ్యాదేవి అయిన రేణుకా మాతకే నేను వందనం

ఆచరించి వచ్చాను. గృహాలలో ఉండేవారు పవిత్రులై కాలత్రయస్వరూపిణి, సంధ్యా స్వరూపిణి అయిన ఈ రేణుకాదేవిని భక్తితో నిత్యమూ ఉపాసిస్తే ఆమె దర్శనం ఆమె అనుగ్రహం వెంటనే పొందుతారు. ఇహంలో భోగాలను అనుభవించి పరంలో సద్గతి పొందుతారు.

ఇలా రేణుకాదేవియే సంధ్యాదేవి అని చెప్పి దత్తాత్రేయుడు మళ్ళీ అంతర్ధానం చెందాడు. ఇది విన్న ఆ దేవజాతులవారూ, ఋషులూ మునులూ సంబరపడి సకల తీర్థోదకాలతోనూ వరాహరూపి అయిన విష్ణుమూర్తికి అభిషేకం చేసి అత్యంత భక్తి ప్రపత్తులతో యోగమాత రేణుకాదేవిని అర్చించి విష్ణు స్వరూపం అయిన అమలకీ తరువుకి ప్రదక్షిణ నమస్కారం చేసి అంతర్ధానం చెందిన దత్తాత్రేయ స్వామికి మనస్సుల్లోనేవందనాలర్పించి దత్తస్వామి మహిమలను రేణుకా మహిమలనూ తలచుకొంటూ కొనియాడుతూ ఎవరిస్థానాలకు వారు బయలుదేరారు.

దీపకా ! అలనాడు కైలాసం మీద మహర్షులకు స్కందుడు స్వయంగా చెప్పిన రేణుకా మహిమ ఇది. విన్నావు గదా ! మరిక నీ కోరిక ఏమి ? - అన్నాడు వేదధర్ముడు.

గురుదేవా ! దత్తాత్రేయుడి ప్రభావమే నాకు ఇంకా వినాలనీ తెలుసుకోవాలని ఉంది. కార్తవీర్యార్జునుడ్ని అంతటి మహావీరుణ్ని చేసిన దత్తదేవుడి దయను ఎంతని కొనియాడగలం. అటువంటి పుత్రుణ్ని పొందడానికి కృతవీర్య దంపతులు ఏ పుణ్యాలు చేసారో ? ఏ వ్రతాలు ఆచరించారో ? సాధన సంపత్తి లేకుండా ఫలాలు దక్కవుగదా. ఆ వివరాలు చెప్పండి - అని అభ్యర్థించడమే తడవుగా వేదధర్ముడు ఆరంభించాడు.

దీపకా ! వెనుకటికి పాండవ మధ్యముడైన అర్జునుడు అడిగితే శ్రీ కృష్ణుడు ఈ వృత్తాంతం అంతా అతడికి వివరించి చెప్పాడు. అదే నేను నీకిప్పుడు యధాతధంగా చెబుతాను. ధర్మజకృష్ణ సంవాదంగా నడుస్తుంది విను.

## సూర్యుడు చెప్పిన సప్తమీ స్నపనవ్రతం

ధర్మరాజా ! వరాహకల్పంలో వైవస్వతమన్వంతరంలో కృతయుగంలో ప్రధమ పాదాన హైహయవంశం ఉండేది. ఆ వంశంలో కృతవీర్యుడు అనే మహారాజు మహాప్రతాపశాలియై సప్త ద్వీపాకృతమైన మహీమండలాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించాడు. డెబ్బైయేడు వేల సంవత్సరాలు పాలించాడు. ఆ మహారాజుకి వందమంది పుత్రులు జన్మించి, చ్యవన మహర్షి శాపాగ్నికి ఆహుతి అయ్యారు. పుత్ర శోకం తట్టుకోలేక రాజదంపతులు వోలువోలున విలపిస్తూ బృహస్పతిని శరణువేడారు. ఎందుకు ఇలా జరిగింది ? మాకు ఈ జన్మలో పుత్రోత్సాహం ఉన్నదా ? వంశోద్ధారకుడు కలుగుతాడా ? - మేమేమి చెయ్యాలి ? దివ్యదృష్టితో పరిశీలించి అనుగ్రహించండి - అని కాళ్ళా వేళ్ళా పడి అభ్యర్థించారు. బృహస్పతి మహాపండితుడే అయినా హృదయంకలవాడు కనుక స్పందించాడు. దివ్యదృష్టి సారించాడు. కృతవీర్యా ! దుఃఖించకు క్లేశాలుపడతావుగానీ త్వరలోనే నీకు దీర్ఘాయుష్మంతుడైన పుత్రుడు జన్మిస్తాడు. అయితే ఈలోగా నువ్వు వదిలించుకోవలసిన కల్మషాలు కొన్ని ఉన్నాయి. వాటి ఫలితంగానే మీకిద్దరకూ ఈ పుత్ర శోకం. వాటిని వదిలించుకో. దీనికి ఒక మార్గం వుంది. దత్తాత్రేయుడు తన భక్తులకి ప్రబోధించిన సప్తమీ స్నపనవ్రతాన్ని మీారు ఆచరించండి. కల్మషాలు తొలగిపోతాయి. మీకోరికలు తీరతాయి. ఈ వ్రతవిధానం తెలిసినవాడు కర్మసాక్షి - సూర్య భగవానుడు కనుక ముందుగా అతణ్ని అర్చించి ప్రసన్నుణ్ని చేసుకోండి. ఇక క్షణం కూడా వృధాచేయకండి. వెళ్ళిరండి శుభమగు గాక - అని ఆశీర్వదించి పంపించాడు.

కృతవీర్యుడు ఉపవాసదీక్షతో వేదమంత్రాలతో నెలనాళ్ళూ సూర్యుణ్ని అత్యద్భుతంగా ఆరాధించాడు. దానికి సంతుష్టుడై సహస్రకిరణుడు ప్రత్యక్షమయ్యాడు. సప్తమీస్నపనవ్రతాన్ని ఉపదేశించాడు. రాజా ! ఈ వ్రతాన్ని ఆచరిస్తే శిశుమరణాలు అంతరిస్తాయి. వ్యాధిపీడలు తొలగుతాయి. అన్ని వయస్సులవారికీ ఆరోగ్యం బాగుపడుతుంది. ఇది నీ చింతలను తొలగిస్తుంది. వ్రత విధానం చెబుతున్నాను శ్రద్ధగా గ్రహించు.

మృతవత్స అయిన ఇల్లాలు మళ్ళీ గర్భందాల్చాక ఏడోనెల రాగానే గ్రహతారాబలాదులు సరిచూసి ఒక శుభముహూర్తం నిశ్చయించుకోవాలి. ఆ పూట దంపతులు ఉదయాన్నే లేచి స్నానం చేసి పురోహితులచేత పుణ్యాహవచనం చేయించుకోవాలి. పేడతో అలికి ముగ్గులు పెట్టిన మండపంలో అగ్నిహోత్రుణ్ని స్థాపించాలి. బియ్యం రక్తశాలేయాలూ ఆవుపాలతో కలిపి చరువులు తయారుచేసుకోవాలి. వాటిని సూర్య - రుద్ర - సప్త మాతృకా గణాలకు ఆహుతి చెయ్యాలి. సౌరసూక్తాలతో సూర్యదేవునికి ప్రత్యేక హోమాలు చేయాలి. జిల్లేడు లేదా మోదుగ సమిధలనే హోమాలకు ఉపయోగించాలి. యవలూ, నల్లనువ్వులతో అష్టోత్తర శతంగా ఈ హోమాలు సాగాలి.

ఏడు కలశాలను గంగాజలంతో నింపాలి. ఆ కలశాలను మండపంలో నాల్గు కోణాల్లో నాల్గు, తూర్పున ఒకటి, పడమట ఒకటి, మధ్యలో ఒకటి ఉంచాలి. మంచి గంధంతో పరిమళ భరిత పూలతో దర్భలతో కలశారాధన చెయ్యాలి. ఏడుకలశాలని ఏడు అద్దాలతో కప్పాలి. సప్తర్షుల్ని వీటిలోకి ఆహ్వానించి ఆవాహన చెయ్యాలి. తూర్పు - పడమర కలశాల్లోకి సూర్యచంద్రుల్ని అభిమంత్రించాలి. ఓషధీ సూక్తాలు పఠించాలి. పంచప్రకార జలన్వితాలు చెయ్యాలి. పంచరత్నాలతో పంచపల్లవాలతో అలంకరించాలి. శుద్ధి చేసిన మట్టి తెచ్చి ఏడుకలశాల్లోనూ వెయ్యాలి. రత్నాలు వేసిన అయిదు కలశాల నుండీ మధ్యమ కలశాన్ని పురోహితుడు సూర్యమంత్రాలు ఉచ్చరిస్తూ వుండగా పైకి తీయాలి. భోజనాలు చేసి నూతన వస్త్రాలూ ఆభరణాలూ ధరించిన ఏడుగురు దంపతులూ (సంతానం కలవారై వుండాలి) ఆ కలశాన్ని అందుకొని మండలాకారంగా నిలబడిముందుకు ఒకింతవంగి అందులోని నీళ్ళుపంపుతూ మృతవత్స (ఇప్పుడు ఏడోనెల గర్భిణి) అయిన ఆ యజమానురాలిని ఏకధారగా అభిషేకించాలి. గర్భస్థ శిశువుకు దీర్ఘాయుష్యాన్ని గర్భిణీకి జీవత్పుత్రతనూ ఆకాంక్షించి ఆశీర్వదించాలి. నవగ్రహాలు అష్ట దిక్పాలకులూ హరిహర హిరణ్య గర్భులూ శిశువును రక్షించాలనీ దుష్టగ్రహాలు తల్లీ బిడ్డలను పీడించక తొలగిపోవాలనీ దీవించాలి. అటుపైన యజమానదంపతులు ఈ ఏడుగురు దంపతుల్నీ షోడశోపచారములతో అర్చించాలి. గణేశుడ్నీ కుమారస్వామినీ అర్చించి బంగారంతో ధర్మరాజు ప్రతిమ చేయించి దాన్ని తిలపాత్రమీద ఉంచి గురువుకి దానం ఇవ్వాలి. విత్తలోభము సుతారమూ పనికిరాదు. భూరిదక్షిణలతో, నూతన వస్త్రాలతో, విందు భోజనాలతో బ్రాహ్మణులనూ. బంధుమిత్రులనూ, సంతృప్తి పరచాలి. అయ్యింతరువాత గురువు ఇలా ఆశీర్వదించాలి - బాలుడు సుఖంగా నూరేళ్ళు జీవించుగాక ! ఇంకా ఏమైనా దురిత శేషముంటే అది బడడబాముఖంలో పడిపోవుగాక.

బ్రహ్మ - రుద్ర - విష్ణు - స్కంద - వాయు - శక్ర - వహ్ని ప్రభృతులు అందరూ దుష్టగ్రహాల నుండి మాతాశిశువుల్ని రక్షిస్తూ సకల శుభాలు కలిగింతురుగాక. ఇలాంటి శుభాశీస్సులు అందించాలి.

ఆశీర్వదించిన గురువుకి ప్రణమిల్లి కపిలగోవును బహూకరించాలి. ఇది యథాశక్తిగా చెయ్యవచ్చు. ఆపైన సూర్యుడికి

శివునికి నమస్కరించి ఆ గర్భిణి హుతాశేషమైన చరువును భుజించాలి. ఈ వ్రతాన్ని శుక్లపక్షం సప్తమీ తిథినాడు చేస్తే చాలా మంచిది. దీన్ని శ్రద్ధగా ఆచరించండి అని ఉపదేశించి సూర్యభగవానుడు వెళ్ళిపోయాడు.

ధర్మజా! కృతవీర్య దంపతులు ఈ వ్రతాన్ని చేసినందువల్లనే వీరి కుమారుడు కార్తవీర్యార్జునుడు దీర్ఘాయుష్మంతుడై ఎనభై అయిదువేల సంవత్సరాలు భూగోళాన్ని పరిపాలించగలిగాడు.

భాస్కరుణ్ని ఆరోగ్యం కోరాలి. అగ్నిని ధనం కోరాలి. శంకరుణ్ని జ్ఞానం కోరాలి. జనార్ధనుణ్ని సద్గతి కోరాలి అని పెద్దలు చెబుతున్నారు. ఈ సప్తమీస్నపనవ్రతాన్ని ఏకాగ్రచిత్తంతో పఠించినవారూ, విన్నవారు, సకల శుభా భీష్ట సిద్ధులూ పొందుతారు. అని మహర్షుల వాక్కు.

ధర్మరాజా కృతవీర్యుని ధర్మపత్ని శీలధర కూడా కొన్ని ప్రత్యేక నోములూ, వ్రతాలూ చేసింది. ఒక రోజు యాజ్ఞవల్క్య మహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఋషిపత్ని అయిన మైత్రేయిని దర్శించింది. కుశల ప్రశ్నల అనంతరం తన మనోవేదనను చెప్పుకుంది. గుణవంతుడు, వంశాన్ని నిలబెట్టే సత్పుత్రుడు కలిగేందుకు ఏదైనా నోమో, వ్రతమో ఉపదేశించమని అభ్యర్థించింది. అప్పుడు మైత్రేయి ఆమెను ఓదార్చి ఇలా చెప్పింది.

## అనంతవ్రతం

శీలధరా! కోరికలు తీరాలంటే జనార్ధనుణ్ని ఆరాధించటం ఒక్కటే మార్గం. అనంతవ్రతం అని ఒకటుంది చెబుతాను విను. మార్గశీర్షమాసంలో మృగశిరా నక్షత్రం ఉన్నరోజున ఉదయాన్నే లేచి స్నానాదికం ముగించుకుని గోమూత్రం కాసింత పుచ్చుకుని పగలంతా ఉపవాసం ఉండి సాయంత్రం ఈ వ్రతం చెయ్యాలి. ముందుగా అనంతుడి వామపాదాన్ని పూలతో గంధాక్షతలతో యధాశక్తిగా పూజించాలి. అనంతుడు సర్వవాంఛాప్రదుడు. అనంత ఫలదాయకుడు. నాకు ఈ జన్మలోనూ రాబోయే జన్మల్లోనూ భద్రప్రదుడు అగుగాక. నేను చేస్తున్న ఈ అనంతవ్రతంలో సంతుష్టుడై నీ పూజలకూ అర్చనలకూ సంబరపడి అనంతుడు నాకు అనంత పుణ్యోపచయాన్ని సమకూర్చుగాక- అని సంకల్పించుకొని ఏకాగ్ర చిత్తంతో అనంతుణ్ని ధ్యానించి సాష్టాంగ నమస్కారం చెయ్యాలి. అలాగే పురోహితుడికి నమస్కరించి దక్షిణ తాంబూలాలు అందించాలి. రాత్రికి తైలవర్జితమైన ఆహారం తీసికోవాలి.

తరువాత పుష్యమాసంలో పుష్యమినక్షత్రం ఉన్న రోజున ఇలాగే పగలంతా ఉపవాసం ఉండి సాయంకాలం అనంతుడి వామ కటిభాగాన్ని అర్చించాలి. అప్పటిలాగానే సర్వవాంఛాప్రదుడవుకమ్మనీ జన్మ జన్మలకీ భద్ర దాయకుడువు కమ్మనీ అనంత పుణ్యోపచయాన్ని సమకూర్చమనీ అభ్యర్థించాలి. పురోహితుణ్ని దక్షిణ తాంబూలాలతో సత్కరించి పంపాలి.

ఇదే ప్రకారంగా మాఘమాసంలో మఘా నక్షత్రం ఉన్న రోజున అనంతుడి వామ వక్షభాగాన్నీ పాల్గుణంలో ఫల్గుణీ నక్షత్రం ఉన్న రోజున వామస్కందాన్ని యధావిధిగా గంధ పుష్పాదులతో పూజించి విప్రుణ్ని దక్షిణ తాంబూలాదులతో సత్కరించి రాత్రికి తైలవర్జితంగా భుజించాలి. ఈ నాలుగు నెలలూ బ్రాహ్మణులకి యవలు దానమివ్వాలి. ఇలాగే ప్రాతః స్నానం గోమూత్ర ప్రాశనాలతో ప్రారంభించి చైత్రంలో దక్షిణ కటిభాగాన్ని వైశాఖంలో దక్షిణపాదాన్ని జ్యేష్టమాసంలో మొత్తం కటినీ అర్చించాలి. ఆషాడంలో పాదపూజ చెయ్యాలి. శ్రావణంలో పాదద్వయార్చన

చెయ్యాలి. పురోహితుడికి ఘృతదానమివ్వాలి. రాత్రికి తైలవర్జితంగా భోజనం. ఈ శ్రావణ భాద్రపదాశ్వయుజ కార్తీక మాసాల్లో ఆయా నక్షత్రాలున్న రోజుల్లో ప్రాతః స్నాన ఘృత ప్రాశన ఘృతదానాలు చెయ్యాలి. భాద్రపదంలో పూర్వాభాద్రా నక్షత్రం ఉన్న రోజున గుహ్యాన్ని ఆశ్వయుజంలో అశ్వనీ నక్షత్రం ఉన్న రోజున హృదయాన్ని, కార్తీకంలో కృత్తికా నక్షత్రం వున్న రోజున శిరస్సునూ అర్చించాలి. స్నాన, ప్రాశన, అర్చన, దానాలు ప్రతినెలా నియమనిష్టలతో జరగాలి. నక్తాలతో హవిష్యాన్నం భుజించాలి. ఇది ప్రశస్తం. నాలుగు నెలలకొకసారి బ్రాహ్మణ సంతర్పణలు జరపాలి. దీన్ని పారణత్రితయం అంటారు. ఈ వ్రత దీక్ష నడుస్తున్నపుడు తుమ్ములు వచ్చినా ప్రస్ఖలనాదులు జరిగినా అనంతుడి నామాలను జపించాలి. ఇది సంవత్సర కాలవ్రతం దీనికి ఒక ప్రత్యేకమైన ఉద్యాపన కూడా వుంది.

బంగారంతో అనంతుడి ప్రతిమ చేయించాలి. వెండితో రోకలి నాగలి చేయించాలి. ఈ రెంటిని ఆప్రతిమకు చెరొక వైపునా ఉంచాలి. షోడశోపచార పూజ చెయ్యాలి. అనంత ప్రతిమకు తలపాగా చుట్టాలి. పూలదండలు అలంకరించాలి. గొడుగుపాదుకలూ అమర్చాలి. భక్తితో ఇలా అంగపూజ జరపాలి.

అనంతుడికి నమస్కారమని శిరస్సునూ, సర్వాత్ముడికి నమస్కారమని పాదాలను, శేషుడికి నమస్కారమని జామాయుగళాన్ని, కాముడికి నమస్కారమని కటిని, వాసుదేవుడికి నమస్కారమని పార్శ్వాలనూ, సంకర్షణుడుకి నమస్కారమని ఊరు యుగళాన్ని, వస్త్రధారికి నమస్కారమని భుజాలను, శ్రీకంఠనాధుడికి నమస్కారమని కంఠాన్ని, విశ్వముఖుడుకి నమస్కారమని ముఖాన్ని, ఇలాగే నా నామధేయాలతో (శ్రీకృష్ణుడు ధర్మరాజుకు చెబుతున్న కథ) హల ముసలాలనూ అర్చించాలి. తరువాత నక్షత్ర దేవతా పూజలు చెయ్యాలి. చంద్రుణ్ని పూజించాలి. ఆకాశ జలంతో నింపి బంగారం వేసి పన్నెండు ఘటాలు నింపి మాస - సంత్సరాది దేవతలను ఆవాహన చేసి యధావిధిగా అర్చించాలి. కడపటి - వేద పురాణవేత్తయై జితేంద్రియుడై శాంత స్వభావుడైన పురోహితుడికి లేదా మరొక యోగ్యవిప్రుడికి ఈ సువర్ణానంత ప్రతిమనూ రజతహల ముసలాలనూ అనంతుడు సుప్రీతుండగుగాక అంటూ దానం చేసి దక్షిణ తాంబూలాలు నూతనవస్త్రాలు అందించాలి. తక్కిన బ్రాహ్మణులకు కూడా యధాశక్తి దక్షిణ తాంబూలాలు ఇచ్చి విందు భోజనాలతో సంతృప్తిపరచాలి. ధర్మజా! అప్పటికి ఈ వ్రతం సమాప్తమవుతుంది - అని మైత్రేయి శీలధరకు అనంతవ్రత విధానం ఉపదేశించింది. ఇది నిష్టగా చేస్తే సకల మనోరధాలూ నెరవేరతాయి. పుత్రార్ధులకు సత్సంతానం కలుగుతుంది. కళ్యాణార్దులకు కళ్యాణం జయార్ధులకు జయం ఆరోగ్యార్ధులకు ఆరోగ్యం ధనార్ధులకు ధనం సంపదార్ధులకు సంపదలూ- ఒకటేమిటి ఏదికోరుకుంటే అది లభిస్తుంది. ఈ అనంత వ్రతం పాపనాశకం, పుణ్యప్రదం, సుఖదాయకం. కనుక ఓ శీలధరా! దీన్ని ఆచరించు

సర్వలోక వరిష్ఠుడైన పుత్రుడు నీకు కలుగుతాడు. అని మైత్రేయి నిండు మనస్సుతో ఆశీర్వదించింది. శీల ధరరాజధానికి వెళ్ళి వెంటనే ఈ వ్రతం ఆచరించి సంవత్సరకాలం నిష్ఠగా జరిపింది. అనంతుడు సంతుష్టుడయ్యాడు. దిగంబర దత్తాత్రేయరూపంతో స్వప్నంలో సాక్షాత్కరించి నీకు సత్పుత్రుడు కలుగుతాడు. విఖ్యాతి పొందుతాడు. మహావీరుడై సప్తద్వీపావృత వసుంధరనంతటినీ పరిపాలిస్తాడు. యోగవిద్యాపారంగతుడు అవుతాడు అని వరమిచ్చి అంతర్ధానం చెందాడు.

శీలధరకు మెలకువ వచ్చింది. అన్నివైపులా చూసింది ఎవ్వరూ కనిపించలేదు. స్వప్నమని గ్రహించింది. ఆనందించింది. భర్తను నిద్రలేపింది. తన స్వప్నం వివరించింది. అతడూ సంబరపడ్డాడు. నీకల నిజమవుతుందని శుభాకాంక్షలు పలికాడు. అటుపైన కొంతకాలానికి ఒక సుముహూర్తాన శీలధరకు మగబిడ్డ జన్మించాడు. అప్పుడు శుభసూచకంగా చల్లని వాయువులు వీచాయి. ఆకాశం విశదమయ్యింది. జగత్తు అంతా మురిసిపోయింది. దేవదుందుభులు మ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది. దేవగంధర్వగీతాలు వినిపించాయి. అప్సరసల నాట్యాలు కనిపించాయి. లోకులందరికి ధర్మం పట్ల ఆసక్తి కలిగింది. కృతవీర్యుడి కుమారుడు కాబట్టి కార్తవీర్యార్జునుడయ్యాడు. ఈ బాలుడు తపస్సు చేసి సేవలు చేసి దత్తాత్రేయుణ్ని మెప్పించి అనుగ్రహపాత్రుడయ్యాడు. ఆ స్వామి సహస్ర బాహువులూ అనంతశక్తి యుక్తులూ సహస్రాయుధాలు శౌర్యపరాక్రమాలు, సమస్తమూ ఇచ్చి అతణ్ని చక్రవర్తిని చేశాడు. అంతేకాదు కార్తవీర్యనామస్మరణ చేస్తే చాలు సకల భయాలూ తొలగిపోయేటట్లు, నమోస్తు కార్తవీర్యాయ అంటూ తిలపాత్రదానం చేసిన వారికి సకల పుణ్యాలూ కలిగేట్లూ పోయిన వస్తువులు దొరికేటట్లూ దత్తదిగంబరుడు వరాలు ఇచ్చాడు. ఇలా మహిమాన్వితుడై ఆయుత సంవత్సరాలు భూగోళాన్ని ఏకచ్ఛత్రంగా పరిపాలించాడు. అంచేత ధర్మరాజా! ఈ అనంతవ్రతం మహత్మ్యం అంతటిది- అని శ్రీకృష్ణుడు అలనాడు ధర్మరాజుకి ఉపదేశించాడు. అది అంతా, దీపకా! నీకు నేను చెప్పాను. కార్తవీర్యుడి తల్లితండ్రుల కథ పుత్రుడి కోసం వారి పాట్లూ విన్నావు గదా! ఇంకా ఏమి కావాలి అన్నాడు వేదధర్ముడు.

## అనఘా వ్రతమహిమ

గురుదేవా! దత్తదేవుణ్ని గురించి ఇంకా తెలుసుకోవాలని ఉంది. ఏమిచెప్పాలో నువ్వే నిశ్చయించి ఎరుకపరుచు. ధర్మరాజు శ్రీకృష్ణుణ్ని ఇంక ఏమీ అడగలేదా? అడిగితే శ్రీకృష్ణుడు ఏమి చెప్పాడు? ఆరహస్యాలు తెలుసుకోవాలని ఉంది. కటాక్షించండి.

దీపకుడి అభ్యర్ధన వేదధర్ముడికి నచ్చింది. తాను చెబుదామనుకుంటున్నదే శిష్యుడు అడిగాడు. సంబరపడి ఇలా ఆరంభించాడు. నాయనా దీపకా! శ్రీకృష్ణుడు ధర్మరాజుకి చెప్పిన అనఘావ్రత మహిమను ఆలకించు.

ధర్మరాజా! అనసూ యాత్రి దంపతులకు విష్ణు అంశతో దత్తాత్రేయుడు జన్మించాడు. అతడి ప్రియురాలి పేరు అనఘాదేవి. లక్ష్మీదేవియే అనఘాదేవి. వీరికి ఎనిమిది మంది సంతానం. అష్టసిద్ధులే కుమారులుగా అవతరించాయి.

ఒకప్పుడు జంభాసురుడి ధాటికి తట్టుకోలేక ఇంద్రాది దేవతలందరూ అమరావతిని వదలి బ్రతుకు జీవుడా అని పలాయనం చిత్తగించారు. సహ్యాద్రి మీద తపస్సు చేసుకుంటున్న దత్తాత్రేయుణ్ని శరణు వేడారు. వారిని తరుముకుంటూ రాక్షసులూ వచ్చారు. దత్తాత్రేయుడు అనఘాదేవి సహితుడై యుక్తిగా ఆ రాక్షసులందర్ని సంహరింపజేసి దేవతలను కాపాడాడు. ఇంద్రుడికి సింహాసనం అప్పగించాడు.

ఈ దత్తయోగీంద్రుడు యోగమార్గం అవలంబించి వేల సంవత్సరాలు తపస్సు చేసాడు. కళ్ళు తెరచి భ్రూమధ్యస్థానంలో దృష్టి నిలిపి మూడు వేల దివ్య సంవత్సరాలు బ్రహ్మోత్తరమనే దివ్యతపస్సు చేసాడు. కాష్టంలాగా పర్వతశిలలాగా నిశ్చలంగా నిలబడి ఊర్ధ్వబాహువై తపస్సు సాగించాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

యోగదీక్షలో ఉన్న దత్తాత్రేయుణ్ని కార్తవీర్యార్జునుడు భక్తిశ్రద్ధలతో సేవించాడు. దత్తుడి హృదయం గెలుచుకున్నాడు. అనేక దివ్యవరాలు పొందాడు. దివ్యరథం, సహస్ర బాహువులు, సహస్రాయుధాలు ఒకటేమిటి ఇలా అనేక వరాలు పొందాడు. సప్త ద్వీపావృతమైన యావద్వసుంధరకూ ఏకైక చక్రవర్తి అయ్యాడు. ఎనభై అయిదు వేల సంవత్సరాలు పాలించాడు. భూరిదక్షిణలతో మహావైభవంగా అనేక యజ్ఞాలు చేసాడు. అతడి యజ్ఞవేదికలూ యూపస్థంభాలూ అన్నీ బంగారమే.

అతడి ఏలుబడిలో ప్రజలు అపూర్వసుఖాలు అనుభవించారు. ఏ కష్టం వచ్చి ఏ పౌరుడు తనను తలుచుకున్నా కార్తవీర్యార్జునుడు స్వయంగా ప్రత్యక్షమయ్యేవాడు. ఆదుకునేవాడు. ఒక్కసారిగా ఏడుదీవుల్లోనూ ఎక్కడైనా ఎవరికైనా స్మరిస్తే చాలు ప్రత్యక్షమయ్యేవాడు.

తానే పశువుల్ని కాసేవాడు. పర్జన్యుడై వర్షించేవాడు. ఇటువంటి అద్భుతశక్తులు అనేకం అతడికి అందించాడు దత్తస్వామి. యోగమార్గంలో కూడా నిష్ణాతుణ్ని చేసాడు. కర్కోటకుణ్ని తెచ్చి ఈ కార్తవీర్యుడు తన రాజధాని మాహిష్మతికి కావలిపెట్టాడు. ఒకనాడు ముచ్చటపడి అంతఃపురకాంతలతో జలకాలాడుతూ తన వెయ్యి బాహువులనూ సాచి నర్మదా నదీ ప్రవాహానికి అడ్డుకట్టవేశాడు. ప్రవాహాన్ని వెనుక దారి పట్టించాడు. సముద్రాన్ని ఒకసారి ఇలాగే అల్లకల్లోలం చేసాడు. ముల్లోకాలను గడగడలాడించిన దశకంఠుడ్ని అవలీలగా బంధించి కారాగారంలో పడేశాడు. ఆ తరువాత పులస్త్యబ్రహ్మ స్వయంగా వచ్చి కార్తవీర్యుణ్ని బ్రతిమాలి రావణున్ని విడిపించుకెళ్ళాడు.

ఒక పర్యాయం ఆకలిగొన్న విప్రునిరూపంలో చిత్రభానుడు అర్థిస్తే అతడికి యావద్భూగోళాన్ని బిక్షగా సమర్పించాడు ఈ కార్తవీర్యుడు. (మొత్తం భూగోళాన్ని అగ్నిబాణరూపంలో భక్షిస్తూంటే తాను చూస్తూ నిలబడ్డాడు. అప్పుడు వశిష్ట మహర్షి తన వేల సంవత్సరాల తపోదీక్ష నుండి జలసమాధి నుండి ఇవతలకి వచ్చి పరిస్థితి గమనించి కార్తవీర్యార్జునుణ్ని శపించాడు. బ్రాహ్మణ బాలుడైన భార్గవరాముని చేతిలో సంహరింపబడతావన్నాడు. దత్తాత్రేయుడి నుండి తానువరంగా పొందిన మరణ విధానమూ ఈ శాపమూ సంపాదించటంతో కార్తవీర్యుడు సంబరపడ్డాడేకానీ దిగులు చెందలేదు.)

ఇంతటి మహామహిమాన్వితమైన మహాయోగి కార్తవీర్యార్జునుడు దత్తయోగీశ్వరుని దయవల్ల మర్త్య లోకంలో ప్రవేశపెట్టిన ప్రసిద్ధ మహావ్రతం - ఈ అనఘాష్టమీవ్రతం.

అఘము అంటే పాపం. అది మనోవాక్కాయకర్మలుగా మూడు విధాలు. దాన్ని నాశనం చేస్తుంది కనుక ఇది అనఘవ్రతం. అనఘుడు అంటే దత్తాత్రేయుడు. అనఘా అంటే లక్ష్మీదేవి అనఘుడు ఉపదేసించింది కాబట్టి అది అనఘవ్రతం. అనఘాదేవిని ఆరాధించేది కాబట్టి అనఘావ్రతం ఇలా దీనికి మూడు విధాలుగా సార్థక్యం వచ్చింది.

ఏ తిధినాడు ఏ సమయంలో ఎలా ఈ వ్రతం ఆచరించాలో తెలియజెప్పమని ధర్మరాజు అడిగిన మీదట కృష్ణుడు ఇలా చెప్పాడు.

మార్గశిరమాసం కృష్ణపక్షం అష్టమీ తిధినాడు ఈ వ్రతం చెయ్యాలి. దర్భలతో అనఘుణ్నీ అనఘాదేవినీ వారి అష్టపుత్రుల్ని ప్రతికృతులు చెయ్యాలి. మండపంలో నెలకొల్పాలి. వ్రతకర్త ఉదయమే లేచి స్నానసంధ్యాధికం ముగించుకుని

తోరం కట్టుకుని వ్రతదీక్ష స్వీకరించాలి. భక్తిప్రపత్తులతో ఈ దర్భాకృతులకు షోడశోపచారాలు చెయ్యాలి. ఋగ్వేదోక్త మంత్రాలతో అనఘుడైన విష్ణుమూర్తినీ అనఘయైన లక్ష్మీదేవినీ ధ్యానించాలి. స్తుతించాలి. హరివంశ సంభవులైన ప్రద్యుమ్నాది పుత్రవర్గంగా అష్టపుత్రుల్నీ భావించాలి.

ఆ ఋతువులో దొరికే కంద మూలఫలాలనూ సుగంధపరిమళభరితమైన పుష్పాలనూ వినియోగించాలి. ధూప దీపనైవేద్యాలు సమర్పించాలి. ఆపైన బంధుమిత్ర పరివారానికీ బ్రాహ్మణులకూ సమారాధన జరపాలి. మరొకడు ఈ వ్రతాన్ని స్వీకరించేటట్టు చేసి అప్పుడు వ్రతసమాప్తి పలకాలి.

అష్టమి నాటి రాత్రి నట, నర్తక, గాయకుల హరికథా సంకీర్తనంతో భజనలతో జాగరణం చెయ్యాలి. నవమి నాటి ఉదయం అనఘస్వామికి పునఃపూజ చేసి నైవేద్యం పెట్టి ఉద్వాసన చెప్పాలి. ఆపైన ఆదర్భాకుతుల్నీ పత్ర పుష్పాది నిర్మాల్యాన్ని భద్రంగా తీసికెళ్ళి నదిలోగానీ, చెరువులోగానీ, బావిలోగానీ నిమజ్జనం చెయ్యాలి. ఇలా ప్రతి సంవత్సరమూ భక్తిశ్రద్ధలతో ఈ వ్రతాన్ని బ్రతికున్నంతకాలమూ చేస్తే వారికి విష్ణుమూర్తి ప్రసన్నుడవుతాడు. కుటుంబం అన్నింటా అభివృద్ధి సాధిస్తుంది. ఆయురారోగ్యైశ్వర్య భోగభాగ్యాలు లభిస్తాయి. ఏడుతరాలు తరిస్తాయి. పాండవాగ్రజా! నువ్వు కూడా ఈ వ్రతం ఆచరించు. కార్తవీర్యార్జునుడు అంతటివాడివి అవుతావు - అని శ్రీకృష్ణుడు శుభాకాంక్ష పలికి ముగించాడు.

దీపకా! ఇదీ దత్తదేవుడి కధాకధనం. జంభ దైత్య పరాజితులైన దేవతల్ని దత్తదేవుడు రక్షించటం, అతడి అనఘత్వం, యోగచర్య, భక్తుడైన కార్తవీర్యయోగికి చేసిన వరదానం, ఈ అనఘతోషణ వ్రతం. ఇలా అన్నీ చెప్పాను. ఇంకా ఏమి వినాలని అనుకుంటున్నావో నిరభ్యంతరంగా అడుగు చెబుతాను. హాయిగా విందువుగాని- అని ముగించాడు వేదధర్ముడు.

గురూత్తమా! నాదొక చిలిపి సందేహం. మీరు బ్రహ్మాండాది బహుపురాణవేత్తలు కనుక కోపగించుకోకుండా చెబుతారని అడుగుతున్నాను. దత్తాత్రేయుణ్ని మహర్షి అంటున్నారు. విష్ణుమూర్తి అవతారం అంటున్నారు. యోగులకు యోగి అంటున్నారు. వీటన్నింటికీ ఏమైనా పురాణకాలంలో ఆధారాలు వున్నాయా? అనేది నా సందేహం. నువ్వు దీనవత్సలుడివి. దయచేసి నా సందేహం తీర్చు.

## దత్తుడు విష్ణువే

**దీపకా! మంచి ప్రశ్నవేశావు. దీనికి తత్త్వదీపన దీపకంగా నేను చెప్పే సమాధానం అత్యంత శ్రద్ధగా ఆలకించు. దత్తుడు- నిశ్చవనుడు- స్తంభుడు- ప్రాణుడు- కశ్యపుడు- ఔర్యుడు- బృహస్పతి- అనే ఏడుగుర్నీ మత్స్యపురాణం మహర్షులుగా పేర్కొంది. జేర్వుడు- వశిష్టపుత్రుడు- స్తంభుడు- కశ్యపుడు- ప్రాణుడు- బృహస్పతి- దత్తుడు- నిశ్చవనుడు అనే ఏడుగుర్నీ మహర్షులు అంటోంది వాయుపురాణం. స్వారోచిషమన్వంతరంలో వీరి పేర్లు వినిపిస్తే దేవతలు సైతం సంబరపడేవారట. ఇది దత్తాత్రేయుని మహర్షిత్వానికి పౌరాణిక నిదర్శనం.**

**ఇంక అవతార విషయకంగా ప్రమాణం చూపుతున్నాను. ఆలకించు. మత్స్యపురాణంలో నారద మహర్షికి ప్రమథగణ ప్రథముడైన నందీశ్వరుడు విభూతిద్వాదశీ వ్రతం గురించి వివరిస్తూ ప్రతిమాసమూర్తి భేధన పూజగా విష్ణుమూర్తికి**

**ద్వాదశ అవతారాలను చెప్పాడు. దత్తాత్రేయుణ్నీ ముసల సమన్వితుడైన వ్యాసుణ్నీ అదనపు అవతారాలుగా పరిగణించి నెలకొక్కరుగా పన్నెండుమందినీ పన్నెండు నెలలూ ఆరాధించాలనీ విభూతి ద్వాదశీ వ్రతం సారాంశం ఉపదేశించాడు.**

**శ్రీమద్భాగవతం ఏకాదశ స్కందంనాల్గో అధ్యాయంలో నిమి చక్రవర్తికి ద్రుమిళుడు విష్ణుమూర్తి మహిమలను చెబుతూ జగత్కల్యాణం కోసం అతడు హంస-దత్త-సనత్కుమార-ఋషభాద్యవతారాలు ధరించాడని పలికాడు. ఇదే భాగవతంలో షష్ఠస్కందం అష్టమాధ్యాయంలో నారాయణకవచం చెప్పబడింది. ఉగ్రధన్వుడైన నారాయణుడు నన్ను అఖిల ప్రమాదాల నుండి కాపాడుగాక, హాసం నుండి నరుడు రక్షించుగాక, యోగనాథుడైన దత్తాత్రేయుడు అయోగం నుండి బ్రోచుగాక, కపిలుడైన గణేషుడు కర్మబంధం నుండి తప్పించుగాక..... ఇలా సాగుతుంది ఆ కవచం దీన్ని బట్టి నారాయణాంశ సంభవుడు దత్తాత్రేయుడు అని స్పష్టమవుతుంది.**

**షష్ఠస్కందం పంచాదశాధ్యాయంలో చిత్రకేతుడు తనకు కనిపించిన ఒక మహామునిని స్వామి! తమరెవరు? లోమశుడు - చ్యవనుడు - దత్తుడు - ఆసురి - పతంజలి మొదలైన మహానుభావుల్లో ఎవరు మీరు? - అని ప్రశ్నిస్తాడు. హరివంశంలో కూడా మరొక దాఖలా ఉంది. విష్ణుమూర్తి దత్తాత్రేయుడై అవతరించాడనీ వేదాలూ వర్ణాశ్రమధర్మాల యజ్ఞయాగాలూ అడుగంటిపోతే, వాటిని ఉద్ధరించాడనీ - కార్తవీర్యుడికి సహస్ర బాహువులూ - అధర్మ నివారణ - పృధివీ విజయం - సంగ్రామంలో అధికుడి చేతిలో మరణం - అనే నాలుగు వరాలూ ఇచ్చి భూగోళాన్ని ధర్మబద్ధంగా ఏలించాడనీ అతడికి అంకితం అయితే రెండు చేతులు వెయ్యి చేతులు అవుతాయనే వైశంపాయనుడు స్వయంగా ప్రశంసించాడు హరివంశంలో.**

దీపకా! తెలిసింది కదా దత్తాత్రేయుడి మహర్షిత్వమూ అవతారత్వమూనూ. అంచేత చిలిపి సందేహాలన్నీ వదిలేసి బుద్ధిగా దత్తదేవుణ్ని ఆరాధించు- అన్నాడు వేదధర్ముడు.

గురూత్తమా! నిజంగా ఇది నాకు కలిగిన సందేహం కాదు. ఇలాంటి విపరీతబుద్ధులు భావి కాలాల్లో ఆవిర్భవిస్తారనీ పెడసరం ప్రశ్నలు వేస్తారనీ ఊహించి ముందుగానే సర్వజ్ఞులైన మీతో ఇలా సమాధానాలు రాబట్టుకుని లోకానికి తెలుపుడయ్యేట్లు చేశాను. లేకపోతే రేపటి ముందు ముందు కాలాల్లో ఈ ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోవచ్చు. సరే గురుదేవా! దయానిధీ! నీ ముఖ పద్మం నుండి జాలువారే ఈ కథా మకరందం జన్మ జరావ్యాధి మృత్యునివారకం. ఇంతటి అదృష్టానికి నోచుకున్నందుకు నా జన్మచరితార్థం. కార్తవీర్యుడి గురించి సమగ్రంగా తెలియజెప్పారు. అంతటివాణ్ని అవలీలగా జయించిన భార్గవరాముని గురించి కూడా ఇంకా ఇంకా తెలుసుకోవాలని ఉంది. అనుగ్రహించండి.

నాయనా దీపకా! నేను చెబుదామని అనుకుంటున్నదే నువ్వు అడిగావు. భారతంలో వ్యాసమునీంద్రుడు రచించిన భార్గవ రామచరిత్రను కుప్లంగా చెబుతాను ఆలకించు - అని వేదధర్ముడు ఇలా చెప్పనారంభించాడు.

# భార్గవరాముని చరిత్ర

మాయాద్యూతంలో సర్వస్వాన్నీ కోల్పోయిన ధర్మరాజు అనుద్యూతంకూడా ఆడి కట్టుబట్టలతో తమ్ములతో ధర్మపత్నితో వనవాసానికి బయలుదేరాడు. మరికొందరు హితులూ, సన్నిహితులూ, మునులు వారి వెంట నడిచారు. అరణ్యాలలో పుణ్యక్షేత్రాలను సందర్శిస్తూ పుణ్యతీర్థాలలో స్నానాలు చేస్తూ ఆశ్రమవాసులకు నమస్కరించి దీవెనలు పొందుతూ వనవాసం గడుపుతున్నారు. కొంతకాలానికి మహేంద్ర పర్వతంమీద భార్గవరాముని ఆశ్రమం చేరుకున్నారు. పాండవులు అక్కడి పుణ్యతీర్థాలలో పవిత్ర స్నానాలు చేసి దేవర్షి పితృతర్పణ విధులు నిర్వహించారు. రోమశమహర్షి మార్గదర్శకత్వంలో అక్కడి ఆశ్రమాలనూ అక్కడి ఋషులను సందర్శించారు, ఆశీస్సులు పొందారు. భృగు - అంగిరస - వాసిష్ఠ - కాశ్యప - అకృతవ్రణాది మహర్షుల్ని దర్శించి సంబరపడిన ధర్మరాజు - భార్గవరాముని ఆశ్రమమైతే కనిపించింది కానీ ఆ మహర్షి దర్శన భాగ్యం లభించలేదు. ఈ జన్మకి నాకు ఆ అదృష్టం ఎప్పుడో - అని తన అభిలాషను ఆ మహర్షులముందు ప్రకటించాడు. అది విన్న అకృత వ్రణుడు - ధర్మజా ! మీ రాక భార్గవరామునికి ముందే తెలుసు. మీరంటే చాలా ఇష్టం, కనక దర్శనం ఇస్తాడు. సాధారణంగా అష్టమికీ చతుర్దశికీ ఈ ఆశ్రమానికి వస్తాడు. ఈ రాత్రి గడిస్తే రేపు చతుర్థశి. కాబట్టి మీరిక్కడ ఉండగలిగితే రేపే భార్గవరాముణ్ని సందర్శించవచ్చు - అన్నాడు. దీనికి సంబరపడి ధర్మజాదులందరూ ఆ రాత్రికి అక్కడే ఆగిపోయారు.

అతిథి మర్యాదలన్నీ అయ్యి అందరూ తీరికూర్చున్నాక ధర్మరాజు మెల్లగా భార్గవరాముని ప్రస్తావన తెచ్చాడు. అకృతివ్రణా ! నువు భార్గవరాముని అనుచరుడివి. ఆ మహాబలపరాక్రమశాలి చేసిన ప్రతి పనికీ నువ్వు ప్రత్యక్ష సాక్షివి. అంచేత భార్గవరాముని పూర్వ వృత్తాంతంలో నీకు తెలియనిదిలేదు. ఆ మహానుభావుడు ముయ్యేడుమార్లు మా క్షత్రియులందరినీ ఏ ప్రకారంగా జయించాడు ? ఏ కారణంగా జయించాడు ? ఈ వివరాలు యథాతథంగా వాస్తవరూపంలో తెలుసుకోవాలని నా కోరిక. అందుకు నువ్వొక్కడివే సమర్థుడివి దయచేసి నన్ను కృతార్థుణ్ని చెయ్యి - అని అభ్యర్థించాడు.

ధర్మ సంభవా ! భృగువంశంలో జమదగ్ని కుమారుడుగా పుట్టి భార్గవరాముడు - జామదగ్నుడు అనే పేరు పొంది అతి వజ్రాయుధమైన గండ్రగొడ్డలిని ధరించి పరశురాముడై మహావీరుడుగా విఖ్యాతిపొందిన ఆ మహానుభావుడి చరిత్ర చెబుతాను ఆలకించు.

హైహయవంశంలో పుట్టిన కార్తవీర్యార్జునుడు భార్గవ రాముని చేతిలో నిహతుడయ్యాడు. అతడికి వెయ్యి చేతులుండేవి. దత్తాత్రేయ ప్రసాదంవల్ల దివ్యకాంచన విమానం ఉండేది. అతడి రథమూ అటువంటిదే. దాని గమనానికి అడ్డూ ఆపూ లేదు. ఆ రథం అధిరోహించి సమస్త భూపాలకుల్నీ ఓడించి సామంతుల్ని చేసుకున్నాడు. ఏడు ద్వీపాల వసుంధరను మొత్తం తన ఏలుబడిలోకి తెచ్చుకున్నాడు. అహంకరించి దేవతలను యక్షులనూ ఋషులనూ సమస్త భూతాలను పీడించసాగాడు. భరించలేక దేవతలూ ఋషులూ కలిసివెళ్ళి విష్ణుమూర్తికి మొరపెట్టుకున్నారు. కార్తవీర్యుణ్ని సంహరించు, మమ్మల్ని రక్షించు అని వేడుకున్నారు. ఇంద్రుడు కూడా తన చేదు అనుభవం ఒకటి చెప్పాడు. శచీ సమేతుడై నందనంలో విహరిస్తున్న తనను దివ్యవిమానంమీద అటువైపు వచ్చిన కార్తవీర్యార్జునుడు అవమానించాడనీ, అతడి ఆగడాలు మితిమీరిపోయాననీ ఇక ఉపేక్షింపరాదనీ విన్నవించాడు. విష్ణుమూర్తి అందరి వేదనలూ విన్నాడు. ఆలోచిస్తాను వెళ్ళిరండి - అని పంపించాడు. తాను బయలుదేరి తన బదరికావనం చేరుకున్నాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ఇదేకాలంలో కాన్యకుబ్జాన్ని గాధి అని ఒక మహారాజు పాలిస్తున్నాడు. అతడు మహాబలశాలి. పరాక్రమశాలి. పరిపాలన బాధ్యతల్ని మంత్రులకి అప్పగించి అతడు కొంతకాలం సతీసమేతుడై వనవాసం చేశాడు. ఆ సమయంలో ఆ రాజదంపతులకి ఒక ఆడపిల్ల పుట్టింది. సత్యవతి అని పేరుపెట్టారు. దినదిన ప్రవర్థమాన అయ్యింది. అప్సరసలను తలదన్నే సౌందర్యం. అందానికి తగిన గుణసంపద, భార్గవ వంశంలో పుట్టిన ఋచీకుడు సత్యవతిని చూసి ముచ్చటపడ్డాడు. తనకిచ్చి వివాహం చెయ్యమని గాధిదంపతుల్ని అభ్యర్థించాడు. సంశిత వ్రతుడైన ఆ బ్రాహ్మణుణ్ని చూసి తన కులాచారం వెల్లడించాడు గాధి. శరీరమంతా తెల్లగా ఉండి ఒక్క చెవి నల్లగా ఉండే వెయ్యిగుర్రాలు కన్యాశుల్కంగా ఇచ్చి సత్యవతిని పరిణయమాడమన్నాడు. శుల్కం తీసుకోకుండా కన్యాదానం చెయ్యడం మా కులాచారం కాదని చెప్పి కాన్యకుబ్జానికి వెళ్ళిపోయాడు.

ఋచీకుడు వరుణుణ్ని అడిగి అటువంటి వెయ్యిగుర్రాలూ పొందాడు. అవ్వి కాన్యకుబ్జం చెంత గంగనుంచి పైకి వచ్చాయి. అప్పటి నుంచీ ఆ రేవుకి అశ్వతీర్థమనే పేరు స్థిరపడింది. ఆ గుర్రాలని గాధికి అందించి ఋచీకుడు సత్యవతిని అగ్నిసాక్షిగా సొంతం చేసుకున్నాడు. కాన్యకుబ్జంలోనే ఉండి రాజభోగాల్లో శృంగారక్రీడల్లో మునిగితేలుతున్నాడు. ఇలా ఉండగా ఒకరోజున ఋచీకుడి తండ్రి భృగువు వచ్చాడు. కొడుకునీ కోడల్నీ వారి అన్యోన్యదాపంత్యాన్ని చూసి సంతోషించాడు. కోడలు చేస్తున్న ఉపచారాలకి సంబరపడ్డాడు. భృగువును ఉన్నతాసనం మీద అర్చించి ఆ దంపతులు వినయంగా అతడికి చేరువులో నేలమీద కూర్చున్నారు.

సత్యవతీ ! నీ గుణగణాలకు సంతోషించాను. ఏదైన వరం కోరుకో, ఇస్తాను - అన్నాడు భృగువు. తనకూ తన తల్లికీ పుత్రసంతానం కలిగేట్టు వరమిమ్మంది సత్యవతి. భృగువు తథాస్తు! అన్నాడు. ఋతుస్నాతవై నువ్వు మేడిచెట్టును కౌగిలించుకో. ఇదిగో ఈ హవిస్సును (చరువు) భుజించు. అలాగే నీ తల్లి రావిచెట్టును కౌగిలించుకోవాలి. ఈ చరువును ఆరగించాలి భద్రంగా పట్టుకు వెళ్ళి దీన్ని మీ తల్లికి అందించు - అని చెప్పి రెండు చరువులూ కోడలికి ఇచ్చాడు. తన దారిన తాను వెళ్ళిపోయాడు. తల్లీ కూతుళ్ళు తాము కౌగలించుకోవలసిన తరువులనూ భుజించవలసిన చరువులనూ పొరపాటున తారుమారు చేసుకున్నారు. దీన్ని గమనించిన భృగువు మళ్ళీ వచ్చి జరిగిన పొరపాటుని కోడలికి తెలియజెప్పాడు. ఇందువల్ల - నీకు పుట్టే బ్రాహ్మణుడు క్షత్రియాచారపరుడవుతాడు. నీ తల్లికి జన్మించే క్షత్రియుడు బ్రాహ్మణాచారపరుడవుతాడు. ఇంతకన్నా ప్రమాదం ఏమీలేదులే అని కోడల్ని ఓదార్చాడు. అయితే ఇది సత్యవతికి నచ్చలేదు. తన కొడుకు బ్రాహ్మణాచారపరుడే కావాలని క్షత్రియాచారాన్ని తరువాత తరానికి అంటే మనుమడికి సంక్రమించేట్టు చెయ్యమనీ అభ్యర్థించింది. తథాస్తు! అన్నాడు భృగుమహర్షి.

కొంతకాలానికి సత్యవతి గర్భం ధరించింది. మగబిడ్డను ప్రసవించింది. జమదగ్ని అని నామకరణం చేశారు. అతడు చతుర్వేదాలనూ అభ్యసించి షట్‌శాస్త్రాలను స్వాధీనం చేసుకొని మహాతేజస్వి అయ్యాడు, మహాతపశ్శాలి అయ్యాడు. ప్రసేనజిత్తు కూతురు రేణుకాదేవిని వివాహం చేసుకున్నాడు. వీరికి వసుమంతుడు - సుషేణుడు - వసువు - విశ్వావసువు - రాముడు - అని అయిదుగురు కుమారులు కలిగారు.

ఒకనాడు రేణుకాదేవి స్నానానికి వెళ్ళింది. ఆ సరోవరంలో మూర్తికావతక పట్టణాధిపతి చిత్రరథుడు తన భార్యాలతో జలక్రీడలు ఆడుతున్నాడు. రేణుకాదేవి కొంచెంసేపు నిలబడి వాళ్ళని చూసింది. తానూ అలాంటి జలకేళికి

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ముచ్చటపడింది. వెంటనే మనస్సును నిగ్రహించుకుంది. స్నానం ముగించుకొని త్వరత్వరగా ఆశ్రమం చేరుకుంది. ఆలస్యానికి జమదగ్ని మండిపడతాడని భయపడుతూనే ఉంది. ఆశ్రమంలోకి అడుగుపెట్టిన రేణుకను మహర్షి తేరిపారచూశాడు. ముఖంలో బ్రాహ్మ్యకళ లోపించడాన్ని గుర్తించాడు. ఆగ్రహోదగ్రుడు అయ్యాడు.

సమత్కుశలకోసం అడవికి వెళ్ళిన నలుగురు కొడుకులూ అదే సమయానికి తిరిగివచ్చారు. వాళ్ళని చూసి, మీ తల్లిని సంహరించండి అని ఒక్కొక్కరికీ పేరుపేరునా ఆజ్ఞాపించాడు జమదగ్ని. అయితే ఆ కుమారులు కన్నతల్లిని సంహరించడానికి మనసొప్పక స్థాణువులై నిలబడిపోయారు. దీనితో జమదగ్నికి క్రోధం రెట్టింపు అయ్యింది. నా మాట వినలేదు కాబట్టి మీరు నలుగురూ ఈ అరణ్యంలో మృగాల్లాగా పక్షుల్లాగా జడజీవితం గడపండి అని శపించాడు. అంతలోకీ పరశురాముడు వచ్చాడు. జమదగ్ని అతడికీ ఇదే ఆజ్ఞ ఇచ్చాడు. పాపశీల నీ తల్లిని సంహరించమన్నాడు. అనడమేమిటి అతడు తన గండ్రగొడ్డలితో తల్లి శిరస్సు నరికివేశాడు. జమదగ్ని కోపం చల్లారింది. సంతోషించాడు. భార్గవరామా ! వరాలు కోరుకో ఇస్తానన్నాడు.

తల్లి పవిత్రురాలై పునరుజ్జీవించాలనీ ఈ శిరఃఖండన వృత్తాంతం ఆమెకు గుర్తుండకూడదనీ సోదరులు నలుగురూ శాపవిముక్తులు కావాలనీ తనకు మాతృహననదోషం అంటకూడదనీ రణరంగంలో అప్రతిహతశక్తి దీర్ఘాయువూ తనకు కావాలనీ రాముడు కోరుకున్నాడు. జమదగ్ని తథాస్తు అన్నాడు. రేణుకాదేవి నిద్రనుంచి మేల్కొనట్టు కళ్ళు తెరచి చూసింది. అన్నగార్ల జడత్వం వదిలిపోయింది. తానూ విముక్తుడు అయ్యాడు.

అటుపైన కొంతకాలానికి కార్యవీర్యార్జునుడు జమదగ్ని ఆశ్రమానికి వచ్చి హోమధేనువును బలాత్కారంగా లాక్కుపోయాడు. దీనికి అలిగిన భార్గవ రాముడు కార్తవీర్యుడి సహస్ర బాహులను ఖండించి సంహరించాడు. హోమధేనువుని తోలుకుని తెచ్చుకున్నాడు. దీనికి ప్రతీకారంగా కార్యవీర్యుడి కొడుకులు ఆశ్రమానికి వచ్చి ఒంటరిగా ఉన్న జమదగ్నిని సంహరించి పారిపోయారు.

దీనికి కసలి భార్గవరాముడు దుష్టులైన క్షత్రియులందరినీ హతమారుస్తానని ప్రతిజ్ఞ చేశాడు. భూమండలమంతా ఇరవై యొక్కసార్లు గాలించి దుష్టక్షత్రియ సంహారం చేశాడు. వారి రక్తంతో శమంతపంచకంలో తొమ్మిది మడుగులు నింపి పితృ తర్పణాలు విడిచిపెట్టాడు. ఆ తరువాత పదిబారల పొడుగూ తొమ్మిది బారల వెడల్పుతో బంగారు వేదికను నిర్మించి భూరిదక్షిణలతో మహాయజ్ఞం చేశాడు. యజ్ఞాంతంలో ఆ కాంచనమయ వేదికను ప్రధాన ఋత్విక్కు కశ్యపుడికి దానం చేశాడు. దాన్ని ఆ మహర్షి అనుజ్ఞతో సమభాగాలుగా ఖండించి యార్జికులందరూ పంచుకున్నారు. అప్పటి నుంచీ ఆ బ్రాహ్మణులకు ఖండవాయనులని పేరు ఏర్పడింది.

క్షత్రియ సంహారం చేసి స్వాయత్తం చేసుకున్న భూగోళాన్ని కూడా బ్రాహ్మణులకు పంచిపెట్టాడు. సరస్వతీ నదీలో అవభృథస్నానం చేశాడు. కల్మషాలన్నీ తొలగించుకున్నాడు. ఈ మహేంద్రపర్వతం మీద నివాసం ఏర్పరుచుకుని ప్రశాంత చిత్తంతో తపస్సు చేసుకుంటున్నాడు - అని అకృతబ్రాహ్మణుడు భార్గవరామ కథను ముగించాడు. అప్పటికి తెల్లవారింది చతుర్ధశి వచ్చింది, భార్గవరాముడు వచ్చాడు. ధర్మజాదులు ఆ మహర్షిని దర్శించి భక్తి ప్రపత్తులతో పాదపూజలు చేశారు. భార్గవుడు కూడా వారినందరినీ ఆదరించి ఆ రోజుకి తన ఆశ్రమంలోనే ఆతిథ్యమిచ్చి మర్నాడు వీడ్కోలు పలికాడు. తానూ దక్షిణాభిముఖంగా వెళ్ళిపోయాడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

దీపకా ! విన్నావు కదా ! శ్రీమన్నారాయణుడు దత్తరూపంలో వరాలిచ్చి కార్యవీర్యార్జునుణ్ని మహావీరుణ్ని చేసి అతడు కోరుకున్నట్టే అధికవీరుడై విప్రుడై భార్గవరాముడై వచ్చి అతణ్ణి సంగ్రామంలోనే సంహరించాడు. నాయనా ! ఇదీ విష్ణోశ్చరితమద్భుతమ్ ! సంక్షేపంగా చెప్పాను - అని వేదధర్ముడు ముగించాడు.

గురుదేవా ! దత్తాత్రేయుడు సాధ్యజాతిదేవతలు వచ్చి అడిగితే ఇహపరాలకు ఉపకరించే శమదమాదుల్నీ, నీతుల్నీ ఉపదేశించాడని విన్నాను. వాటిని తమరు నాకుకూడా ఉపదేశించవలసిందిగా కోరుతున్నాను.

దీపకా ! జ్ఞానకళా స్వరూపుడూ - స్వయంభువూ అయిన పరమేశ్వరుడే అత్రిపుత్రుడుగా అవతరించాడు. అతడు జ్ఞాన ఘనుడు. సాక్షాజ్జగద్గురుడతడు. దేవతలకూ, సిద్ధులకూ, సాధ్యులకూ, మనుష్యులకు అందరికీ అతడే పరమ గురువు. జ్ఞాన - యోగ - తపో - యమ - నియమ - శమాది మార్గాలలో ఎవరు ఏ మార్గంలో సాధన చేసినా సేవించినా దత్తాత్రేయ సద్గురుని అనుగ్రహం పొందుతారు. ఆయనే అందరికీ మార్గమూ గమ్యమూను. సంసార సాగరాన్ని తరించి కృతార్థత పొందాలంటే ఈ సద్గురూపాసన ఒక్కటే సాధనం. అంచేత సాధ్యజాతి దేవతలు సైతం దత్తాత్రేయుణ్ని ఆశ్రయించి భక్తిజ్ఞాన యోగాది రహస్యాలనే కాక తమకు కావలసిన లౌకికాలౌకిక విషయాలన్నింటినీ అడిగి తెలుసుకొని వెడుతుంటారు. అలా ఒక సందర్భంలో దత్తాత్రేయుడు సాధ్యులకు చేసిన నీతి ప్రభోదాలను ఒకానొక సందర్భంలో విదురుడు ధృతరాష్ట్రుడికి వినిపించాడు. వాటిని ఆ ఇద్దరి సంభాషణగా నీ ముందు ఉంచుతాను గ్రహించుకో - అని వేధర్ముడు ఇలా ప్రవచించాడు.

## విదుర నీతి

ధృతరాష్ట్రా ! నీ పెద్ద కొడుకు దుర్యోధనుడు నీతి తప్పి ప్రవర్తిస్తున్నాడు. నువ్వు చూస్తూ ఊరుకుంటున్నావు. ఇది కులానికి చేటు తెచ్చిపెడుతుంది. కనక త్వరగా మేల్కొని నీ పెద్దకొడుక్కి తగిన బుద్ధులు నేర్పు.

విదురా ! నువ్వు జ్ఞానివి. సకల నీతి శాస్త్రవేత్తవు. దుర్యోధనుడికి ఏమి నీతులు నేర్పాలో ముందుగా నువ్వు నాకు ఉపదేశించు. వాటిని వాడికి బోధిస్తాను. ఆపైన ఏది జరగాలో అది జరుగుతుంది.

ధృతరాష్ట్రా ! సరే అయితే ఆలకించు, పూర్వకాలంలో దత్తయోగీంద్రుడు సాధ్యజాతి వారికి ఉపదేశించిన కొన్ని గొప్ప నీతులు ఉన్నాయి. వాటిని నీకు ఉపదేశిస్తాను. శ్రద్ధగా ఆలకించు - అని విదురుడు ఆరంభించాడు.

ముందుగా మనస్సుకి సంశ్రుతం అలవర్చాలి. దానితో శమదమాదులూ సత్యమూ ధృతీ అలవడతాయి. వాటివల్ల హృదయగ్రంథి విడుతుంది. అరిషడ్వర్గం అంతరిస్తుంది. క్రోధాన్ని క్రోధంతో జయించలేం. సహనంతో ఓర్పుతో జయించగలం. క్రోధమనేది అన్ని అనర్థాలకూ మూలకందం. ఎవడి క్రోధం వాడినే దహించేస్తుంది. వాడి పూర్వజన్మార్జిత సుకృతాలనుకూడా నాశనం చేస్తుంది. అంచేత అందరూ తితిక్ష అలవరుచుకుని క్రోధాన్ని అదుపు చేసుకోవాలి. అలాగే ఏ మనిషీ ఆక్రోశి కాకూడదు, అవమాని కాకూడదు. మిత్రద్రోహి కాకూడదు. నీచోపసేవి కాకూడదు, దురభిమాని కాకూడదు, హీనవృత్తుడు కాకూడదు. రూక్షంగా, పరుషంగా మాట్లాడే అలవాటును క్రమేపీ ప్రయత్నపూర్వకంగా వదుల్చుకోవాలి. ఇది హృదయాలనూ, మర్మాలనూ అస్థికలను సైతం దహించి వేస్తుంది. ఇటువంటి వాక్పారుష్యరూప మహాపాపాన్ని ధర్మారాములందరూ వెంటనే వదిలిపెట్టి దానికి ఆమడల దూరం తొలగిపోవాలి

ఈటెలలాంటి మాటలతో ఎదుటివారి హృదయాలను తూట్లుపొడిచే మానవుణ్ని లక్ష్మి సరస్వతులు ఆ క్షణంలోనే పరిత్యజిస్తాయి. దరిద్రదేవత వాడి ముఖంలో స్థిర నివాసమేర్పరుచుకుంటుంది. నిప్పులు కక్కుతున్న వాగ్బాణాలతో ఎవరు ఎంతగా హింసించినా చలించని వాడూ గుండెలు దహించుకుపోనివాడూ నిజమైన యోగి. అతడు తన సుకృతాన్ని ఇంతకింతగా పెంచుకుంటున్నాడని గ్రహించు.

అంబికేయా ! వస్త్రాలకు రంగులు అంటుకున్నట్టే మనుషులకు గుణాలూ అంటుకుంటాయి. సజ్జనుణ్ని సేవిస్తే సజ్జనత్వం దుర్జనుణ్ని సేవిస్తే దుర్జనత్వం తపస్విని సేవిస్తే తపస్విత్వం చోరున్ని సేవిస్తే చోరత్వం క్రమంగా సంక్రమిస్తాయి. ఆరు నెలల సావాసంతో వీరు వారవుతారని లోకోక్తి.

**తనను నిందించిన వాణ్ని తాను నిందించకుండా మరొకరితో నిందింపజెయ్యకుండా, తనను కొట్టినవాణ్ని తాను కొట్టకుండా కొట్టించకుండా, తనకు ద్రోహం చేసిన వాడికి తాను ద్రోహం చెయ్యకుండా చేయించకుండా జీవించేవాడికి ఏ పాపమూ అంటదు.** దేవతలు మెచ్చి స్వయంగా ఎదురువచ్చి అతణ్ని తమ లోకానికి తీసుకువెడతారు.

రాజా ! అవ్యాహృతం వ్యాహృతాత్ శ్రేయ ఆహు మాట్లాడటంకన్నా మౌనం ఎప్పటికీ శ్రేయోదాయకమన్నారు. ఒకవేళ మాట్లాడవలసివస్తే సత్యమే పలకాలి. అది రెండురెట్లు మంచిది. అది ప్రియం కూడా అయ్యేట్టు మాట్లాగడలిగితే మూడురెట్లు మంచిది. సత్యమూ ప్రియమే కాక ధర్మబద్ధంకూడా అయ్యేట్టు పలకగలిగితే అది నాలుగురెట్లు మంచిది. మనిషి ఎవరిని జతచేర్చుకుంటాడో, ఎవరితో జతకడతాడో, తానెటువంటివాడు కాదలుచుకున్నాడో - దాన్నిబట్టి మార్పులు వస్తాయి. అటువంటివాడు అవుతాడు. ఏయే విషయాలను నివర్తించగలుగుతాడో తాను ఆయా విషయాల నుంచి విముక్తుడవుతాడు. ఇలా క్రమంగా అన్నింటినీ నివర్తించుకోగలిగిన వాడికి అణుమాత్రమైన దుఃఖం ఉండదని తెలుసుకో. ఇదొక నిరంతరసాధన. దుఃఖాన్ని జయించే ఏకైకమార్గం. నిందా, ప్రశంసలు రెండింటినీ సమానంగా చూడగలిగినవాడు ఒకరిని జయించడు. ఒకరికి తాను ఓడిపోడు. ఒకణ్ని శత్రువనుకోడు, ఒకడికి తాను శత్రువుకాడు. ఇటువంటివాడికి సుఖదుఃఖాలు అంటవు. అందరికీ మంచి జరగాలనీ ఎవ్వరికీ కీడు జరగకూడదనీ కోరుకునేవాడూ, మృదు స్వబావం కలవాడూ, అంతర్భహిరింద్రియాలను నిగ్రహించినవాడూ - అతడూ ఉత్తమ పురుషుడంటే.

యాచకుల్ని ఆదరించేవాడూ, ఇస్తానన్నది వెంటనే ఇచ్చేవాడూ, ఇతరుల్లో రంధ్రాన్వేషణ చేయనివాడూ ఉత్తముడు. ఇక దుష్టుడెలా ఉంటాడంటే - ఎవ్వరు ఏమంచి పని చెప్పినా వినడు. పరుల్ని శంకించడం తనని తాను శంకించుకోవడం, నిత్య శంకితుడుగా ఉంటాడు. మిత్రుల్ని ఉత్తపుణ్యానికి దూరం చేసుకుంటాడు. అంతరాత్మను చంపుకుంటాడు. కోపవివశుడుగా ఉంటాడు. ఇతరులు చేసిన మేలుని ఆ నిమిషంలోనే మరచిపోతాడు - ఇవీ దుష్టుడి లక్షణాలు, వీణ్ని అధమపురుషుడంటారు.

శ్రేయస్కాముడు ఎప్పుడూ తనకంటే ఉత్తములనే సేవించాలి. కాలానుగుణంగా అవసరమైతే మధ్యముల్ని కూడా సేవించవచ్చు. అంతేకాని అధముల్ని ఛస్తే సేవించకూడదు.

లోకంలో ఒక్కొక్కసారి అధములుకూడా బాగా ధనం ఆర్జిస్తారు. తెలివితేటలనండి, బలమనండి, పౌరుషమనండి - ఏదో ఒకటి ఉపయోగించి బాగా కూడబెడతారు. అంత మాత్రాన సంఘంలో అతడు ప్రశంసా పాత్రుడుకాడు. పెద్దల సరసన కూర్చోలేడు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

దత్తాత్రేయుడు అందించిన ఈ నీతి వాగామృతాన్ని ఆస్వాదించి సాధ్యులు స్వామి దగ్గర సెలవు తీసుకున్నారు. ఈ నీతుల్ని నీ పెద్దకొడుక్కి బోధించి దారిలోపెట్టుకో అని విదురుడు ధృత రాష్ట్రుణ్ణీ హెచ్చరించాడు.

దీపకా ! విన్నావుగదా. ఇవి ఇహపరసాధకాలైన నీతివాక్యాలు. ఇంకా చాలామంది ఇలాగ దత్తుణ్ణి ఆశ్రయించి సంశయాలు తొలగించుకొని సన్మార్గాలు అలవరచుకొని జీవన్ముక్తులైనవారు ఉన్నారు. పరమాత్మగా ధ్యానించి అపునర్భవమైన ముక్తిని పొందుతున్నవారూ ఉన్నారు. మరింకా ఏమి వినాలనుకుంటున్నావో అడుగు చెబుతాను అన్నాడు వేదధర్ముడు.

గురూత్తమా ! అత్రిపుత్రుడి మహాత్మ్యాలు ఇంకా వినాలి అన్నదొక్కటే నా కోరిక. ఎంతకీ తనివి తీరడంలేదు. భరత వంశంలో ఆయువుకి దత్తానుగ్రహం వల్లనే నహుషుడు జన్మించాడనీ ఆ యోగీంద్రుణ్ణి ఆరాధించి శత్రువుల్ని జయించి చక్రవర్తి అయ్యాడనీ క్లుప్తంగా విన్నాను. ఇది కాస్త వివరంగా ఈ శిష్యుడికి వినిపించి హృదయాబ్జాన్ని వికసింపజేయండి.

దీపకా ! నువ్వు ధన్యుడవు కావటమే కాదు నీ తల్లిదండ్రుల్ని సైతం ధన్యుల్ని చేస్తున్నావు. పితృదేవతల్ని తరింపచేస్తున్నావు. నువ్వు సంపాదించుకుంటున్న ఈ పుణ్యకథా శ్రవణఫలం అంతటిది. అంతేకాదు అడిగి నాతో వీటిని చెప్పించి నన్ను కూడా ధన్యుణ్ణి చేస్తున్నావు. నాయనా ! నీలో ఇంకొక సుగుణం నాకు మరీ నచ్చింది. ప్రతికథనూ నేను చెబుతున్నంత శ్రద్ధగానూ వింటున్నావు. ఏదైనా ఒకటి మునుపు విన్నదే మళ్ళీ ప్రస్తావనకు వచ్చినా నన్ను ఆనందపరచడంకోసం ఇదే మొదటిసారి అన్నంత శ్రద్ధగా వింటున్నావు. ఇలాంటి శ్రోత దొరకడం చాలా అదృష్టం పైగా కథకూడా అటువంటిది.

## వేన వృత్తాంతము

అనగా అనగా ఒక పక్షిరాజు, అతడిపేరు కుంజులుడు. అతడికి నలుగురు కొడుకులు. శౌర్యవీర్య బలోన్మత్తులు. గరుత్మంతుడితో సమానులు. వీరిలో పెద్దవారి పేరు కపింజలుడు. ఈ నలుగురూ ప్రతిరోజు నాలుగు దిక్కులకి వెడతారు. సంచరిస్తారు. సాయంకాలానికి తిరిగి వస్తారు. తాము కన్నవీ విన్నవీ వింతలూ విడ్డూరాలు ముసలి తండ్రికి వినిపిస్తుంటారు. భోజనాల సమయంలో తండ్రితో వీరికి ఇదొక మంచి కాలక్షేపం. ఆ తండ్రి కూడా అడిగి అడిగి విశేషాలు తెలుసుకుంటూ ఉంటారు.

ఒకనాటి సాయంకాలం కపింజలుడు పట్టరాని ఆనందంతో తిరిగివచ్చి తండ్రికి సవినయంగా నమస్కరించి - తండ్రీ ! ఈ రోజు నేనొక వింత చూసాను. ఒక మహానుభావుడు అగ్నిలా ప్రజ్వరిల్లుతూ తపస్సు చేస్తుంటే ప్రసన్నుడై జనార్ధనుడు దివ్య రూపంతో ప్రత్యక్షమయ్యాడు. శ్రీమన్మహావిష్ణువును నేను దర్శించగలిగాను. తండ్రీ ! నిజంగా నా జన్మ సఫలమయ్యింది. నా కన్నులు చరితార్థమయ్యాయి - అంటూ ఆనంద బాష్పాలు రాల్చారు.

నాయనా ! కపింజలా ! నిజంగా నువ్వు భాగ్యశాలివి. ఇంతకీ ఆ తపస్వి ఎవరు ? అతడి ప్రభావం ఏమిటి ? జనార్ధనుణ్ణి ఎలా ప్రసన్నుణ్ణి చేసుకున్నాడు ? ప్రసన్నుడై వచ్చిన వరదుడు అతడికి వఱద కట్టించిన వరాలేమిటి ? ఈ విశేషాలన్నీ నువ్వు చెప్పాలి. నువ్వు అదృష్టవంతుడవి మాత్రమే కాదు సర్వజ్ఞుడవు. యోగ విద్యావేత్తవు. కాబట్టి నీకు తెలియనిదంటూ ఉండదు. నేనెరుగుదును అంచేత ఇవన్నీ చెప్పి నా కుతూహలం తీర్చు.

తండ్రీ ! నాకు తెలిసినంతమట్టుకు తప్పకుండా చెబుతాను. అందరూ వినండి తుంగుడు అనే ఒక మునీశ్వరుడు ఉన్నాడు. గురుచరణసేవా పరాయణుడు. మహాతపస్వి. అతడికి ఏదో ఒక దుర్యోగం వల్ల అత్యుల్బణుడు వేనుడనే కొడుకు పుట్టాడు. పాపకర్మ ఫలితంగా వేనుడు నిత్యమూ రోగపీడితుడై దుఃఖ పడుతున్నాడు. తండ్రి చూసి - తపస్సు చేసుకో, పాప క్షయమూ, రోగక్షయమూ అవుతుందని ఆజ్ఞాపించాడు. అందుమీదట వేనుడు ఆరోగ్యకాంక్షతో ఘోరతపస్సు చేశాడు. గోవిందుడు సంతుష్టుడై ప్రత్యక్షమయ్యాడు. ఆరోగ్యాన్నీ రాజ్యభోగాలనూ సత్సంతానాన్ని వరాలుగా ప్రసాదించాడు. వేనుడు రాజ్యభోగాలు చాలాకాలం అనుభవించి రాజ్యాన్ని పుత్రులకు అప్పగించి మళ్ళీ అరణ్యాలకు వచ్చి తపస్సుకు కూర్చున్నాడు. తీవ్రంగా తపస్సు సాగించాడు. గోవిందుడు గరుడవాహనం మీద మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు.

దేవదేవా ! జనార్ధనా ! శంఖ చక్ర గధాధరా ! నువ్వు ఈ భూలోకంలో చాలా అవతారాలు ధరించావు. అన్నీ విఖ్యాతిపొందాయి. కానీ దత్తాత్రేయావతారం వాటిలోకెల్లా విఖ్యాతమైనదీ ప్రత్యేకమైనదీను. ఆ అవతారంలో ఎందరెందరో రాజులను సంకట పరిస్థితులనుంచి ఉద్ధరించావు. అలా నీతో ఉద్ధరింపబడిన ఒకరాజు కథ నీ ముఖతః వినాలని నా కోరిక. ఇంతకుమించి నేను వేరే కోరే వరాలు ఏమీలేవు. నన్ను అనుగ్రహించు.

## నహుష వృత్తాంతం

తుంగపుత్రా ! వేన తపస్వీ ! ఆయువు అని ఒక సార్వభౌముడున్నాడు. సత్యధర్మ పరాయణుడు. తపో యశో బలాలతో ఇంద్ర సమానుడు. దానధర్మాలతో యజ్ఞయాగాలతో నియమ నిష్ఠలతో పుణ్యకార్యాలతో పవిత్రంగా ఏకచ్ఛత్రంగా రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. చంద్రవంశానికే విభూషణంగా భూలోకంలో కీర్తిప్రతిష్ఠలు గడించాడు. అయితే ఎంతకాలానికీ ఆ దంపతులకు సంతానం కలుగలేదు. ఆయువు ఎంతగానో దిగులుచెందాడు. దత్తయోగీంద్రుడి మహిమ విని ఒక మంచిరోజున హుటాహుటీన బయలుదేరాడు. సహ్యాద్రి చెంగట దత్తాశ్రమం చేరుకున్నాడు. అల్లంత దూరంలో దత్తాత్రేయుడు కనిపించాడు. సర్వాలంకార విభూషితుడై మదిరానందలోలుడై అంకపీఠంలో అతిలోక సౌందర్యవతిని బుజ్జగిస్తూ తరుణీ బృందపరివేష్టితుడై కనిపించాడు. అక్కడ అందరూ సురాపానం చేస్తున్నారు. ఆడుతున్నారు, పాడుతున్నారు. దత్తదేవుడి మెడలో పుష్పహారాలూ ముక్తామాలికలూ ఫరిడవిస్తున్నాయి. తనువంతా చందనంతో పరిమళిస్తోంది. సువర్ణ యజ్ఞోపవీతం తళతళా మెరిసిపోతోంది. ఆయువు నదురూ బెదురూ లేకుండా పరుగుపరుగున వెళ్ళి దత్తాత్రేయుడి పాదాలమీద సాష్టాంగపడ్డాడు. యోగీంద్రుడు గుర్తించాడు. అయినా పరీక్ష కోసం పరాభవించాలని ఆయువును కాలితో నెట్టాడు. ధృడసంకల్పంతో వచ్చిన ఆ మహారాజు దాన్ని లెక్కచెయ్యలేదు. దత్తదేవుడి పాదాలు వీడలేదు. దత్తాత్రేయుడు మౌనంగా అక్కడి నుండి నిష్క్రమించాడు. ఆయువు ఆశ్రమంలోనే ఉండి క్రమక్రమంగా స్వామి పరివారంలో సభ్యుడై సన్నిహితుడై నూరేళ్ళు సేవలు చేశాడు. మనసుపెట్టి భక్తితో సకలపరిచర్యలూ చేశాడు. నిత్యము స్తుతించాడు.

అత్రిసంభవా ! మహాభాగా ! గోవింద ! పురుషోత్తమా ! బ్రాహ్మణ రూపంలో అవతరించిన గరుడధ్వజా ! దేవదేవేశ ! పరమేశా ! నమోనమః ! శరణాగతవత్సలా ! నిన్నే శరణువేడాను. హృషీకేశా ! నువ్వు కల్పించిన మాయను నువ్వే ఉద్ధరించు. నువ్వు విశ్వప్రదాతవు. విశ్వనాయకుడవు. మధుసూదనా ! నువ్వు జగన్నాథుడవని ఎరుగుదును. గోవిందా ! విశ్వరూపా ! నన్ను కటాక్షించు. నన్ను రక్షించు. నమోనమః

ఉన్నట్టుండి ఒకనాడు దత్తాత్రేయుడు కటాక్షించాడు. అదే తొలిసారి పలకడం. అదిగో ఆకపాలంతో మద్యం తీసుకురా. మాంసభోజనం కూడా కావాలి అన్నాడు. ఆయువు త్వరత్వరగా వెళ్ళి మద్యం తెచ్చి ఇచ్చాడు. స్వచ్ఛమైన మాంసాన్ని రుచిగా వండి స్వహస్తాలతో అందించాడు. ఇలా ఎన్నో పరీక్షలయ్యాక అతడి నిశ్చలభక్తికీ గురుశుశ్రూషకూ సంబరపడి ఆయు భూపతీ! ఏం కావాలో వరం కోరుకో ఇస్తానన్నాడు. దత్తయోగీంద్రా! గుణ సంపన్నుడూ సర్వజ్ఞుడు దేవవీర్యుడు దేవదానవ గంధర్వ కిన్నెర రాక్షస క్షత్రియాదులకు అజేయుడూ దేవబ్రాహ్మణ భక్తి తత్పరుడూ ప్రజాపాలన దక్షుడూ యజ్ఞ నిర్వాహకుడూ దానశీలుడూ శరణాగత తత్పరుడూ మహాత్యాగీ వేద శాస్త్రపారంగతుడూ ధనుర్వేద నిపుణుడూ అనాహతమతిమంతుడూ సుందరాకారుడూ - ఇంకా ఇటువంటి సద్గుణాలన్నీ కలిగి మా వంశాన్ని నిలబెట్టే సత్పుత్రుణ్ని వరంగా ప్రసాదించు - అని ఆయువు కోరుకున్నాడు. దత్తస్వామి తథాస్తు అన్నాడు. వైష్ణవాంశతో పుడతాడనీ సార్వ భౌముడవుతాడనీ ఇంద్రతుల్య పరాక్రముడవుతాడనీ ఆశీర్వదించి, ఒక పండు చేతికందించి ఇది తీసుకువెళ్ళి నీ ధర్మపత్నికి ఇచ్చి భుజించమను, నీ కిచ్చిన వరం ఫలిస్తుంది - అని చెప్పి అదృశ్యమయ్యాడు.

ఆయు మహారాజు ఆనందంగా రాజధానికి తిరిగి వచ్చి తన ధర్మపత్ని స్వర్భానుతనయ పట్టమహిషి ఇందుమతికి జరిగిన వృత్తాంతమంతా చెప్పి దత్తదేవుడిచ్చిన దివ్య ఫలాన్ని భక్తితో కన్నులకద్దుకుని ప్రసాదంగా స్వీకరించమని అందించాడు. ఆమె అలాగే చేసింది. నెల తిరిగేసరికి గర్భం ధరించింది. నెలలు నిండుతున్నాయి. ఒకనాటి రాత్రి ఇందుమతికి ఒక కలవచ్చింది. ఆ కలలో ఒక దివ్య పురుషుడు కనిపించాడు. సూర్య సన్నిభుడు, సముజ్జ్వలత్సర్వాంగుడు, శ్వేతవస్త్ర సుశోభితుడూ. శ్వేత పుష్పమాలికాలంకృతుడు. దివ్యాభరణ దివ్యానులేపన విరాజితుడు. చతుర్భుజుడు, శంఖ చక్రగదాఖడ్గధారి. హారకంకణ కేయూరనూపురాలంకృతుడు. చంద్రబింబంలాంటి ఛత్రచ్ఛాయలో నిలబడ్డాడు. చంద్రబింబంల్లాంటి మకరకుండలాలు చెక్కిళ్ళపై వెన్నెలలు కుమ్మరిస్తున్నాయి. ఇలా ఉన్న ఆ దివ్యపురుషుడు ఇందుమతిని చెంతకు పిలిచి రత్నకాంచన పట్టికాలంకృతమైన శంఖంతో క్షీరాభిషేకం చేశాడు. అటుపైని ఆమె మెడలో ముక్తాఫలాన్ని ధరింపజేసి చేతికి ఒక శ్వేతపద్మం అందించి అదృశ్యుడయ్యాడు.

ఇందుమతికి మెలకువ వచ్చింది. భర్తను లేపి స్వప్న వృత్తాంతం అంతా చెప్పింది. అంతలోకి తెల్లవారింది. మహారాజు ఉదయాన్నే శౌనక మహర్షిని ఆహ్వానించి ఈ స్వప్నం గురించి చెప్పి ఫలమేమిటో చెప్పండి అని అడిగాడు. వరమిచ్చిన దత్తాత్రేయుడే ఇవ్వాళ మహారాజ్ఞికి కలలో దర్శనమిచ్చారని క్షీరస్నాన పద్మదానాలను బట్టి వైష్ణవాంశ సంయుతుడు పుత్రుడుగా అవతరించనున్నాడనీ ముక్తాఫలం గర్భరక్షకమయ్యుంటుందనీ స్వప్నాన్ని విశ్లేషించి చెప్పి సోమవంశోద్ధారకుడు మీకు కలగబోతున్నాడని ఆశీర్వదించి వెళ్ళాడు ఆ మహర్షి. రాజదంపతులు సంబరపడి దత్తాత్రేయుణ్ని ధ్యానిస్తూ ప్రసవానికి వేచి ఉన్నారు.

ఇదే సమయంలో - హుండుడు అనే దానవుడి కూతురు ఇష్టసఖులతో కలిసి నందనవనంలో విహరిస్తూ చారణ దంపతుల సంభాషణ వింది. భూలోకంలో ఆయు మహారాజుకి విష్ణు తుల్య పరాక్రముడు పుత్రుడుగా జన్మించబోతున్నాడనీ అతడి చేతిలో హుండుడు మరణిస్తాడనీ అప్పుడు మనదేవలోకం మనకు స్వాధీనమవుతుందనీ అందాకా మనకు ఈ ఇడుములు తప్పవనీ చారణులు కలబోసుకుంటున్న కబుర్లను హుండ పుత్రిక విన్నది. పరుగుపరుగున వెళ్ళి తండ్రికి విన్నవించింది. అశోక సుందరి తనకిచ్చిన శాపాన్ని గుర్తుకు తెచ్చుకున్న హుండుడు

తనకు పోగాలం దాపురించిందని గుర్తించి గడగడలాడాడు. ఇందుమతీ గర్భంలో ఎదుగుతున్న శిశువును ప్రసవానికి ముందే నాశనం చెయ్యాలని నిశ్చయించుకొని అదృశ్యరూపంలో ఇందుమతీ శయనాగారంలో ప్రవేశించాడు. అక్కడ దివ్య తేజోమయరూపాలు ఆమెకు కావలి ఉండటం గమనించాడు. ఆమె తేజస్సునీ వారి తేజస్సునీ తట్టుకోలేక ఇవతలకి వచ్చేశాడు. స్వప్నంలో ప్రవేశించి భీషణ రూపాలతో ఆమెను భయపెడితే గర్భస్రావం అవుతుందని ఆశించాడు. విష్ణు తేజో రక్షితను ఏరకంగానూ భయపెట్టలేక ప్రసవం కాగానే పసిగుడ్డును తన్నుకుపోదామని ఆశగా ప్రతీక్షిస్తూ కూర్చున్నాడు.

ఒక సుముహూర్తాన స్వర్భాను తనయ ఇందుమతి మగబిడ్డను ప్రసవించింది. అతడి దివ్యతేజస్సుకి ఆశ్చర్యపోయిన ఇందుమతి ఇష్టసఖులు వీడు సూనుడు కాడు భానుడు అని తృళ్ళిపడ్డారు. సూతికాగృహం వెలుపల ఉన్న దాసదాసీ జనానికి ఈ శుభావార్త అందించడానికి వచ్చిన ఒక దాసీని ఆవహించి హుండుడు లోపలికి చొరబడ్డాడు. అనుకూల సమయంకోసం వేచివేచి ఒక అర్ధరాత్రి అందరూ నిద్రిస్తున్న తరుణంలో కావలివారిని సమ్మోహపరచి హుండుడు ఆ శిశువును అపహరించుకుపోయాడు. తన రాజధాని కాంచనపురం చేరుకున్నాడు. భార్యను పిలిచాడు. ఈ శిశువు నా శత్రువు. వీణ్ని మన పాచకులకు ఇచ్చి వీడి మాంసం నాకు వండి వడ్డించమను - అన్నాడు. ఈ పసి గుడ్డేమిటి, నీకు శత్రువేమిటి, వీణ్ని చంపడమేమిటి, వండటమేమిటి, నువ్వు తినడమేమిటి - ఏమీ నాకు అర్థం కావడం లేదని ఆ రాక్షసకాంత భర్తను నిలదీసి కారణం చెప్పమంది. అంతా వివరించాడు హుండుడు. కామోసనుకొని ఆమె సైరంధ్రి మేకలను పిలచి బిడ్డణ్ని చేతిలో పెట్టి ఆ పని అప్పగించింది. మేకల వెళ్ళి పాచకుడికి అప్పగించింది. వాడు కత్తితో బిడ్డను నరకపోతే కత్తి రెండు ముక్కలయ్యింది. బాలకుడు చిరునవ్వు చిందించాడు. మేకలకు విషయం అర్థమయ్యింది. ఈ శిశువు అసాధారణుడు. మనకు అవధ్యుడు, దివ్య లక్షణ సంపన్నుడు అంది. రాజలక్షణ సంపన్నుడైన ఈ పసిగుడ్డును భక్షించాలనుకుంటున్న మన నాయకుడు హుండుడు దానవాధముడు. ఈ శిశువును చంపడం ఎవరి తరమూ కాదు. కర్మ రక్షిస్తూంటే ఎవడు ఎవణ్ని ఏమి చేయగలడు? దేవుడైనా వచ్చి ప్రదక్షిణలు చేయవలసిందే. ఎన్ని ఆపదలైనా తప్పుకుంటాయి. బందిఖానాలైనా తెరుచుకుంటాయి. కాళ్ళూచేతులూ కట్టేసి నదిలోకి విసిరేసినా క్షేమంగా తిరిగి వస్తాడు.

అంచేత మనం ఈ బిడ్డని ఎక్కడైనా దూరంగా వదిలేసి వద్దామని ఇద్దరూ కూడబలుక్కొని ఆ అర్ధరాత్రి శిశువుని తీసుకువెళ్ళి వశిష్ఠుడి ఆశ్రమ ద్వారంలో పరుండబెట్టి, తిరిగి వస్తూ ఒక బుజ్జిలేడి కూనను సంహరించి తెచ్చి, ఆ మాంసం వండి, పసిబిడ్డ మాంసమని హుండుడుకి వడ్డించారు. అది భక్షించి హుండుడు నిశ్చింతగా నిద్రపోయాడు.

తెల్లవారింది, వశిష్ఠుడు లేచాడు. గుమ్మంలో చందమామలా ఉన్న శిశువును చూశాడు. దివ్యలక్షణాలను గమనించాడు. ఈ బిడ్డను ఎవరు ఇక్కడ ఉంచి వెళ్ళారోనని ఆరా తీశాడు. ఆశ్రమ వాసులంతా మాకు తెలీదంటే మాకు తెలీదు అన్నారు. కొందరు పరిశీలనగా చూసి, ఆయు మహారాజుగారి పుత్రుడిలా ఉన్నాడు. ఈ తేజస్సూ ఈ కాంతీ కలిగిన సుతుడు వారికి జన్మించాడని విన్నాము - అన్నారు. వసిష్ఠుడు దివ్యదృష్టి సారించాడు. అంతా అర్థమయ్యింది. ఆ శిశువును తానే స్వయంగా చేతుల్లోకి తీసుకున్నాడు. ఆకాశం నుంచి పుష్పవృష్టి కురిసింది.

దేవదుందుభులు మ్రోగాయి. అప్సరసలు నృత్యం చేశారు. కిన్నెరులు గానం చేశారు. ఋషులు వేదమంత్రాలు పఠించారు. ఆ వరదత్తుని వైపు ప్రసన్నంగా చూశాడు వశిష్ఠుడు. నరాధిపా ! నీ వంశం బాలభావధూషితం కాలేదు కాబట్టి నువ్వు నహుష నామంతో విఖ్యాతికెక్కుతావు. దేవ పూజ్యత దక్కుతుంది - అని నామకరణం చేసి దీవించాడు.

వసిష్ఠుడే జాతక కర్మాదులన్నీ చేసి విద్యాబుద్ధులు నేర్పించాడు. వేదవేదాంగాలూ నేర్పాడు. ధనుర్వేదం రహస్యాలతో సహా నేర్పాడు. వేదాంతం ధర్మశాస్త్రం రాజనీతి ఒకటేమిటి సమస్త విద్యలూ నేర్పాడు. నహుషుడు సర్వవిద్యావేత్త సకల కళాపారీణుడూ అయ్యాడు.

అక్కడ రాజంతఃపురంలో ఇందుమతికి మెలుకువ వచ్చింది. పక్కలో బిడ్డ కనిపించలేదు. వెదికింది, సఖులను అడిగింది. దాసీజనాన్ని ప్రశ్నించింది. అందరూ అప్పుడే నిద్రలేచారు. మాకు తెలీదంటే మాకు తెలీదన్నారు. క్షణంలో ఆ వార్త రాజప్రసాదం అంతటా వ్యాపించి రాజధానిలో వీధివీధికీ ప్రయాణించింది. ఆయు మహారాజు అంతటా గాలింపు చర్యలు జరిపించాడు. ప్రయోజనం కనిపించలేదు. కావలివారిని శిక్షించాడు. అంతఃపురంలోకి ప్రవేశించి పట్టమహిషి పొత్తిలిలో నిద్రిస్తున్న నెలల పిల్లాడిని ఎవరు అపహరించారు ? ఎలా అపహరించగలిగారు ? ఎవరిని ఎలా నిర్బంధించి ప్రశ్నించినా వీటికి సమాధానం దొరకలేదు. రాజధాని అంతటా విషాదమేఘాలు అలుముకున్నాయి. అందరి ముఖాలలోను అదే దిగులు. ఇందుమతి దుఃఖానికి అంతే లేదు. వంశోద్ధారకుణ్ని ఇచ్చినట్టే ఇచ్చి దేవుడు ఇలా మాయం చేశాడేమిటి ? దివ్య స్వప్నం పగటికలేనా ? అని ఆవిడ ఆక్రోషం. దత్తాత్రేయుడిచ్చిన వరం ఇలా అయ్యిందేమిటి ? అని ఆయువు విస్తుపోతున్నాడు. తపస్సులు నిష్ఫలాలు, దాన ధర్మాలు నిష్ఫలాలు. వరాలూ ఇంతేనా ? దేవుడే మోసం చేశాడా ? - మధనపడుతూ లోపలలోపల కుమిలిపోతున్నాడు మహారాజు.

సరిగ్గా అదే సమయానికి దేవుడు పంపినట్టు నారదమహర్షి వచ్చాడు. అర్ఘ్యపాద్యాలూ అతిథి మర్యాదలూ అయ్యాయి. కుశల ప్రశ్నల సందర్భంగా మహారాజు తన దుఃఖాన్ని వెళ్ళబోసుకున్నాడు. మహారాజా ! చింతించకు, నీ వంశోద్ధారకుడు క్షేమంగా ఉన్నాడు. తిరిగి వస్తాడు. అయితే కొన్ని సంవత్సరాలు పడుతుంది. సకల విద్యాప్రవీణుడై మహావీరుడై రణరంగంలో హుండాసురుణ్ని సంహరించి ధర్మపత్నీ సమేతుడై మీ దగ్గరకి వస్తాడు. కొడుకునీ కోడల్నీ ఆశీర్వదిద్దురుగాని. సార్వభౌముడై భూగోళాన్ని చిరకాలం పరిపాలిస్తాడు. అటుపైని ఇంద్రపదవి అధిష్టిస్తాడు. దత్తదేవుడిచ్చిన వరం వృధాకాదు. ధైర్యంగా ఉండండి అని చెప్పి ఆశీర్వదించి ఆ దేవర్షి వీడ్కోలు తీసుకున్నాడు. రాజదంపతులు కుదుటపడ్డారు. సుదీర్ఘ నిరీక్షణకు సిద్ధమయ్యారు. దుఃఖతీవ్రతలో దత్తాత్రేయుణ్ణి అతడిచ్చిన వరాన్నీ శంకించిన పాపానికి ప్రాయశ్చిత్తంగా మరింత భక్తిప్రపత్తులతో నిత్యమూ ఆ స్వామిని స్తుతించారు.

## ఇందుమతీ కృతదత్తస్తవం

1. **నమః పరస్మై పురుషాయవేధసే<br>షడింద్రియ జ్ఞాన విదూరవర్త్మనే ।<br>పరాత్మనేఽహంకృతి దూషితాత్మనాం<br>గుణాత్మనాం సంసృతి హేతుకేతవే ॥**

2. నమోఽస్తు తస్మై పరిశుద్ధ బుద్ధయే
విశుద్ధ విజ్ఞాన ఘనాయ సాక్షిణే ।
ద్విజాయదేవాయ చదేవహేతవే
మునీశ్వరాయాత్రి సుతాయ యోగినే ॥

3. వృజిన జలధిపారం ప్రాపయేద్యః ప్రపన్నాన్
సుత మమర సుతాభం యోఽదదద్దత్తదేవః ।
తదహ మమర పూజ్యం సిద్ధవంద్యం శరణ్యం
పురుష మృషభమాద్యం త్వాం ప్రపన్నాస్మి భూయః

4. యోయేఽదత్సుతం దివ్యం విభుతేజోపబృంహితం ।
సపాతు సర్వదా పుత్రం సర్వదేశే చ యద్గతిః ॥

5. యస్యప్రసాదజో బ్రహ్మ రుద్రస్తే జస్సముద్భవః ।
కింకరాశ్చ సురాయస్య సమాంపాతు సదాహరిః ॥

6. నమస్తేపురుషాధ్యక్ష మైకాధ్యక్ష జగద్గురో ।
దత్తాత్రేయసురేశాన పాహిమాం భవసంకటాత్ ॥

7. త్వత్ప్రసాదేన దేవేశ సర్వం సౌఖ్య మవాప్తవాన్ ।
గతింమేదేహి పాదాబ్జే నాన్యమిచ్ఛామ్యహంప్రభో ॥

పరాత్పరుడు, పురుషోత్తముడూ, బ్రహ్మ స్వరూపుడూ, ఇంద్రియ జ్ఞానానికి అందనివాడూ, అహంకార దూషితాలకు దూరంగా వుండేవాడూ, సంసారహేతువుకు కేతువైనవాడూ - దత్తదేవుడికి నమస్కారం. పరిశుద్ధ బుద్ధికి, విశుద్ధ విజ్ఞాన ఘనుడికి, జగత్సాక్షికి, ద్విజుడికి దేవుడికి, దేవకారణుడికి, మునీశ్వరుడికి, యోగేశ్వరుడికి- ఆ అత్రి పుత్రుడుకి ప్రణామం. ప్రపన్నులకి పాపజలధి దాటించేవాడూ, అమర సుతుడులాంటి బిడ్డను ప్రసాదించినవాడూ, అమరపూజ్యుడూ, సిద్ధవంధ్యుడూ, శరణ్యుడూ, అయిన ఆ పురుషోత్తమునికి నేను ప్రసన్నురాలినై ఇదే ప్రణతి సమర్పిస్తున్నాను.

తేజశ్శాలియైన పుత్రుణ్ని ప్రసాదించిన ఆ దత్తదేవుడు సర్వకాల సర్వావస్థల్లోనూ నినుగును సంరక్షించుగాక. బ్రహ్మదేవుడు కూడా దత్తదేవుడి అనుగ్రహంతో అవతరించినవాడే. రుద్రుడు దత్త తేజస్సంభూతుడు. సకలదేవతలూ సేవకులు. ఆ శ్రీహరి సదా నన్ను రక్షించుగాక - అని ఇందుమతి స్తుతించింది. పురుషాధ్యక్షా ! లక్ష్మీవల్లభా ! జగద్గురూ ! దత్తాత్రేయా ! సురేశానా ! భవ సంకటం నుంచి నన్ను ఉద్ధరించుదేవా ! నీ అనుగ్రహంతో సర్వసౌఖ్యాలు అనుభవిస్తున్నాను. నీ పాదపద్మాలే నాకు దిక్కు, ప్రభూ ! నేనింకేమీ కోరను - అని ఆయువు స్తుతించాడు.

ఇలా దంపతులిద్దరూ దత్తదేవుణ్ని స్తుతిస్తూ అర్చిస్తూ వరమాహత్మ్యాన్ని తలుచుకుంటూ పుత్రాగమనాన్ని ప్రతీక్షిస్తూ కాలం గడుపుతున్నారు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ఆశ్రమంలో వశిష్ఠులవారు ఒకనాడు నహుషుణ్ణి పిలిచి సమిత్కుశలూ కందమూల ఫలాలు తెమ్మని అడవిలోనికి పంపించారు. అన్నింటినీ సేకరించుకొని తిరిగివస్తున్న నహుషుడికి దేవదూతల సంభాషణ వినిపించింది. ఇతడే మహావీరుడు నహుషుడు. ఆయు మహారాజు గారి ఏకైక సుతుడు, చిన్నప్పుడే తల్లిదండ్రులకు దూరమై తల్లి ఇందుమతికి ఎనలేని దుఃఖం కలిగించాడు. వశిష్ఠుడు అనుగ్రహంతో సకల విద్యాపారంగతుడు అయ్యాడు. ఇతణ్ణి వలచి - వివాహం చేసుకోదలచి శివకన్య అశోక సుందరి దుష్కరతపస్సు చేస్తోంది. ఆ పిచ్చి తల్లి తపస్సు ఎప్పటికి ఫలిస్తుందో? ఈ మాటలు విని నహుషుడు చకచకా ఆశ్రమానికి వచ్చాడు. తెచ్చిన వస్తువులను ఎక్కడివక్కడ సర్దాడు. వసిష్ఠులకు నమస్కరించి చేరువలో కూర్చున్నాడు. తాను విన్న దేవదూతల సంభాషణ గురించి చెప్పాడు. మహర్షి సుకుమారంగా నవ్వి అతడి జన్మవృత్తాంతం అంతా ఎరిగించాడు. పుత్రా ! ఆనందపరచు-అని ఆజ్ఞాపించాడు. నహుషుడు మహర్షికి సాష్టాంగపడి దీవెనలందుకుని ధనుఃఖడ్గతూణీరాలను ధరించి హుండాసురుడిమీదకు బయలుదేరాడు దేవదుందుభులు మ్రోగాయి. అఖండ పుష్పవృష్టి కురిసింది.

పరిమళ భరిత శీతలవాయువులు అనుకూలదిశగా వీతెంచాయి. శుభశకునాలన్నీ కనిపించాయి. దేవేంద్రుడు స్వయంగా మాతలి సారధికమైన దివ్యరథాన్ని దివ్యాస్త్ర శస్త్రాలనూ అందించి హుండాసురుణ్ణి జయించమని ఆశీర్వదించి వెళ్ళారు. మునులు ఋషులూ సకల దేవమానవ జాతులవారూ జయోఽస్తు పలికారు. సహుషుడు ఇంద్ర రథం అధిరోహించాడు. సూర్యుడులా తళత్తళలాడాడు. వాయువేగ మనోవేగాలతో హుండరాజధాని మహోదరనగరం శివారుకు చేరుకున్నాడు.

అశోక సుందరి అభ్యర్థన మీద ఇష్టసఖి రంభ ఎదురు వచ్చి నహుషుణ్ని కలుసుకుంది. నహుషా ! శివకన్య అశోక సుందరికి నేను ప్రాణసఖిని రంభను. రూపగుణశీల సంపన్న మా అశోక సుందరి నీ కోసమే తపస్సు చేస్తోంది. హుండుడు ఆమెను అపహరించి తెచ్చి తన కారాగారగృహంలో బంధించాడు. తన కోరిక తీర్చమని నిర్బంధిస్తున్నాడు. అశోక సుందరి శపించింది. నహుషుడు వస్తాడు నిన్ను సంహరిస్తాడు - నన్ను వరిస్తాడు అని పలికింది. నీకోసం తపిస్తు నీ కోసం దుఃఖిస్తూ నీ కోసం కారాగార క్లేశాలు అనుభవిస్తున్న అశోక సుందరికి ఒక్కసారి కనువిందు చెయ్యి - అని అభ్యర్థించింది. రంభా ! నాకు అన్ని విషయాలు తెలుసు. ముందుగా హుండుణ్ని సంహరించాలి. అటుపైన మీ దేవికి దర్శనం అనుగ్రహిస్తాను. ప్రాణ సమానవుగదా, వెళ్ళి ఈ మాట చెప్పి నా ప్రేయసిని ఊరడించు - అని పలికి నహుషుడు రంభను పంపించి వేశాడు.

యుద్ధాహ్వాన సూచకంగా శంఖం పూరించాడు. ఆ ధ్వనికి మహోదరనగరం కంపించింది. హుండుడు కళవళ పడ్డాడు. ఎవడో యుద్ధానికి వచ్చాడని గ్రహించాడు. చూసి రమ్మని దూతను పంపించాడు. వచ్చినవాడు ఆయు పుత్రుడు, వశిష్ఠుల శిష్యుడు నహుషుడట. యుద్ధం కావాలిట, నీకు మరణం తప్పదట - తిరిగివచ్చి నహుష సందేశాన్ని వినిపించాడు దూత. హుండుడు ఉలిక్కిపడ్డాడు. ఆయు పుత్రుణ్ని నెలల పసిగుడ్డుగా ఉన్నప్పుడే వండించుకుని తినేశాను గదా ! మరి వీడెక్కడివాడు ? అనుకుంటూనే భార్యను మేకలను సూదకుణ్ణి పిలిచి గద్దించి ఆరాతీశాడు. సూదకుడు నిజం చెప్పేశాడు. వశిష్ఠుడు దగ్గర సకల విద్యలూ నేర్చి ఈ ఆయుపుత్రుడు నామీదకి వచ్చాడన్నమాట. హుండుడికి అర్థం అయ్యింది. తనకు చావు తప్పదని తెలిసిపోయింది. దైవం

అనుకూలించనప్పుడు అన్నీ అనుకూలించనట్టే ప్రతికూలించినప్పుడు అన్నీ ప్రతికూలిస్తాయి. సరే జరగవలసిందేదో జరుగుతుంది. అని ఒక నిర్ణయానికి వచ్చి మొండిధైర్యంతో ఆ హవనీయ రథాన్ని అధిరోహించాడు. భీషణ దానవ సైన్యాన్ని సమాయత్తం చేసుకుని నహుషుణ్ని ఎదిరించాడు.

వశిష్ఠుడు నేర్పిన ధనుర్విద్య, ఇంద్రుడిచ్చిన దివ్యాస్త్రశాస్త్రాలు, సుదర్శన చక్రంలా పయనించగలిగిన దివ్యరథం - వీటితో నహుషుడు ఒక్కడే అయినా మొత్తం రాక్షస సైన్యాన్ని చిటికెలో మట్టుపెట్టాడు. హుండాసురుడితో తలబడ్డాడు. వాడు గుప్పిస్తున్న రకరకాల ఆయుధాల ధాటికి తట్టుకోలేక మేఘాచ్ఛాదితుడైన బాలభానుడిలా కనిపించాడు. దేవతలూ ఋషులూ విషన్న వదనులయ్యారు. నహుషుడొక్కసారి గురుదేవుల్ని తలుచుకున్నాడు. విశిష్టాస్త్రాలను రెండింటినీ ఒకేసారి మంత్రించి విడిచిపెట్టాడు. అవి సరాసరి వెళ్ళి హుండాసురుని రెండు బాహువులను తన్నుకుపోయాయి. వాడికి క్రోధంతో పిచ్చెక్కింది. పులిలా గాండ్రిస్తూ గుహలా నోరు తెరుచుకుని బాహుమూలాల నుంచి రక్తధారలు ఏరులుకడుతున్నా లక్ష్యపెట్టక నహుషుణ్ని కబళించాలని విరుచుకుపడ్డాడు. ముంచుకు వస్తున్న ప్రమాదాన్ని గుర్తించిన నహుషుడు క్షణ మాలస్యం చెయ్యకుండా ఇంద్రుడిచ్చిన ఐంద్రీశక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. అది మహావేగంగా విద్యుజ్జ్వలన సన్నిభంగా వెళ్ళి వాడి గుండెకు తగిలింది. ఆ దెబ్బకు కొండ గుహలు మారుమోగేట్టు భీషణంగా మూలిగి మెలికలు తిరుగుతూ హుండుడు రెక్కలు విరిగిన పర్వతమై నేలకు రాలిపోయాడు. హతశేషులైన దానవులు అడవులకూ, కొండలకూ పలాయనం చిత్తగించారు. దేవతలూ ఋషులూ మునులూ హర్షధ్వానాలు చేశారు. దేవదుందుభులు మ్రోగాయి. పారిజాత పుష్పవృష్టి కురిసింది. అప్సరాంగనలు నాట్యాలు చేశారు. గంధర్వ కిన్నరాదులు బృందగానాలు చేశారు.

అశోక సుందరిని వెంటబెట్టుకొని రంభ వచ్చింది. తపఃకృశాంగి, కారాగారవాస పరిప్రశాంత, అశోకసుందరి తనను తాను నహుషుడికి సమర్పించుకుంది. నేను నీకు దేవదత్తమైన ధర్మపత్నిని, తపస్విని. నీకోసం నే చేసిన తపస్సు ఇప్పటికి ఫలించింది - అంటూ చేరువకు వచ్చి పాదాభివందనం చేసింది. కృశాంగీ ! నా కోసమే నువ్వు తపస్సు చేస్తున్నావని విన్నాను. ఇప్పుడు కన్నాను. ఒక్క నిమిషం ఓపిక పట్టు. క్షణకాలంలో గురుదేవుల అనుమతితో నిన్ను పరిణయమాడతాను - రండి, మీరిద్దరూ రథం అధిరోహించండి. వశిష్టాశ్రమానికి వెడదాం అన్నాడు నహుషుడు. అన్నట్టుగానే రథం కదిలింది. క్షణంలో వశిష్ఠాశ్రమాన నిలిచింది. ముగ్గురూ దిగివెళ్ళి వశిష్ఠులకు సాష్టాంగ పడ్డారు. నహుషుడు జరిగిన వృత్తాంతమంతా విన్నవించాడు. మహర్షికి తనువు పులకించింది. శిష్యుడి వీరగాధ మనస్సుకి గిలిగింతలు పెట్టింది. కౌగలించుకుని వత్సా అంటూ శిరస్సు మూర్కొన్నాడు. నీ కళ్యాణం నేనే జరిపిస్తానన్నాడు. ముహూర్తం నిశ్చయించాడు. బ్రహ్మవాదులైన మహర్షులు మంత్రాలు చదువుతుంటే వైదికంగా అశోకసుందరీ నహుషులకు సకలదేవతలూ సాక్షిగా వివాహం జరిపించాడు. సదస్యమయ్యింది. పసుపుబట్టలతోనే వెళ్ళి తల్లితండ్రులకు నమస్కరించి ఆశీస్సులు పొంది ఆనందింపజెయ్యండి అని చెప్పి నవదంపతులను అదే రథంమీద రాజధానికి పంపించాడు.

అప్పటికే దేవతల పంపున మేనక వెళ్ళి ఇందుమత్యాయు దంపతులకు శుభవార్త అందించింది. మీ కొడుకు కోడలు దివ్యరథం మీద వస్తున్నారని ఉప్పు అందించింది. అంతటి శుభవార్త అందించిన మేనకకు తన మెడలోని

రత్నహారం బహూకరించాడు ఆయువు. ఆ రాజదంపతులు దత్తదేవుడి వరాన్నీ నారద వచనాలనూ గుర్తు తెచ్చుకుని ఇన్ని సంవత్సరాల నిరీక్షణ ఇన్ని సంవత్సరాల దత్తారాధన ఇప్పటికి ఫలిస్తోందని దుఃఖమో ఆనందమో ఏదో తెలియని ఒక భావావేశంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నారు. అంతలోకి దివ్యరథం వచ్చి గుమ్మంలో వాలింది. దేవతలకోలాహలం. గంధర్వాప్సరసల గీతనృత్యవాద్య ఘోష. మందార పుష్పవృష్టి. దేవవర్చస్వీ మహాబాహువూ నహుషుడూ ధర్మపత్నీ సమేతుడై దివ్యరథం నుంచి అవతరించాడు. తల్లి తండ్రులకు పాదాభివందనం చేశారు. తండ్రీ కొడుకులూ అత్తా కోడళ్ళూ గాఢంగా ఆలింగనం చేసుకున్నారు. ఆనందాశ్రువులతో మూర్ధాభిషేకం చేశారు. కొడుకును దగ్గరకు తీసుకుని ఇందుమతి శిరస్సు మీదుగా వీపు నిమిరి మురిసిపోయింది.

రాజధానిలో వీధివీధికీ ఇంటింటికీ ఈ శుభవార్త పరిమళంలా వ్యాపించింది. ఉప్పొంగిన ఆనందంతో ఒక మహోత్సవం తనంత తాను రూపుగట్టింది. అది రాజ్యమంతటా గుబాళించింది.

తండ్రీ ! కుంజలా ! వేన తపస్వికి ప్రత్యక్షమై జనార్ధనుడు చెప్పిన దత్తమహిమ ఇది. నహుషవృత్తాంతమిది. ఇది చెప్పి గోవిందుడు అదృశ్యుడయ్యాడు. ఈ రోజు నేను కన్నదీ విన్నదీ వింత ఇది - అని ముగించాడు పక్షియువకుడు కపింజలుడు.

సూతమహర్షీ ! మహాప్రాజ్ఞా ! మా జన్మలు చరితార్థమయ్యాయి. మా స్వాధ్యాయ తపోయజ్ఞాది క్రియలన్నీ సఫలమయ్యాయి. విచిత్రమూ మధురాతిమధురమూ అయిన దత్తకథామృతాన్ని శృతిపుటాలతో ఆస్వాదించగలిగాము. జన్మజరామృత్యువేదనలను మరచిపోగలము. విన్నకొద్దీ వినాలనిపిస్తోంది తప్ప ఇక చాలు అనిపించడంలేదు. అంచేత ఓ మహాబుద్ధీ! ఆయా సందర్భాలలో దత్తాత్రేయుడు ఉపదేశించిన ధర్మాలనూ వ్రతదాన విధులనూ పాపప్రాయశ్చిత్తాలకూ కాలనిర్ణయాలనూ శ్రాద్ధాదిక కర్మవిధానాలనూ గంగామాహాత్మ్యాదులనూ మాకు వినిపించి సంతృప్తి పరచవలసిందిగా కోరుతున్నాం.

శౌనకాది మునులారా ! మీరు అడిగినట్టే దీపకుడు సైతం తన గురువు గారిని అడిగాడు. వేదధర్ముడు స్వయంగా అతడికి బోధించిన ఈ అంశాలను మీరు ఆలకించండి.

వత్సా ! దీపకా ! దత్తాత్రేయుడు ప్రబోధించిన ధర్మాలను సనత్కుమారుడు అడిగితే నారదుడు వివరించాడు. వాటిని నీకు నేను చెబుతున్నాను. శ్రద్ధగా విని గ్రహించు. విష్ణుభక్తి పరాయణుడైన నారదుడు మేరుశృంగంమీద సనత్కుమారాదులకు అనేక వ్రతాలు బోధించి ఇంకా ఇలా కొనసాగించాడు.

## ఏకాదశీ వ్రతం

సనత్కుమారా ! సర్వపాప వినాశకంగా సర్వపుణ్యాదాయకంగా ముల్లోకాలలోనూ ప్రసిద్ధికెక్కిన మరొక వ్రతం మీకు చెబుతున్నాను. దీన్ని చాతుర్వర్ణా ల వారూ స్త్రీ పురుషులూ అందరూ చేసుకోవచ్చును. ఇది విష్ణుమూర్తికి అత్యంత ప్రీతిపాత్రం. భక్తితో చేస్తే ముక్తి లభించి తీరుతుంది. దీనిపేరు ఏకాదశీవ్రతం, కృష్ణ పక్షంలో గానీ శుక్ల పక్షంలోగానీ ఏకాదశినాడు ఉపవాసం ఉండాలి, భుజించడం మహాపాపం. నరక హేతువు. ఉపవాస ఫలం పూర్తిగా దక్కాలి అంటే దశమినాటి రాత్రి, ఏకాదశి రెండు పూటలూ, ద్వాదశినాటి రాత్రి - మొత్తం నాలుగు భోజనాలు

మానెయ్యాలి. ఏకాదశినాడు భోజనం చెయ్యడమంటే సర్వపాపాలనూ కావాలని ఏరికోరి భుజించడమన్నమాట. అంచేత ఏకాదశినాడు రెండుపూటలా నిరాహారులై ఉండాలి. బ్రహ్మహత్యమహాపాతకంతో సాటివచ్చే సర్వపాపాలూ ఏకాదశినాడు అన్నాన్ని ఆశ్రయిస్తాయి. అంచేత ఆరోజు భుజించినవాడికి అవి సంక్రమిస్తాయి. ఇక అతడికి నిష్కృతి ఎలా చెప్పు ?

పాపాలు చేసిన వారుగానీ చెయ్యని వారుగానీ ఏకాదశినాడు నిరాహారులుగా ఉంటే పరమపదం చేరుకుంటారు. ఈ తిథి విష్ణుమూర్తికి అత్యంత ప్రీతపాత్రం కనక భవబంధాలను తెగతెంచుకోవాలనుకునేవారు తప్పకుండా ఏకాదశీవ్రతం ఆచరించాలి. దశమిరోజున తెల్లవారు జామునే లేచి దంతధావనాదులు ముగించి తలారా స్నానం చేసి నియతేంద్రియుడై భక్తి ప్రపత్తులతో విష్ణుమూర్తిని ఆరాధించాలి. ఆ రాత్రికి నారాయణ సన్నిధిలోనే నిద్రించాలి. ఏకాదశి నాటి ఉదయమూ అల్లాగే లేచి స్నానాదికం ముగించుకుని జనార్ధనుణ్ని గంధపుష్పాదులతో షోడశోపచార విధి పూర్వకంగా అర్చించాలి అటుపైని ఇలా చెప్పుకోవాలి - పుండరీకాక్షా ! ఏకాదశినాడు ఉపవాసం ఉండి మర్నాడు భోజనం చేస్తాను, అచ్యుతాశరణు, శరణు.

ఈ మంత్రం పఠించి దేవదేవుడైన చక్రిపట్ల భక్తిభావంతో సంతుష్టాత్ముడై ఉపవాసం స్వామివారికి సమర్పించాలి. ఆ రాత్రి స్వామి సన్నిధిలోనే జాగరణం ఉండాలి. గీతవాద్యనృత్య పురాణ శ్రవణాదులతో కాలక్షేపం చెయ్యాలి, గీతం - వాద్యం - నృత్యం - పురాణపఠనం - వేదపఠనం - ధూపం - దీపం - నైవేద్యం - పుష్ప గంధానులేపనం - ఫలం - అర్ఘ్యం - ప్రదక్షిణం - సాష్టాంగ నమస్కారం - ఆర్తికం - వీటిని భక్తిశ్రద్ధలతో ఇంద్రియ నిగ్రహంతో త్రికరణశుద్ధిగా జాగరూకుడై ఆ రాత్రి జాముజాముకీ ఆచరించాలి. ఉపవాసం ఎంతముఖ్యమో జాగారం అంత ముఖ్యం. విష్ణుమూర్తికి షడ్వింశతి గుణాధికంగా సంతృప్తి కలిగిస్తుంది. ఈ రెండింటినీ భక్తితో చేసిన వారికి మరి పునర్జన్మలేదు. ఈ వ్రతంలో విత్తశాఠ్యం ఎంతమాత్రమూ పనికిరాదు. ధనవంతుడు లోభించి క్లుప్తంగా ఈ వ్రతం చేస్తే ఆ దురాత్ముడు విష్ణుమూర్తిని మోసగించినట్టు. దానికి తగిన శాస్తి జరుగుతుంది. కలిభుజంగ దుష్టులై మాయాపాశవిమోహితులై కొందరు పాపాత్ములు ఏకాదశినాడు నిద్రిస్తారు. వాళ్ళు ఏమి నష్టపోతున్నారో ఎంత నష్టపోతున్నారో తేల్చిచెప్పడం కష్టం. జీవితం అధ్రువం కాబట్టి ఒకసారి జారవిడుచుకున్న ఏకాదశిని కూడదీసుకోవడం అసంభవం. పౌరాణికుడు దొరక్కపోతే గీతానృత్యాదులతో జాగారం చెయ్యాలి. దొరికితే పురాణ పఠనం చెయ్యడమే అత్యుత్తమం. ఇలా జాగరణం చేసిన హరిభక్తులు పితృదేవతలు వైకుంఠవాసులవుతారు. జన్మాంతంలో తామూ వైకుంఠధామం చేరుకుంటారు. షష్ఠి సహస్రవర్షాలు ఆశ్వేతద్వీపంలోనే నివసిస్తారు. తాను కాళ్ళతో రేపిన దుమ్ములో ఎన్ని కణాలుంటాయో అన్ని వేల సంవత్సరాల పాటు ఏకాదశీ జాగరికి వైకుంఠవాసమనీ కనకనే ఆ రోజున ఎంతదూరమైనా నడిచి మాధవాలయానికి వెళ్ళాలనీ పెద్దలు చెబుతారు.

ఏకాదశీ జాగరణ తరువాత ద్వాదశినాటి ఉదయం విష్ణుమూర్తికి పుష్పమంటపం నిర్మించాలి. దీనికి సమర్పించే ఒక్కొక్క పువ్వూ ఒక్కొక్క అశ్వమేధ ఫలం ఇస్తుంది. ఇలాంటి విశ్వాసాలతో విశుద్ధ భావాలతో ఏకాదశి ఉపవాసం - జాగరణం చేస్తే నిమిష నిమిషానికీ చేకూరే పుణ్యం తీర్థకోటికి సాటి వస్తుంది. ద్వాదశినాటి ఉదయం స్నానసంధ్యాదులు ముగించి షోడశోపచారాలతో శ్రీహరిని అర్చించాలి. ఏకాదశినాడు స్వామికి పంచామృతస్నానం, ద్వాదశినాడు క్షీరాభిషేకం జరపాలి. ఈ రెండూ చేసిన భక్తుడు హరి సారూప్యం పొందుతాడు. కేశవా! అజ్ఞాన తిమిరాంధుణ్ని నేను ఈ వ్రతంలో నువ్వు ప్రసన్నుడవై సుముఖడవై జ్ఞాన దృష్టిని ప్రసాదించు అని ప్రార్థిస్తూ నారాయణుడికి సాగిలిమ్రొక్కాలి.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

చక్రికి ఇలా విజ్ఞాపన చేసి ద్వాదశినాటి మధ్యాహ్నం బ్రాహ్మణ సంతర్పణ జరపాలి. భూరిదక్షిణలతో తాంబూల నూతన వస్త్రప్రదానాలతో సంతృప్తి పరచాలి. అటుపైని తాను తనకు నిత్య విధులైన పంచయజ్ఞాలు ముగించి బంధుమిత్రులతో కలిసి మౌనంగా నారాయణ పరాయణుడై భుజించాలి. ఇలా చేసిన హరి భక్తుడికి ఏకాదశీ వ్రత ఫలంగా పునరావృత్తి రహితమైన విష్ణులోక నివాసం లభించి తీరుతుంది.

ఈ వ్రత దీక్షతో ఉన్నంతసేపూ - వృషులులతో వేదనిందకులతో వృషలీపతులతో అయాజ్యయాజకులతో కుండాశులతో (అక్రమసంతానం) గోళకులతో (విధవాసంతానం) దేవలకాశులతో (స్థావర పూజలతో జీవించేవాళ్ళు) భిషక్కులతో కావ్యకర్తలతో దేవద్విజ విరోధులతో పరాన్న లోలుపులతో పరస్త్రీ నిరతులతో మాట్లాడకూడదు. మర్యాదకోసం మాటమాత్రంగానైనా పలకరించకూడదు. (వాఙ్మాత్రేణాపి వార్చయేత్). ఇట్లాంటి నియమాలు పాటించి నిగ్రహం కలవాడై సర్వహితం కోరుతూ ఏకాదశీవ్రతం పరిసమాప్తం చేస్తే పరమపదం కైవసమవుతుంది. సారాంశంగా ఒక్కమాట - గంగకు సాటివచ్చే తీర్థం లేదు. తల్లికి సాటివచ్చే గురువులేడు, శ్రీహరికి సాటివచ్చే దేవదేవుడు లేడు, (ఏకాదశీ) ఉపవాసానికి సాటివచ్చే తపస్సులేదు. వేద సమమైన శాస్త్రం, శాంతిసమమైన సుఖం, సత్యసమయమైన వెలుగు, ఉపవాస సమమైన తపస్సులేవు. తల్లికి సరితూగే ఓర్పరి, కీర్తికి సరితూగేధనం, జ్ఞానానికి సరితూగేభావం, ఉపవాసానికి సరితూగే తపస్సు లేవంటే లేవు.

**నాస్తి గంగాసమం తీర్థం నాస్తి మాతృసమో గురుః ।**
**నాస్తి విష్ణుసమో దేవః తపో నానశనాత్పరమ్ ॥**
**నాస్తి వేదసమం శాస్త్రం నాస్తి శాంతిసమం దుఖం ।**
**నాస్తి సత్యసమం జ్యోతిః తపోనానశనాత్పరమ్ ॥**
**నాస్తి క్షమాసమా మాతా నాస్తికీర్తి సమం ధనమ్ ।**
**నాస్తి జ్ఞానసమో భావః తపోనానశనాత్పరమ్ ॥**

## భద్రశీల గాధ

సనత్కుమారా ! ఈ విషయంలో పురాతనమైన ఇతిహాసం ఒకటి ఉంది. చెబుతాను ఆలకించు. పూర్వకాలంలో గాలవుడు అనే ముని వున్నాడు. నర్మదాతీరంలో కందమూల ఫలాలూ సమిత్కుశ పుష్పాదులూ సమృద్ధిగా దొరికే ఒక సుందరారణ్యంలో ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేసుకుంటున్నాడు. శాంతి - దాంతులు కలవాడు. సత్యపరాయణుడు. జితేంద్రియుడై తపస్సు కొనసాగిస్తున్నాడు. ఆ అరణ్య సౌందర్యం పక్షిమృగాలకోలాహలం సిద్ధచారణ గంధర్వ యక్ష విద్యాధరాదుల్ని సహితం ఆకర్షిస్తూ వుండేది. వారు వచ్చి అక్కడ సంచేరించేవారు. ఈ తపోనిధి గాలవునికి భద్రశీలుడు అనే కుమారుడుండేవాడు. చాలా అందగాడు. పేరుకి తగ్గట్లే శీలసంపన్నుడు జాతి స్మరుడు. నారాయణభక్తి పరాయణుడు. అతడు బాలుడుగా వున్నప్పుడే ఆటలూపాటలు శ్రీ హరిపరంగా సాగించేవాడు మట్టితో నారాయణ ప్రతిమ చేసి దాన్ని అర్చించడం బాల్యక్రీడగా జరిపేవాడు. అర్చన ముగిసాక సకలజగత్తులకు సకల శుభాలు కల్పించమనీ ప్రార్థిస్తూ స్వామికి నమస్కరించేవాడు. ఉన్నట్లుండి ఒక్కొక్కరోజున ఈరోజు ఏకాదశి అని

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ఉపవాస దీక్ష స్వీకరించేవాడు. రాత్రి జాగారం చేసేవాడు. బాల్యం నుండీ ఇలాహరి భక్తి తత్పరుడైన బిడ్డడిని చూసి తల్లి తండ్రులు ఎంతగానో మురిసిపోయేవారు. ఒకనాడు తండ్రిగాలవుడు భద్రశీలుడ్ని ఒడిలో కూర్చోబెట్టుకొని ముద్దాడుతూ -

నాయనా ! మహాయోగులకుసైతం దుర్లభమైన నీ భక్తి నీ ప్రవర్తనా నన్ను ఆశ్చర్యపరుస్తున్నాయి. పేరుకి తగ్గట్లుగా వున్నావు. నిత్యమూ నువ్వు చేసే హరి పూజలూ సర్వభూతహితమూ, ఏకదశీవ్రతాలూ, నిర్మమంగా శాంతచిత్తంతో చేసే హరి నామ స్మరణలూ, - ఇవన్నీ నీ ఈడు పిల్లల్లో ఉన్నవి, విన్నవి, కన్నవికావు. నీకసలు ఈ విష్ణుభక్తి ఇంత చిన్నవయస్సులోనే ఎలా ఏర్పడింది ? నా ఆలోచనకు అందడం లేదు. నీకేమైనా తెలిస్తే చెప్పు ! వినినిండుగా సంతోషిస్తాను - అన్నాడు.

తండ్రీ ! జాత స్మరుణ్ని కనుక క్రిందటి జన్మలో యమధర్మరాజు చెప్పిన మాటలు నాకు జ్ఞాపకం వున్నాయి. నువ్వు అడిగావు కనుక అన్నీ వివరంగా చెబుతాను విను. నేను క్రిందటి జన్మలో సోమవంశంలో పుట్టిన మహారాజుని అప్పుడు నాపేరు ధర్మకీర్తి దత్తాత్రేయుడి శిక్షణలో ఆయావేదశాస్త్రాలు తెలుసుకొని ధర్మబద్ధంగా తొమ్మిదివేల సంవత్సరాలు ఈ భూమిని పరిపాలించాను. కీర్తి గడించాను. ధర్మకీర్తి అనే పేరుని చరితార్థం చేసుకున్నాను. ప్రజలంతా నన్ను దైవంతో సమానంగా చూసేవారు.

రాజ్యం అకంటకంగా ధనధాన్యసమృద్ధులతో తులతూగుతోంది. ఆ కీర్తి, ఆ భోగాలూ - రెండూ కలిసి లక్ష్మీ మదం గట్టిగా తలకెక్కింది. పాషండుల సలహాలు వింటూ అధర్మాలు అనేకం చేసాను. పూర్వ సంచితాలైన పుణ్యాలన్నింటినీ పోగొట్టుకొన్నాను. కూడనియుక్తులు చెబుతూ వితండవాదాలు చేస్తూ రాజ్యంలో యజ్ఞయాగాది క్రతువులూ సమస్త ధర్మకార్యాలనూ - నోములూ, వ్రతాలూ, జపాలూ - అన్నింటినీ నిలుపుదల చేసాను. నేను అధర్మ మార్గం పడితే నా ప్రజలు అంతకన్నా ముందుకు వెళ్ళారు. ఎన్నెన్నో ఘోరాలు చేసారు. వారుచేసిన పాపకృత్యాలలో పరిపాలకుడుగా నా భాగం నాకూ దక్కుతూ వచ్చింది. ఇలా రకరకాలుగా పాపం ప్రోగుచేసుకున్నాను.

ఒకనాడు - పదిమంది స్నేహితులతో కలిసి మృగయా వినోదం కొరకు అడవికి వెళ్ళాను. క్రూరమృగాలను వేటాడి అలసిపోయాను. సాయంకాలం అయ్యేసరికి రేవా నదీతీరం చేరుకున్నాను. అలసి గుర్రాన్ని ఒడ్డున నిలిపి హాయిగా నదిలో స్నానం చేసాను. వేటలో పడి ఉదయం నుండీ ఏమీతినలేదు కనుక నీళ్ళతో కడుపు నింపుకున్నాను. ఇంతలో సూర్యాస్తమయం అయ్యింది. నెమ్మదిగా చీకట్లు క్రమ్ముకున్నాయి. సేదతీర్చుకొని జలక్రీడముగించి గట్టుకి చేరుకున్నాను. అల్లంత దూరాన మనుజలు అలకిడి అయ్యింది. మెల్లగా నడుచుకుంటూ వెళ్ళాను. ఎవరో సమీప గ్రామస్థులు రేవానదీతీరంలో గుట్టుగా ఏకాదశీవ్రతం ఆచరిస్తున్నారు. నేను కూడా వారిలో ఒకడినై కూర్చుండిపోయాను. వారితో పాటు ఆరాత్రంతా జాగారం చేసాను. గుర్రపు స్వారీ, రోజంతా వేట, తిండీతిప్పలు లేకపోవడం జాగరణం - అన్నీ కలసి అలసటలో ప్రాణాలు ఎగిరిపోయాయి.

భీకరా కారులూ యమభటులు ప్రత్యక్షమయ్యారు. నన్ను యమపాశాలతో బంధించి యమలోకానికి తీసుకుపోయారు. యమధర్మరాజు ముందు నిలబెట్టారు. చిత్ర గుప్తుణ్ని పిలచి నా పాపాల చిట్టా చదవమన్నారు. చిత్రగుప్తుడు ఒక్కక్షణం ఆలోచించాడు. ధర్మరాజా ! ఈ ధర్మకీర్తితొలినాళ్ళల్లో ధర్మాత్ముడు. శ్రీ దత్తాత్రేయ గురువర్యుని

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

దర్శనం, స్పర్శనం, సంభాషణం వల్ల ధర్మశాస్త్రాలన్నీ ఎరిగి ధర్మబద్ధంగా జీవించిన వ్యక్తి. ఆ తర్వాత కొన్నాళ్లకు సాంగత్య దోషాలవల్ల అధర్మాత్ముడుగా మారాడు. ఇతడు చెయ్యని పాపం లేదు. కానీ దత్త స్వామి కృపవల్ల నిన్న ఏకాదశీ వ్రతం ఆచరించాడు. నిరాహారుడై హరిపూజలో పాల్గొన్నాడు. జాగరణం చేసాడు. ప్రాణాలు వదిలేసాడు. తెలిసి చేసినా తెలియకజేసినా పాప ఫలం తప్పనట్లుగానే పుణ్యఫలమూ తప్పదు. కనుక ఈ వ్రతంలో ఇతడి పాప సముద్రాలన్నీ ఇంకిపోయాయి. పుణ్యఫలమే మిగిలివుంది.

చిత్రగుప్తుడు ఇలా చెప్పేసరికి తండ్రీ ! యమధర్మరాజు సింహాసనం నుండి దిగివచ్చి నాకు సాష్టాంగపడ్డాడు. షోడశోపచారాలు చేసాడు. యమభటుల్ని అందర్ని పిలచి ఇలా ప్రకటించాడు.

దూతలారా ! మీకందరకూ ఒక హితం చెబుతున్నాను. శ్రద్ధగా వినండి. ధర్మపరాయణులై జీవితాలు గడిపి అసువులు బాసిన వారిని ఎవరినీ నా దగ్గరకు తేకండి. విష్ణుభక్తి పరాయణులనూ, వారి బంధుమిత్రులనూ, దైవంపట్ల కృతజ్ఞతా భావంతో జీవించేవారిని ఏకాదశీ వ్రత పరుల్నీ జితేంద్రియుల్ని - నారాయణా ! అచ్యుతా ! అని భవార్తి శమనం కోసం హరినామస్మరణ బిడియ పడకుండా బిగ్గరగా చేసే వారినీ విడిచిపెట్టండి వీళ్ళజోలికి మీరు వెళ్ళవద్దు. దూరం తొలగి వచ్చెయ్యండి. వీళ్ళకి నేను వేసే శిక్ష ఏమీలేదు.

స్వాచారపరులూ, గురుసేవకులూ, సత్పాత్ర దాననిరతులూ, పాషండ సాంగత్యదూరులూ, సత్సంగలోలుపులు, హరిహర సమబుద్ధిమంతులు, ఉపకార శీలురు బ్రాహ్మణభక్తి - కలవారు వీరిజోలికి మీరు పోవద్దు. వీరిని ఎప్పుడూ నా సన్నిధికి తేవద్దు.

తల్లితండ్రుల్ని ఏడిపించుకొని తినేవాళ్ళని, లోకకంటకుల్నీ, బ్రహ్మద్వేషుల్ని దేవుడిసొమ్ము దిగమ్రింగేవాళ్ళని, జననాశకారుల్ని - ఇలాంటి అపరాధుల్ని పట్టితీసుకురండి. నా సమక్షంలో నిలబెట్టండి తగిన శిక్షలు విధిస్తాను. ఏకాదశీ వ్రతపరాఙ్ముఖుల్నీ, ఉగ్రశీలురూ, లోకాపవాదనిరతులూ, పరదూషణపరాయణులూ, గ్రామ వినాశకులూ, ఉత్తముల్ని నిందించేవారూ బ్రాహ్మణుడి సొమ్ము కాజేసిన వారూ, వీళ్ళని బంధించి తీసికొనిరండి - వీళ్ళతో మనకు పని. నోరారా హరినామం జపించని వారూ, హరికి నమస్కరించనివారూ, హరికోవెలలకు వెళ్ళని వారూ - వీళ్ళని వెదికి వెదికి పట్టుకుని రండి. ఇటువంటి మహాపాప ప్రశస్తులు మనకు కావాలి.

తండ్రీ ! యమధర్మరాజు తన భటులకు జారీ చేసిన ఆజ్ఞలను విన్నాను. నాలో గొప్ప అనుతాపం బయలుదేరింది. చేసిన పాపకృత్యాలన్నీ కళ్ళఎదుట మెదిలి పశ్చాత్తాపంజెందాను. ఆపుకోలేని దుఃఖంతో వలవలా ఏడ్చాను. యమధర్మరాజు ఓదార్చాడు. దుఃఖపడకు ఏకాదశీవ్రతంవల్లా ఈ అనుతాపం వల్లా సద్ధర్మశ్రవణంవల్లా నువ్వు పాపరహితుడవేకాదు. మహాపుణ్యాత్ముడవయ్యావు - అంటూండగానే నాకు నారాయణరూపం వచ్చేసింది. సహస్ర సూర్యసంకాశుణ్ని అయిపోయాను. యమధర్మరాజు మళ్ళీనాకు సాష్టాంగపడ్డాడు. యమదూతలందరూ సాగిలపడి మ్రొక్కారు. అంతలోకే నూరు దివ్య విమానాలు వచ్చాయి. ఒకదానిలో కూర్చోపెట్టి వైకుంఠానికి సాగనంపారు. అక్కడ దివ్యభోగాలు అనుభవిస్తూ దివ్య విమానాల్లో సంచరిస్తూ కొన్నివేల సంవత్సరాలు గడిపాను. అటుపైన ఇంద్రలోకానికి పంపారు. అక్కడా అందరి దేవతల నమస్కారాలు అందుకుంటూ ఇంద్రభోగాలు అనుభవిస్తూ మరికొన్ని వేలసంవత్సరాలు ఆనందించి ఏకాదశీ పుణ్యఫలం నిల్వలు కరిగిపోవడంతో భూగోళానికి తిరిగి వచ్చాను. మీయింట

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

బిడ్డనై జన్మించాను. జాతిస్మరుణ్ని కనుక పూర్వజన్మ వృత్తాంతం గుర్తుంది. యమధర్మరాజు ప్రభోదించిన మేరకు ఆ బాల్యమూ హరిభక్తిని ఆచరిస్తున్నాను. ఏకదశీవ్రతాలు ఉపవాసాలతో జాగరణలు చేస్తున్నాను. అనుకోకుండా ఉపవాసం వుండి జాగారం చేస్తేనే ఇంత ఫలం నాకు దక్కిందంటే ఇక కావాలనీ భక్తితో ఏకాదశీవ్రతం చేసేవారికి దక్కేఫలం గురించి ఏమి చెప్పను, ఎంతని చెప్పను.

అంచేత తండ్రీ ! అప్పటి నుండి ఈనేను ఏకాదశీవ్రతాలు చేస్తున్నాను. అహరహమూ విష్ణు పూజలు చేస్తున్నాను. నా ఆకాంక్ష - పరమపద ప్రాప్తి - పరమానందదాయకమైన ఆ విష్ణులోకం చేరుకోవాలంటే భక్తి శ్రద్ధలతో ఏకాదశీవ్రతం చెయ్యడ మొక్కటే సులువైన మార్గం. ఈ కథ విన్నవారు చదివినవారూ కూడా సర్వపాప విముక్తులై జన్మాంతంలో విష్ణులోకం చేరుకుంటారు.

నాయనా భద్రశీలా ! నిన్ను పుత్రుడిగా పొంది మా జన్మలు ధన్యమయ్యాయి. మా వంశం తరించింది. నీ వల్ల హరి భక్తి మహిమ తెలుసుకోగలిగాను. ఏకాదశీ వ్రత మహిమ గుర్తించగలిగాను. తండ్రి నన్న మాటేగానీ నాకు తెలీని రహస్యాలు ఎన్నో బోధించావు. నిజానికి నువ్వే నా తండ్రివి, నా గురువువి. నాయనా ! ధర్మకీర్తిగా నువ్వు రాజ్యం చేస్తున్న రోజుల్లో దత్తస్వామి శిక్షణపొందాను అన్నావు. వేదశాస్త్రాలు, ధర్మాధర్మాలు ఆచారవ్యవహారాలు, ఆయోగీంద్రుడు నీకు బోధించాడన్నావు. ఆబోధలు వినాలని వుంది. జాతిస్మరుడువి కనుక నీకు అన్ని విషయాలు గుర్తుండి వుంటాయి. ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకొని క్లుప్తంగానైనా ఎరుకపరిస్తే ధన్యుణ్ని అవుతాను.

తండ్రీ ! పూర్వజన్మలో నొకసారి సహ్యాద్రికి వెళ్ళాను. అక్కడ ఆశ్రమం నిర్మించుకొన్న అత్రిపుత్రుణ్ని దర్శించాను. మధుమత్తుడై పాడుతున్నాడు, ఆడుతున్నాడు. కుడిచేతిలో మధు చషకం. ఎడమచేతి క్రింద జగదేకసుందరి. ఎరుపెక్కిన కన్నులు. తడబడుతున్న మాటలు, మద్యమాంసాల కంపుకి జోరుగా ముసురుతున్న ఈగలు అల్లంత దూరం నుండి చూసి అక్కడే సాష్టాంగపడి లేచి సాంజలిబంధంగా ఒకింత ముందుకి వంగి నిలబడ్డాను. దత్తప్రభువు నావైపుకి చూసాడు. చేతిలో మధుపాత్ర నాపైకి విసిరాడు. వెంటనే ఒకపాటి చేతి కర్ర కూడా విసిరాడు. ఆ పైన ఒక ఇటుకరాయి విసిరాడు. దెబ్బలు తగులకుండా తప్పించుకొని నిలబడ్డాను. నన్ను భయపెడుతూ తరమడానికి వచ్చాడు. నేను చలించలేదు. అలాగే నమస్కరించి నిలబడ్డాను. దత్తాత్రేయుడు వెనుతిరిగి వెళ్ళిపోయాడు. ఆనాడే నేను స్వామి పరివారంలో సభ్యుణ్ని అయ్యాను. నిత్యము సేవలు చేస్తున్నాను. ఎన్నో సంవత్సరాలు గడిచాయి. ఏనాడూ నన్ను పలుకరించని స్వామి నా వైపు చూపులన్నా నిగిడించనిస్వామి ఓనాడు నన్ను కరుణించారు.

కరుణామృత ధారల్ని కురిసే చూపుల్ని నాపైకి ప్రసరింపజేసారు. ఎందుకోసం వచ్చావు ? ఏమి కావాలని వచ్చావు? అని మృదువుగా అడిగారు. ప్రభూ ! ధర్మ స్వరూపం తెలుసుకోవాలని ఆశగా వచ్చాను - అభ్యర్ధనగా అన్నాను. ధర్మకీర్తి! తెలుసుకోగానే సరా ఆచరించవద్దూ సరే అయితే చెబుతాను విను అని ఒకవింతైన చిరునవ్వునవ్వి ధర్మాలనూ ధర్మసూక్ష్మాలనూ ఎన్నింటినో ఉపదేశించాడు దత్తప్రభువు. అన్నింటినీ అవగతం చేసుకొని స్వామికి కృతజ్ఞతగా నమస్కరించి అనుమతి తీసికొని రాజధాని చేరుకున్నాను. ధర్మబద్ధంగా పరిపాలన సాగించాను. ఏ జన్మ పాపమో దుష్ట సాంగత్యానికిలోనై ధర్మం తప్పి పాపాలు మూటగట్టుకున్నాను. చివరకు మళ్ళీదత్త స్వామి కృపవల్లనే మరణవేళ

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

సత్సాంగత్యం లభించింది. యముడిధర్మప్రభోదాలు వినగలిగాను. విష్ణుభక్తుణ్ని కాగలిగాను. సరేదత్త స్వామి చేసిన ధర్మప్రభోదాలు చెప్పమన్నావుగదా శ్రద్ధగా ఆలకించు. దత్తదేవుడు ఆ జన్మలో నన్ను సంభోదించి చెప్పిన ధర్మాలు యధాతథంగా వినిపిస్తాను.

## దత్తుడు ప్రబోధించిన వర్ణాశ్రమ ధర్మాలు

ధర్మకీర్తి మహారాజా ! వర్ణాశ్రమాచార యుతమైన సనాతన ధర్మం చెబుతున్నాను తెలుసుకో. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులని నాలుగు వర్ణాలువారు వున్నారు. వీరిలో మొదటి ముగ్గురికి ద్విజులు అని పేరు. తల్లి గర్భం నుండి పుట్టడం ఒక జన్మ. ఉపనయనం రెండవ జన్మ. కనుకనే వీరిని ద్విజులు అన్నారు. ఈ నాలుగు వర్ణాలవారూ స్వధర్మం తప్పకుండా జీవితాలు గడపాలి. వర్ణాశ్రమ ధర్మాలను ప్రజలు పాటించేటట్లుగా చెయ్యడం రాజుకి ప్రధమ కర్తవ్యం. స్వవర్ణ ధర్మాన్ని త్యజిస్తే వీరిని పాషండులు అంటారు. వీరిని కఠినంగా శిక్షించాలి. తనకు నిర్దేశించిన గుహ్యాసూత్రాలను, కర్మలను, విప్రుడు తు.చ. తప్పకుండా పాటించాలి. అది కృతకృత్యత పాటించకపోతే పతితుడైనట్లు సర్వధర్మ బహిష్కృతుడైనట్లు లెక్క - చతుర్వర్ణాలవారూ యుగధర్మాలను గమనించాలి. యధోచితంగా వాటికి లోబడి స్వధర్మాలను పరిష్కరించుకోవాలి. అలాగే స్మృతి విరోధం లేనంత వరకూ గ్రామాచారాలను పాటించాలి. త్రికరణ శుద్ధిగా ధర్మాచరణం చెయ్యాలి. స్వర్గ సంపాదం కాని ధర్మాన్ని, లోకం ఒప్పని ధర్మాన్ని వదిలి వెయ్యాలి.

ధర్మకీర్తి! సముద్ర యానం, కమండలు ధారణ, అన్యకన్యను వివాహం ఆడటం, దేవర న్యాయం చొప్పున వంశం నిలబెట్టుకోవడం (మరిదివల్ల పిల్లల్ని కనడం) మధుపర్క సందర్భంగా పశువధ చెయ్యడం శ్రాద్ధాలలో మాంసం పెట్టడం, వాన ప్రస్థస్వీకారం, స్త్రీ పునర్వివాహం, దీర్ఘకాలబ్రహ్మచర్యం నర - అశ్వమేధాలు చెయ్యడం, మహా ప్రస్థానగమనం, ఇవి ఈ కలియుగంలో పరిహరణీయాలని పెద్దలు చెబుతున్నారు. ఆయా ప్రాంతాలవారు - వారి వారి దేశీయాచారాలను విధిగా పాటించాలి. లేదంటే పతితుడవుతాడు. సర్వధర్మ బహిష్కృతుడవుతాడు.

చాతుర్వర్ణాలవారికి విడివిడిగా ధర్మాలున్నాయి. వాటిని ఎరుక పరుస్తాను తెలుసుకో, బ్రాహ్మణుడు దాన ధర్మాలలో సాటి బ్రాహ్మణులను సంతృప్తి పరచాలి. జీవన భృతికోసం యోగ్యులకు యాజ్ఞికం స్వీకరించవచ్చు. అధ్యాపనం చెయ్యవచ్చు. స్నానసంధ్యలు నిత్యమూ ఆచరించాలి. వేదాధ్యయనమూ చెయ్యాలి. ఆయుధ జీవికాకూడదు. అగ్ని పరిగ్రహం నిత్యకృత్యం. పరద్రవ్యాన్ని మట్టితో సమంగా చూడాలి. ఎప్పుడూ లోకహితం కోరాలి. మృదువుగా సంభాషించాలి. ఋతుకాలంలోనే ధర్మపత్నితో సంగమించడం ప్రశస్తం. క్షత్రియుడు కూడా ఇలాగే ఎవ్వరికీ అహితం పలుకకూడదు. దానధర్మాలతో విప్రుల్ని సంతోషపెట్టాలి. వేదాధ్యయనం చెయ్యాలి. యజ్ఞాలతో దేవతల్ని ఆనందపరచాలి. ఆయుధ జీవి కావాలి. ధర్మబద్ధంగా భూమిని పరిపాలించాలి. దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసితీరాలి.

పశుపాలన వాణిజ్యం కృషి వేదాధ్యయనం - ఇవీ ప్రధానంగా వైశ్యవర్ణ ధర్మాలు - యజ్ఞాలతో దేవతల్ని దానధర్మాలతో విప్రుల్ని సంతృప్తి పరచాలి. శూద్రులు - క్రయవిక్రయాలలో ఆర్జించిన లాభాలతో గానీ శిల్ప విద్యలతో సంపాదించిన ధనంతోగాని దానధర్మాలు యజ్ఞయాగాలు నిర్వహించాలి. ద్విజులకు అన్నింటా సహకరించడం వీరికర్తవ్యం. ఋతుకాలంలో ధర్మపత్నిని కలవడం ప్రశస్తం. లోకహితం కోరడం, మంగళప్రదంగా ప్రియంగా మృదువుగా

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

మాట్లాడటం. అనాయాసిత్వం (అట్టే శ్రమలేకుండా నిపుణంగా పనులు చెయ్యడం) మహోత్సాహిత్వం నిగర్విత్వం సహనగుణం (తితిక్ష) - ఇవన్నీ అన్ని వర్ణాల వారికీ సాధారణ ధర్మాలు.

తమ వర్ణాశ్రమాలకూ తగినకర్మలను అనుష్టించడం ద్వారా అందరూ ముక్తికి అర్హులవుతారు. ఆపత్కాలంలో బ్రాహ్మణుడు క్షత్రియాచారాన్ని క్షత్రియుడు వైశ్యాచారాన్ని ఆశ్రయించవచ్చు. ఇదీ ఆపద్ధర్మం మాత్రమే. వర్ణాలు లాగానే ఆశ్రమాలు కూడా నాలుగే. అయిదవదిలేదు. బ్రహ్మచర్యం - గృహస్థాశ్రమం - వానప్రస్థం - సన్యాసం. కర్మయోగరతులై నిస్పృహులై శాంతమనస్కులై స్వకర్మ పరినిష్ఠతులై అన్ని ఆశ్రమాలవారూ పునరావృత్తి రహితమైన ముక్తిని పొందగలుగుతారు. వీటిలో స్వకర్మను పరిత్యజించి పరకర్మను ఆశ్రయించినవాడు పాషండుడు అనబడతాడు. అతడే సర్వధర్మ బహిష్కృతుడు.

## షోడశ సంస్కారాలు

అన్ని వర్ణాలవారికి గర్భాదానాది సంస్కారాలు పదహారు ఉన్నాయి. అని కూడా తెలుసుకోవడం అవసరమే. గర్భాదానం - పుంసవనం - సీమంతం - జాతకర్మ - నామకరణం - అన్నప్రాశనం - చౌలం - ఉపనయం -ప్రజాపత్యం - సౌమ్యం - ఆగ్నేయం - వైశ్వదేవం - గోదానం - సమావర్తనం - వివాహం - అంత్యకర్మం - ఇవీ షోడశసంస్కారాలు. వీటిలో గర్భాదానం పురుషుడికి సమంత్రకంగా స్త్రీకి అమంత్రకంగా చెయ్యాల్సిన సంస్కారం. తొలిచూలు గర్భిణికి **4-6-7-8** మాసాలలో సీమంత సంస్కారం చెయ్యాలి. పుత్రోదయం కాగానే తండ్రి కట్టుబట్టలతో సహా స్నానం చెయ్యాలి. స్వస్తి వాచన పూర్వకంగా నాందీశ్రాద్ధం ఆచరించాలి. బంగారంతో గానీ, ధాన్యంతో గానీ జాతశ్రాద్ధం చెయ్యాలి. అన్నంతో మాత్రం చేయరాదు. సూతకమయ్యాక యధావిధిగా మౌనంగా తండ్రి బిడ్డకు నామకరణం చెయ్యాలి. అర్థవేది (అతిప్రకటితమైన అర్థం కలది) అర్థహీనం, అతి గుర్వక్షరాన్వితం విషమాక్షర సహితం - అయిన పేరును పెట్టకూడదు.

గుహ్య సూత్రోక్తప్రకారంగా **3-5-6-7-8** సంవత్సరాల వయస్సులో బిడ్డడికి చౌల సంస్కారం చెయ్యాలి. దైవయోగం వల్ల ఈ గర్భాదానాది సంస్కారాలకు కాలాతి క్రమణం జరిగితే పాదకృఛ్ఛ ప్రాయశ్చిత్తం చౌలానికి కాలాతి క్రమణం జరిగితే అర్థకృఛ్ఛ ప్రాయశ్చిత్తం చెయ్యాలి.

గర్భాష్టమంలో గానీ ఎనిమిదేళ్ళ వయస్సున గానీ పుత్రుడికి ఉపనయనం చెయ్యాలి. అధమ పక్షం పదహారేళ్ళ లోపులో జందెం వెయ్యాలి. క్షత్రియుడికి పదకొండో యేట ప్రశస్తం. అధమ పక్షం ఇరవైరెండేళ్ళు దాటేలోగా, వైశ్యుడికి గర్భద్వాదశంలో ఉపనయనం ఉత్తమపద్ధతి. అధమ పక్షం ఇరవైనాలుగేళ్ళ వయస్సు దాటేలోగా చెయ్యడం మంచిది. బ్రాహ్మణవటువు కాషాయాంబరం క్షత్రియ వటువు మాంజిష్టాంబరం, వైశ్యవటువు హరిద్రాంబరంధరించాలి.

ఉపనయనానంతరం ఈ వటువులు గురుకులంలో నివసిస్తూ గురుశుశ్రూష చేస్తూ వేదాధ్యయనం సాగించాలి. తెల్లవారు జామునే స్నానం చెయ్యడం గురువు గారికి సమిత్కుశ ఫలాదుల్ని అడవి నుండి తెచ్చి అందించడం వీరి నిత్యకృత్యం, యజ్ఞోపవీత - అజిన - దండాలను ధరించి ఉండాలి. వీటిలో ఏది ఎప్పుడు తెగినా, విరిగినా, వెంటనే సమంత్రకంగా కొత్తది ధరించి పాతదాన్ని నీటిలో వదిలిపెట్టాలి. బ్రహ్మచారులు భిక్షాన్నంతోనే జీవించాలి. శ్రోత్రియుల

ఇళ్ళల్లోనే బిక్షాటన చెయ్యాలి. భవతి భిక్షాందేహి అని బ్రాహ్మణవటువు. భిక్షాం భవతి దేహి అనిక్షత్రియవటువు. భిక్షాందేహి భవతి అని వైశ్యవటువు భిక్షను అభ్యర్థించాలి. సంబుద్ధి ఆది - మధ్య - అంతాలలో క్రమంగా రావాలి. ఉభయ సంధ్యల్లో అగ్ని కార్యం చెయ్యాలి. అటుపైన భిక్షాన్నం తెచ్చుకొని గురువు గారికి నివేదించి వారి అనుజ్ఞతో మౌనంగా భుజించాలి. మధువు - స్త్రీ - మాంసం - లవణం - తాంబూలం - దంత ధావనం - ఎంగిలి తినడం - (ఉచ్ఛిష్ట భోజనం) - పగటి నిద్ర - (దివాస్వాపం) - గొడుగు - పాదుకలు - చందన గంధాది పరిమళద్రవ్యాలు - జలకేళి - ద్యూతం - గీతనృత్యవాద్యాదులు - పరివాదం - ఉపతాపం - విప్రలాపం - అంజనం - పాషండ జన సంయోగం - శూద్ర సంగం - వీటిని పరిహరించాలి.

## నమస్కారవిధి

జ్ఞాన తపో వయో వృద్ధులకు బ్రహ్మచారి అభివాదన శీలియై ఉండాలి. వేదశాస్త్రాదుల్ని ఉపదేశించి ఆధ్యాత్మికాది దుఃఖాలను తొలగించే గురువుకు ముందుగా నమస్కరించాలి. బ్రాహ్మణుడు తన పేరుకి చివర శర్మపదం తగిలించి గోత్రనామాలు చెప్పుకుంటూ విప్రుడికి నమస్కరించాలి. క్షత్రియాదులకి ఎప్పుడూ నమస్కరించకూడదు. నాస్తికుడికీ భిన్నమర్యాదుడికీ (బహుళ మతాంతరుడు) కృతఘ్నుడికీ గ్రామయాజకుడికీ చోరుడికీ జూదగాడికీ (కితవుడు) ఉన్మత్తుడికీ, శఠ-ధూర్త-పాషండులకీ, అశుచికీ నమస్కరించకూడదు. అభ్యంగనస్నానం చేస్తున్న వాడికీ, జపం చేస్తున్నవాడికీ నక్షత్రజీవికీ, పరుగెత్తుతున్నవాడికీ, పాపాత్ముడికీ, స్నానం చెయ్యని వాడికీ, సమిత్కుశాదులు సేకరిస్తున్నవాడికీ, దండలు గుచ్చుతున్నవాడికీ, నీళ్ళకుండ మోసి తెస్తున్నవాడికీ, భోజనం చేస్తున్న వాడికీ వివాదశీలికి దిగంబరుడికీ, వాంతి చేసుకుంటున్న వాడికీ నీళ్ళమధ్యలో ఉన్నవాడికీ, భిక్షాన్నధారికీ, నిద్రిస్తున్న వ్యక్తికీ - నమస్కరించకూడదు. భర్తను చంపిన దానికి, పుష్పవతికీ, జారిణికీ, బాలింతకు, గర్భపాతినికి, కృతఘ్నికీ, చండిక్కీ (కోపిష్ఠి) - నమస్కరించకూడదు. సభలో యజ్ఞశాలలో దేవాలయంలో ఎవరు ఎవరికైనా ప్రత్యేకంగా నమస్కారం చేస్తే చేసినవారి పురాకృత పుణ్యమంతా నశించిపోతుంది.

పుణ్యక్షేత్రంలో పుణ్యతీర్థంలో స్వాధ్యాయ సమయంలో ఎవరూ ఎవరికీ ప్రత్యేకంగా నమస్కరించకూడదు. శ్రార్ధం - వ్రతం - దానం - దేవతాభ్యర్చనం - యజ్ఞం - తర్పణం - వీటిని చేస్తున్న వ్యక్తికి చేస్తున్న వేళ నమస్కరించకూడదు. నువ్వు ఎవరికైనా నమస్కరిస్తే అతడు ప్రతినమస్కారం చెయ్యకపోతే మరింక ఆ వ్యక్తికి ఎప్పుడూ నమస్కరించకూడదని కఠిన నియమం. కనక నమస్కరించదగిన వారికే అయినా సమయం సందర్భం చూసి మరీ నమస్కరించాలి.

## అనధ్యయనాలు

కాళ్ళు కడుక్కుని ఆచమించి వచ్చి గురువు గారి పాదాలు స్పృశించి నమస్కరించి అభిముఖంగా కూర్చుని వేదశాస్త్రాధ్యయనం సాగించాలి.

వేదాధ్యయనం చెయ్యకూడని రోజుల్ని అనధ్యయనాలంటారు. మార్గశీర్షం బహుళ సప్తమి, పుష్యమాసం బహుళాష్టమి, మాఘమాసం బహుళనవమి, ఫాల్గుణం బహుళ దశమి, భాద్రపదం బహుళైకాదశి - వీటిని అష్టకాలంటారు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ఈ తిధుల్లో వేదాధ్యయనం చెయ్యకూడదు. ప్రతినెలా అష్టమి చతుర్ధశి పూర్ణిమ అమావాస్యలూ మకర కర్కాటక రవి సంక్రాంతులూ - వీటిని పంచపర్వాలంటారు. ఇవికూడా అనధ్యయన దివసాలే. ఇంకా ఇలాగే ప్రతీపాడ్యమి, భాద్రపద కృష్ణపక్షంలో మహాభరణి (ఆషాడం), ఉత్థాన ద్వాదశీ (కార్తికం), ఆషాడ - కార్తిక - ఫాల్గుణాల్లో శుక్ల పక్ష ద్వితీయులు, మాఘశుద్ధ సప్తమి, అశ్వయుజ శుద్ధ నవమి - ఈ తిథులు వేదాధ్యయనానికి అనర్హాలు. అంటే అనధ్యయన దివసాలు. శ్రోత్రియ మరణం - గ్రామ దహనం - సూర్యమండలానికి (పరివేషం) గుడిచుట్టిన రోజు - ఎవరైనా శ్రోత్రియుడు అతిధిగా ఆశ్రమానికి వచ్చిన రోజు (దీన్నే శిష్టానధ్యయనం అంటారు).

కలహం జరిగిన రోజు - బ్రాహ్మణుడు వధింపబడ్డ రోజు - సంధ్యాసమయంలో మేఘం గర్జించిన రోజు - అకాల వర్షం పడిన రోజున - ఉల్కా, అశనిపాతాలు జరిగినప్పుడు - విప్రుడు అవమానింపబడిన వేళ - సంధ్యావందన సమయాలు - ఇవి కూడా అనధ్యయనాలు.

కృతయుగం ప్రారంభమైన కార్తిక శుద్ధనవమి, త్రేతాయుగారంభం వైశాఖ శుక్ల తృతీయ, ద్వాపరారంభం మాఘ పూర్ణిమ, కలియుగాది భాద్రపద బహుళ త్రయోదశి - ఇవ్వి అనధ్యయనాలు, ఇలాగే స్వాయంభువమన్వాది దివసాలు కూడా అనధ్యయనాలు. అవి ఏవి అంటే - కార్తిక శుద్ధ ద్వాదశి (స్వాయంభువ మనువు), అశ్వయుజ శుద్ధ నవమి (స్వారోచిష మనువు), చైత్ర శుద్ధ తృతీయ (ఉత్తమ మనువు), భాద్రపద శుద్ధ తృతీయ (తామసమనువు), పుష్యశుద్ధ ఏకాదశి (రైవత మనువు), ఆషాఢ శుద్ధ దశమి ( చాక్షుశమనువు), మాఘశుద్ధ సప్తమి (వైవస్వత మనువు), మాఘమావాస్య (సూర్యసావర్ణ మనువు), కార్తిక కృష్ణాష్టమి (ఇంద్రసావర్ణి), ఫాల్గుణామావాస్య (బ్రహ్మసావర్ణి), శ్రావణామావాస్య (అగ్నిసావర్ణి), ఆషాఢ పూర్ణిమ (రుద్రసావర్ణి), చైత్ర పూర్ణిమ (రౌచ్యమనువు), జ్యేష్ట పూర్ణిమ (భౌచ్యమనువు) - ఈ తిథులు అనధ్యయనాలు. ఈ యుగాదుల్లో మన్వాదుల్లో విప్రులు శ్రాద్ధ విధులు నిర్వర్తించాలి. ఇవికాక ఇంకా కొన్ని అనధ్యయ దివసాలు ఉన్నాయి. శ్రాద్ధ భోక్తగా నియంత్రితుడైనప్పుడు, సూర్య-చంద్ర గ్రహణాల్లోనూ ఉత్తరాయన - దక్షిణాయన దివసాల్లోనూ శవయాత్రలో పాల్గొన్న రోజున, జాతాశౌచంగానీ మృతాశౌచంగానీ వచ్చిన రోజుల్లోనూ సర్పాదులు కనిపించిన రోజున, భూకంపం వచ్చినప్పుడు - వేదాధ్యయనం చెయ్యకూడదు. అనధ్యయన దివసాల్లో అధ్యయనం చేస్తే అతడి ప్రజ్ఞనూ యశస్సునూ సంపదనూ ఆయుష్షునూ బలాన్ని ఆరోగ్యాన్ని అన్నింటినీ యముడు స్వయంగా కత్తిరిస్తాడు. పైగా బ్రహ్మ హత్యాపాతకం చుట్టుకుంటుంది. అటువంటివాణ్ని అందరూ వెలివెయ్యాలి, పలకరించకూడదు.

కుండగోళకులకి జడులకీ వారి సంతతికీ ఉపనయనం జరిపించవచ్చునని కొందరి మతం, సరే. ఉపనయనం అయ్యాక వేదాధ్యయనమునకు ఉపక్రమించాలి. వేదం చెప్పుకోకుండా ఏ శాస్త్రాలు చదివినా వ్యర్థమనీ నరకపాత హేతువనీ ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. అతడి నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానమంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. వేదాన్ని అభ్యసించని విప్రుల సర్వకర్మలూ వ్యర్థాలే. వేదము అంటే శబ్దబ్రహ్మమయుడైన విష్ణు స్వరూపం. అందుకని విప్రుడు వేదాధ్యయనం చేసి తీరాలి. వేదాధ్యాయికి సకలాభీష్టాలు తమంతతాముగా సిద్ధిస్తాయి.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

# వివాహ సంస్కారం

గురుకులంలో ఉండి గురు శుశ్రూష చేస్తూ బ్రహ్మచర్య దీక్షతో వేదాధ్యయనం ముగించుకున్నాక గురువుల అనుమతితో అగ్ని పరిగ్రహం చెయ్యాలి. అటుపైని వేదాంగాలైనా శాస్త్రాలనూ, ధర్మశాస్త్రాలనూ అధ్యయనం చెయ్యాలి. అటుపైన పుష్కలంగా గురుదక్షిణ చెల్లించి ఆశీరనుమతులు స్వీకరించి గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి. రూపలక్షణ సంపన్న సుగుణ సత్కులోద్భవ సుశీల ధర్మచారిణి అయిన కన్యను వివాహం చేసుకోవాలి. తల్లి వైపు నుంచి అయితే అయిదుతరాలూ తండ్రివైపు నుంచి అయితే ఏడుతరాలు దాటితే ఆయా వంశాల్లో నుంచి కన్యను వివాహం చేసుకోవచ్చు. లేకపోతే గురుభార్యా సంగమం దోషం చుట్టుకుంటుంది. రోగిణి - వృత్తాక్షి - సరోగకుల సంభవ - అతికేశ - అకేశ - వాచాల - కాయస్థ - వామన - దీర్ఘదేహ - విరూపిణి - న్యూనాధికాంగి - ఉన్మత్త - పిశున - వృధాహాస్యముఖి - కృశించినది - స్థూల దంతిక - కనుబొమ్మలు కలిసిపోయినది (లగ్నభ్రువు) - కృష్ణముఖి - స్థూలశరీరిణి - ఉష్ణశరీరిణి - ఘర్ఘర నాదిని - అతికృష్ణ రక్తవర్ణ - ధూర్తురాలు - స్థూల గుల్ఫ - దీర్ఘ జంఘ - పురుషాకృతి కలది - శ్మశ్రుముఖి (మీసాలున్నది) - సదారోదన శీల - పాండువర్ణ - కుత్సిత - కాసశ్వాసాది సంయుక్త నిద్రాశీల - అన్యధా భాషిణి - లోకద్వేష పరాయణ - పరాపవాదనిరత - తస్కర - దీర్ఘనాసిక - కితవ (జూదరి) - అతిరోమశ - గర్విత - కు (టెల) వృత్తి - ఇటువంటి కన్యలని (సుఖంగా సంసారం చేసుకోవాలన్నప్పుడు) వివాహమాడకూడదు. చిన్నప్పుడు గుణం తెలియక వివాహం చేసుకున్నా పెద్దయ్యాక ఆవిడలో దుర్గుణాలూ విపరీత బుద్ధులూ కనిపిస్తే వదిలిపెట్టేయ్యాలి. భర్తపట్లా, సంతానం పట్లా ఎప్పుడూ నిష్ఠురంగా ఉంటూ పరులకు అనుకూలంగా ప్రవర్తించే ఇల్లాలిని విడిచిపెట్టెయ్యాలి.

నాయనా, ధర్మకీర్తీ ! ఎనిమిది రకాల వివాహాలు ఉన్నాయి. వీటిలో పూర్వపరం ఉత్తమోత్తమాలు మొదటిది కుదరకపోతే రెండోది, రెండోదీ కాకపోతే అలా ఈ విధానాలకు చెల్లుబాటు. బ్రాహ్మం, దైవం, అర్షం, ప్రాజాపత్యం, అసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచమని ఎనిమిది వివాహ పద్ధతుల్ని చెప్పారు మన మహర్షులు.

వీటిలో బ్రాహ్మణులు బ్రాహ్మపద్ధతి వివాహమే చేసుకోవాలి. దైవమైనా ఫర్వాలేదు. అర్షం కూడా అంగీకార్యమేనని చాలామంది అభిప్రాయం. తక్కిన ప్రాజాపత్యాది పద్ధతులైదూ విప్రులకు పనికిరావు. మొదటి ఉత్తమ పద్ధతులు కుదరనప్పుడు అగతికంగా అనంతర పద్ధతులకి దిగవచ్చు, కానీ అది దిగజారడమే (అభావేషుతు పూర్వేషు కుర్యాదేవ అవరాన్ బుధః)

విద్యావంతుడు బుద్ధిమంతుడు ఆచారపరుడు అయిన వరుణ్ని పిలిచి కన్యాదాత నూతన వస్త్రాదుల్ని అలంకరించి పూజించి పిల్లనిచ్చి పెళ్ళిచేస్తే అది బ్రాహ్మవివాహం. జ్యోతిష్టోమాది యజ్ఞాలను యధావిధిగా చేయించిన ఋత్విక్కుకి కన్యాదానం చేస్తే అది దైవవివాహం. ధర్మార్థంగా వరుడి నుంచి రెండు గోవుల్ని పుచ్చుకుని కన్యనిచ్చి పెళ్ళిచేస్తే అది అర్షవివాహం. మీరిద్దరూ కలిసి గృహస్థ ధర్మాలు నిర్వహించండి అని ఒడబరిచి వధూవరులకు వివాహం జరిపిస్తే అది ప్రాజాపత్య వివాహం. ధనం ఇచ్చి కన్యను (కొనుక్కొని) వివాహమాడితే అది అసురం, వధూవరులు తమంతతాముగా చేసుకొనే వివాహం - గాంధర్వ వివాహం. బలాత్కారంగా కన్యను అపహరించి తీసుకుపోయి వివాహమాడితే అది రాక్షస వివాహం. నిద్రపోతున్న కన్యనో మధ్యపాన వివశగా ఉన్నదానినో కేవల సంభోగేచ్ఛతో స్వాధీనం చేసుకోవడం పైశాచ వివాహం ఇది అన్నింటిలోకీ అధమాధమ పద్ధతి అని మహర్షులు నిరసించారు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

# గృహస్థాచారం

గృహస్థు కనీసం రెండు యజ్ఞోపవీతాలు ధరించాలి. ఉత్తరీయం వదలకూడదు. సువర్ణకుండలాలు ధౌత వస్త్రద్వయం ధరించాలి. పరిమళద్రవ్యాల అనులేపనం పుష్పమాలికల ధారణ ఉండాలి. కేశాలనూ నఖాలనూ అందంగా కత్తిరించుకుని శుచిగా ఉండాలి. వేణుదండం ఉదకంతో కూడిన కమండలువు, తలపాగా గొడుగు పాదుకలు చెప్పులు ఉపయోగించాలి. అలంకరించుకుని ప్రియదర్శనుడుగా ఉండాలి. నిత్యం స్వాధ్యాయం అధ్యాపనం ఏమరకూడదు. స్వాచారం విడువకూడదు. పరాన్నం భుజించకూడదు. పరివాదాలకు దిగకూడదు. పాదం మీద పాదం వేసి తోముకోకూడదు. ఉచ్ఛిష్టాన్ని దాటకూడదు. ఒకేసారి రెండు చేతులతోనూ బుర్రబరుక్కోకూడదు. దేవాలయాల్లోకి అపసవ్యంగా ప్రవేశింపకూడదు. దేవతార్చన ఆచమనం స్నానం వ్రతం శ్రాద్ధంలాంటి కర్మల్ని ఆచరిస్తున్నప్పుడు ముక్తకేశుడూ ఏకవస్త్రధారీకాకూడదు. దుష్టయానాలను అధిరోహించకూడదు. శుష్కవాదాలు చెయ్యకూడదు. పరకాంతలను స్పృశించరాదు. ఆశించరాదు. పొందరాదు. పిసినారితనం పనికిరాదు. కొండేలు చెప్పే బుద్ధి ఉండకూడదు. చతుష్పథంలో విప్రులకూ రావిచెట్టులకూ అపసవ్యంగా వెళ్ళకూడదు. అసూయనూ పగటి నిద్రనూ వదిలెయ్యాలి. ఇతరుల పాపాలను ప్రస్తావించడంగానీ సొంతపుణ్యకార్యాలను ప్రశంసించడంగానీ చెయ్యకూడదు. తన ఆయుర్దాయాన్నీ నక్షత్రాన్నీ మానాన్నీ గోప్యంగా ఉంచుకోవాలి. దుర్జనులతో జతకట్టకూడదు. అశాస్త్రం వినకూడదు. ఆసవ ద్యూత - గీతాదుల పట్ల ఆసక్తిని చంపుకోవాలి. రక్తంతో తడిగా ఉన్న ఎముకనూ మద్యాన్నీ ఉచ్ఛిష్టాన్ని పతితుడైన మనిషినీ, సర్పాన్ని, వైద్యుణ్ణి తాకినట్టయితే సచేలస్నానం చెయ్యాలి. చితినీ చితికాష్టాన్నీ (బలిపశువుని కట్టిన) యూప స్తంభాన్నీ చండాలుణ్నీ దేవలుణ్ని తాకితే సచేలస్నానం చెయ్యాలి. దీపపునీడ, మంచంనీడ, కేశవస్త్ర నఖోదకం, అజం మార్జాలం రేణువు - ఇవి మన పూర్వసంచిత పుణ్యాలను నశింపచేస్తాయి.

చేటలగాలి ప్రేతధూమం శూద్రాన్నం వృషలీపతితో స్నేహం - ఇవ్వి ఎంతమాత్రం పనికిరావు. తలంటుపోసుకున్నాక మిగిలిన నూనెను ఒంటికి పులుముకోకూడదు. (శిరోభ్యంగా వశిష్టేనతైలే నాంగం న వేపమేత్). అశుచిగా ఉండి తాంబూలం వెయ్యరాదు. నిద్రించేవాణ్ని అనవసరంగా లేపకూడదు. అపరిశుద్ధుడై అగ్నికార్యంగానీ మజ్జిగగానీ కుడిచెయ్యి స్పర్శ లేకుండా ఒక్క ఎడమ చేతితోనే తాగరాదు. గురువుగారి నీడనూ ఆజ్ఞనూ అతిక్రమించకూడదు. (నచాక్రమేత్ గురోః చాయాం తదాజ్ఞాం చ మునీశ్వరాః), యోగి-విప్ర-యతి-వ్రతులను నిందించకూడదు. బ్రాహ్మణులు ఒకరి మర్మాలను మరొకరు చెప్పకోకూడదు. ఎవరికీ చెప్పకూడదు. (పరస్పర మర్మాణి కదాచిన్న వదేత్ ద్విజాః), దర్శ పౌర్ణ మాసయాగాలను యథావిధిగా చెయ్యాలి. సాయంప్రాతరౌపాసాలను మానకూడదు. ఔపాసన మానితే సురాపానం చేసిన దోషం అంటుకుంటుంది. రెండు అయనాలతో విషువత్పుణ్య సమయాల్లో నాలుగు యుగాదుల్లో మన్వాదుల్లో అష్టకాల్లో దర్శంతో ప్రేతపక్షంలో (మహాలయం) తిధినాడూ కొత్త పంట ఇంటికి వచ్చినపుడు శ్రోత్రియుడు అతిథిగా వచ్చినప్పుడూ సూర్యచంద్రగ్రహణ సమయాల్లో పుణ్యక్షేత్రాల్లో తీర్థాల్లో తప్పకుండా పితృదేవతలకు శ్రాద్ధవిధులు ఆచరించాలి. ఊర్ధ్వ పుండ్రాలు ధరించకుండా చేసిన యజ్ఞం, దానం, తపస్సు, హోమం, స్వాధ్యాయం, పితృతర్పణం వృథా అవుతుందని కొందరి అభిప్రాయం. మరికొందరు ఊర్ధ్వపుండ్రానీ తులసినీ శ్రాద్ధ విధుల్లో అంగీకరించకూడదు. కాబట్టి శ్రేయోభిలాషులు వృద్ధాచారం ఏమిటో తెలుసుకొని దాన్ని పాటించటం మంచిది. స్మృతులు చెబుతున్న

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

ఇలాంటి సదాచారాలను అందరూ తప్పకుండా పాటించాలి. సదాచారపరులను విష్ణుమూర్తి అనుగ్రహిస్తాడు. విష్ణువే ప్రసన్నుడైతే అసాధ్యమేముందిక.

శౌనకాదిమునులారా! దత్తాత్రేయుడు ధర్మకీర్తికి బోధించిన వర్ణాశ్రమ ధర్మాలను భద్రశీలుడు (కిందటి జన్మలో ధర్మకీర్తి) తన తండ్రి గాలవుడికి చెబుతున్నట్టుగా నారదుడు సనత్కుమారుడికి ఉపదేశించగా వాటిని వేదధర్ముడు తన శిష్యుడు దీపకుడికి వివరిస్తున్నాడు. మొత్తం ఇదంతా బ్రహ్మదేవుడు కలిపురుషుడి సందేహాలను తీరుస్తున్న ఘట్టం. దత్తదేవుడి ఆజ్ఞతో నేను మీకు చెబుతున్నాను. స్వామివారు ధర్మకీర్తికి చెప్పిన శౌచసదాచారాలు మరికొన్ని ఉన్నాయి. ఆలకించండి.

## శౌచసదాచారాలు

ధర్మకీర్తీ! సద్బ్రాహ్మణుడు నిద్రలేచింది మొదలు ఏయే శౌచసదాచారాలు పాటించాలో వివరిస్తాను తెలుసుకో. బ్రాహ్మీముహూర్తంలో వామనస్తుతిపరత్వంగా నిద్రలేవాలి. పురుషార్థాలకు అవిరుద్ధంగా వుండే ప్రవృత్తుల గురించి యోచన చెయ్యాలి. జుట్టు (శిఖ) ముడివేసుకోవాలి. ఉత్తరీయాన్ని శిరస్సున కప్పుకోవాలి. యజ్ఞోపవీతాన్ని కుడిచెవికి తగిలించుకోవాలి. ఒక కర్రను జలపాత్రనూ పట్టుకోవాలి. బహిఃప్రదేశానికి వెళ్ళాలి. నేల కనబడకుండా గడ్డి పరవాలి. పగటివేళ కానీ ఉభయసంధ్యల్లో కానీ ఉత్తరముఖంగా కూర్చోవాలి. రాత్రిళ్ళు అయితే దక్షిణముఖంగా కూర్చోవాలి. మౌనంగా మలమూత్ర విసర్జన చేయాలి. బాటలో, గోష్ఠంలో, నదిఒడ్డున, నూతికి దగ్గరలో, చెరువుల చెంత, నీళ్ళల్లో, చెట్లనీడన, అడవిలో, అగ్నికి చేరువలో, దేవాలయాల దగ్గర, ఉద్యానవనాల్లో, దున్నిన పొలంలో, నాలుగుదారుల కూడలిలో, గురు, గో, బ్రాహ్మణ, స్త్రీ సన్నిధిలో ఊక-పొట్టు నిండిన స్థలాల్లో కపాలాల్లో ఇంకా ఇటువంటి చోట్ల మలమూత్ర విసర్జనలు చేయరాదు.

బ్రాహ్మణుడు ప్రయత్నపూర్వకంగా శౌచంపాటించాలి. శౌచ మూలాః ద్విజాంః అన్నారు. ఇది లేకపోయాక ఎంతటి సత్కర్మలన్నా వ్యర్థం.

ఈ శౌచం-బాహ్యము, ఆభ్యంతరము అని రెండు విధాలు. మట్టితో, నీటితో చేసుకొనేది బహిశ్శుద్ధి. భావశుద్ధినే ఆభ్యంతర శౌచము అంటారు.

మలమూత్ర విసర్జనలు అయ్యాక మర్మాంగం చేతబట్టుకొని లేచి మరొకచోట కూర్చుని మృత్తిక(మట్టి)తో నీటితో దుర్గంధం వదిలే వరకు ప్రక్షాళన చేసుకోవాలి. శౌచానికి ఉపయోగించే మట్టిని అనుచ్ఛిష్ట ప్రదేశాల నుంచే తీసుకోవాలి. ఎలుకలు త్రవ్విందో, నాగటితో లేచిందో, వాపీకూపతటాకాదులకు సంబంధించిందో కాకూడదు. ఈ బాహ్యమృత్తిక. నీటిలో నుండి తీసుకొన్న తడిమట్టి శ్రేష్ఠం. మర్మంగానికి ఒకసారి అపానంలో అయిదుసార్లు కుడిచేతికి ఏడుమార్లు ఎడమచేతికి పదిమార్లు పాదాలకు మూడేసిసార్లు మట్టిపులుముకొని ప్రక్షాళన చేసుకోవాలి. ఈ శౌచం గృహస్థులకు రెట్టింపు, బ్రహ్మచారులకు మూడు రెట్లు వానప్రస్థులకు, సన్యాసులకు నాలుగు రెట్లు - అధికం స్వగ్రామంలో అయితే పూర్ణశౌచం పాటించాలి. మార్గమధ్యంలో అర్ధశౌచం పాటిస్తే చాలు. రోగాతురుడైనప్పుడుగానీ ఆపత్కాలంలోగానీ ఈ శౌచనియమం లేదు.

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

స్త్రీలకూ ఉపవీతులకూ గంధలేపక్షయావధిగా ఈ శౌచం చెప్పబడింది. మిగతా వ్రతులందరికి యువతులకుమల్లేనే విధవలకు సైతం ఇదే శౌచం. ఇలా శౌచవిధి పూర్తి చేసుకుని తూర్పుముఖంగా కానీ ఉత్తరముఖంగా కానీ ముమ్మారు కూర్చుని ఆచమనం చేయాలి. దుర్గంధమూ నురుగూ లేని నీళ్ళు మాత్రమే ఉపయోగించాలి. రెండుసార్లు చెక్కిళ్ళు పెదవులూ తడిచేత్తో తుడుచుకోవాలి. తర్జన్యంగుష్టాలతో నాసికనూ అంగుష్ఠ నామికాలతో కళ్ళనీ కనిష్టాంగుష్టాలతో నాభినీ అరచేత్తో గుండెనీ అంగుష్టాగ్రాలతో శిరస్సునీ అంగుళీకాగ్రంతో భుజాలనూ స్పృశించాలి. అటుపైన స్నాన-మార్జన-జలతర్పణాలు ఆచరించాలి. ఆపైది సంధ్యోపాసన. సూర్యుడికి ఆర్ఘ్యప్రధానం. ప్రాతఃసంధ్యలో నిలబడి సూర్యదర్శనం అయ్యేదాకా గాయత్రిని జపించాలి. సాయంసంధ్యలో కూర్చుని నక్షత్ర దర్శనమయ్యేదాకా గాయత్రిని జపించాలి.

మధ్యాహ్నం కూడా సంధ్యోపాసన చేసి ఆర్ఘ్యం విడిచిపెట్టాలి. కూర్చుని కానీ నిల్చునికానీ గాయత్రిని జపించాలి. ప్రాతర్మధ్యాహ్నలలో గృహస్థు స్నానం చెయ్యాలి. దర్భలు చేతబట్టి బ్రహ్మయజ్ఞం చేయాలి. ఏదైనా ఇబ్బంది కలిగి లేదా ప్రమాదవశాత్తు ఈ వేదోక్తకర్మల్ని సకాలంలో చెయ్యలేకపోతే రాత్రి తొలిజాములో ఆరంభించి యధాక్రమంగా అన్నీ చేసుకోవాలి. ఏ ఇబ్బందీలేకపోయినా సంధ్యవార్చని విప్రుడు పాషండుడుగా పరిగణింపబడతాడు. వాడు సర్వధర్మ బహిష్కృతుడు. కూట యుక్తి విశారదుడై సంధ్యాది సత్కర్మాచరణాన్ని పరిత్యజించినవాడు మహాపాతకుల్లో కెల్లా మహాపాతకి. నేను సంద్యాది సత్కర్మల్ని విడిచిపెట్టానోచ్- అని ప్రకటించుకొనే ద్విజుడు ఆ చంద్రతారకంగా ఘోరనరకాలు అనుభవిస్తాడు.

సంధ్యోపాసన అయ్యాక దేవతార్చనం వైశ్వదేవం యధావిధిగా చేసుకోవాలి. ఆ సమయంలో వచ్చిన అతిథుల్ని మధురవాక్కులతో ఆహ్వానించి కందమూల ఫలగృహాన్న దానాలతో సంతృప్తిపరచాలి. వట్టి చేతులతో తిరిగి వెళ్ళే అతిథి తన పాపాన్ని మన ఇంటవదలి మన పుణ్యాలను పట్టుకపోతున్నాడని అర్ధం చేసుకో.

అతడి గోత్ర నామాలు ఏమిటో మనకు తెలియవు. పొరుగూరు నుండి వచ్చాడు. అటువంటివాణ్ని పండితులు అతిథి అన్నారు. విష్ణువులా భావించి అతడ్ని పూజించమన్నారు. స్వగ్రామవాసి, విష్ణుభక్తుడు శ్రోత్రియుడు- దిక్కులేని వాడు- ఇటువంటి విప్రుణ్ని నిత్యమూ అర్చించి అన్నోదకాలతో సంతృప్తిపరిస్తే దేవతలు అనుగ్రహిస్తారు. పితృదేవతలు తరిస్తారు.

పంచ యజ్ఞ పరిత్యాజీ బ్రహ్మహా - అన్నారు పెద్దలు. కనుక ఏ మారక రోజూ పంచయజ్ఞాలు చెయ్యాలి. దేవ-భూత-పితృ-మనుష్య-బ్రహ్మయజ్ఞాలను పంచయజ్ఞాలు అంటారు.

ఈ పంచయజ్ఞాలు నిర్వహించి అప్పుడు అతిథి మిత్రాదులతో కలసి శుచిగా రుచిగా మౌనంగా కూర్చుని భుజించాలి. పాత్రుడైన విప్రుణ్ని ఎప్పుడూ వదలిపెట్టకూడదు. అతనితో కలసి సహపంక్తిని భోజనం చెయ్యాలి. సగం వస్త్రం ధరించి కాళ్ళుపీట మీద పెట్టుకొని గొంతు కూర్చుని అన్నాన్ని ఆవిరి ఊదుకుంటూ భోజనం చెయ్యటం అంటే - సురాపానం సేవించటంతో సమానం.

కుడుములూ ఫలాలు మొదలైన వాటిని సగం తిని మళ్ళీ వాటినే తినటం అంటే - కొరుక్కుతినటం చాలా

తప్పు. ముక్కలుగా విరుచుకొనో లేదా తరుక్కునో తినాలి. అలాగే సరాసరి ఉప్పుని తినకూడదు. ఈ రెండు పనులూ చేస్తే గోమాంసం తిన్నపాపం చుట్టుకుంటుంది. అలాగే నీటిని ఆచమనం చేసేటప్పుడు ఆపోశనం చేస్తున్నప్పుడూ (జుర్రుమన్న) శబ్దం చెయ్యకూడదు. చేసినవాడు నరకానికి పోతాడు.

అన్నాన్ని ఎన్నడూ దూషించకూడదు. రుచులు మెచ్చుకుంటూ హితవైనది మితంగా భుజించాలి. ఎక్కువ మాట్లాడకుండా ఇంచుమించు మౌనంగా భుజించటం ఉత్తమం. భోజనాలయ్యాక శాస్త్ర చింతనలతో చర్చలతో అధ్యయనాలతో పగలు గడచిపోవాలి. రాత్రి కూడా ఇదే మాదిరి అతిథిని యధాశక్తిగా శయనాసన భోజనాదులతో నో కందమూల ఫలాదులతోనో గౌరవించాలి. గృహస్థుడు ఇలా సదాచారాలు పాటిస్తూ తాను తరించాలి. తన వారిని తరింపజేయాలి. ఎప్పుడైనా సదాచారం తప్పితే వెంటనే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

## వానప్రస్థం - సన్యాసం

తలనెరసి తనువు అలసి వృద్ధుడైన గృహస్థు తన భార్యను పుత్రుల దగ్గరుంచి లేదా వెంట తీసుకొనిగానీ అరణ్యానికి వెళ్ళాలి. ఒక పర్ణశాల ఏర్పరచుకొని కాలక్షేపం చెయ్యాలి. దీన్నే వానప్రస్థం అంటారు. మూడుపూటలా స్నానం చేస్తూ నఖ-శ్మశ్రు-జటాధారియై గంధ పుష్పాలకు దూరమై బ్రహ్మచర్యం పాటిస్తూ పంచయజ్ఞాలు చేస్తూ నేలమీద పరుండుతూ తపస్సు చేసుకోవాలి. పగటి పూట కేవలం ఎనమిది ముద్దలు భుజించాలి. రాత్రివేళ భోజనం చెయ్యరాదు. వన్యతైలంతో అభ్యంగస్నానాలు నిర్వర్తించుకోవాలి.

శంఖ చక్ర గదాపాణియైన నారాయణున్ని నిత్యమూ ధ్యానిస్తూ వుండాలి. చంద్రాయణా దికవ్రతాలు ఆచరించాలి. శీతావాతాదుల్ని ఓర్చుకోవాలి. అగ్నికార్యం విడువరాదు.

వానప్రస్థం సాగిస్తుండగా అన్ని వస్తువుల మీదా ఒక్కొక్కటిగా మనస్సులో వైరాగ్యం పుట్టుకవస్తుంది. తనంత తాను అది ఏర్పడినప్పుడు సన్యాసాశ్రమం స్వీకరించాలి. అలాకాకుండా (ఏదో కారణంగా హఠాత్తుగా సన్యాసం స్వీకరించినందువల్ల లేదా) మరోలా స్వీకరించిన సన్యాసం వల్ల మనిషి కడపటికి పతితుడూ భ్రష్టుడూ అవుతాడు.

సన్యాసి ఎప్పుడూ- వేదాంతాభ్యాస నిరతుడై శాంతుడై దాంతుడై జితేంద్రియుడై నిర్ద్వంద్వుడై నిరహంకారుడై నిర్మముడై కాలం గడపాలి. కామక్రోధాదుల్ని వదిలించుకున్నవాడై శమ దమాదిగుణాలకు ఆటపట్టుగా ఉండాలి. (ఇంచుమించు) నగ్నంగా కానీ చిరిగిపోయిన పాతగుడ్డ గోచీతోగానీ కాలక్షేపం చెయ్యాలి. శత్రుమిత్రుల పట్లా మానావమానాల పట్లా సమబుద్ధితో వుండాలి. గ్రామాల్లో అయితే ఏకరాత్రం. పట్టణాల్లో అయితే మూడురాత్రులూ నివసించవచ్చు. నిత్యమూ ఒక ఇంటిలో భిక్ష చెయ్యకూడదు. భిక్షాటనతో నాలుగు మెతుకులు సంపాదించుకోవటం ఉత్తమం. వివాదరహితులైన విప్రుల ఇళ్ళల్లోనే బిక్షాటన చెయ్యాలి. నిత్యం త్రిషవణ స్నానాలు చేస్తూ నారాయణ ధ్యానపరాయణుడై ప్రణవాన్ని జపిస్తూ ప్రణవసహితంగా నారాయణస్మరణ) విజితేంద్రియుడై నియతాత్ముడై జీవితం గడపాలి. ఒకే ఇంటనిత్యమూ భుజిస్తే లేదా ఒకే రకం ఆహారాన్ని రోజూ తీసుకుంటే యతీశ్వరుడు సైతం ఒక్కొక్కప్పుడు రాగలంపటుడవుతావు. నూరుప్రాయచ్ఛిత్తాలు చేసుకున్నా అటువంటి వాడికి నిష్కృతిలేదు.

సన్యాసి తన ఆశ్రమ చిహ్నాలను కావాలని ఏనాడూ కప్పిపుచ్చుకోకూడదు. అలా చేసినవానికి ప్రాయచ్ఛిత్తమే లేదు.

ఆత్మవిచారంతో నారాయణ నామస్మరణతో నిర్ద్వంద్వ నిర్మలశాంత మాయాతీత అమత్సర అవ్యయ పరిపూర్ణ సదా ఆనందైకవిగ్రహ జ్ఞానస్వరూప అమలసనాతన అవికార అనాద్యంత జగచ్చైతన్యకారణ నిర్గుణ పరంజ్యోతిర్మయ నామధేయాలతో విరాజిల్లే ఆ పరాత్పరుణ్ని ఆ పరమాత్మను ధ్యానిస్తూ సన్యాసి కాలం గడపాలి.

ఉపనిషత్తులను పఠిస్తూ వేదాంతార్థాలను యోచన చెయ్యాలి. జితేంద్రియుడై సుగతి తత్పరుడై ఎల్లవేళలా సహస్రశీర్షుడైన ఆ పరమాత్మను ధ్యానించాలి. అప్పుడే కోరుకున్న ముక్తిని పొందగల్గుతాడు. ధర్మకీర్తీ! బ్రహ్మచర్యం మొదలుకొని సన్యాసం వరకు ఒక్కొక్క ఆశ్రమాన్నీ గడుపుతూ వచ్చిన ద్విజుడు దుఃఖరహితుడై పునర్జన్మలేని ముక్తి పొందుతాడు.

కుమారా! దత్తాత్రేయుడు క్రిందటి జన్మలో నీకు చాలా రహస్యాలు బోధించాడు. ధన్యుడవయ్యావు. వాటిని నాకు వివరించినన్నూ ధన్యుణ్ని చేసావు. సంతోషం ఇంకా ఏమైనా చెప్పేవి వుంటే అవి కూడా నాకు వివరించు- అని తండ్రిగాలవుడు కోరాడు. అప్పుడు తనయుడైన భద్రశీలుడు గత జన్మలో ధర్మకీర్తిగా తానున్నప్పుడు దత్తదేవుడు తెలియపరచిన శ్రాద్ధ విధులను కూడా తండ్రికి వినిపించాడు. సనత్కుమారా! వాటిని సైతం ఆలకించు అనినారదుడు ఇలా కొనసాగించాడు.

శౌనకాది మునులారా! దీపక వేదధర్మ సంభాషణగా సాగుతున్న కలి-బ్రహ్మ సంవాదం వింటున్నారుగా శ్రాద్ధ విధులు ఆలకించండి అని సూతుడు అందుకున్నాడు.

## శ్రాద్ధ విధులు

శ్రాద్ధ కర్త క్షయావహానికి (తద్దినానికి) ముందు రోజు రాత్రి భోజనం చెయ్యకూడదు. బ్రహ్మచర్యం పాటించాలి. మర్నాటి శ్రాద్ధకర్మకు అవసరమైన బ్రాహ్మణుల్ని ఆ రోజే నియంత్రించుకోవాలి. ఆ రాత్రికి నేల మీదనే పరుండాలి. తద్దినం నాడు తత్కర్తలు దంతధావన - తాంబూల - తైలాభ్యంగ స్నాన - రతి - ఔషధీ - పరాన్న భోజనాలను వర్జించాలి.

శ్రాద్ధ నియంత్రితులైన బ్రాహ్మణులకి కూడా ఇవే నియమాలు. వాళ్ళు వీటిని పాటించపోతే బ్రహ్మహత్యా మహాపాతకులవుతారు. శ్రోత్రియుడు, విష్ణుతత్పరుడు, స్వాచారనిరతుడు ప్రశాంతుడు, సత్కులోద్భవుడు, రాగద్వేషరహితుడు, పురాణార్థ విశారదుడు, త్రిమధుత్రి సుపర్ణజ్ఞుడు (ఆపస్తంభశాఖా సూక్తద్వయం సార్థం జానాతి యః - అని పద మంజరీటీక. ధర్మశాస్త్రజ్ఞుడు అని తాత్పర్యం) సర్వభూతదయాపరుడు. దేవపూజారతుడు, స్మృతి తత్వ విశారదుడు, వేదాంత తత్వసంపన్నుడు, సర్వలోకహితాకాంక్షి, కృతజ్ఞుడు, గుణసంపన్నుడు, గురుశుశ్రూషణాపరుడు, పరోపదేశ నిరతుడు. అధ్యాపనతత్పరుడు, అయిన విప్రుణ్ని ఎంచుకొని శ్రాద్ధానికి నియంత్రించుకోవాలి.

శ్రాద్ధవిమంత్రణికి పనికిరాని వారు ఎవరంటే - న్యూనావయవులు, అధికావయవులు, కాయస్థులు (లేఖన జీవులు) రోగగ్రస్తులు, కుష్ఠి, కునఖి, లంబకర్ణుడు, క్షతావ్రతుడు, నక్షత్ర పాఠజీవి, శవదాహకుడు, కువాది పరివేత్త (అన్నగారికంటే ముందు తానై పెళ్ళి చేసుకున్నవాడు) దేవలకుడు, ఖలుడు, నిందకుడు, అమర్షణుడు, ధూర్తుడు, గ్రామ యాజకుడు, అసచ్ఛాస్త్రాభినిరతుడు, పరాన్నరతుడు, వృషలీపతి, వృషలీపుత్రుడు, కుండుడు, గోళకుడు, అయాజ్య యాజికుడు

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

(అర్హత లేనివారితో క్రతువులు చేయించేవాడు) దంభాచారుడు, వృధాముండుడు, అన్యస్త్రీ ధనతత్పరుడు, విష్ణుభక్తి విహీనుడు, శివభక్తిదూరుడు, వేద విక్రయి, వ్రతవిక్రయి, గాయకులు, కావ్యకర్తలు, వైద్యులు, శస్త్రోపజీవులు, వేదనిందకులు, దైవనిందకులు, రాజసేవకులు, కృతఘ్నులు, జూదరులు, నిత్యప్రయాణులు, సర్వద్యూతపరాయణులు, మిధ్యాభివాదులు గ్రామారణ్య ప్రవాహకులు, అతికాముకులు, వాంతకులు, రసవిక్రయులు, కూటసాక్షులు వీరు పనికిరారు. కుతపకాలంలో తద్దినం పెట్టాలి. అది పితృదేవతలకు అక్షయమవుతుంది. పగటి సమయాన్ని పదిహేను భాగాలు చేస్తే అందులో ఎనిమిదో భాగం కుతపకాలం అవుతుంది. అప్పటికి రవికిరణాల వేడి కొంతమందగిస్తుంది.

సృష్టికర్త పితృదేవతలకు ఇచ్చిన కాలం అపరాహ్ణమే కనుక ఆ సమయంలోనే వారికి పిండ ప్రదానాదికం చెయ్యాలి. అకాలంలో ఇచ్చిన కవ్యం వారికి అందదు. రాక్షసులు దాన్ని కాజేస్తారు. కనుక దాన్ని రాక్షస కవ్యప్రధానం అంటారు. అంచేత కుతపకాలానికి బాగా ముందేగానీ సాయంకాలంగానీ ఇచ్చే కవ్యం రాక్షసమవుతుంది. తత్కర్త తద్భోక్త నరకానికి పోతారు.

సూర్యోదయం నుండీ సూర్యాస్తమయం వరకు ఒకే తిథి వుంటే దాన్ని అఖండ తిథి అంటారు అలాగాక ఒకటే తిథి మర్నాటికి కూడా వ్యాపిస్తే దాన్ని ఖండ తిథి అంటారు. క్షయాహంతో (తద్దినం నాడు) ఖండ తిథివస్తే అపరాహ్ణానికి తిథి ఏ రోజున వుంటుందో ఆనాడే శ్రాద్ధ కర్మ చెయ్యాలి. రెండు అపరాహ్ణాలకూ అదే క్షయాహతిథి ఉన్నట్లయితే గడియల వృద్ధి క్షయాలనుబట్టి శ్రాద్ధ కర్మ ఎప్పుడో నిర్ణయించాలి. క్షయిస్తున్నట్లయితే పూర్వదిన అపరాహ్ణంలోనూ వృద్ధి పొందుతున్నట్లయితే పరదినాపరాహ్ణంలోనూ తద్దినం పెట్టాలి. క్షయాహ తిథి పూర్వదినా పరాహ్ణంలో రెండు ముహూర్తాలు వుండి మర్నాడు సాయంకాలం దాకా వుంటే పరదినా పరాహ్ణంలోనే శ్రాద్ధ విధి నిర్వహించాలని చాలా మంది నిర్ణయం. కొందరు పూర్వదినాపరాహ్ణంలోనే పెట్టాలంటారుగానీ అది అధిక సంఖ్యాకులకు సమ్మతంగా కనిపించటం లేదు.

శ్రాద్ధానికి నియంత్రితులైన విప్రులు ఒకరినొకరు తాకకూడదు. ఒక వేళ తాకితే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అలా విశుద్ధి పొందాక తత్కర్త వారి ఆజ్ఞను అనుసరించి మళ్ళీ వారిని శ్రాద్ధానికి నియంత్రించాలి. వైశ్వేదేవస్థానానికి ఇద్దరు, పితృదేవతల స్థానానికి ముగ్గురు బ్రహ్మణుల్ని నియంత్రించుకోవాలి. లేదంటే దానికొకరూ దీనికొకరూ నియుక్తులు కావాలి. బ్రాహ్మణులకి చతురస్యం క్షత్రియులకి త్రికోణాకారం వైశ్యులకి వర్తులం కర్తవ్యం. శూద్రులకి అభ్యుక్షణం అవసరం.

అభావం వస్తే అంటే బ్రాహ్మణులు దొరక్కపోతే సోదరుల్నిగానీ, పుత్రుల్నిగానీ, తనకు తానే గానీ, నియంత్రించుకోవచ్చు. అంతేగానీ వేదవర్జితుడైన విప్రుణ్ని మాత్రం నియంత్రించరాదు. బ్రాహ్మణుల పాదాలు కడిగి వాళ్ళు కూర్చుని ఆచమించాక నారాయణ స్మరణ చేస్తూ వారిని యధావిధిగా సమంత్రకంగా అర్చించాలి. ఆపైన బ్రాహ్మణుల మధ్య నుండి ద్వారదేశం వైపు 'అపహతా' అనే మంత్రోచ్చారణతో శ్రాద్ధకర్త నువ్వులు విసరాలి.

బియ్యమూ దర్భలతో విశ్వేదేవులకు, నువ్వులు దర్భలతో పితృదేవతలకూ అక్షయ్యాసనార్చనలు చెయ్యాలి. అక్షయ్యాసన సమర్పణలో షష్ఠీ విభక్తినీ, ఆ వాహనలో ద్వితీయావిభక్తినీ, అన్నదానంలో చతుర్థీ విభక్తినీ మిగతా సందర్భాల్లో సంబుద్ధిని పితృదేవతల నామధేయాలకు ఉపయోగించాలి.

దర్భల మీద పాత్రలుంచి శంనో దేవీతి మంత్రంతో ఉదకం నింపి యవోసి మంత్రంతో బియ్యం వేసి

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

గంధపుష్పాలతో అర్చించి విశ్వే దేవాస మంత్రంతో విశ్వేదేవతలను అవాహన చెయ్యాలి. యాదివ్యా మంత్రంతో అర్ఘ్యమివ్వాలి. గంధ, వస్త్ర, భూషణ, పత్ర, పుష్ప, ధూపదీపాలతో పూజించాలి.

విశ్వేదేవుల అనుమతి తీసుకొని పితృదేవతలను అర్చించాలి. తిలదర్భలతో ఆసనం సమర్పించాక (దర్భల మీద) మూడు పాత్రలుంచి శంనోదేవీ మంత్రంతో నీళ్ళునింపి తిలోసి మంత్రంతో నువ్వులు వేసి ఉశంతీతి మంత్రంతో పితృదేవతలను ఆ వాహనచేసి "యాదివ్యా"తో ఆర్ఘ్యమివ్వాలి. గంధ పత్ర వస్త్రభూషణ పుష్పధూప దీపాలతో యథాశక్తిగా అర్చించాలి. అటుపైన అన్నగ్రాసాన్ని అగ్నౌ కరిషేన మంత్రంతో అగ్నౌకరణం చెయ్యాలి. ఇక్కడ బ్రాహ్మణుల అనుమతి తీసుకోవాలి. ఈ హోమ సన్నివేశంలో అగ్ని బాహుళ్యం, విధావ బాహుళ్యం, నియమ బాహుళ్యం, సాంప్రదాయ బాహుళ్యం ఉంది గుర్తించాలి. తరువాత నియంత్రిత బ్రాహ్మణులు వాగ్యతులై భోజనాలు చెయ్యాలి. పెద్దగా నవ్వుతూ మాట్లాడుతూ పాకాదుల్ని ప్రశంసిస్తూ భుజిస్తే ఆ హవిస్సు రాక్షసమైపోతుంది. కనుక కావలసింది అడిగి వేయించుకోవటం కన్నా మాట్లాడకుండా ధృతభాజనులై భుజించాలి. అంటే భోజన పాత్ర (అరటి ఆకు) మీద ఒక వేలుంచి భోజనం చెయ్యాలి. అలా ఒక్కసారి అయినా ఉంచకుండా భుజిస్తే ఆ భోక్తశ్రాద్ధం చెడగొట్టిన పాపానికి ఒడిగట్టి నరకానికిపోతాడు.

భోజనాలు చేస్తున్నప్పుడు నియంత్రిత బ్రాహ్మణులు ఒకరినొకరు స్పృశించకూడదు. పొరపాటున తాకితే ఆ అన్నాన్ని వదలకూడదు. భుజించాలి. ప్రాయశ్చిత్తంగా నూట ఎనిమిదిమార్లు గాయత్రి జపించాలి. భోక్తలు భుజిస్తున్నంత సేపూ తత్కర్త నారాయణస్మరణం చేస్తూనో పురుషసూక్తం పఠిస్తూనో నచికేతత్రయం జపిస్తూనో ఇంకా ఇటువంటివాటితో కాలక్షేపం చెయ్యాలి. భోక్తలు లేచాక పిండప్రధానం చెయ్యాలి. పిండస్థల శుద్ధి జరపాలి. శ్రాద్ధంలో అగ్నౌకరణం బ్రాహ్మణ భోజనం పిండప్రధానం - ఇవి మూడు ముఖ్యమైనవి. బ్రాహ్మణులు భుజించిన విస్తళ్ళను కదిలించిన తరువాతనే స్వస్తి వాచనం జరపాలి. అలాకాకుండా ముందు జరిపితే అతడి పితృదేవతలు సంవత్సరం పాటు ఉచ్ఛిష్ట భోజనులు అవుతారు.

ద్రవ్యాభావానికి తోడు ద్విజాభావం కూడా తటస్థపడితే ఇంత అన్నం వండి పైతృకసూత్రంతో హోమం చేస్తే సరిపోతుంది. అగ్నియే దొరక్కపోతే (అగ్న్యాభావం) విపుహస్తంలో హోమం చెయ్యవచ్చు. అత్యంత ద్రవ్యశూన్యుడైతే (అన్నం కూడా వండలేనంత) ఆవుకి ఇంత గడ్డి వేసి స్నానం చేసి పితృదేవతలకు తర్పణాలు విడిచిపెట్టాలి. అది కూడా చెయ్యలేని మహాదరిద్రుడే అయితే నిర్జనారణ్యంలోకి పోయి దరిద్రుణ్ణి నేను మహాపాపిని అని నిందించుకుంటూ బిగ్గరగా ఏడవాలి.

తిథి అయిన మర్నాడు తత్కర్త తప్పకుండా పితృతర్పణాలు చెయ్యాలి. చెయ్యకపోతే బ్రహ్మహత్యా మహాపాతకం చుట్టుకుట్టుంది. వంశ నాశనమవుతుంది.

శ్రద్ధతో ఇలా పితృదేవతలనూ విశ్వేదేవతలనూ తిథినాడు అర్చించేవారికి వంశ విచ్ఛేదం ఉండదు. తామరతంపరగా వంశాభివృద్ధి జరుగుతుంది. పితృదేవతలని పూజించటం అంటే విష్ణుమూర్తిని పూజించటమే. జగన్నాథుడు సంతుష్టుడయితే సర్వదేవతలూ సంతుష్టులయినట్లే. ఈ స్థావరజంగమాత్మకమైన సకల సృష్టి విష్ణుమయం. విష్ణుమయం కానిది ఏదీ లేదు. విశ్వాధారుడు, విశ్వభూతాత్మకుడు అనౌపమ్య స్వభావుడు హవ్యభుక్కు పరబ్రహ్మాభిధేయుడు- ఆ జనార్ధనుడు. కనుక భోక్త విష్ణువు. కర్త విష్ణువు. కారయిత విష్ణువు.

శౌనకాది మహామునులారా! సాక్షాత్తూ దత్తాత్రేయుడు ధర్మకీర్తికి బోధించిన ఈ ఉత్తమ శ్రాద్ధవిధిని ఆచరించటమే

కాదు. శ్రాద్ధ సమయంలో ఈ భాగాన్ని పఠిస్తే పితృదేవతలు ఎంతగానో సంతోషిస్తారు. కర్తకు వంశాభివృద్ధీ సంతానాభివృద్ధీ జరుగుతుంది- అని సూతమహర్షి ఫలశ్రుతి పలికాడు.

సనత్కుమారా ! వింటున్నావుగా, దత్తాత్రేయుడు శ్రాద్ధయోగ్య పదార్థాలేమిటి వర్జించవలసినవి ఏమిటి తొలినాట ఈ విధిని ఎవరు ఆచరించారు మొదలైన ప్రశ్నలు వేస్తే భీష్ముడు కురుక్షేత్రంలో శరతల్పంమీద ఉండి ధర్మరాజుకి చెప్పిన అత్రి - నిమి సంవాదాన్ని వినిపించాడు. దత్తుడు కొడుకు నిమికి పుత్రవియోగం కలిగిందనీ, ఆ దుఃఖాన్ని తీర్చుకోడానికి ముమ్మొదటగా ఈ విధిని రూపొందించాడనీ, దానికి అత్రి మహాముని సమ్మతి తెలియజేసాడని శ్రాద్ధవిధిలో విశ్వదేవతలకూ పితృదేవతలకూ అగ్నికీ సోముడికీ ఇంకా సంబంధిత దేవతలకూ భాగాలు కల్పించాడనీ వర్జనీయాలను నిర్ధారించాడని వివరించాడు.

వీటిని దత్తాత్రేయుడు వివరిస్తుంటే శ్రద్ధగా విన్న ధర్మకీర్తి - శ్రౌత స్మార్తవ్రత దానాది వైదిక సత్కర్మలకు తిథి ప్రధానమంటారు గదా. దాని మీదనే వాటి ఫలాలు ఆధారపడి ఉంటాయి, అని కూడా విన్నాను. కాబట్టి ఇంత ప్రధానమైన తిథిని నిర్ణయించడమెలాగ ? పాపకార్యాలకు ఏమైనా ప్రాయశ్చిత్తాలున్నాయా ? చాంద్రాయణాది వ్రతాల స్వరూపం ఏమిటి ? ఈ విషయాలు తెలియజెప్పి నన్ను ధన్యుణ్ని చెయ్యి దేవాదిదేవా! అని అభ్యర్థించాడు. దత్త యోగేంద్రుడు సంతోషించి - ఉపవాసాలకూ, వ్రతాలకు, దానధర్మాలకూ ఏయే తిథులు ఉత్తమాలో ఏవి పనికిరావో తిథి నిర్ణయం ఎలా చేసుకోవాలో సవిస్తరంగా తెలియజేశాడు. స్మృతులు చెప్పిన పద్ధతుల్లో తిథి వార నక్షత్రాదుల్ని నిర్ణయించుకుని సత్కర్మాచరణం చేస్తే అక్షయఫలం లభిస్తుందని ఉపదేశించాడు. ధర్మాన్ని దేవతలు ఏర్పరిచారు. దాన్ని ఆచరిస్తే కేశవుడు సంతోషిస్తాడు. కాబట్టి ధర్మపరాయణులు అంతిమంగా విష్ణులోకం చేరుకుంటారు. ధర్మపరులంటే విష్ణుస్వరూపులే. వారికి సంసార దుఃఖాలు ఆదివ్యాధులూ అంటవు, అవి బాధించవు.

ధర్మకీర్తీ ! బ్రహ్మహత్య - సురాపానం - స్వర్ణస్తేయం - గురుభార్యాగమనం - ఇవి చేసిన వాడితో స్నేహం - అనే పంచ మహాపాతకాలతోపాటు పరస్త్రీగమన ప్రాణిహింసాదులు మరికొన్ని ఉపపాతకాలూ ఉన్నాయి. తెలిసి చేసినా తెలియక చేసినా పాపఫలం అనుభవించక తప్పదు. కొన్నింటికి ప్రాయశ్చిత్తాలు లేవు. కొన్నింటికి పిడకలు పేర్చుకుని తననితాను దహించుకోవడం వంటి తీవ్ర ప్రాయశ్చిత్తాలను చెబుతున్నాయి ధర్మశాస్త్రాలు. ఏమైనా అడుసు తొక్కనేల కాలు కడుగనేల అన్నట్టు పాపకర్మలు ఆచరించకుండా ఆత్మనిగ్రహంతో వ్యవహరించడమే ఉత్తమం. దీని సాధనకు చెప్పిన నిత్యనైమిత్తిక కర్మలను శ్రద్ధతో ఆచరించండం ధర్మాచరణపట్ల ఆదర్శప్రాయులను అనుసరించడం పురాణేతిహాసాల పఠనం ద్వారా ధర్మసూక్ష్మాలను మంచిచెడులనూ తెలుసుకొని మంచిని అలవరచుకోవడం - ఇవే ఉత్తమోత్తమమైన పరిష్కార మార్గాలు.

ధర్మకీర్తీ ! అనుతాపంతో అంత శ్శుద్ధినీ ఉపవాసాలతో బహిశ్శుద్ధినీ సాధించి పదిమందికీ ఆమోదయోగ్యుడై మళ్ళీ సాధారణ జీవితం గడపడానికి వీలుగా పాప ప్రాయశ్చిత్తాలుగా నైతేనేమి ఆయా ఆశ్రమవాసుల ఆచారాలుగానైతేనేమి చాంద్రాయణాది వ్రతాలు కొన్నింటిని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. వాటిని వివరించమన్నావు గదా ఆలకించు - అంటు దత్తాత్రేయుడు కొనసాగించాడు. ఏ వ్రతానికైనా బ్రహ్మచర్యం దయ ఓర్పుమౌనం సత్యదీక్ష అకామ్యత అహింస అస్తేయం (దొంగతనం చెయ్యకపోవడం) మాధుర్యం బాహ్యేంద్రియ నిగ్రహం అంతరింద్రియ

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

నిగ్రహం స్నానం ఉపవాసం ఇజ్య (హోమం) స్వాధ్యాయం గురుశుశ్రూష శౌచం అక్రోధిత అప్రమాదిత - ఇవి తప్పక పాటించవలసిన నియమాలు. వీటిని పాటిస్తూ చంద్రుడి వృద్ధిక్షయాలకు అనుకూలంగా ఆహారాన్ని తీసుకుని కాలం గడపటం వానప్రస్థులకు వ్రతంగా పెద్దలు చెబుతున్నారు. దీన్నే చాంద్రాయణ వ్రతమంటారు. శుక్ల పక్షంలో చందమామ దినదినాభివృద్ధి చెందుతాడు. రోజుకి ఒకకళ చొప్పున పెరుగుతాడు. వానప్రస్థి శుక్లపక్ష ప్రతిపత్తినాడు ఒక ముద్దతో మొదలుపెట్టి రోజుకొకటిగా పెంచుకుంటూ పూర్ణిమనాడు పదిహేను ముద్దల ఆహారం స్వీకరిస్తాడు. బహుళ పాడ్యమి నుంచి కళలు తరుగుతాయి. కనక రోజుకొకటిగా ముద్దలు తగ్గించుకుంటూ అమావాస్య నాటికి నిరాహారుడవుతాడు. ఇదీ చాంద్రాయణ వ్రత నియమం.

ఒకరోజు పగటి భోజనం, మర్నాడు రాత్రి భోజనం, మూడవనాడు అయాచిత భోజనం, నాల్గవనాడు ఉపవాసం - దీన్ని పాద కృచ్ఛ్రవ్రతమంటారు. ఇది నాల్గునాళ్ళ వ్రతం.

దీన్ని రెట్టింపు చేస్తే అర్ధకృచ్ఛ్రం. అంటే రెండు రోజులు పగటిభుక్తి, తరువాత రెండునాళ్ళు రాత్రిభుక్తి, ఆపై రెండునాళ్ళు అయాచిత భోజనం చివరి రెండు రోజులు ఉపవాసం మొత్తం ఎనిమిదినాళ్ళ వ్రతమిది. ఇలా కాకుండా పన్నెండు నాళ్ళు వరుసగా ఉపవాసముంటే పరాకమంటారు.

పంచగవ్య ప్రాశనం చేసి వపనాదులు (గుండు) చేసుకుంటే అది సాంతపనకృచ్ఛ్రం. పంచగవ్యాలనూ కుశోదకాన్ని రోజుకి ఒక్కటిగా ఆరురోజులు పుచ్చుకుని ఏడవనాడు అవి కూడా లేకుండా నిట్టుపవాసముంటే - దీన్ని మహాసాంతపనకృచ్ఛ్రవ్రతమంటారు. దీనికే సప్తాహకృచ్ఛ్రమని పేరు. మహారాజా! ప్రాయశ్చిత్తాలుగా ఉపదేశించిన ఈ వ్రతాలను యాంత్రికంగా చేస్తే చాలదు. అను తాపంతో చెయ్యాలి. శ్రద్ధా సక్తులతో చెయ్యాలి. పాపభారం తొలగించు దేవా అని నారాయణుణ్ని స్మరిస్తూ చెయ్యాలి. నారాయణాంకితమైన మనస్సే ప్రధానం. రాగాది నిర్ముక్తుడై అనుతాప సమన్వితుడై సర్వభూత దయాపరుడై విష్ణుస్మరణ తత్పరుడై నట్టయితే అతడు తెలిసీ తెలియక చేసిన ఎంతటి పాతకమైనా అంతరించిపోతుంది. నారాయణ స్మరణమే సర్వపాపాలకు ప్రాయశ్చిత్తం.

ఆద్యంత రహితుడు విశ్వాకారుడు అనామయుడు అయిన శ్రీమన్నారాయణుడు తనను స్మరించిన వారినీ, పూజించిన వారినీ, ధ్యానించినవారినీ, నమస్కరించిన వారినీ పాపవిముక్తుల్ని చేసి కాపాడతాడు. తెలియకచేసినా తెలిసిచేసినా హరికీర్తనం పుణ్యప్రదమే. హరినామస్మరణ ఒక్కసారి చేసినా క్లేశాలను నశింపజేస్తుంది. నిత్యమూ చేస్తే లభించే పుణ్యాలూ భోగాలు వర్ణనాతీతం ఊహించుకోవలసిందే. మానవజన్మ దుర్లభం. అందులో హరిభక్తి కుదురుకోవడం మరీ దుర్లభం. తటిల్లతాలోలమైన మానవజన్మలో హరిని పూజించక పోవడంకన్నా తెలివితక్కువ పని మరొకటి ఉంటుందా ? పశుపాశ విమోచనుడైన హరిని పూజచేసి తీరాలి.

జనార్ధనుణ్ని అర్చిస్తే మనశ్శుద్ధి కలుగుతుంది. మోక్షమూ దొరుకుతుంది. హరిపూజా పరులకు చతుర్విధపురుషార్థాలు కరతలామలకాలు. సందేహంలేదు. మోహనిద్రాసమాకులమై అతిఘోరాకారమైన ఈ సంసారంలో శ్రీహరిని శరణువేడుకున్నవారు నిశ్చయంగా కృతార్థులు. ఓరోరీ మానవుడా ! భార్యాపుత్రులూ, ఇల్లూ వాకిలీ, ధనమూ ధాన్యమూ వీటితో నిన్ను సమ్మోహపరిచే మానుషివృత్తిని చూసుకుని దర్పంతో విర్రవీగకు. అహంకరించి ఎగిరిపడకు. కామక్రోధలోభ మోహమదమాత్సర్యాలను విడిచిపెట్టు. పరాపవాదాలకు నిందలకు పాత్రుడవు కాకుండా శక్తిమేరకు

శ్రీహరిని ఉపాసించు. సకల వ్యాపారాలు విడిచిపెట్టి జనార్ధనుణ్ని పూజించు. అవయవాల పటుత్వం క్షీణించకముందే ముసలితనం ముసురుకోకముందే నరకలోకపు అసిపత్రవనాలు చేరువలో కనిపించకముందే హంస ఎగిరిపోకముందే - శ్రీ హరిని అర్చించు.

ఆశాశ్వతమైన ఈ శరీరంమీద ధీమంతులెవ్వరూ ఆట్టే నమ్మకం పెట్టుకోరు. నిత్యం సన్నిహితో మృత్యుః అన్నారు. సంపదలా అత్యంత చంచలాలు. ఆసన్నమరణోదేహః అంచేత ఎవ్వరికీ ఏ దర్పమూ పనికిరాదు. ఏ సంయోగానికైనా ముగింపు వియోగమే. అంతా క్షణభంగురం. ఇది ఎరిగి అందరూ అన్నివేళలా హరిభజన చెయ్యాలి. మహాయోగులకూ మహాతపస్వులకూ ధుర్లభమైన వైకుంఠ నివాసం విష్ణుమూర్తిని భక్తితో స్మరించిన వారికి అర్చించిన వారికి, అనాయాసంగా లభిస్తుంది. సందేహంలేదు. సర్వతీర్థ సంసేవనం సర్వయజ్ఞ నిర్వహణం సాంగోపాంగ వేదాధ్యయనం - ఇవన్నీ నారాయాణార్చనలో పదహారవ కళకు సాటిరావు. అటువంటి విష్ణుభక్తి లేకపోయాక వేదశాస్త్రాలు అభ్యసించి ఏం లాభం ? తీర్థయాత్రలు చేసి ఏమి ప్రయోజనం ? తపస్సులెందుకూ ? యజ్ఞాలెందుకు ?

నైమిశేయులారా ! శౌనకాది మహామునులారా ! నారదుడు సనత్కుమారుడికి దత్తాత్రేయ - ధర్మకీర్తి సంవాదరూపంగా చెప్పిన ప్రాయశ్చిత్తవిధులు సంక్షేపంగా మీ చెవిని వేశాను. ఇంకా అనేక ధర్మాలూ సదాచారాలూ దత్తదేవుడు ధర్మకీర్తికి బోధించాడు. అతని నుంచి వాటిని విన్న గాలవుడు ధన్యుడు.

**భజంతి యే విష్ణు మనంతమూర్తిమ్**
**నిరీహమోంకార గతం వరేణ్యమ్ !**
**వేదాంత వేద్యం భవరోగవైద్యమ్**
**తేయాంతి సర్వేపద మచ్యుతస్య !!**

**అనాదిమాత్మానమనంతశక్తిమ్**
**ఆధారభూతం జగతాంపరేశమ్ !**
**జ్యోతిస్స్వరూపం పరమచ్యుతాఖ్యమ్**
**సంపూజ్యతే యాంతి పదం పవిత్రమ్ !!**

సూత మహర్షీ ! దత్తదేవుడి అనుగ్రహం వల్ల నీముఖతః వీటిని అన్నింటిని వినగలిగిన మేము కూడా ధన్యులం. ఏమిచ్చి మీ ఋణం తీర్చుకోగలం. అందుకని కృతమెరిగి నీకిదే నమస్కరిస్తున్నాం. ఇంతకీ - బ్రహ్మదేవుడు కలిపురుషుడికి చెప్పిన ఈ మహేతిహాసాన్ని తన గురువు వేదధర్ముడి నోటి నుండి ప్రత్యక్షంగా విన్న ఉత్తమశ్రోత దీపకుడు ఏమన్నాడు ? గురువుగారికి కృతజ్ఞతలు ఎలా చెప్పుకున్నాడు ? - ఇవి తెలుసుకోవాలని ఉబలాటంగా ఉంది. వీటిని వినేసి ఈ రోజుకింక మా యోగ విధుల్లోకి మేము వెళ్ళిపోతాం.

మహామునులారా ! వేదధర్ముడికి కార్తవీర్యార్జునుడంటే అదొకరకం ప్రీతి, అభిమానం అంచేత అతడి గాథల్ని వీలు చిక్కినప్పుడల్లా ప్రశంసిస్తూ వుంటాడు. పునరుక్తి అవుతున్నా పట్టించుకోడు. అవునుకదా ! మీరూగమనించే వుంటారు. ఇప్పుడూ అదే చేశాడు. కార్తవీర్యుని చరిత్రను క్లుప్తంగా మళ్ళీమళ్ళీ చెప్పాడు. చెప్పిందే మళ్ళీ మళ్ళీ చెబుతున్నా కొత్తది వింటునట్లే వినడం దీపకుడి ప్రత్యేకత. ఇప్పుడూ అలాగే విన్నాడు. ఇంకా ఏమి వినాలనుకుంటున్నారో నిస్సంకోచంగా

అడుగు అని వేదధర్ముడు ముగించగానే గురువుగారి పాద పద్మాలకు తుమ్మెదలాంటి దీపకుడు ఆనందంతో పులకించిపోతూ ఆర్ద్రమైన కన్నుల్ని ఒత్తుకుంటూలేచి సాష్టాంగ నమస్కారం చేశాడు.

గురుదేవా ! అత్యంత మహిమాన్వితమూ అత్యంత పవిత్రమూ అత్యంత రమణీయమూ అయిన శ్రీ దత్తపురాణాన్ని సవిస్తరంగా నాకు ఎరుకపరిచారు. దీనికి ఏమిచ్చి ఋణంతీర్చుకోగలను ? బ్రతికి ఉన్నంతకాలమూ ఇలాగే మీసేవ చేసుకుంటాను. మీ వెంట వుంటాను. అనుమతించండి మహానుభావా ! అని సాగిలపడి మ్రొక్కాడు. వాత్సల్యమూర్తి వేదధర్ముడు శిష్యుణ్ని లేవనెత్తి ప్రేమగా కౌగలించుకొని శిరస్సు నిమురుతూ ఆనందబాష్పాలను ఆశీరక్షతలుగా రాల్చాడు.

నైమిశారణ్యవాసులారా ! మహా మునీశ్వరులారా ! దత్తాత్రేయుడి కటాక్షంతో రూపొందిన ఈ పురాణాన్ని విన్నవారూ, చదివినవారూ సర్వపాపవిముక్తులవుతారు. విష్ణు శివాలయాల్లో పారాయణమే చెయ్యగలిగితే ఇహలోకంలో సకల సుఖాలు అనుభవించి వైకుంఠధామం చేరుకుంటారు.

ఎవ్వడైనా ఈ దత్తపురాణంలోని ఒక అంశాన్ని గానీ పూర్తి పురాణాన్ని గానీ అర్థంతో సహా సమాజానికి వివరించి చెప్పినా లేదా తాను ఆకళింపుజేసుకున్నా దత్తాత్రేయుడి అనుగ్రహానికి పాత్రుడవుతాడు. దానితో సకలాభీష్టాలూ సిద్ధిస్తాయి. కడపటికి అపునర్భవమైన విష్ణుసాయుజ్యం పొందుతాడు.

**మంగళం దేశికేంద్రాయ**
**అనసూయాత్రి సూనవే !**
**యోగ విద్యా నిధానాయ**
**దత్తాత్రేయాయమంగళమ్ !!**

**దత్త పురాణం సంపూర్ణం**



www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

**మహిమాన్వితమైన పురాతన దత్త స్తోత్రములు**

॥ ఓం శ్రీ పరమాత్మనే నమః ॥

# శ్రీ దత్తాత్రేయ వజ్రకవచమ్

శ్రీ గణేశాయ నమః । శ్రీ దత్తాత్రేయాయ నమః ॥

### ఋషయ ఊచుః

కథం సంకల్పసిద్ధిః స్యాద్ వేదవ్యాస! కలౌ యుగే ।
ధర్మార్థకామ మోక్షాణాం సాధనం కిముదాహృతమ్ ॥ 1

### వ్యాస ఉవాచ

శృణ్వంతు ఋషయ స్సర్వే శీఘ్రం సంకల్ప సాధనమ్ ।
సకృదుచ్చారమాత్రేణ భోగమోక్షప్రదాయకమ్ ॥ 2

గౌరీశృంగే హిమవతః కల్ప వృక్షోపశోభితమ్ ।
దీప్తే దివ్యమహారత్న హేమమండపమధ్యగమ్ ॥ 3

దీప్తే దివ్యమహారత్న హేమమండపమధ్యగమ్ ॥ 3
రత్న సింహాసనాసీనం ప్రసన్నం పరమేశ్వరమ్ ।
మందస్మితముఖాంభోజం శంకరం ప్రాహ పార్వతీ ॥ 4

### శ్రీ దేవి ఉవాచ

దేవదేవ! మహాదేవ! లోకశంకర! శంకర! ।
మంత్రజాలాని సర్వాణి యంత్రజాలాని కృత్స్నశః ॥ 5

తంత్రజాలాన్యనేకాని మయా త్వత్తః శ్రుతాని వై ।
ఇదానీం ద్రష్టుమిచ్ఛామి విశేషేణ మహీతలమ్ ॥ 6

ఇత్యుదీరితమాకర్ణ్య పార్వత్యా పరమేశ్వరః ।
కరేణామృజ్య సంతోషాత్ పార్వతీం ప్రత్యభాషత ॥ 7

మయేదానీం త్వయా సార్ధం వృషమారుహ్య గమ్యతే ।
ఇత్యుక్త్వా వృషమారుహ్య పార్వత్యా సహ శంకరః॥ 8

యయౌ భూమండలం ద్రష్టుం గౌర్యాశ్చిత్రాణి దర్శయన్ ।
క్వచిత్ వింధ్యాచలప్రాంతే మహారణ్యే సుదుర్గమే ॥ 9

తత్ర వ్యాహర్తుమాయాంతం భిల్లం పరశుధారిణమ్ ।
వధ్యమానం మహావ్యఘ్రం నఖదంష్ట్రాభిరావృతమ్ ॥ 10

అతీవ చిత్ర చారిత్ర్యం వజ్రకాయసమాయుతమ్ ।
అప్రయత్నమనాయాసమఖిన్నం సుఖమాస్థితమ్ ॥ 11

పలాయంతం మృగం పశ్చాద్వ్యాఘ్రో భీత్యా పలాయతః ।
ఏతదాశ్చర్యమాలోక్య పార్వతీ ప్రాహ శంకరమ్ ॥ 12

## శ్రీ పార్వత్యువాచ

కిమాశ్చర్యం కిమాశ్చర్యమగ్రే శంభో! నిరీక్ష్యతామ్ ।
ఇత్యుక్తః స తతః శంభుర్దృష్ట్వా ప్రాహ పురాణవిత్ ॥ 13

## శ్రీ శంకర ఉవాచ

గౌరి! వక్ష్యామి తే చిత్రమవాఙ్మానసగోచరమ్ ।
అదృష్టపూర్వమస్మాభిర్నాస్తి కించిన్న కుత్రచిత్ ॥ 14

మయా సమ్యక్ సమాసేన వక్ష్యతే శృణు పార్వతి ।
అయం దూరశ్రవా నామ భిల్లః పరమధార్మికః ॥ 15

సమిత్కుశప్రసూనాని కందమూలఫలాదికమ్ ।
ప్రత్యహం విపినం గత్వా సమాదాయ ప్రయాసతః ॥ 16

ప్రియే! పూర్వం మునీంద్రేభ్యః ప్రయచ్ఛతి న వాంఛతి ।
తేఽపి తస్మిన్నపి దయాం కుర్వతే సర్వమౌనినః ॥ 17

దలాదనో మహాయోగీ వసన్నేవ నిజాశ్రమే ।
కదాచిదస్మరత్ సిద్ధం దత్తాత్రేయం దిగంబరమ్ ॥ 18

దత్తాత్రేయః స్మర్తృగామీ చేతిహాసం పరీక్షితుమ్ ।
తత్క్షణాత్ సోఽపి యోగీంద్రో దత్తాత్రేయః సముత్థితః ॥ 19

తం దృష్ట్వాశ్చర్యతోషాభ్యాం దలాదనమహాముని ।
సంపూజ్యాగ్రే విషీదంతం దత్తాత్రేయమువాచ తమ్ ॥ 20

మయోపహూతః సంప్రాప్తో దత్తాత్రేయ మహామునే ।
స్మర్తృగామీ త్వమిత్యేతత్ కింవదంతీం పరీక్షితుమ్ ॥ 21

మయాద్య సంస్మృతోఽసి త్వమపరాధం క్షమస్వ మే ।
దత్తాత్రేయో మునిం ప్రాహ మమ ప్రకృతిరీదృశీ ॥ 22

అభక్త్యా వా సుభక్త్యా వా యః స్మరేన్మామనన్యధీః ।
తదానీం తముపాగమ్య దదామి తదభీప్సితమ్ ॥ 23

దత్తాత్రేయో మునిం ప్రాహ దలాదనమునీశ్వరమ్ ।
యదిష్టం తద్ వృణీష్వ త్వం యత్ ప్రాప్తోఽహం త్వయాస్మృతః ॥ 24

దత్తాత్రేయం మునిం ప్రాహ మయా కిమపి నోచ్యతే ।
త్వచ్చిత్తే యత్ స్థితం తన్మే ప్రయచ్ఛ మునిపుంగవ ॥ 25

**శ్రీ దత్తాత్రేయ ఉవాచ**

మమాస్తి వజ్రకవచం గృహాణేత్యవదన్మునిమ్ ।
తథేత్యంగీకృతవతే దలాదమునయే ముని ॥ 26

స్వవజ్రకవచం ప్రాహ ఋషిచ్ఛందః పురస్సరమ్ ।
న్యాసం ధ్యానం ఫలం తత్ర ప్రయోజనమశేషతః ॥ 27

అస్య శ్రీ దత్తాత్రేయ వజ్రకవచస్తోత్ర మంత్రస్య, కిరాతరూపీ మహారుద్రఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ దత్తాత్రేయో దేవతా, ద్రాం బీజమ్, ఆం శక్తిః, క్రౌం కీలకమ్,

ఓం ఆత్మనే నమః
ఓం ద్రీం మనసే నమః
ఓం ఆం ద్రీం శ్రీం సౌః
ఓం క్లాం క్లీం క్లూం క్లైం క్లౌం క్లః
శ్రీ దత్తాత్రేయ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః

**కరన్యాస ః**

ఓం ద్రాం అంగుష్ఠాభ్యాం నమః
ఓం ద్రీం తర్జనీభ్యాం నమః
ఓం ద్రూం మధ్యమాభ్యాం నమః
ఓం ద్రైం అనామికాభ్యాం నమః
ఓం ద్రౌం కనిష్ఠికాభ్యాం నమః
ఓం ద్రః కరతలకరపృష్ఠాభ్యాం నమః

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

## హృదయాది న్యాసః

| | | | |
|---|---|---|---|
| ఓం | ద్రాం | హృదయాయ | నమః |
| ఓం | ద్రీం | శిరసే | స్వాహా |
| ఓం | ద్రూం | శిఖాయై | వషట్ |
| ఓం | ద్రైం | కవచాయ | హుం |
| ఓం | ద్రౌం | నేత్రత్రయాయ | వౌషట్ |
| ఓం | ద్రః | అస్త్రాయ | ఫట్ |
| ఓం | భూర్భువః | స్వరోమితి | దిగ్బంధః |

## ధ్యానమ్

జగదంకురకందాయ సచ్చిదానందమూర్తయే ।
దత్తాత్రేయాయ యోగీంద్రచంద్రాయ పరమాత్మనే ॥ 1

కదా యోగీ కదా భోగీ కదా నగ్నః పిశాచవత్ ।
దత్తాత్రేయో హరిః సాక్షాద్ భుక్తి ముక్తిప్రదాయకః॥ 2

వారాణసీపురస్నాయీ కొల్హాపుర జపాదరః।
మాహురీపురభిక్షాశీ సహ్యశాయీ దిగంబరః॥ 3

ఇంద్రనీలసమాకారశ్చంద్రకాంతిసమద్యుతిః।
వైదూర్యసదృశస్ఫూర్తిశ్చలత్కించిజ్జటాధరః॥ 4

స్నిగ్ధధావల్య యుక్తాక్షోఽత్యంతనీలకనీనికః।
భ్రూవక్షఃశ్మశ్రునీలాంకః శశాంకసదృశాననః॥ 5

హాసనిర్జితనీహారః కంఠనిర్జితకంబుకః।
మాంసలాంసో దీర్ఘబాహుః పాణినిర్జితపల్లవః॥ 6

విశాలపీనవక్షాశ్చ తామ్రపాణిర్దలోదరః।
పృథులశ్రోణిలలితో విశాలజఘనస్థలః॥ 7

రంభాస్తంభోపమానోరుర్జానుపూర్వైకజంఘకః।
గూఢగుల్ఫః కూర్మపృష్ఠో లసత్పావదోపరిస్థలః॥ 8

రక్తారవిందసదృశరమణీయపదాధరః।
చర్మాంబర ధరో యోగీ స్మర్తృ గామీ క్షణే క్షణే ॥ 9

జ్ఞానోపదేశనిరతో విపద్ధరణదీక్షితః ।
సిద్ధాసనసమాసీన ఋజుకాయో హసన్ముఖః॥ 10

వామహస్తేన వరదో దక్షిణేనాభయంకరః।
బాలోన్మత్త పిశాచీభిః క్వచిద్ యుక్తః పరీక్షితః ॥ 11

త్యాగీ భోగీ మహాయోగీ నిత్యానందో నిరంజనః।
సర్వరూపీ సర్వదాతా సర్వగః సర్వకామదః॥ 12

భస్మోద్ధూలితసర్వాంగో మహాపాతకనాశనః।
భుక్తిప్రదో ముక్తిదాతా జీవన్ముక్తో న సంశయః॥ 13

ఏవం ధ్యాత్వాఽనన్యచిత్తో మద్వజ్రకవచం పఠేత్ ।
మామేవ పశ్యన్సర్వత్ర స మయా సహ సంచరేత్ ॥ 14

దిగంబరం భస్మసుగంధ లేపనం
చక్రం త్రిశూలం డమరుం గధాయుధమ్ ।
పద్మాసనం యోగిమునీంద్రవందితం
దత్తేతినామస్మరణేన నిత్యమ్॥ 15

## పంచోపచార పూజా

ఓం లం పృథివీతత్త్వాత్మనే శ్రీ దత్తాత్రేయాయ నమః గంధం పరికల్పయామి
ఓం హం ఆకాశతత్త్వాత్మనే శ్రీ దత్తాత్రేయాయ నమః పుష్పం పరికల్పయామి
ఓం యం వాయుతత్త్వాత్మనే శ్రీ దత్తాత్రేయాయ నమః ధూపం పరికల్పయామి
ఓం రం అగ్నితత్త్వాత్మనే శ్రీ దత్తాత్రేయాయ నమః దీపం పరికల్పయామి
ఓం వం అమృతతత్త్వాత్మనే శ్రీ దత్తాత్రేయాయ నమః అమృతనైవేద్యం పరికల్పయామి
ఓం సం సర్వతత్త్వాత్మనే శ్రీ దత్తాత్రేయాయ నమః తాంబూలాది సర్వోపచారాన్ పరికల్పయామి
(అనంతరం 'ఓం ద్రాం' మూలమంత్రం 108 సార్లు జపించాలి)

## అథవజ్రకవచమ్

ఓం దత్తాత్రేయః శిరః పాతు సహస్రాబ్జేషు సంస్థితః ।
ఫాలం పా త్వానసూయేయ శ్చంద్రమండలమధ్యగః ॥ 1

కూర్చం మనోమయః పాతు హం క్షం ద్విదలపద్మభూః।
జ్యోతీరూపోఽక్షిణీ పాతు పాతు శబ్దాత్మకః శ్రుతీ ॥ 2

నాసికాం పాతు గంధాత్మా ముఖం పాతు రసాత్మకః
జిహ్వాం వేదాత్మకః పాతు దంతోష్ఠౌ పాతు ధార్మికః ॥ 3

కపోలావత్రిభూః పాతు పా త్వశేషం మమాత్మవిత్।
స్వరాత్మా షోడశారాబ్జస్థితః స్వాత్మాఽవతాద్ గలమ్ ॥ 4

స్కంధౌ చంద్రానుజః పాతు భుజౌ పాతు కృతాదిభూః।
జత్రుణీ శత్రుజిత్ పాతు పాతు వక్షఃస్థలం హరిః ॥ 5

కాదిఠాంత ద్వాదశార పద్మగో మరుదాత్మకః।
యోగీశ్వరేశ్వరః పాతు హృదయం హృదయస్థితః ॥ 6

పార్శ్వే హరిః పార్శ్వవర్తీ పాతు పార్శ్వస్థితః స్మృతః।
హఠయోగాదియోగజ్ఞః కుక్షిం పాతు కృపానిధిః ॥ 7

డకారాదిఫకారాంత దశార సరసీ రు హే।
నాభిస్థలే వర్తమానో నాభిం వహ్న్యాత్మకోఽవతు ॥ 8

వహ్నితత్త్వమయో యోగీ రక్షతాన్మణిపూరకమ్।
కటిం కటిస్థ బ్రహ్మాండ వాసుదేవాత్మకోఽవతు ॥ 9

బకారాదిలకారాంత షట్పత్రాంబుజ బోధకః।
జలతత్త్వమయో యోగీ స్వాధిష్ఠానం మమావతు ॥ 10

సిద్ధాసన సమాసీన ఊరూ సిద్ధేశ్వరోఽవతు।
వాదిసాంత చతుష్పత్ర సరోరుహ నిబోధకః ॥ 11

మూలాధారం మహీరూపో రక్షతాద్ వీర్యనిగ్రహీ।
పృష్ఠం చ సర్వతః పాతు జానున్యస్త కరాంబుజః ॥ 12

జంఘే పాత్వ వధూతేంద్రః పాత్వంఘ్రీ తీర్థపావనః।
సర్వాంగం పాతు సర్వాత్మా రోమాణ్యవతు కేశవః ॥ 13

చర్మ చర్మాంబరః పాతు రక్తం భక్తి ప్రియో ఽవతు।
మాంసం మాంసకరః పాతు మజ్జాం మజ్జాత్మకోఽవతు ॥ 14

అస్థీని స్థిరధీః పాయాన్మేధాం వేధాః ప్రపాలయేత్।
శుక్రం సుఖకరః పాతు చిత్తం పాతు దృఢాకృతిః॥ 15

మనోబుద్ధిమహంకారం హృషీకేశాత్మకోఽవతు।
కర్మేంద్రియాణి పా త్వీశః పాతు జ్ఞానేంద్రియాణ్యజః॥ 16

బంధూన్ బంధూత్తమః పాయాచ్ఛత్రుభ్యః పాతు శత్రుజిత్।
గృహారామధనక్షేత్ర పుత్రాదీన్ శంకరోఽవతు॥ 17

www.facebook.com/mohanpublications www.granthanidhi.blogspot.in

భార్యాం ప్రకృతివిత్ పాతు పశ్వాదీన్ పాతు శార్ఙ్గభృత్।
ప్రాణాన్ పాతు ప్రధానజ్ఞో భక్ష్యాదీన్ పాతు భాస్కరః ॥ 18

సుఖం చంద్రాత్మకః పాతు దుఃఖాత్ పాతు పురాంతకః ।
పశూన్ పశుపతిః పాతు భూతిం భూతేశ్వరో మమ॥ 19

ప్రాచ్యాం విషహరః పాతు పాత్వాగ్నేయ్యాం మఖాత్మకః।
యామ్యాం ధర్మాత్మకః పాతు నైరృత్యాం సర్వవైరిహృత్॥ 20

వరాహః పాతు వారుణ్యాం వాయవ్యాం ప్రాణదోఽవతు।
కౌబేర్యాం ధనదః పాతు పాత్వైశాన్యాం మహాగురుః॥ 21

ఊర్ధ్వం పాతు మహాసిద్ధః పాత్వధస్తాజ్జటాధరః।
రక్షాహీనం తు యత్ స్థానం రక్షత్వాది మునీశ్వరః॥ 22

ఏతన్మే వజ్రకవచం యః పఠేత్ శృణుయాదపి ।
వజ్రకాయశ్చిరంజీవీ దత్తాత్రేయోఽహమబ్రువమ్॥ 23

త్యాగీ భోగీ మహాయోగీ సుఖదుఖవివర్జితః।
సర్వత్ర సిద్ధసంకల్పో జీవన్ముక్తోఽద్య వర్తతే॥ 24

ఇత్యుక్త్వాంతర్దధే యోగీ దత్తాత్రేయో దిగంబరః।
దలాదనోఽపి త జ్జప్త్వా జీవన్ముక్తః స వర్తతే॥ 25

భిల్లో దూరశ్రవా నామ తదానీం శ్రుతవానిదమ్।
సకృ చ్ఛ్రవణమాత్రేణ వజ్రాంగోఽభవదప్యసౌ॥ 26

ఇత్యేతద్ వజ్రకవచం దత్తాత్రేయస్య యోగినః।
శ్రుత్వా శేషం శంభుముఖాత్ పున రప్యాహ పార్వతీ॥ 27

**శ్రీ పార్వ త్యువాచ**

ఏతత్ కవచమాహాత్మ్యం వద విస్తరతో మమ।
కుత్ర కేన కదా జాప్యం కియజ్జాప్యం కథం కథమ్॥ 28

ఉవాచ శంభుస్తత్ సర్వం పార్వత్యా వినయోదితమ్।
శృణు పార్వతి వక్ష్యామి సమాహితమనానిలమ్॥ 29

ధర్మార్థకామమోక్షాణామిదమేవ పరాయణమ్।
హస్త్యశ్వరథపాదాతిసర్వైశ్వర్యప్రదాయకమ్॥ 30

